# డంకెల గురి
# వ్యవసాయానికి ఉరి



# డంకెల్ గురి – వ్యవసాయానికి ఉరి



జె. కిషోర్‌బాబు

ప్రచురణః
ఆంధ్రప్రదేశ్ రైతుకూలీ సంఘం
కృష్ణాజిల్లా

డంకెల్ గురి – వ్యవసాయానికి ఉరి

– జె.కిషోర్ బాబు

ప్రచురణ కాలం : నవంబర్ 1993.

కవర్ డిజైన్ : శ్యాం మోహన్

కాపీలకు:
మైత్రీ బుక్‌హౌస్
మసీదు వీధి
కార్ల్‌మార్క్స్ రోడ్
విజయవాడ – 520 002
ఆంధ్ర ప్రదేశ్

# ప్రచురణకర్తల మాట

ఈనాడు "డంకెల్" అనే మాట తెలియనివాడు లేడన్నంతగా ప్రచారం జరిగినా డంకెల్ ప్రతిపాదనల సారమేమిటి? దాని పర్యవసానమేమిటి? అనేది తెలిసింది చాలా తక్కువమందికేనన్నది చాలా స్పష్టం. డంకెల్ ప్రతిపాదనల సారాంశానికి సంబంధించి విభిన్నసామాజిక రంగాలపై దాని ప్రభావానికి సంబంధించిన పుస్తకాలు తెలుగులో వచ్చినవి చాలా పరిమితమైనమవటం ఒక కారణమైతే విషయానికున్న సంక్లిష్టత మరో కారణం.

డంకెల్ ప్రతిపాదనల ప్రమాదాన్ని ప్రధానంగా ఎదుర్కొనే రైతు, కూలీ ప్రజానీకానికి అర్థమయ్యేశైలిలో వివరించటానికి రచయిత చేసిన ప్రయత్నం హర్షణీయం. నాలుగు సంవత్సరాల క్రితం ఢిల్లీ సైన్సు ఫోరం *Seeds of Dependence* పేరుతో ఒక బుక్‌లెట్ వేశారు. దాని ఆధారంగా రచయిత ఒక వ్యాసం రాశారు. నాటి "జనశక్తి", విప్లవ కమ్యూనిస్టుల పక్ష పత్రిక దాన్ని ప్రచురించింది. ఆ తర్వాత రైతుకూలీ పేదలసంఘం తూర్పు గోదావరి జిల్లా శాఖ ఆ వ్యాసాన్ని బుక్‌లెట్‌గా ప్రచురించింది. విత్తనాల గురించి మాత్రమే తాజాగా వచ్చిన సమాచారంతో జోడించి పాత వ్యాసాన్ని తిరిగి రాయాలనుకున్న రచయిత ప్రస్తుత అవసరాలకనుగుణంగా ఈ పుస్తకాన్ని మన ముందుంచారు. రైతు కూలీ సంఘం కార్యకర్తలు డంకెల్ వ్యతిరేక ప్రచారం చేసే సందర్భంలో తేలిక భాషలో, తగిన సమాచారం రావల్సిన అవసరాన్ని వివిధ సమావేశాల సందర్భంగా వ్యక్తం చేస్తూ రావటం మేము కూడా రచయితను ప్రోత్సహించటానికి కారణమైంది. ఉద్యమ బాధ్యతలరీత్యా తగినంత సమయం వెచ్చించలేకపోయినప్పటికీ ఉన్నంతలో విభిన్న కోణాలనుండి పరిశీలన చేసిన ఈ రచన ఫీల్డులోవున్న కార్యకర్తలకు ముఖ్యంగా తోడ్పడుతుందని ఆశిస్తున్నాం. దీన్ని గ్రామీణ ప్రాంతాల్లోకి వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లోకి, మధ్య తరగతి మేధావుల్లోకి తీసుకెళ్ళాల్సిందిగా రైతాంగకార్యకర్తలకు, డంకెల్ వ్యతిరేక శక్తులందరికీ విజ్ఞప్తిచేస్తున్నాం.

విప్లవాభినందనలతో

విజయవాడ, ఆంధ్రప్రదేశ్ రైతుకూలీ సంఘం

1–12–93 కృష్ణాజిల్లా

# విషయసూచిక

# ప్రవేశిక

భారతదేశపు గ్రామాలలో అత్యధికం ఇప్పటికీ మనకు పురాతన లక్షణాలతోనే కన్పిస్తాయి. ఎపుడో పురాతన తరాల్లో రూపొందించబడిన ఎడ్లబండ్లు (కొయ్యచక్రాలతో), ఆకాలం నాటి వ్యవసాయ పరికరాలే ఇప్పటికీ మనగ్రామాల్లో దర్శనిమిస్తాయి. బావులు, కుంటలు, చెరువులు, దొరువులు, వీటి నీళ్ళే ఇప్పటికీ వ్యవసాయానికి, తాగడానికి ప్రధానమైన ఆధారం. ఇందులో మార్పులు తెచ్చి రైతాంగానికి తోడ్పడకపోయినా పాలకులు వారిపై తమ పన్నులు, లాభాలనే కాడి భారం మాత్రం మోపుతూ వస్తున్నారు.

అమాయకమైన ఆ గ్రామీణ జీవితాలతోనే బ్రిటిష్ వాడు చెలగాటమాడాడు - భూమిపై హక్కునిస్తానంటూ పన్ను కట్టలేదని భూములు గుంజేశాడు. తనచేలో రైతుకు ఇష్టం వచ్చిన పంటగాకుండా తనకవసరమైన పంటే పండాలని శాసించాడు. ఈ భయంకర బాధలు పడలేక రైతు తను నమ్ముకున్న నేలనుండే వేరుపడ్డాడు. కరువు కాటకాలకు గురై ఆకలి చావులకు గురయ్యాడు. జీవశ్చవమయ్యాడు. అందుకే తనమంచి తనాన్ని, తన అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని తన బ్రతుకునే బుగ్గిపాలు చేసిన బ్రిటిష్ ముష్కరులపై కదనరంగంలోకి దూకాడు. స్వరాజ్యం వస్తే తనబతుకు బాగవుతుందని ఆశపడ్డాడు.

ఆ ఆశ అడియాసేనని తేలడానికి ఎంతోకాలం పట్టలేదు. బ్రిటిష్ పాలనలో తనను పీక్కుతిన్న జమిందారీ, జాగీర్దారీ విధానదార్లే మంత్రులు, కంత్రులూ కావడంతో కంగారుపడ్డాడు. 'హరితవిప్లవం', గరీబీహటావో', నినాదాలూ, భూసంస్కరణల చట్టాలు, దారిద్ర్యనిర్మూలనా పథకాలు తన బతుకులో తెస్తున్న మార్పులు తనకోసంగాక పల్లెల్లోని బుగ్గమతలకు, పట్నాల్లోని దళారులకు వరాలుగా మారడంతో కంగారుపడ్డాడు. ఎరువులూ, పురుగుమందులు వాడి పైర్లకు పట్టిన తెగుళ్ళను చంపిన చేతుల్తోనే తనూ దాన్ని తాగి ఆత్మహత్యకు తలపడ్డాడు. సేద్యపు ఋణాలకోసం బ్యాంకుల్లో తాకట్టు పెట్టిన బంగారపు సొమ్ములు వేలం పాటలో పరుల పాలవుతుంటే గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు. కరువు తనను పట్నాల్లో మూటలు మొయ్యడానికి, రాళ్ళెత్తడానికీ, రిక్షాలు లాగడానికి తరిమినా ఆధునికి ఆయకట్టు సేద్యం సీజనువారీగా వలసలు పంపినా భరించాడు. అడవి తల్లిని నమ్ముకున్న గిరిజనుడ్ని, రైతును అందులో పుల్లకూడ ముట్టనివ్వకుండా నిషేధాలు విధించి దౌర్జన్యాలు ప్రయోగించి మరోవైపు బిర్లా, టాటాలకు కారుచౌకగా కలపను కట్టబెట్టి అడవుల్ని నాశనం చేస్తుంటే తిరగబడ్డాడు. లాఠీలకు, తూటాలకు, జైళ్ళకు గురయ్యాడు. పాలవిప్లవమంటే పాలు పెరుగు తాగకుండా కడుపుకట్టుకొని పట్నాలకు పంపాడు. నీలివిప్లవమంటే నాలికకట్టుకొని, ముక్కుమూసుకొని పట్నాలకు, విదేశాలకు చేపలు, రొయ్యలు ఎగుమతి చేస్తున్నాడు.

ఇపుడేమో ఏకంగా తన చేలో పండించిన పంటలు - తన తాత ముత్తాతలకాలంనుండి కారుకారుకు మంచి కంకుల్ని ఏరుకుని రూపొందించిన మంచి మొక్కలు, విత్తనాలపై తనహక్కు కాజెయ్యడానికీ; తనకోళ్ళనుండీ, ఒంగోలు జాతి మేలు ఎద్దుల నుండీ, ఇంకా ఇతర మేలు రకాల జంతువుల నుండీ తయారుచేయబడిన సంకరజాతి పశుపక్ష్యాదులపై హక్కు గుంజేసుకోడానికీ; తనభూమిలో తనకవసరమైన పంట వేసుకోవీలులేకుండాను; వ్యవసాయానికి అంతో ఇంతో వస్తున్న తోడ్పాటును రద్దు చేయ్యడానికీ; వ్యవసాయ కూలీలకు ఇపుడు దొరుకిన పనికూడ దొరక్కుండా, బియ్యం, కిరసనాయిల్ ఇచ్చే చౌకదరల

దుకాణాల రద్దుకు; రోగమొస్తే జ్వరంబిళ్ళ కూడ కొనుక్కోడానికి అందనంతధరలు పెంచడానికీ; తన 'నుండి పన్ను వసూలు చేసుకోడానికే తప్ప తన బిడ్డలు పనీపాటా, మందూ, మాకు, కొంపా, గోడూ, తిండి నీడా వంటి వేవీ నాబాధ్యత కాదని అనడానికి ప్రభుత్వం చేస్తున్న కుట్రకు బలిగాబోతున్నాడు. సామ్రాజ్యవాదులకు, విదేశీగుత్తకంపెనీలకు గేట్లు బార్లాతెరచి దోచుకోనిచ్చి తమవాటాలు తాము సొమ్ము చేసుకోగలిగితే చాలనుకుంటున్న దేశదళారీ పాలకుల కుహనావిధానాల కోరల మధ్య నలగబోతున్నాడు.

అదే.....అదే....... డంకెల్ డ్రాఫ్టు పేరిట మూడవ ప్రపంచ దేశాలపై సామ్రాజ్యవాదులు రుద్దజూస్తున్న పథకం. ఒప్పందం పేరిట వేయబోతున్న ఉరి. డిసెంబరు 15, 1993 నాటికి మూడవ ప్రపంచ దేశాలచే బలవంతంగా బెదిరించి సంతకాలు చేయించడానికి, నేటి ప్రపంచపు బడా వ్యాపార పెద్దన్నలైన అమెరికా, యూరపుకమ్యూనిటీ (ఫ్రాన్సు, బ్రిటను, జెర్మనీ వగైరా) దేశాలు, జపానులు తమలో తాము సర్దుబాట్లకు రావడానికే తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మన రైతాంగంపై, వ్యవసాయరంగంపై డంకెల్ డ్రాఫ్టు పడవేసే దుర్మార్గ ప్రభావాలను వివరించడానికి చేసిన ప్రయత్నమే ఈ పుస్తకం. సామ్రాజ్యవాద కుట్రల కొనసాగింపును అర్థంచేసుకోడానికి వీలుగా బ్రిటన్ సామ్రాజ్యవాదం మనదేశంలోకి ప్రవేశించిన నాటి నుండి నేటి వరకు చారిత్రక క్రమంలో తన అవసరాల కనుగుణంగా వ్యవసాయ రంగాన్ని ఎలా మార్పులకు గురిచేసిందో వివరిస్తుంది. ప్రస్తుతం ప్రధానంగా చర్చ జరుగుతున్న పేటెంట్ హక్కులు జీవజాలరంగంలోకి (విత్తనాలు, మొక్కలు, పశుపక్ష్యాదులు వగైరా) విస్తరించడానికి కారణమైన జీవసాంకేతిక శాస్త్రాన్ని, అందునుండి పేటెంట్ హక్కుల ఆవశ్యకత ఎలావచ్చిందో కూడ వివరిస్తుంది.

మూడవ ప్రపంచ దేశాలను పునర్వల స్వీకరించడానికి (Re-colonisation) జరుగుతున్న కుట్రలను అర్థం చేసుకొని రైతాంగానికి విప్పి చెప్పి కర్తవ్యోన్ముఖులను చెయ్యడానికి రైతాంగ కార్యకర్తలకు, ఇతర ప్రజాపుద్యమాల కార్యకర్తలకు ఉపయోగపడుతుందనీ; లోకం అంతా పచ్చగా వుందనుకుంటూ ఊహాలోకాల్లో వున్న మధ్య తరగతి మేధావులకు పరిస్థితిని కొంత మేరకైనా గుర్తింపచేయడానికి తోడ్పడుతుందని ఆశిస్తాము.

విజయవాడ
23-11-93

జె. కిశోర్‌బాబు
రాష్ట్ర సహాయ కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ రైతుకూలీసంఘం

# కొన్ని సాంకేతిక పదాల వివరణ

## బహుళ జాతి గుత్త సంస్థలు (TNC లేక MNC)

పెట్టుబడిదారీ విధానంలో స్వేచ్ఛాయుత పోటీ (Free competition) అన్నది విధానంగాను, వినాదంగాను, ప్రచారం చేయబడుతోంది. సామర్థ్యం వున్నవాళ్లు వున్నట్లుగా పరిశ్రమలు పెట్టుకోవచ్చు. లాభాలు సంపాదించుకోవచ్చు. ఈ పోటీలో ఒకే వస్తువును వుత్పత్తి చేయడం కోసం పోటీపడే పరిశ్రమలు, లేదా కంపెనీల్లో సహజంగా ఎక్కువ పెట్టుబడి వుండే వాళ్ళు ఆధునిక యంత్రాలతో తక్కువ ఉత్పత్తి ఖర్చులతో వుత్పత్తి సాధించగలుగుతారు. మొదట్లో పెట్టుబడిదారుల మధ్య పెరిగే పోటీ వల్ల మార్కెట్లో వినియోగదారుడికి తక్కువ రేట్లకే సరుకులు లభిస్తాయి. అయితే పోటీ క్రమంలో ఎక్కువ పెట్టుబడితో లేదా ఇతర అవినీతికర (Malpractices) చర్యలు ద్వారా ఎక్కువ సంపాదించగలిగిన వాళ్ళు పోటీని నివారించుకోవడం కోసం చిన్న ఫ్యాక్టరీలు లేదా కంపెనీలను కొనివేస్తారు. ఇలా ఇలా --- చిన్న చేపలను పెద్ద చేపలు మింగుతూపోయి రంగంమీద చేతివేళ్ళ పై లెక్కించదగిన కంపెనీలు మాత్రమే మిగులుతాయి. అవికూడ తమ మధ్య పోటీని నివారించుకోవడం కోసం గ్రూపులుగా ఏర్పడతాయి. వాటిని సిండికేట్లు లేదా కార్టెల్సు లేదా ట్రస్టులు అని కూడా పిలుస్తారు. ఇవే ఆరంగంలోని వ్యాపారాన్ని నియంత్రిస్తాయి లేదా కంట్రోలు చేస్తాయి. (ఎంత ధరనైనా పెంచవచ్చు - కొరతను సృష్టించి కృత్రిమ డిమాండును సృష్టించవచ్చు - వగైరా) ఈ దశకు చేరిన వాటినే గుత్త సంస్థలంటారు. ఈ దశకు వచ్చేసరికి స్వేచ్ఛాయుత పోటీ అన్న సూత్రం గాలికి ఎగిరిపోతుంది. గుత్తగా నియంత్రించడమే మిగులుతుంది.

ఈ గుత్త సంస్థలు ఏ దేశంలో పుడతాయో ఆదేశంలోనే గాక వేరే దేశాల మార్కెట్ల కోసం కూడ ఒక దశలో ఎగబడతాయి. ఇలా విదేశాల మార్కెట్ల కంట్రోలు కోసం ఎగబడే దశకు పెరిగిన పెట్టుబడిదారీ విధానాన్ని సామ్రాజ్యవాద రూపం తీసుకోవడమన్నారు. మార్క్సిస్టు మహోపాధ్యాయుడు కా॥ లెనిన్ పెట్టుబడిదారీ విధానపు అత్యున్నత రూపమే సామ్రాజ్యవాదమన్నాడు.

మన దేశంలో బ్రిటిష్ వలస ఆరంభమయింది ఇలాగే. మొదట దేశంలోకి వ్యాపారం పేరిట వచ్చిన (ఈస్టిండియా కంపెనీ) మనదేశంపై రాజకీయ ఆధిపత్యాన్ని కూడ సంపాదించింది. ప్రథమ భారత సంగ్రామం వరకు (1757 నుండి 1857) ప్రత్యక్షంగా మనల్ని పాలించింది ఈ వ్యాపార కంపెనీయే. ఆ తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం వేరుగా మనదేశ పాలనా వ్యవహారాలను చూసింది.

తొలిదశల్లో ఒక దేశ పెట్టుబడితోనే ఆరంభమైన గుత్త కంపెనీల్లో తర్వాత 2,3 దేశాల లేదా అంతకన్నా ఎక్కువ పెట్టుబడులు కూడా కలుపుకున్నారు. వాటి వ్యాపారం ప్రపంచంలో వీలైన దేశాలన్నిటా సాగిస్తున్నారు. వీటిని బహుళ జాతి గుత్త సంస్థలు అని ఇంగ్లీషులో T.N.C లేదా M.N.C అనీ పిలుస్తువారు. ప్రస్తుత ప్రపంచ వ్యాపారాన్ని కంట్రోలు చేస్తున్నవి ఇవే.

వీటి సామర్థ్యాన్ని అర్థం చేసుకోడానికి క్రింది అంశాలు చూడండి.

- ప్రపంచ వ్యాపారంలోని 70 శాతాన్ని 500 గుత్త సంస్థలు కంట్రోలు చేస్తున్నాయి. ప్రపంచదేశాల్లో వున్న విదేశీ పెట్టుబడుల్లో 80 శాతాన్ని, ప్రపంచ దేశాల మొత్తం ఉత్పత్తి (GDP) లో 30 శాతాన్ని ఇవే కంట్రోలు చేస్తున్నాయి.

- 15 గుత్తసంస్థల (అతిపెద్ద) స్థూల ఆదాయం - 120 దేశాల (దాదాపు మూడవ ప్రపంచ దేశాలన్నిటి) స్థూల జాతీయదాయం కంటే ఎక్కువ.

- ప్రపంచంలోని ఆటోమొబైల్ వాహనాలన్నిటినీ కేవలం 13 గుత్త సంస్థలు తయారు చేస్తున్నాయి. అందులో జనరల్ మోటార్స్, ఫోర్డ్ (అమెరికా), టొయోటా (జపాన్), నిసాన్, ప్యుయ్‌గాట్ అనే అతి పెద్ద సంస్థలు సగం వ్యాపారం చేస్తాయి.

- ఆయిల్ కంపెనీ షెల్ (Shell) 1990 లో 132 బిలియన్ డాలర్లు (13,200 కోట్లు) స్థూల ఆదాయాన్ని సంపాదించింది. ఇది టాంజానియా, ఇథియోపియా, నేపాల్, బంగ్లాదేశ్, జైరె, ఉగాండా, నైజీరియా, కెన్యా, పాకిస్తాన్ - ఈ దేశాలన్నిటి స్థూల జాతీయ-వుత్పత్తి (GNP) కన్నా ఎక్కువ. మరోరకంగా చెప్పాలంటే ఈ ఒక్క కంపెనీ ఆదాయం 50 కోట్ల మంది ప్రజలు చేసే మొత్తం వుత్పత్తితో సమానమన్నమాట.

వీటి శక్తిని, విస్తృతిని అర్థం చేసుకోడానికి ఒకటి రెండు వుదాహరణలు:

మనదేశంలోని హిందుస్తాన్ లివర్ కంపెనీ; ఇది ఆంగ్లో - డచ్చి కంపెనీ అయిన యూనిలివర్ కంపెనీకి భారతదేశపు శాఖ. మన దేశంలో సబ్బుల అమ్మకాల్లో దీనిదే ప్రథమస్థానం. లిక్స్, రెక్సోనా, లైఫ్ బాయి వంటి వన్నీ దీని వుత్పత్తులే - బట్టలు, స్నానపు సబ్బుల అమ్మకాలలోనే ఇది మన దేశంలో 2036 కోట్ల రూ॥ వార్షిక టర్నోవరును కలిగివుంది. మన కేంద్ర ప్రభుత్వం గుత్త సంస్థల నిరోధక చట్టం (MRTP), విదేశీ ద్రవ్యమారక నియంత్రణ చట్టం (FERA) ల ఆంక్షలను తొలగించడంతో కొద్ది కాలంలోనే వేగంగా విస్తరించింది.

సబ్బుల రంగంలో తన పోటీదారైన టాటా ఆయిల్స్‌ను కొని వేసుకుంది. దీంతో దీని సబ్బుల టర్నోవరు 2500 కోట్లకు పెరుగుతుంది. మార్కెట్లోని ఒక పోటీదారుణ్ని తొలగించుకొంది.

పేరు పొందిన బ్రూక్ బాండ్, లిప్టన్ కంపెనీలు కూడ దీనివే - డాల్డా బ్రాండ్ వంటనూనెలు, తేయాకు, పాలవుత్పత్తులు, చేపలు, పశువులు, కోళ్ళదాణా, కాఫీపొడి, ఇన్‌స్టంట్ కాఫీ, సుగంధ ద్రవ్యాల వ్యాపారంలో ఈ రెండు కంపెనీలున్నాయి.

ఇపుడు కొఠారీ జనరల్ ఫుడ్స్‌ను, కాడ్‌బరిస్‌కు చెందిన ఐస్‌క్రీమ్ విభాగాన్ని, యునైటెడ్ బ్రూవరీస్ కు చెందిన కిసాన్ ప్రొడక్టులను కొనివేశాయి.

బ్రూక్ బాండ్, లిప్టన్‌లను ఇపుడు కలిపివేసుకుంది. ఈ కొత్తగా కొన్న కంపెనీల ద్వారా విస్తరించే వ్యాపారంతో కలుపుకొంటే - భారతదేశపు మార్కెటులో తేయాకు - 17%, కాఫీ - 6%, ఐస్‌క్రీములు - 50%, జామ్‌లు, సాస్‌లు - 40% పట్టుకలిగి వుంటుంది. ఇవికాక 25 కోట్ల రూ॥తో శీతలీకరణ ఫ్యాక్టరీ, 10 కోట్ల రూ॥తో నూడుల్సు (ఒక రకం సేమ్యాలవంటివి) ఫ్యాక్టరీ త్వరలో వుత్పత్తిని ప్రారంభించ బోతున్నాయి. ఇవన్నీ కలిపితే 1400 కోట్ల రూ॥ల వాణిజ్యంతో భారతదేశం లో కెల్ల పెద్దదైన ఆహారపదార్థాల కంపెనీగా ఇది తయారవుతుంది.

ఈ పుస్తకం లోపలిపేజిల్లో యూనిలివర్ కంపెనీ ప్రపంచ వ్యాప్తంగా పామాయిల్ పెంపకంలో గుత్తాధిపత్యాన్ని చూస్తాం. మన రాష్ట్రంలో కూడ ఈ పామాయిల్ మొక్కల పెంపకాన్ని చేపట్టనున్నారు. ఇక ఆయిల్ తయారీ, మార్కెటింగు అన్ని శాఖలు ఈ కంపెనీకున్నాయి.

ఇటీవలే బల్గేరియా నుండి దిగుమతి చేసుకున్న యంత్రాలతో వుల్లిపాయలు, వెల్లుల్లి (చిన్నవుల్లి) పాయలను నీటి ఆవిరిపై వుడికించి (Dehydration) విదేశాలకు ఎగుమతి చేసే పరిశ్రమను దేశంలో పెట్టింది ఇలావేగవంతంగా విస్తరిస్తోంది.

## ఇండియన్ టుబాకో కంపెనీ (ITC)

ఐ.యల్.టి.డి. (ILTD) కంపెనీగా మన పొగాకు రైతుల కందరికీ పరిచయమైన కంపెనీ ఐ.టి.సి. కి శాఖ. బ్రిటిష్ పరిపాలన కాలంలో లక్షరూపాయలకు లోపు పెట్టుబడితో ఈ కంపెనీ మనదేశానికి వచ్చింది. బ్రిటిష్ అమెరికన్ టుబాకో కంపెనీ (BATC) దీని మాతృకంపెనీ. ఆ రోజుల్లో ఇంపీరియల్ టుబాకో కంపెనీగా వచ్చి స్వదేశీపాలనలో ఇండియన్ టుబాకో కంపెనీగా మారింది.

ఇపుడు దీని ఆస్తులు 4 - 5 వందల కోట్లకు (ఇండియాలో) చేరాయి. మొదట వచ్చినపుడు ఒక పొగాకు రంగానికే పరిమితమైతే ఇపుడు దీని వ్యాపారం 7 రంగాలకు విస్తరించింది. పొగాకు, పేపర్ తయారీ, ఫైవ్ స్టార్ హోటల్ పరిశ్రమ, రొయ్యల ఎగుమతి, సరుకుల మార్కెటింగ్ తదితర రంగాలలో వుండి ఇటీవల విత్తనాల రంగంలోకి కూడ వచ్చింది. ఆదర్శ విత్తనాలు దీనివే. బర్కిలీ, సిజర్స్, ఛార్మినార్, విల్స్ (Wills) లోని అన్ని బ్రాండ్లు, గోల్డ్ ఫ్లాక్ (Gold Flake) లోని అన్ని బ్రాండ్ సిగరెట్లు దీనివే. మనదేశపు పొగాకు మార్కెటింగ్, సిగరెట్ పరిశ్రమలో గుత్తాధిపత్యం దీనిదే.

మరో రకంగా కూడ ఈ కంపెనీని చెప్పుకోవాలి. సిగరెట్ పరిశ్రమలో తాను చెల్లించాల్సిన సెంట్రల్ ఎక్సైజ్ పన్నును ప్రతి సం॥ 200 నుండి 300 కోట్ల వరకు ప్రభుత్వానికి ఎగవేస్తుంది. అయినా, ప్రభుత్వమే ఈ విషయం అంగీకరించినా కంపెనీని ఏమీ చెయ్యలేదు. కారణం వున్నతస్థాయి రాజకీయనాయకులు, అధికారుల బంధువులు ఈ కంపెనీలో వున్నత ఆఫీసర్లు. ఒకప్పటి ఇందిరాగాంధీ పర్సనల్ కార్యదర్శి హక్సర్, కాంగ్రెసు అధ్యక్షుడు బారువాల దగ్గరి బంధువులు కంపెనీ వున్నత స్థానాల్లో పనిచేశారు. ఇలాంటి వారి నుపయోగించి ఈ కంపెనీ ప్రభుత్వ పాలసీలను కూడ ప్రభావితం చేస్తుంది. తన పొగాకు పంట దెబ్బతినకుండా వుండడం కోసం ప్రకాశం జిల్లాలో ఒంగోలు తాలుకాలోని పొగాకు పండే ప్రధాన గ్రామాలను, నాగార్జునసాగర్ కుడికాల్వ ఆయకట్టు ప్లాను నుండి తొలగించేలా చేయడం దీనికో ఉదాహరణ.

## కార్గిల్ కంపెనీ

ఇటీవలి కాలంలో వార్తల్లోకి వస్తున్న కార్గిల్ కంపెనీ ప్రపంచ గుత్త కంపెనీల్లో ఒకటి. ప్రపంచపు కాయధాన్యాల (వరి, గోధుమ వంటి తిండి గింజలు) వ్యాపారంలో 60% ఇది కంట్రోలు చేస్తుంది. అమెరికన్ ధాన్యపు వ్యాపారంలో కీలక పాత్ర కార్గిల్ కంపెనీదే.

అమెరికన్ కాంగ్రెసు సభ్యులు అమెరికా వ్యవసాయశాఖ అధికారులు ఈ కంపెనీ చెప్పుచేతుల్లో వున్నారు. ఈ కంపెనీ రైతు కపసరమైన ఎరువుల నమ్ముతుంది. విత్తనాలను

సప్లయి చేస్తుంది. వారు పండించిన ధాన్యాన్ని కొనుగోలు చేస్తుంది. విదేశాలకు ఎగుమతి చేస్తుంది. ఆ ధాన్యంలో కొంత భాగాన్ని పశువుల దాణాగా మారుస్తుంది. ఆ దాణాతో పశువులు, కోళ్ళు, పందులు పెంచుతుంది. వాటి మాంసాన్ని ప్రాసెస్ చేసి డబ్బాలలో సీల్‌చేసి తిరిగి అమెరికాలోను, విదేశాలలోను అమ్ముతుంది.

అమెరికా మాజీ వ్యవసాయశాఖ కార్యదర్శి "బాబ్‌బెర్గ్లాండ్" చెప్పినట్లు దీనికి తనకు అవసరమైన ఆర్థిక, రాజకీయ, సమాచారం సేకరించడానికి (రహస్యంగా) అమెరికన్ గూఢచారి సంస్థ (CIA) ను మించిన యంత్రాంగం వుంది. వున్నతోద్యోగులకు, రాజకీయ నాయకులకు పెద్ద మొత్తాలు చెల్లిస్తుంది. అమెరికన్ వ్యవసాయ పాలసీల నిర్ణయంలో ఈ కంపెనీ కీలకపాత్ర నిర్వహిస్తున్నదంటే ఆశ్చర్యంలేదు.

అమెరికన్ రైతులకు ప్రభుత్వం సబ్సిడీలిచ్చి (వ్యవసాయాన్ని ప్రోత్సహించేందుకు) ధాన్యం పండించేట్లు చేస్తుంది. వాటి మార్కెటింగ్ ధరలను తక్కువగా నిర్ణయిస్తుంది. ఆరేట్లకు కార్గిల్ కంపెనీ కొంటుంది. ఈ తక్కువ ధరల వల్ల నష్టపోయి 1981 నాటికే 6 లక్షల మంది రైతులు దివాళా తీసి వ్యవసాయాన్ని వదిలివేశారు. ఆహారధాన్యాల్ని నిల్వ చేసే గిడ్డంగులలో అధికభాగం ఈ కంపెనీవే.

ఈ కంపెనీపై బ్రిటన్‌లో పన్నులు ఎగవేసిందనీ, ఇండియాలో తక్కువ తూకం ఇచ్చిందనీ, బ్రెజిల్‌లో ధరలను తారుమారు (Manipulate) చేసిందనీ ఆరోపణలున్నాయి. ఇపుడు డంకెల్ ప్రతిపాదనలు రావడం వెనుక కూడ కార్గిల్ కంపెనీది ముఖ్యమైన పాత్రే.

భారతదేశంలోకి వస్తే -

1988 లో ఢిల్లీకి చెందిన సెడ్కోతో ఒప్పందానికి వచ్చి బళ్ళారివద్ద 7 కోట్ల రూ.I తో హైబ్రీడ్ విత్తనాల తయారీ - పరిశోధన యూనిట్‌లను పెట్టింది. "ర్యాలిస్ ఇండియా" కంపెనీ ఇది తయారు చేసిన విత్తనాల్ని దేశంలో పంపిణీ చేస్తుంది.

కర్నాటక రాష్ట్ర మొక్కజొన్న అభివృద్ధి సంస్థ (KMDA) తో ఒప్పందం చేసుకుని ప్రత్యేక మొక్కజొన్న రకాన్ని తయారు చేయజూస్తోంది. దీన్ని తన పశువుల దాణా తయారీ కోసం ఉపయోగించుకోవాలన్నది కంపెనీ ఆలోచన. కాండ్లా రేవు వద్ద భారీ ఎత్తున వుప్పు తయారు చేసే ఫ్యాక్టరీ కోసం 15000 ఎకరాల భూమిని, ఒక ఓడరేవును (జెట్టీ) కట్టుకోడానికి అనుమతి ఇమ్మని కోరితే కేంద్రం ఆమోదించింది. ప్రజల ఆందోళన వల్ల కంపెనీ తాత్కాలికంగా వెనక్కు తగ్గుతున్నట్లు ప్రకటించింది.

## రక్షిత విధానం (Protectionism)

ఉత్పత్తిలో ఆధునిక విధానం వచ్చే కొద్దీ పాతది నిలబడడం కష్టమవుతుంది. అలాగే పెట్టుబడి పెరిగితే దానిముందు కొద్ది మొత్తాలు నిలబడడం కష్టం. బలవంతుడి ముందు బలహీనుడు నిలబడడం కష్టం. అందువల్ల సామాజిక ప్రయోజనం (Social Welfare) అన్న సిద్ధాంతాన్ని అంగీకరించే వాళ్ళంతా బలహీనులకు ఆ పోటీని తట్టుకొని నిలబడగలిగేందుకె కొన్ని రక్షణలు సమాజపు అధికార యంత్రాంగం నుండి కల్పిస్తారు. ఇదే రక్షిత విధానమంటే. ఇది దేశంలో అంతరంగికంగానూ వుంటుంది. విదేశాలతో వ్యవహరించాల్సిన విషయంలోనూ వుంటుంది.

**ఉదాహరణకు చేనేత :** మనదేశంలో వ్యవసాయం తర్వాత అత్యధిక ప్రజానీకం ఆధారపడుతున్న వృత్తి ఇది. ఈ కోట్లాది ప్రజానీకం తమ ఉత్పత్తులను మిల్లుమగ్గాల పోటీ

ముందు అమ్ముకోవడం కష్టం. అందుకే భారత ప్రభుత్వం 22 రకాల గుడ్డల్ని చేనేతకు కేటాయించింది. మిల్లుల మీద ఆ ప్రత్యేక రకాల్ని నెయ్యడానికి వీల్లేదని చట్టం చేసింది.

అలాగే చేపల వృత్తిలో సాంప్రదాయకంగా చేపలు పట్టుకునే జాలర్లు ఆధునికంగా వచ్చిన ట్రాలర్ల పోటీని ఎదుర్కోలేక వృత్తిని కోల్పోవాల్సి వచ్చి ఆందోళన చేశారు. షుమారు 3 కి.మీ వరకు సముద్రపు ఒడ్డునుండి సాంప్రదాయక వేటగాళ్ళకు వదిలి లోతైన సముద్రంలో మాత్రమే వేటాడాలని ట్రాలర్లకు చట్టం పెట్టారు. లేకుంటే దేశంలోని లక్షలాది మత్స్యకారులు జీవనాధారం కోల్పోతారు.

**కుటీర పరిశ్రమలు :** కొన్ని ప్రత్యేక తరహా వస్తువుల్ని బడా ఫ్యాక్టరీలు తయారు చెయ్యరాదని నిర్దేశించారు - ఉదా.కు సబ్బులు - ఈ చట్టం వచ్చే నాటికే ఈ రంగంలో వున్న కంపెనీలు తప్ప ఆ తర్వాత సబ్బుల తయారీకి పెద్ద కంపెనీలకు అనుమతి నిరాకరించారు. గుజరాత్‌లోని అహమ్మదాబాద్‌లో ఇటువంటి చిన్న సబ్బుల ఫ్యాక్టరీల్లో వేలాదిమంది కార్మికులు పని చేస్తున్నారు - వీరంతా ప్రస్తుతం వచ్చిన లిబరలైజేషన్ వల్ల (విధానాల్ని సరళతరం చేయడం) పెద్ద పెట్టుబడిదారులు ఈ రంగంలోకి రావడంతో వృత్తిని కోల్పోతున్నారు.

ఉప్పు తయారీ చిన్నతరహా పరిశ్రమ. ఇందులోకి కూడ కార్గిల్ కంపెనీకి లక్షల టన్నులు వుత్పత్తి చేయడానికి అనుమతిస్తే ఇక ఉప్పు పండించే రైతులకు మార్కెట్ ఎక్కడుంటుంది?

వ్యవసాయ ధాన్యాల కంట్రోలు. మన రాష్ట్రం బియ్యం అంతర్ రాష్ట్ర రవాణాపై ఆంక్షలు విధించింది. రాష్ట్రంలో పండే ధాన్యం ఇతర రాష్ట్రాలకు పోతే రాష్ట్రంలో ధరలు నిలకడగా వుండవని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చట్టంచేసింది. పొరుగు రాష్ట్రాలకు బియ్యం ఎగుమతి చేయడానికి లైసెన్సింగ్ పద్ధతి పెట్టింది.

## గుత్త వ్యాపార నిరోధక చట్టం (MRTP)

పారిశ్రామిక రంగంలో పెట్టుబడులు పోగుపడితే స్వేచ్ఛాయుత పోటీలేకుండా గుత్తకంపెనీలే నియంత్రణ చేస్తాయి. ఇలా గుత్త కంపెనీలు తయారు కాకుండ వుండడం కోసం కంపెనీల టర్నోవరుపైన పరిమితి పెట్టారు. ఇది కొంతమేరకు గుత్త కంపెనీల నుండి మధ్య తరహావాటికి రక్షణ కల్పించింది. ఈ చట్టం వున్నపుడు కొన్ని చిన్న తరహాపరిశ్రమలు మూతకు గురయ్యాయి (Sick Industries).

నియంత్రణ వుండడంవల్లే పై చెప్పిన వుదాహరణలో హిందుస్తాన్ లివర్ కంపెనీవే అయినా బ్రూక్‌బాండ్, లిప్టన్ కంపెనీలు వేర్వేరుగా వుంచారు. అయితే ఇపుడు రెండూ కలవడం వల్ల అవి చిన్న కంపెనీలను దెబ్బ తీస్తాయి. మింగి వేస్తాయి. అందుకే చిన్న కంపెనీల రక్షణకోసం పెట్టిన ఈ చట్టం ఎత్తివేయడం కొన్ని కంపెనీల లేదా పరిశ్రమల మూసివేతకు తద్వారా వేలాది కార్మికుల వుద్యోగాలు కోల్పోడానికి దారితీస్తుంది. (చీరాలలో ITC కంపెనీ పొగాకు ఈనె తీసే యంత్రం తెచ్చిపెడితే 20 వేల మంది మహిళా కార్మికులు పనికోల్పాయారు.)

అలాగే ప్రభుత్వ రంగం - ప్రవేటు, సంయుక్త రంగంగా చేసిన విభజనలు, ఇలాంటి వన్నీ ఆంతరంగిక రక్షక విధానాలంటారు - దేశం లోపల బలహీన శక్తులను రక్షిస్తాయివి. (అవి ఎంత సమర్థంగా అమలు జరుగుతాయన్నది వేరే విషయం)

## విదేశీమారక ద్రవ్య నియంత్రణ చట్టం (FERA)

ఈ చట్టం దేశంలోకి వచ్చే, దేశం నుండి పోయే విదేశీమారక ద్రవ్యాన్ని నియంత్రిస్తుంది - కొన్ని పరిశ్రమలలోకి, కొన్ని రంగాలలోకి విదేశ పెట్టుబడిని అసలు అనుమతించదు. అలాగే మన దేశంలోని విదేశీ కంపెనీ తమకు వచ్చే లాభాలను ఇష్టా రాజ్యంగా తరలించడానికి కూడ వీలులేదు - ఎక్కువ భాగం ఇక్కడే తిరిగి పెట్టుబడిగా పెట్టుకోవాల్సి వస్తుంది. అందువల్ల గుత్తకంపెనీలు దీన్ని రద్దు చెయ్యమని గొడవ పెట్టాయి - అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF) ప్రపంచబ్యాంకు (WB) ల ఆదేశాల మేరకు ఇప్పటికే మన ప్రభుత్వం ఈ చట్టాలను ఎత్తివేసింది.

ఇలాంటి వన్నీ రక్షిత విధానాలే - దేశంలోని ప్రజల్లో విభిన్న సెక్షన్ల జీవనాన్ని దెబ్బ తిననివ్వకుండా వుండడం కోసమూ; బలవంతులైన అగ్రరాజ్యాల, సామ్రాజ్యవాదుల గుత్త కంపెనీల నుండి పేదదేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ ఆర్థిక వ్యవస్థలను కాపాడుకోవడం కోసమూ ఇలాంటి విధానాలు అవసరం.

అయితే వెనుకబడ్డ దేశాల్ని నేరుగా కబళించి ఏలిన సామ్రాజ్యవాదం ఆ దేశాల్లో స్వాతంత్ర్యపోరాటాలధాటిని తట్టుకోలేక ప్రత్యక్ష పాలనను ముగించుకుంది - రెండో ప్రపంచ యుద్ధం తర్వాత పరోక్షంగా పెత్తనం చేస్తోంది - మూడవ ప్రపంచ దేశాల్లో వుండేది దోపిడీ పాలక వర్గాలే అయినా ప్రజల ఆందోళనల వల్ల కొన్ని హక్కుల్ని ప్రజలకు ఇవాల్సి వచ్చింది. రక్షణలు కల్పించాల్సి వచ్చింది. సామ్రాజ్యవాదులకు యధేచ్ఛగా దోచిపెట్టడానికి వీలు లేకుండా పోయింది.

మళ్ళీ ఇపుడు ఆ క్రమంలో సామ్రాజ్యవాదం తనకు ఏర్పడిన అనుకూల పరిస్థితులను ఆసరా చేసుకుని మూడవ ప్రపంచ దేశాలను అవి పెట్టుకున్న రక్షిత విధానాలన్నీ ఎత్తివేసుకోమని వత్తిడి చేశాయి, చేస్తున్నాయి - డంకెల్ ప్రతిపాదనల సారాంశం కూడ ఈ రక్షిత విధానాలను ఎత్తివేసి అంతర్జాతీయ దోపిడీకి గేట్లు బార్లా తెరవమనడమే.

## సూపర్ 301, స్పెషల్ 301

అమెరికా వ్యాపారరంగంలో ఇతరదేశాలపై చర్యతీసుకొనేందుకు వుపయోగించుకునే ఆయుధాలు ఇవి. తన షరతులను అంగీకరించకపోతే ఈ చట్టాలక్రింద ప్రతీకార చర్యలు తీసుకుంటుంది. ఏదైనా దేశాన్ని ఈ చట్టం క్రిందకు చేర్చినట్లు అమెరికా ప్రకటిస్తే ఆదేశానికి తను చేసే ఎగుమతులను నిలిపివేయడం, ఆదేశంనుండి తనకు వచ్చే సరుకులపై ఎక్కువ సుంకాలు విధించి ఆ సరుకును వాళ్ళకు గిట్టుబాటుకాకుండా చేయడం వంటి చర్యలు చేపడుతుంది.

మనదేశాన్ని 1989 మేలో సూపర్301 లిస్టులో అమెరికా ప్రకటించింది. తనకోరికలైన 1. విదేశీపెట్టుబడులతో నడిచే పరిశ్రమలువిధిగా పేర్కొన్న నిర్దిష్టశాతం ఎగుమతులు (తన వుత్పత్తిలో) చేయ్యాలనే నిబంధన ఎత్తివేయడం. 2. విదేశీ బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీల్ని స్వేచ్ఛగా మనదేశంలోకి అనుమతించాలి - ఈ రెంటినీ అంగీకరించనందువల్లే మనపై ఈ చట్టాన్ని ప్రయోగించింది. ఆంక్షలువిధించింది - పి.వి. ప్రభుత్వం వీటిని అంగీకరించగానే లిస్టునుండి తొలగించింది-...

అమెరికా కోరినవిధంగా మేధోసంపత్తి హక్కుల్ని గుర్తించని దేశాలపై స్పెషల్301ను ప్రయోగిస్తుంది. మనదేశాన్ని ఫిబ్రవరి 1990లో ఈ లిస్టులో ప్రకటించింది. మనదేశంనుండి ఎగుమతయ్యే మందులపై అంతకుముందువరకూ ఇస్తూవచ్చిన సుంకాల రాయితీని రద్దుచేసింది. తర్వాత మనకు వచ్చే విదేశీమారకాన్ని దెబ్బతీసింది.

ఇలా చట్టాలను ఉపయోగించి అమెరికా చాలా దేశాలను తన వాణిజ్య అవసరాలకనుగుణంగా లొంగదీసుకుంది.

**యూరోపియన్ కమ్యూనిటీ :** బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, తదితర 12 దేశాలు. ఇవన్నీ యూరోపియన్ ఎకనమిక్ కమ్యూనిటీగా ఏర్పడ్డాయి. దేశాలమధ్య మారకం జరుపుకునేటపుడు ఇవన్నీ ఒకేవిధమైన సుంకాలను విధించడం వంటి పద్ధతులు పాటిస్తాయి. గాట్‌లో ఒక కూటమిలాగేవ్యవహరిస్తాయి.

## నాఫ్తా (NAFTA - NORTH AMERICA FREE TRADE AGENCY)

ఇది అమెరికా, కెనడా మెక్సికో దేశాలమధ్య వాణిజ్య ఒప్పందం,. EC దేశాల్లాగే ఇవి కూడా ఒకే కూటమిలాగా ఏర్పడతాయి - ఈ ఒప్పందాన్ని ఏర్పరచడానికి అనుమతికోరడం కోసం అమెరికా ప్రభుత్వం తన కాంగ్రెసు (మన పార్లమెంటులాంటి సంస్థ) లోతీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొంది. ఈ విధంగా ప్రకటించడం ద్వారా గుత్త పెట్టుబడిదారి సంస్థలు పేదదేశమూ, చౌకగా శ్రమ, శక్తిదొరికే దేశమైన మెక్సికోకు పరిశ్రమలను తరలిస్తాయనీ - అందువల్ల అమెరికాలో ఇప్పటికున్న నిరుద్యోగానికి తోడు ఇంకా లక్షలాది మంది ఆ లిస్టులోకి చేరతారని, కాబట్టి దీన్ని ప్రతిఘటించాలని కార్మికవర్గ శక్తులు పిలుపిచ్చాయి. అయినా గుత్త సంస్థలు అధికార ప్రతినిధుల్ని కొనివేయడంద్వారా ఈ ఒప్పందం విషయంలో కాంగ్రెసులో మెజారిటీ సాధించాయి. క్లింటన్ కీలక ఓటింగ్ లో గెలిచాడని చెప్పడం వెనుక రహస్యం ఇదే.

## మూడవ ప్రపంచ దేశాలు

ప్రస్తుతం వచ్చే అంతర్జాతీయ సాహిత్యంలోను - దేశంలోని పత్రికల్లోనూ - "అభివృద్ధి చెందుతున్న దేశాలు", "మూడవ ప్రపంచ దేశాలు", "దక్షిణ దేశాలు (South)" వంటి పదాలు వాడుతున్నారు - ఎలా వ్రాసినా ఈ కోవలోకి వచ్చేవన్నీ పేదదేశాలే ..

ఆసియా, ఆఫ్రికా ఖండాల్లోని దేశాలు, లాటిన్ అమెరికన్ దేశాలన్నీ ఈ కోవలోకి వస్తాయి. ఇవన్నీ సామ్రాజ్యవాదం చేత పీడించబడుతున్న దేశాలే. (చైనావంటివి తప్ప)

# దేశాన్ని వ్యవసాయ వలసగా మార్చిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం

భారతదేశంలో తన వ్యాపారం కోసం ఈస్టిండియా కంపెనీ రాక పూర్వం అమలులోవున్న వ్యవసాయం స్థానికంగా ఏ గ్రామానికి ఆగ్రామం స్వయం పోషకంగా వుండేందుకు సరిపడేదిగా వుంది. రైతాంగం భూమిపట్ల మక్కువ కలిగి వుండి శ్రద్ధతో వ్యవసాయం చేసుకునే వాళ్ళు, దేశంలోవున్న వాతావరణ పరిస్థితులకనుగుణంగా సేద్యపు పద్ధతులు కూడ రూపొందించుకున్నారు. ఎక్కడికక్కడ చెరువులు, కుంటల్ని అభివృద్ధి చేసుకున్నారు. బ్రిటన్ ఎంత పారిశ్రామికంగా అభివృద్ధి చెందినప్పటికీ కొన్ని విజ్ఞానాలు మనదేశంలో అప్పటికే అభివృద్ధి చెందివున్నాయని చెప్పడానికి ఇదొక వుదాహరణ. ఎందుకంటే బ్రిటన్ ఇంజనీరు ఆర్థర్‌కాటన్ తాను ఆనకట్టలు నిర్మించే పద్ధతిని భారతదేశపు తార్దామేస్త్రీల నుండి నేర్చుకొన్నానని స్వయంగా వ్రాసుకున్నాడు.

ఎక్కడికక్కడే నీటివనరుల మేనేజిమెంటు ఉండడంతో ప్రకృతి వైపరీత్యం వల్ల కరువులకు గురికావలసి వచ్చినా మళ్ళీ తట్టుకుని నిలబడగలిగే వాళ్ళు. మరో వైపు వ్యవసాయానికి, చేతి పరిశ్రమలకు మధ్య సమన్వయం వుండేది. ఈ గ్రామాల్లో వున్న వుత్పాదక పద్ధతి మనదేశంపైకి ఎంతమంది రాజులు వచ్చి పరిపాలించినా విధ్వంసం గావించబడకుండా సాగింది.

మార్క్స్ తన 'కాపిటల్' గ్రంథంలో మన గ్రామీణ వ్యవస్థను గురించి ఇలా వివరించారు.

" ఈ దినం వరకు వుంటున్న ఆ చిన్న చిన్న అతి ప్రాచీన భారతదేశపు గ్రామసమితులు భూమిని వుమ్మడి ఆస్తిగా పెట్టుకుని వ్యవసాయం, చేతిపనులు, ఎప్పటికీ మారని విభిన్న వృత్తులు (శ్రమ విభజన) అనే ప్రాతిపదిక మీద అవి పనిచేసేవి.

ఈ ప్రణాళిక ఖచ్చితంగా ఏ కొత్త సంఘానికయినా అమలు జరిపే వారు. ఒక్కొక్క గ్రామంలో నూరు నుంచి వేల ఎకరాల భూమిలో తమకు కావలసినవన్నీ పండించుకొనేవారు. పంటలో ఎక్కువ భాగం గ్రామ ఉపయోగానికి మాత్రమే కావడం వల్ల అవి అమ్మకపు వస్తువులుగా తయారు కావడంలేదు. మొత్తం భారత సమాజంలో వస్తు వినిమయం ద్వారా శ్రమవిభజనతో నిమిత్తం లేకుండా వుత్పత్తి జరిగేది. ఉపయోగానికి మిగిలిన పంటలే అమ్మకపు సరుకుగా మారేవి. అందులోనే కొంతభాగం పన్నుగా వస్తు రూపేణా ప్రభుత్వానికి వెళ్ళుతుండేది."

" ఈ గ్రామ సంఘాల నిబంధనలు భారత దేశంలోని ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కరకంగా ఉండేవి. అందులో సులభమైన పద్ధతి: ఉమ్మడిగా సేద్యం చేసుకొనేవారు, ఈ పంటను అందరూ పంచుకొనేవారు. ఇందుతో పాటు ఉపవృత్తిగా వడకడం, నేయటం, ప్రతికుటుంబంలోనూ జరుగుతుండేది. ఈ ఒకే పని చేసే ప్రజలతో పాటు ఊరికొక పెద్ద ఉండేవాడు. అతనే న్యాయాధిపతి. పోలీసు పన్ను వసూలు చేసేవాడు కూడా. ఇక కరణం సేద్యం లెక్కలు, వానికి సంబంధించిన పన్నీ రాస్తాడు. ఇంకో ఉద్యోగి నేరస్తులను పట్టుకోవటం, యాత్రికులకు రక్షణ నిచ్చి వారిని భద్రంగా

ఇంకో గ్రామానికి చేర్చేవాడు. ఇంకొక ఉద్యోగి గ్రామ పొలిమేర్లకు కాపలా కాసేవాడు: ఓవర్‌సీరు, ఉమ్మడి చెఱువుల్లో నీటిపంపకం చేసేవాడు. పురోహితుడు పూజలూ, పెళ్ళిళ్లూ, పేరంటాలు చేసేవాడు. ఉపాధ్యాయుడు ఇసుకమీద పిల్లలకు చదువు నేర్పేవాడు. ఇక పంచాంగం బ్రాహ్మణుడు విత్తటానికి, కోతలకు, మిగతా వ్యవసాయ పనులకు మంచి దినాలు అవీ చెప్తుంటాడు. కమ్మరి, వడ్రంగి వ్యవసాయపు పనిముట్లన్నీ తయారుచేయటం, చెడిపోతే బాగుచేయటం చేసేవారు. కుమ్మరి గ్రామానికి కావలసిన కుండలన్నీ చేసేవాడు. మంగలి, చాకలి, కంసాలి, అచ్చటచ్చటా ఒక కవి, ఈయనే కొన్ని సంఘాల్లో కవిగాను, కొన్ని చోట్ల అయ్యావారుగాను ఉండేవాడు. ఈ పన్నెండుగురిని గ్రామ సమిష్టిమీద పోషించేవారు. జనసంఖ్య పెరిగితే ఇలాంటి పద్ధతుల మీదనే ఇంకో మైదానంలో ఇంకో కొత్త గ్రామం ఏర్పడేది."

మార్క్స్ చేసిన ఈ వర్ణన ఆనాటి గ్రామీణ వ్యవస్థను అర్థం చేసుకోవటానికి తోడ్పడుతుంది. ఈ వ్యవస్థలోని స్వయంపోషక స్వభావం బ్రిటిష్ సామ్రాజ్యవాదం మనదేశంలో అనుసరించిన పద్ధతుల వల్ల నాశనం కావించబడింది. 1947 కు పూర్వం మన దేశంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను గురించి మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించిన రజనీ పామీదత్తు తన "నేటి భారతదేశం"లో ఈ వినాశనాన్ని ఇలా వర్ణించాడు. "పూర్వం విదేశీదండయాత్రలో వచ్చిన వారు ఈ ఆర్థిక పునాదుల్ని కదిలించకుండా ఆ వ్యవస్థలోనే ఇమిడిపోయారు. బ్రిటిష్‌వారు మాత్రం ఆ పునాదిని పెకలించి విదేశీసేనగానే బయటనుండి పాలిస్తూ ధనాన్ని పీల్చివేయ సాగారు. యూరప్‌లోని ధనికతత్వ విజయానికి భిన్నమైన విజయాన్ని భారతదేశంలో విదేశీ పెట్టుబడిదారీ విధానం సాగించింది. యూరప్‌లోలాగా విధ్వంసన కార్యక్రమంతోపాటు (ఈ పెట్టుబడిదారీ విధానం) భారతదేశంలో అది నూతనశక్తులను సృజించలేదు. ఇందులో భారతప్రజలు బ్రిటిష్‌రాజ్యంలో అనుభవిస్తున్న ఇబ్బందులలో వున్న ప్రత్యేక విషాదగాథ నిబిడీతమైంది. భారతీయులు తమ పాతప్రపంచాన్ని పోగొట్టుకొన్నారు. కానీ, కొత్త ప్రపంచం మాత్రం రాలేదు."

మన దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం అనుసరించిన వినాశకర విధానాలు, వాటి పర్యవసానాలను చూద్దాం.

## వలస పాలన కనుగుణంగా మార్చబడిన మన పంటల సరళి

వలస పాలన దేశంలోకి ప్రవేశించే నాటికి స్థానికంగా అవసరమైన పంటలను మాత్రమే పండించేవారు. సామ్రాజ్యవాదం ఈ పంటల పద్ధతిని తనకనుగుణంగా మార్చుకోవటానికి భారత రైతాంగాన్ని బలవంతపెట్టింది. తన చేతిలోని అధికారాన్ని ఇందుకోసం ఉపయోగించింది. స్వేచ్ఛాయుతంగా తనకోసం లేక తన గ్రామ అవసరాల కోసం పంట పండించుకొనే రైతు సామ్రాజ్యవాదపు వ్యాపార అవసరాలకోసం పంటపండించాల్సిన దుస్థితికి నెట్టి వేయబడ్డాడు.

బ్రిటన్ సిగిరెట్ పరిశ్రమకోసం మనదేశంలోకి పొగాకు పంట ప్రవేశపెట్టబడింది. తన రంగుల పరిశ్రమ కోసం నీలి పంట (ఇండిగో) పండించమని రైతాంగాన్ని ఒత్తిడి పెట్టింది. ఈ నిర్బంధాన్ని తట్టుకోలేకే 1860లో పెద్ద ఎత్తున "నీలిమందు రైతుల తిరుగుబాటు" జరిగింది. చైనాతో మత్తు మందు వ్యాపారం కోసం మనదేశంలో గంజాయి

(ఓపియం) వంటి పంటలను పండించేట్లు చేసింది. దేశంలోని శీతల ప్రాంతంలో విస్తారమైన భూభాగంలో టీ, కాఫీ తోటలను పెంచేట్లు చేసింది. ఇందుకోసం, వెస్టిండీసులో బానిసవిధానాన్ని రద్దు చేయాల్సిరావటం ద్వారా మిగిలిన ఆ దేశపు బానిసలను భారతదేశం తీసుకొచ్చింది. వాళ్ళను ఈ ప్లాంటేషన్‌లలో కూలీలుగాను, ఆ దేశంనుండే వాళ్ళచే పనిజేయించటంలో అనుభవం ఉన్నవాళ్ళను తెచ్చి వారిని టీ తోటల యజమానులుగాను పెట్టారు. 1860ల నాటికి ఈ తోటల్లో 10 లక్షల మంది కార్మికులు బంధితులయ్యారు. ఆనాటికి నేత, బొగ్గుగని, ఇంజనీరింగ్, ఉక్కు పరిశ్రమలలో పనిచేసే మొత్తం కార్మికులకన్నా ఎక్కువైన ఇంతమంది కార్మికులను టీ తోటల్లో పెట్టారంటే ఎంత విస్తారంగా ఆ ప్లాంటేషన్‌లను పెట్టారో ఊహించుకోవచ్చు. బ్రిటన్ తన వ్యాపార సరకుల ప్యాకింగ్ కోసం జనుము పంటను కూడా దేశంలోకి విస్తారంగా తెచ్చింది. తన బట్టల మిల్లుల అవసరం కోసం పెద్ద ఎత్తున ప్రత్తి పంటను పండించేట్లు చేసింది.

## ప్రజల్ని భయంకర కరువులకు గురిచేసిన సామ్రాజ్యవాద రాబందులు

ఈ రకంగా నిర్బంధంగా పంటలు పండిచాల్సి వచ్చిన రైతు తను పండిచే పంట వాణిజ్య ముడి పదార్థంగా వినియోగింపబడినప్పటికీ అందునుండి ఏ మాత్రం లాభం గడించలేడనేది వేరుగా చెప్పనవసరం లేదు. ఈ వాణిజ్య పంటలన్నీ బ్రిటిష్ సామ్రాజ్య వాదుల కంపెనీలకు తరలించబడ్డాయి. వారి లాభాలను మాత్రం పెంచాయి. మన వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతుల వివరాలు చూస్తే ఎంత సంపదను భారతదేశం నుండి తరలించుకు పోయారో ఊహించుకోగలుగుతాం.

| పంట | సంవత్సరం | పరిమాణం |
|---|---|---|
| ముడిపత్తి | 1813 | 90 లక్షల పౌన్లు |
| ముడిపత్తి | 1843 | 8 కోట్ల 80 లక్షల పౌన్లు |
| ముడిపత్తి | 1849 | 17 లక్షల పౌన్లు (డబ్బులో) |
| ముడిపత్తి | 1914 | 2 కోట్ల 20 లక్షల పౌన్లు (డబ్బులో) |
| ఉన్ని | 1833 | 3700 పౌన్లు (బరువు) |
| ఉన్ని | 1844 | 27 లక్షల పౌన్లు (బరువు) |
| అవిశె నూనె | 1833 | 2100 బుషెల్సు (కొలత) |
| అవిశె నూనె | 1844 | 2,37,000 బుషెల్సు (కొలత) |
| జనుము | 1849 | 68 పౌన్లు |
| జనుము | 1914 | 86 లక్షల పౌన్లు |

ఇంత పెద్ద ఎత్తున మనదేశం నుండి వ్యవసాయ సంపద కొల్లగొట్టుకుపోయిన పరిస్థితి గురించే 1840 బ్రిటన్ పార్లమెంటరీ కమిటీ విచారణలో మాంచెస్టర్ వాణిజ్యమండలి అధ్యక్షుడైన థామస్ బాజ్లీ ఇలా చెప్పాడు. "భారతదేశం ముఖ్యమైన ముడిసరకులను చర్మాలు, నూనె, రంగులు, జనుము, పత్తి - ఇంగ్లండు పారిశ్రామిక విప్లవానికి అవసరమైనవన్నీ సరఫరా చేసింది. అందుతోబాటు ఇంగ్లీషు పరిశ్రముల యజమానుల

ఇనుము, పత్తి వస్తువుల మార్కెట్‌ను విశాల పరిచింది. ఇందులోనే ఇంగ్లాండుకు భారతదేశ యొక్క ప్రాధాన్యత ఈ శతాబ్దపు ప్రథమ భాగంలో ఇమిడి ఉంది."

ఈ వ్యాపార పంటల పెరుగుదల ఏడాదికేడాదికి పెర్గ్గా ఆహారపంటల ఎదుగుదల మాత్రం అతినిదానంగా సాగడమో లేక పూర్తిగా స్తంభించటం, తగ్గటంకూడా జరిగింది. 1892 - 1920ల మధ్య వాణిజ్య పంటల విస్తీర్ణం 3 కోట్ల ఎకరాలనుండి 4 కోట్ల 10 లక్షల ఎకరాలకు అంటే 43% పెర్గ్గా - ఇదే కాలంలో ఆహారపంటల విస్తీర్ణం మాత్రం కేవలం 7% మాత్రమే పెరిగింది. జనాభా పెరిగినప్పటికీ ఆహారపంటలు పెరగక పోవటంతో తిండికొరత తీవ్రమైంది. మరోవైపు ఆహారధాన్యాలను కూడా వలసవాదులు మనదేశం నుండి తీసుకెళ్ళే మొత్తాలు గణనీయంగా పెరుగుతూ పోయాయి. 1949లో 858 పౌన్లు బియ్యం, గోధుమలను తీసుకెళ్ళగా, 1858కి కేవలం 10 సంవత్సరాలలోనే ఆ మొత్తం 38 లక్షల పౌన్లకు, 1901 నాటికి 79 లక్షల పౌన్లకు, 1914 నాటికి 1 కోటి 93 లక్షల పౌన్లకు పెరిగింది.

బ్రిటిష్ వలసవాదుల ఈస్ట్ ఇండియా కంపెనీ తన పాలన నారంభించిన 20 ఏండ్లలోనే మనదేశాన్ని ఎంతగా కొల్లగొట్టారో వాళ్ళ రిపోర్టుల్లోనే చూద్దాం:

బెంగాల్‌లో ఆఖరి భారతీయరాజు సిరాజుద్దౌలా తన పాలన ఆఖరి సం॥లో వసూలు చేసిన భూమి పన్ను 1764 - 65లో 8,16,000 పౌన్లు. కంపెనీ పాలన ఆరంభించిన తొలి సం॥లోనే దీన్ని 14,70,000 పౌన్లకు పెంచారు. 1775 - 76లో (పది సం॥లలో) దీన్ని రెట్టింపుకు 28,18,000 పౌన్లకు పెంచారు. 1793కు 34 లక్షలకు పెరిగింది. ఈ భయంకర పన్నులవల్ల రైతు కొన్న విత్తనాలగింజలు, ఎద్దులు కూడా కోల్పోయాడు. 1771లో భయంకరమైన కరువు వచ్చి కోటి మంది చనిపోయారు. అయినా ఆ సం॥లో కూడా బెంగాలు, బీహారు రాష్ట్రాలలో అంతకుముందు వసూలు చేసిన పన్నుకంటే ఎక్కువ పన్ను వసూలు చేసిందంటే సామ్రాజ్యవాదం ఎంత క్రూరమైందో వేరుగా చెప్పనవసరం లేదు.

బ్రిటిష్ కామన్స్ సభ్యుడు విలియం ఫ్లట్టన్ 1757లో వ్రాసిన "భారతదేశంలో ఇంగ్లీషు వ్యాపారుల ధోరణి" అన్న పుస్తకంలో ఇలా వ్రాశాడు." పూర్వకాలంలో బెంగాలు ప్రాంతాలు దేశపు ధాన్యాగారాలుగా ఉండేవి. ప్రాచ్య దేశ వస్తు సంపత్తికి వాణిజ్య వీదులుగా వెలిసేవి ..... కాని మన దుష్పరిపాలనకున్న అఖండశక్తి మూలంగా 20 ఏళ్ళలోపుగానే ఆ ప్రాంతాలన్నీ ఎడారులయ్యాయి. పొలాలు సాగుకావటంలేదు. విశాల భూముల్లో అప్పుడే గడ్డి గాదం మొలచి పోయింది. రైతులు కొల్లగొట్టబడ్డారు. చేతి పరిశ్రమలు చేసుకొనేవారు అణచివేయబడ్డారు. క్షామం పదేపదే తలచూపింది. జన క్షీణం ప్రారంభమైంది".

1789లో ఇదే విషయాన్ని లార్డ్ కారన్ వాలిస్ ఇలా చెప్పాడు "హిందూ స్థానంలో కంపెనీ ప్రభుత్వం (ఈస్ట్ఇండియా) క్రిందవున్న ప్రాంతంలో 3వవంతు నేడు కేవలం క్రూరమృగాలు మాత్రమే నివసించే కీకారణ్యమై పోయిందని నిస్సందేహంగా చెప్పవచ్చు".

ఇలా ప్రారంభమైన ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన అనుసరించిన విధానాలు అనేక దుష్ఫలితాలకు దారితీసాయి. ఒక వైపున పెరిగిన పన్నులు - ఆ పన్నులను కట్టటానికి రైతాంగం వాణిజ్య పంటలు తప్పనిసరిగా పండించాల్సి రావటం - దానితో, జనాభా పెరుగుతున్నప్పటికీ ఆహారపంటలు పండించే భూములు పెరగకపోవటం - మరోవైపు

మరోవైపు పండిన ఆహారధాన్యాలను కూడా తన దేశానికి తరలించుకు పోవటం - ఇవన్నీ ఒకదానితో ఒకటి కలిసి ప్రభావం కలిగించి దేశంలో తీవ్రమైన కరువును సృష్టించాయి. ప్రకృతి కరుణించకపోవటం వలన వచ్చిన కరువులు కావవి. విలువైన మన సంపదను కొల్లగొట్టడం, తన పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకులు పండించేవిగా మన భూములను మార్చటం ఫలితంగా సామ్రాజ్యవాదం తెచ్చిన కరువులివి. 1900 సం॥ నాటికే ఎన్ని ఆకలి చావులు సంభవించాయో చూద్దాం:

| సంవత్సరములు | క్షామంలో చావులు |
|---|---|
| 1800 - 1825 | 10,00,000 |
| 1825 - 1850 | 4,00,000 |
| 1850 - 1875 | 50,00,000 |
| 1875 - 1900 | 1,50,00,000 |
| 100 సం॥ల్లో | 2 కోట్ల 14 లక్షల మంది చనిపోయారు |

ఈస్ట్ ఇండియా కంపెనీ పైన చెప్పినట్లు విచ్చలవిడిగా కొల్లగొట్టి పన్నులు పెంచి రైతాంగాన్ని ఆకలి చావులకు గురిచేసి తీవ్రమైన భారాలు పెంచినందువల్లే రైతాంగ ప్రతిఘటన తీవ్రమై 1857లో ప్రధమ భారత స్వాతంత్ర సంగ్రామపు రూపం తీసుకొంది. దాంతో సామ్రాజ్యవాదులు ఖంగుతిన్నారు. దేశంలో ఈస్ట్ ఇండియా పాలనను తొలగించి బ్రిటన్ పార్లమెంటు నేరుగా అధికారం చేపట్టింది. అయితే ఆతర్వాత కూడా కంపెనీ విధానాలనే కొనసాగించిన ఫలితంగా అప్పుడు కూడా మార్పులేకుండా పోయింది. పై పట్టికలో 1875 నుంచి 1900 వరకు ఆ పాతిక సం॥లలోనే 1 కోటి 50 లక్షల మంది చనిపోవటం దాని ఫలితమే. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఈ భారాలు ఇంకా పెరగటంతో దేశంలోనే తీవ్రమైన కరువుగా చెప్పుకొనే 1947 బెంగాల్ కరువు సంభవించింది.

## చేతి వృత్తుల వినాశనం - భూమిపై పెరిగిన ఒత్తిడి

వలస పాలనకు పూర్వం వ్యవసాయానికి, చేతి వృత్తులకు మధ్య సమతూకం వుండేది. వ్యవసాయంలో తమకనుకూలమైన పంటలు పండించమని రైతాంగాన్ని బలవంత పెట్టినట్లే - తన పరిశ్రమలు తయారు చేసిన వస్తువులకు మార్కెట్‌లు పెంచుకోవటం కోసం చేతి వృత్తులను కూడా నాశనం చేశాయి. ప్రపంచంలోనే పేరెన్నికగన్న నిపుణులైన మన చేనేత కార్మికుల చేతి వేళ్ళు తెగకోసారు. ఇతర చిన్న వృత్తులు కూడా నాశనం చేయబడ్డాయి. 1911లో ప్రభుత్వం ప్రకటించిన జనాభా రిపోర్టులోనే యిలా వ్రాశారు. "చవకగా యూరోపియన్ గుడ్డలు, పాత్రలు ఎక్కువగా దిగుమతి చేయటం, ఇండియాలోనే పాశ్చాత్య పద్ధతిలో ఎన్నో పరిశ్రమలు పెట్టటం మూలంగా గృహపరిశ్రమలు ధ్వంసమయ్యాయి. వ్యవసాయ వస్తువుల ధరలు పెరగటం మూలంగా కూడా చాలా మంది చేతి పనివారు తమ క్రమానుగత వృత్తులను వదలి సేద్యానికి

దిగటానికి కారణమయ్యింది." ఈ పరిస్థితిని గురించే 1918 నాటి మాంటేగు - చెమ్స్ ఫర్డ్ నివేదికలో యిలా చెప్పారు.

"వ్యవసాయం ప్రజల ప్రధానవృత్తి. బాగా పారిశ్రామికమైన ఇంగ్లాండు వంటి దేశాలలో పరిశ్రమలలో 100 మంది వుంటే వ్యవసాయంలో 8 మంది వుంటారు. కాని భారతదేశంలో ప్రతి 100 మందికి 71 మంది వ్యవసాయం, పశుపోషణల మీద పనిచేస్తారు. భారతదేశం మొత్తం మీద వున్న 31 కోట్ల 50 లక్షల ప్రజల్లో , 22 కోట్ల 60 లక్షల మందిని పొలం పోషిస్తుంది. 20 కోట్ల 80 లక్షల మంది తమ స్వంత పొలం మీదనో లేక ఇతరుల పొలాలలోనో సేద్యం చేయటం మీద సరాసరి జీవిస్తున్నారు. లేక దాని మీదే ఆధారపడుతున్నారు."

ఇలా వ్యవసాయంలోకి ఇతర రంగాలనుండి వచ్చి చేరే వారి సంఖ్య వేగవంతంగా పెరిగింది. 1891 లో వ్యవసాయంపై ఆధారపడ్డవారు 61.1% ఉంటే 1921 నాటికి ఇది 73% కు పెరిగింది. దీని వలన కమతాల సైజు బాగా తగ్గిపోయింది. "భారతదేశం - ప్రజలు, సమస్యలు" అన్న పుస్తకంలో థామస్ హొల్టర్‌నెస్ భూసంబంధాల విషయంలో దేశంలోని పరిస్థితిని గూర్చి సూటిగా యిలా చెప్పాడు.

"భారతదేశంలో స్వదేశీ సంస్థానాలు కూడా కలుపుకొంటే జనసంఖ్య 31 కోట్ల 50 లక్షలు. ఇందులో 3 వంతుల నుండి వ్యవసాయం మీదనే జీవిస్తున్నారు. సంస్థానాల్లోని లెక్కలు సమగ్రంగా లేవు కనక ఎన్ని ఎకరాల పొలం సాగుచేయబడుతున్నదో నికరంగా తెలియదు. కానీ, ప్రత్యక్షంగా వ్యవసాయం మీద బతికేవారికి ప్రతి ఒక్కరికీ ఒకటింబాతిక ఎకరం కన్న ఎక్కువ పొలంరాదని అంచనావేయవచ్చు.

భారతదేశ భూములు ఇంతపెద్ద జనాభాకు ఆహారం పండించటమే కాదు. ఈ భూమిలో చాలా భాగం ఎగుమతి చేసే పంటలకు వేరు చేసి పెట్టారు. దిగుమతి చేసుకొనే వస్తువులకయ్యే మొత్తాన్ని, మిగతా విదేశీ ఋణాలను ఈ పంటల అమ్మకం వలననే భారతదేశం తీర్చవలసి వస్తున్నది. ఇలా విదేశాలకు ఎగుమతయ్యే పంటలకుగాను కొంత సాగయ్యే పొలాన్ని వదిలితే, మిగిలే భూమి భారతదేశ జనాభాకు తలకు సగటున 2/3 ఎకరాల (66 సెంట్లు) మాత్రమే వస్తుంది. అంటే ఈ కాస్త పొలంలో తిండి, బట్ట కావాలి. ఇంత పోషణ భారం భూమి మీద పడవేయటమనేది ఇంకేదేశంలోనూ బహుశా లేదనవచ్చును."

దేశంలోవున్న వనరులనుపయోగించుకొని చేతి వృత్తుల నుండి పరిశ్రమలు క్రమంగా ఎదగాల్సివున్న సహజ పరిణామాన్ని సామ్రాజ్యవాదం అడ్డుకొని నిరంకుశంగా తన పరిశ్రమలకోసం మనదేశంలోని వృత్తులను నాశనం చేసినదాని ఫలితమిది. మరోవైపు మనదేశంలోని అడవులని, సంపన్నమైన గనులను అన్నింటినీ కూడా సామ్రాజ్యవాదం స్వంతం చేసుకొని ప్రజలను వినియోగించకుండా అడ్డుకొన్నందువల్ల అనివార్యంగా ప్రజలు భూమిపై ఆధారపడాల్సివచ్చింది. అయితే ఈ భూమిని సాగుచేయటానికి కూడా తమవద్ద పెట్టుబడి లేక పోవటంతో యింకా సాగుకు యోగ్యమైన చాలా భూమి బీడుగానే వుండి పోయింది. ఈ బీడుగా వున్న పొలాలను సాగులోకి తేవటానికి మార్గాలు వేయలేదు. సరికదా - అంతకు పూర్వం నుండి ప్రజలు అనుభవిస్తున్న నీటి వనరులను కూడా పట్టించుకోక అవి నాశనమౌతుంటే చూస్తూ కూర్చుంది.

## పన్నులు వసూలు చేసుకొంటాం - పనులు మాత్రం చెయ్యం

ఇదే సామ్రాజ్యవాదుల విధానం. వలస పాలనకు పూర్వం ప్రజలు తాము పండించుకొన్న పంటలోనుండి కొంత భాగం తీసి వ్యవసాయానికవసరమైన చెఱువులు, కుంటలు తదితర వనరుల అభివృద్ధి కోసం ఖర్చు పెట్టుకొనే వాళ్ళు. వలస పాలకులు భూములపై శిస్తులు అంతకంతకూ ఎక్కువ గుంజుకోవటమే తప్ప వాటిని సాగుచేసేందుకు ఏ ఒక్క చర్యా చేపట్టలేదు. 1854లో ఈ పరిస్థితిని గురించే మనదేశంలో ప్రాజెక్టులు కట్టిన ఆర్థర్ కాటన్ యిలా వర్ణించాడు. "భారతదేశమంతటా జలవసతులూ - బాటలూ మొదలైనవి పూర్తిగా నిర్లక్ష్యం చెయ్యబడినవి ...... ఇంతవరకూ ప్రభుత్వ లక్ష్యమేమంటే ఏమీ చెయ్యవద్దు, ఏమీ చెయ్యనియ్యవద్దు, ఎవ్వరూ ఏమీ చెయ్యరాదు - ఏ నష్టమైనా భరించు. ప్రజలు కరువుతో చస్తే చావనీ. నీళ్ళూ బాటలు లేక కోట్లపన్ను నష్టమైనా సరే ఏమీ చెయ్యకూడదు." ("ఇండియాలో పబ్లిక్ వర్క్సు")

1834 - 1848ల మధ్య 14 సం||ల కాలంలో భారతదేశమంతటా అన్ని ప్రజాకార్యాలకు (కాలువలు, రోడ్లు, చెరువులు వగైరా) పెట్టబడిన ఖర్చుకన్నా ఒక్క ఇంగ్లండులోని మాంచెస్టరు పట్టణంలో మంచినీటి సరఫరాకు ఒక సం||లో పెట్టిన ఖర్చు ఎక్కువంటే పరిస్థితిని ఊహించుకోవచ్చు. ఈ పరిస్థితిని ఉద్దేశించే వలసవాదుల దుర్మార్గ స్వభావాన్ని కార్ల్‌మార్క్సు యిలా వ్రాశాడు.

"సామాన్యంగా అనాదికాలం నుండి ఆసియాలో ప్రభుత్వ శాఖలు మూడుండేవి. ఆర్థిక శాఖ దేశంలో దోపిడీ ; యుద్ధ శాఖ విదేశాల దోపిడీ ; ఆఖరున ప్రజాక్షేమ కార్యాలశాఖ ఉండేవి. బ్రిటిష్ వారు భారతదేశంలో తమ పూర్వ ప్రభుత్వాల నుండి తొలిరెండు శాఖలను - యుద్ధ, ఆర్థిక శాఖలను - మాత్రం తీసుకొన్నారు. కానీ ఆఖరు ప్రజాక్షేమ కార్యాల శాఖను మాత్రం బొత్తిగా నిర్లక్ష్యం చేశారు. కాబట్టే వ్యవసాయం క్షీణించి పోయింది. అది బ్రిటిష్ సూత్రమైన స్వేచ్ఛా వ్యాపారం, పోటీ - వీనితో నడపటానికి వీలయ్యేది కాదు." (భారతదేశంలో బ్రిటిష్ పాలన, 1853 వ్యాసం)

అయితే సామ్రాజ్యవాదం ఈ నిర్లక్ష్య విధానం వల్ల పన్నులు కోల్పోవటంతో కొంత ప్రాంతాన్నైనా ఖచ్చితంగా పంటలు పండేట్లు చేసుకోవటం అవసరమైంది. పెరిగిన ప్రజల విప్లవ పోరాటాల వల్ల, జాతీయ వాంఛలవల్ల కూడా బ్రిటన్ పాతపద్ధతుల్లో విచ్చలవిడిగా కొల్లగొట్టుకోవటం వీలుపడకపోవటంతో కొన్ని చర్యలను చేపట్టవలసి వచ్చింది. అక్కడక్కడా చిన్న చిన్న ఆనకట్టలు కట్టింది ఇలాగే.

ఆనాటికి తీసుకొన్న లెక్కల ప్రకారం ప్రపంచంలో ఇతర దేశాలతో పోలిస్తే మన పంటల సగటు దిగుబడి అతి తక్కువగా ఉండేది. దీనికున్న కారణాలను విచారించటం కోసం 1889 లో రాయల్ అగ్రికల్చరల్ సొసైటీ రసాయన శాస్త్ర సలహాదారైన జె.ఎ.వోల్కర్‌ను భారతదేశ వ్యవసాయ పద్ధతిని విచారించి అభివృద్ధికి సూచనలిమ్మని పంపింది. 1901లో విడుదలైన ఆయన నివేదికలో

"భారతదేశపు వ్యవసాయం మొత్తం మీద పాతకాలపు నాటిదని, వెనుకబడినదని, దానినభివృద్ధి పరిచేందుకు ఏమీ చెయ్యలేదని సామాన్యంగా ఇంగ్లండులోను, భారతదేశంలో పదేపదే చెబుతుంటారు. ఇది అబద్ధమనేది మాత్రం నిజం. అందులో సందేహం లేదు. తనకున్న అవకాశాలలో భారతదేశపు రైతు బ్రిటిష్ రైతుకన్నా ఏమీ తీసిపోడు. కొన్నిట్లో

యింకా మెరుగే - అతనికున్న పెద్ద యిబ్బంది ఏ మాత్రం అవకాశాలు లేకపోవటమే - ఇంత నిస్సహాయస్థితి యింకే దేశంలోనూ లేదు. ఈ యిబ్బందులను గూర్చి ఏమీ చెప్పుకోకుండా ఓరిమితో ఏదో తంటాలుపడుతూ గడుపుకొంటూ ఉంటాడు. ఇలా యింకెవ్వరూ చెయ్యలేరు. **ఇదే భారతదేశపు రైతు లోపం.**

ఇలా వేనంటే బ్రిటిష్ రైతులేమీ కలతపడవలసిన అవసరంలేదు. మన ఇంగ్లండులో గోధుమ పండించటానికి ఎన్నో శతాబ్దాలకు ముందే భారతదేశపు రైతు పండిస్తున్నాడు. కాబట్టి వారి పద్ధతి ఎంతో మార్చాలి అనుకోవల్సిన పనిలేదు. అయినప్పటికీ ఇండియాలో ఎక్కువ పంట ఎందుకు పండించలేక పోతున్నారంటే రైతుకు అందుబాటులో నీటి సరఫరా మరియు ఎరువులు మొదలైన వస్తువులు చాలా తక్కువగా వుండటమే.

కేవలం సామాన్య రైతు కార్యక్రమం చూసినా ఇంత చక్కని ఉదాహరణలు ఇంకెక్కడా కన్పించవు. పొలాన్ని ఏమాత్రం గడ్డి గాదం మొలవకుండా రైతు అద్దంలా వుంచుతాడు. నీళ్ళు తోడేందుకు ప్రత్యేక విలక్షణ సాధనాల్ని రైతు కనిపెట్టాడు. ఇతనికి ఏ నేల ఎలాంటిదో, ఏరకమైందో బాగా తెలుసు; ఎప్పుడు విత్తాలో ఎప్పుడు పంటకొయ్యాలో సరిగా తెలుసు. ఇలాంటి శక్తి ఎవరో ఒకరికి కాదు, భారతదేశ రైతులందరికీ సామాన్యవిషయం. ఒక పంట తర్వాత మరోపంట మార్చటం, రెండు మూడు రకాల పంటలను కలిపివేయటం, చక్కగా దున్నటం, ఇవన్నీ చూస్తే ఆశ్చర్యమేస్తుంది. నా సంచారంలో మకాంచేసిన స్థలాల్లో చూసినంతటి చక్కని సేద్యం; బాగా కాయకష్టం చేయటం, ఉన్న అవకాశాలు చెడకుండా భూసారం తగ్గిపోకుండా చూసుకోవటం. వీనిలో ఇంకెక్కడా యింత నైపుణ్యం చూడలేదనేది నిజం."

ఈ రిపోర్టు సున్నితంగానే అయినా భారతరైతాంగపు కృషికి సామ్రాజ్యవాదం ఎలా తోడ్పడటంలేదో చెప్పింది. ప్రభుత్వమే నియమించిన వ్యవసాయ కమిషన్ కూడ మన దిగుబడులు ఎందుకు తక్కువగా ఉన్నాయో చెప్పింది. రైతుకు కృత్రిమ ఎరువులు కొనుక్కోలేక పోవటమే కాదు, సాంప్రదాయక ఎరువులు వేసేందుకు కూడా వీలుపడక పోవటానికి కారణం చెప్పింది. అడవులనుండి బొగ్గులు తెచ్చుకొని వంట చెరుకుగా ఉపయోగించుకొనేందుకు ప్రభుత్వం అవకాశం ఇవ్వనందువల్ల గత్యంతరం లేక, రైతాంగం పశువుల పేడనే వంట చెరకుగా వాడక తప్పటంలేదు. అలాగే కంకులుపోను మిగతా వున్న పంట పచ్చి గడ్డిని ఇతర మొక్కల్ని పొలంలో వేసి కుళ్ళబెట్టి ఎరువుగా వాడతారు. భారతదేశంలోని అడవులపై బ్రిటిష్ వలసవాదమే కంట్రోలు పెట్టుకొని పశువులు అడవులలో మేపటాన్ని అడ్డుకొన్నందువల్ల మనరైతు పైన్న చెప్పిన గడ్డినంతటినీ పశువుల మేతగా ఉపయోగించాల్సి వస్తుందని కూడా చెప్పింది.

ఈ దుస్థితి వల్లే కరువులో పశువులను మేపుకోవటానికి కూడా అనుమతించక పోవటంతోనే పల్నాడులో పుల్లరి వ్యతిరేక పోరాటానికి దారితీసింది. పుల్లరి చెల్లించి కూడా అడవుల్లో పశువులను మేపుకొనే హక్కు కోసం కన్నెగంటి హనుమంతు వంటి రైతువీరులు బలికావలసి వచ్చింది.

ప్రజల నుండి అనేక పోరాటాలను ఎదుర్కోవలసి రావటంతోను, తన పన్నువసూలు గ్యారంటీ కోసం బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో కొద్దిపాటి ప్రాజెక్టులను, నీటి పారుదల సౌకర్యాలను కల్పించక తప్పలేదు.

## వలస పాలనకు ఊడిగం చేసేందుకు సృష్టించబడ్డ జమీందారీ విధానం

ఆసియాటిక్ గ్రామీణ వ్యవస్థలో ఏగ్రామానికా గ్రామంలో పన్నులెలా వసూలు చేసేది చూశాం. వలస పాలకులు పన్నులు వసూలు చేసుకోవటానికి గల మార్గాంతరాలను అన్వేషించారు. బ్రిటన్‌లోని భూస్వామ్య వర్గపు పోలికతో భారతదేశంలో ఒక జమీందారీ వర్గాన్ని తయారుచేసుకోవటం తమకు ప్రయోజనకరమని భావించారు. మొగలు సామ్రాజ్య విచ్ఛిన్న దశలో అధికార వర్గంగా వున్నవాళ్ళను ఇందుకోసం వినియోగించుకొన్నారు. నూతనంగా ఏర్పరిచిన ఈజమీందారీ ప్రాంతాలకు ఆప్రాంత విస్తీర్ణాన్ని బట్టి నిర్దిష్ట మొత్తాన్ని ప్రతి సం॥ పన్నుగా చెల్లించాలని నిర్ణయించారు. బెంగాలు, బీహారు, ఉత్తర మద్రాసు రాష్ట్రాలలో దీన్ని అమలు పరచారు. ఈపద్ధతిలో జమీందార్ల భూములను తమకిష్టం వచ్చిన వారికి కౌలుకిచ్చుకోవచ్చు. అయితే ఈపద్ధతి వల్ల రైతాంగానికి భూమిపై శ్రద్ధ తగ్గింది. దానికి కారణం వచ్చే సం॥ తనకు ఆభూమిని ఇస్తారో లేదోనన్న గ్యారంటీ లేకపోవటం. ఈ పద్ధతిలో రైతాంగం అటు వలసవాదుల భారాన్ని, స్థానిక జమీందారుల భారాన్ని కలగలిపి మోయాల్సి వచ్చింది.

ఆచరణలో శాశ్వత జమీందారీ పద్ధతి వల్ల తనకు వచ్చే పన్నులు తగ్గుతున్నాయని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించినప్పటికీ జమీందారీ వర్గాలు తమకు రాజకీయంగా విశ్వసనీయంగా ఉండటం వలన దాన్ని రద్దు చేయకుండా కొనసాగించారు. ప్రజలను తిరుగుబాటు చెయ్యనీకుండా ఈజమీందారీ వర్గాలు తమకు అడ్డుగోడగా నిలిచిన విషయాన్ని విలియం బెంటిక్ ఇలా చెప్పాడు.

"విస్తృత ప్రజా వెల్లువ లేదా విప్లవం నుండి రక్షించుకోవాల్సిన అవసరం వచ్చింది. ఇతర అనేక అంశాలలో, అతి ప్రధానమైన వాటిలో (పన్ను వసూలు వగైరా) శాశ్వత సెటిల్‌మెంటు పద్ధతి విఫలమైనప్పటికీ కనీసం బ్రిటిష్ పాలన కొనసాగాలని కోరుకొనే ధనిక భూస్వామ్య యజమానులను పెద్ద సంఖ్యలో సృష్టించిన రీత్యానైనా జమీందారీ పద్ధతిలో పై అనుకూలాంశం ఉందని చెప్పాలి" - అనీ, మరో సందర్భంలో "ఈ పర్మినెంటు సెటిల్‌మెంటు పద్ధతి దేశంలో విప్లవాన్ని ప్రతిఘటించే అగ్రగామి" అనీ చెప్పాడంటే ఆర్థికంగా కొంత కోల్పోయినప్పటికీ దీన్నెందుకు రద్దు చేయలేదో స్పష్టమౌతుంది.

ఈ విధాన ఫలితాలను చూసిన తర్వాత కొన్ని ప్రాంతాల్లో జమీందార్లతో తాత్కాలిక పద్ధతిలో శిస్తులు నిర్ణయించుకోగా (టెంపరరీ సెటిల్మెంటు) విస్తారమైన ప్రాంతంలో రైతువారీ పద్ధతిననుసరించాడు. ఈరైతువారీ పద్ధతిలో సాగుచేసే రైతుకే భూమిపై హక్కునిచ్చారు. ఈపద్ధతిలో రైతు నుండి వసూలు చేసే పన్నులను ఎప్పటికప్పుడు మార్చుకోవచ్చునని ఆలోచించారు. బొంబాయి, మద్రాసులలో ఎక్కువ భాగం, బీహారు, సింధు, అస్సాం ప్రాంతాల్లో ఈ పద్ధతినమలు పరిచారు. దేశం మొత్తంమీద చూస్తే జమీందారీ పద్ధతిలో 49% భూభాగాన్ని, రైతువారీ పద్ధతిలో 51% భూభాగాన్నీ విడగొట్టారు.

## రైతాంగాన్ని పీల్చి పిప్పి చేసిన పన్నుల విధానాలు

మనదేశంలో గతంలో భూమిని బట్టిగాక పండిన పంటను బట్టి అందులో కొంతభాగాన్ని పంట రూపంలోనే పన్నుగా వసూలు చేసేవారు. ఒకవేళ కరువు కాటకాలవల్ల పంటలేకుంటే పన్నుకూడా ఉండేది కాదు. వలస ప్రభుత్వం దీన్ని మార్చి భూమి విస్తీర్ణాన్ని బట్టి పన్ను వసూలు పద్ధతిని పెట్టింది. దీనివల్ల పంట పండినా పండకపోయినా రైతాంగం పన్నులు

చెల్లించాల్సిందే. పైగా అంతకు ముందు ధాన్యరూపంలో నున్న పన్నును డబ్బు రూపంలోకి మార్చింది. అందుకే రైతాంగం వలస పాలనలో విపరీతమైన పన్నుల భారంతో కృంగిపోయింది. అంతకు ముందు రోజుల్లో దేశంపైకి వచ్చిన దురాక్రమణదారులైన మొఘల్ చక్రవర్తుల పాలనలో ఆ ఉద్యోగులు తమను పీల్చి పిప్పి చేసినప్పటికీ, అవమానాలకు గురిచేసినప్పటికీ - బ్రిటిష్‌కాలంలో పన్నులకు అప్పులుపడి భూములమ్ముకోవాల్సి వచ్చిన దుస్థితితో పోల్చుకొన్నపుడు అదే మేలని మన రైతాంగం భావించాల్సి వచ్చింది.

వ్యవసాయంలో వలసవాదులు చేసిన మరో మార్పు భూమి రిజిస్ట్రేషన్ విధానం. ఈ పద్ధతిలో భూమి రైతుకు రిజిస్టరు చేయబడి దాన్ని ఆస్తిగా అమ్ముకోడానికి మారకం చేయడానికి వీలుకలిగింది. ఇది రైతు జీవితంలో మరికొన్ని మార్పులకు కారణమైంది. గతంలో వ్యవసాయానికి కావలసిన పెట్టుబడిని రైతాంగం వడ్డీ వ్యాపారుల నుండి తీసుకొన్నప్పటికీ వారు గ్రామ పంచాయతీ హద్దు దాటిపోనందున ఆ అప్పును తీర్చుకోడంలో రైతుకు వెసులుబాటువుండేది. అయితే వలస పాలనలో భూమిపై హక్కు మారకానికి అవకాశం వుండడంతో అప్పులు కట్టలేని రైతుల భూములను లాక్కోవడం మొదలైంది. మరో వైపు ప్రభుత్వం కూడ పన్నులు కట్టలేని రైతుల భూములను మరొకరికి అమి తన బకాయిలను రాబట్టు కోసాగింది. రైతాంగం పంటపై వచ్చిన ఆదాయాన్నే గాక తరాతరాలుగా కూడ బెట్టిన బంగారం వంటి విలువైన వాటిని అప ్పజెప్పినప్పటికీ ఇంకా అప్పుల్లోనే మునిగి పోయారు. కేవలం 1931 - 37 సం॥ల మధ్య 2410 లక్షల పౌన్ల బంగారం బ్రిటన్ ఈ విధంగా దోచుకెళ్ళింది. పన్నులను ఎంతవేగంగా పెంచారో చూడండి.

| సంవత్సరం | మొత్తం పన్ను |
|---|---|
| 1801 | 42 లక్షల పౌన్లు |
| 1857 - 1858 | 153 లక్షల పౌన్లు |
| 1900 - 1901 | 175 లక్షల పౌన్లు |
| 1911 - 1912 | 200 లక్షల పౌన్లు |
| 1936 - 1937 | 239 లక్షల పౌన్లు |

1928లో బార్డోలీలో 87 వేల మంది రైతులు ఉద్యమంతో పెరిగిన పన్నును ప్రతి ఘటించారు.

ఇక్కడొక విషయాన్ని గమనించాలి. 1857 లో ఈస్టిండియా కంపెనీ నుండి అధికారం బ్రిటన్ ప్రభుత్వమే తీసుకున్నాక పాత పద్ధతిలో కొల్లగొట్టడం వీలుకాలేదు. దాంతో మరొక పద్ధతిని ఎంచుకున్నారు. భూమి శిస్తుతో బాటుగా ప్రజలు వాడే వస్తువులపై ఎక్సైజు పన్ను పేరిట కొత్తగా మరో పన్ను ప్రవేశపెట్టారు. ఉప్పుపై పన్ను కూడ అలా వచ్చిందే. దానికి వ్యతిరేకంగా జరిగిన ఉప్పు సత్యాగ్రహం మనందరకూ తెలిసిందే.

ఈ విధంగా భూమిశిస్తుతో బాటు సరుకులపై పన్నుల భారాన్ని కూడ రైతాంగం మోయాల్సి వచ్చింది. "భారత గ్రామం స్వయం సంపూర్ణంగా వుండడం వల్ల వారు వాడే వస్తువులపై పన్నులు కేవలం ఉప్పు, కిరోసిన్, మత్తు పదార్థాలపైన మాత్రమే వేసుకోగలుగుతున్నా"మని సైమన్ కమీషన్ వాపోయింది. అయినా 1939 - 40 లో వేసిన లెక్క ప్రకారం ఈ కొత్త పన్ను భూమి శిస్తులో 2/5వ వంతు వుండింది.

ఈ విధంగా రైతు వలస పాలన కాలంలో మూడు భారాలకు గురయ్యారు. భూమిపన్ను, సరుకులపై పరోక్షపన్ను, భూస్వామి కౌలు లేదా గుత్త. మొత్తం గ్రామ నికరాదాయంలో 2/3 వంతులు భూమి పన్ను, ఎక్సైజు పన్ను, వడ్డీలు, ఊళ్ళో లేని భూస్వాముల గుత్తల రూపంలో బయటకు వెళ్ళిపోతున్నాయని అంచనా వేశారు.

బ్రిటిష్ పాలనలో సాగిన ఈ నిరంకుశ దోపిడీకి వ్యతిరేకంగా రైతాంగం వీరోచితంగా పోరాడారు. 1855లో సంతాల్ రైతులు (బెంగాల్) చేసిన తిరుగుబాటు, 1860లో జరిగిన నీలి మందు రైతు తిరుగుబాటు, 1875లో జరిగిన దక్కన్ రైతు తిరుగు బాటు, 1921లో సాగిన మలబారు మోప్లా రైతాంగ తిరుబాట్లు వీనిలో కొన్ని.

ఇంతకంటె సంఘటిత రూపంలో నైజాం సంస్థానంలో తెలంగాణ రైతాంగ సాయుధపోరాటం, తిరువాన్కూరు సంస్థానంలో పున్నప్ర - వాయలార్ రైతాంగ తిరుగుబాట్లు సాగాయి.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఈ విధంగా తన ఆర్థిక, రాజకీయ అధికారం అవసరాలకు అనుగుణంగా భారత వ్యవసాయరంగంలో మార్పులు తెచ్చింది. భారతదేశాన్ని తన వ్యవసాయ వలసగా మార్చింది.

తన వాణిజ్య పంటలు పండించే దేశంగా మార్చి ప్రజల్ని భయానకమైన కరువు కాటకాలకు గురిచేసి కోట్లాది మందిని చంపింది. తన కొత్త భూస్వామ్య వర్గాన్ని తయారు చేసుకుని వారి నుపయోగించుకొని రైతాంగ తిరుగుబాట్లను, జాతీయోద్యమాన్ని పెరగకుండా చేయజూసింది. అణచ జూసింది. అయినప్పటికీ 1917 రష్యన్ విప్లవం తర్వాత మనదేశంలో కూడ కార్మిక వర్గ సిద్ధాంతమైన మార్క్సిజం మార్గదర్శక కత్వంలో విప్లవోద్యమాలు పెరగడంతో ప్రజల్లోని విభిన్న సెక్షన్ల మధ్య పెరుగుతున్న సంఘీభావం, విప్లవ, జాతీయోద్యమాలను చూసి భయపడింది.

మరోవైపు రెండో ప్రపంచ యుద్ధంలో తీవ్రంగా నష్టపోయిన బ్రిటన్ వలసను పాత రూపాల్లో కొనసాగించలేనన్న నిర్ధారణకు వచ్చి మన దేశంలో తనకు అనుకూలమైన శక్తులకు అధికారాన్ని బదిలీ చేయడానికి నిర్ణయించుకుంది. 1947 ఆగస్టు 14 అర్ధరాత్రి భారత స్వాతంత్ర్యాన్ని బ్రిటన్ సామ్రాజ్య వాదమే ప్రకటించింది. ఆ విధంగా "స్వదేశీ" ప్రభుత్వం అధికారం చేపట్టింది.

# వ్యవసాయరంగాన్ని పరాధీనత దిశగా నడిపిస్తున్న స్వదేశీ పాలకులు

వలసవాద ప్రభుత్వానికి బదులుగా 'భారతీయ' ప్రభుత్వం ఏర్పడిన తర్వాత సహజంగానే ఆ ప్రభుత్వాలు భిన్నమైన విధానాలను రూపొందించి, అమలు జరుపుతారని ఎవరైనా ఆశిస్తారు. తన "విదర్ ఇండియా" అన్న పుస్తకంలో నెహ్రూ స్వయంగా చెప్పినట్లుగా "స్వదేశీ ప్రభుత్వం స్థాపించబడిన తర్వాత కూడా పాతదోపిడీ ప్రయోజనాలను ముట్టకుంటే అది స్వాతంత్ర్యం కాదుగదా! దాని నీడగా కూడ ఉండబోదు!!

ఇంతకు ముందే మనం చూసినట్లుగ బ్రిటిష్ వలస వాదులు తమ దోపిడీ ప్రయోజనాల కోసం రూపొందించిన వ్యవసాయక విధానంలో ఏమార్పులు మన 'స్వదేశీ' పాలకులు తెచ్చారన్నది పరిశీలించాలి:-

బ్రిటిష్ పాలకులు తమ పన్నుల వసూళ్ళకోసమూ, ఇంకా అంతకంటే లోతైన ఆలోచనతో భారతదేశంలో తమను సమర్థించే జమిందారీ వర్గాన్ని రూపొందించటం ద్వారానూ, ప్రత్యక్షంగా రైతాంగాన్ని కొల్లగొట్టే విధానాల్ని ఏమైనా స్వదేశీపాలకులు మార్చారా? భూముల పంపకం సరళిని మార్చి వ్యవసాయకూలీలను పాతదోపిడీ పద్ధతుల నుండి విముక్తి చేశారా? రైతాంగపు రుణభారాన్ని తొలగించారా! నిరుపయోగంగా బీడుపడిపోయిన కోట్లాది ఎకరాలను సాగులోకి తెచ్చి భారత ప్రజల అవసరాలను తీర్చారా? వంటి ప్రశ్నలను మనం వేసుకొని వచ్చిన మార్పులను అంచనా కట్టాలి.

అందులోకి వెళ్ళబోయే ముందు బ్రిటిష్ సామ్రాజ్య వాదం సృష్టించిన జమీందారీ వర్గంపట్ల మన కాంగ్రెసు విధాన రూపకర్త, మహాత్ముడుగా కీర్తించబడే గాంధీజీ వైఖరి చూద్దాం.

"సరైన కారణం లేకుండా ఆస్తివంతులను వారి ఆస్తుల నుండి తొలగించడంలో నేను భాగస్వామిని కాను. మీ హృదయాలను మార్చి మీరు మీ స్వంత ఆస్తులను మీ రైతుల ధనంగా, వారి మేలుకై ఉపయోగించేటట్టు చేయటమే నా ఆశయం. నేను కలలుకనే రామరాజ్యంలో, రాకుమారుని, దరిద్రుని హక్కులు రెంటికీ రక్షణ ఉంటుంది. వర్గకలహం రాకుండా చేసేందుకు, నా యావచ్ఛక్తినీ, పలుకుబడినీ ఉపయోగిస్తానని మీరు నమ్మండి . . . . . . . . ఒక వేళ అన్యాయంగా మీ ఆస్తులను తొలగించాలని ప్రయత్నం జరిగితే నేను మీ వైపు నుండి పోరాడతాను. మన సోషలిజం లేక కమ్యూనిజం అహింస మీద కార్మికుల, పెట్టుబడిదార్ల మైత్రీ సహకారం మీద; రైతు, భూస్వామి సహకారం మీద ఆధారపడాలి."

(గాంధీ, ఉత్తరప్రదేశ్ జమీందార్లకిచ్చిన ఇంటర్వ్యూ, జులై,. 1934 మరాఠీ పత్రిక)

ఆయన తన సాంఘిక సిద్ధాంతాన్ని ఇంకా ఇలా చెప్పారు.

"మనం పుట్టుకతో సమానులమే అయినా - అంటే మనకు సమానావకాశాలు పొందే హక్కు ఉన్నప్పటికీ, మనందరి సామర్థ్యం సమానమైనది కాదు. ప్రకృతి సిద్ధంగానే మనందరం ఒకే రంగు, ఒకే స్థాయిగల ప్రతిభాశక్తి కలిగి ఉండటం అసాధ్యం; ఇందువల్ల

మనలో కొందరు ధనం చేకూర్చుటకు తగిన సమర్థులుగా వుండటం సహజమే. ఆ సామర్థ్యం కలవారు ధనం సంపాదించాలనుకొంటే వారు తమ శక్తిని అందుకోసం వెచ్చిస్తారు. వారు సద్బుద్ధితో ద్రవ్యం సంపాదిస్తే, వారు ప్రజాసేవకులౌతారు. వీరు కేవలం ధర్మకర్తలు మాత్రమే అవుతారు. కాని ఇంకేమీ కారు. ప్రతిభాశాలి ఎక్కువ సంపాదిస్తుంటే నేను సంపాదించమంటాను. అతను తన సమర్థతను ఉపయోగించుకుంటే ఏ ఆటంకం పెట్టను." (గాంధీ, చార్లెస్ పెట్రాష్‌తో - మాండే పత్రిక ఫిబ్రవరి 20, 1932)

**అయితే ఇందుకు భిన్నంగా జవహర్‌లాల్ నెహ్రూ తన ఆలోచనలను ప్రకటించాడు:**

"కాబట్టి భారతప్రజల దోపిడీని అంతమొందించే పద్ధతిలోనే భారతదేశ తక్షణాశయాన్ని ఊహించాలి. రాజకీయంగా స్వాతంత్ర్యం, బ్రిటిష్ సంబంధాన్ని తొలగించుకోవటం, అంటే సామ్రాజ్యవాదానికి లోబడి ఉండే స్థితిని తొలగించుకోవాలి ; ఆర్థికంగా, సామాజికంగా స్వాతంత్ర్యానికి అర్థమేమంటే ఉన్న ప్రత్యేక వర్గ సౌకర్యాలను జమీందారీ, పెట్టుబడిదారి ప్రయోజనాలను తుదముట్టించాలి."

("భారతదేశమా ఎక్కడకి" 1939)

అయితే వీరిద్దరి విధానాల్లో ఏది అమలు జరిగిందన్నది చూస్తే ఖచ్చితంగా గాంధీ ప్రకటించిందే. జమీందారీ, జాగీర్దారీ విధానాలు - రైతాంగాన్ని పీల్చిపిప్పిచేయటానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టులు నైజాంపై సాగించిన పోరాటం పట్ల కాంగ్రెసు తీసుకొన్న వైఖరే దాని ఆచరణకు ప్రత్యక్ష సాక్ష్యం.

"బాంచెను నీకాలికి మొక్తాదొరా" "నీ పెంట తింటాదొరా" అనాల్సిన దుస్థితి నుండి రైతాంగాన్ని మేల్కొలిపి, జమీందార్ల రాజ్యంపై ధ్వజమెత్తి తమ ఆత్మాభిమానాన్ని చాటుతూ సాహసోపేతంగా పోరాడేట్లు చేసింది కమ్యూనిస్టు పార్టీ. 3 వేల గ్రామాల్లో పది లక్షల ఎకరాల్ని పంచుకొని గ్రామరాజ్యాన్ని నిర్మించుకొన్నారు.

కాంగ్రెసుకు జమీందారీ వ్యతిరేకత ఉంటే ఈ ప్రజల వీరోచిత పోరాట ఫలితాన్ని అంగీకరించి స్థిరీకరించాలి. కానీ కాంగ్రెసు 1948లో పల్లెల నుండి ప్రాణాలు దాచుకోవటానికి పట్నాలకు పారిపోయిన జమీందార్లకు కాంగ్రెసు టోపీలు తగిలించి, గ్రామాల్లోకి మిలిటరీని అండగా ఇచ్చిపంపింది. 4 సం॥ల పాటు 'జమీందారీ విధానం' రద్దుచెయ్యజూసిన కమ్యూనిస్టులపై క్రూరమైన హత్యాకాండ సాగించి ప్రజలు పంచుకొన్న భూముల్ని తిరిగి భూస్వాములకు స్వాధీనం చేసిగానీ కాంగ్రెసు తృప్తి పడలేదు. ఆ సందర్భంగా దేశంలోకే పేరుమోసిన బ్రిటిష్ వారసత్వంలో అందెవేసిన మలబారు సైన్యాన్ని ప్రజలపైకి, జమీందారీ వ్యతిరేక ఉద్యమ గ్రామాలపైకి పంపి కాంగ్రెసు జరిపించిన హత్యాకాండ, పైశాచిక చిత్రహింసలూ, సామూహిక అత్యాచారాలు, అవమానాలు కాంగ్రెసు అసలు నైజాన్ని బయట పెట్టాయి. ఈ రక్తసిక్త చరిత్రతో మొదలైన కాంగ్రెసు పాలనలో ఆకర్షవంతంగా చెప్పిన పథకాలన్నీ భూస్వామ్య వర్గాల ప్రయోజనాలకే ఉపయోగపడ్డాయి.

దేశంలో 1950లో కాంగ్రెసు ముందుకు తెచ్చిన 'సమాజవికాస అభివృద్ధి పథకం' (కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రాజెక్టు) గ్రామీణ దృశ్యాన్ని పరివర్తన చేసే పథకమని ప్రణాళికలను విజయవంతంగా అమలు జరపటానికి చోదకశక్తిని అందించే 'డైనమో' అని నెహ్రూ వర్ణించాడు.

అయితే దీని అమలును పరిశీలించిన ఆర్థిక శాస్త్రవేత్తలంతా ఈ పథకం కోసం కేటాయించిన మొత్తాలన్నీ గ్రామీణ ప్రాంతాల్లోని భూస్వాములకు తోడ్పడ్డాయనీ, వారు

వ్యవసాయ ఉత్పత్తులను కొనుగోలు చేసే మార్కెట్‌లో ప్రవేశించటానికి లేదా కాంట్రాక్టులను చేపట్టటానికి ఉపయోగపడ్డాయనీ తేల్చి చెప్పారు. 1951లో సేకరించిన లెక్కలకు, 1961లో సేకరించిన లెక్కలకు మధ్య భూకమతాల పంపకం తీరులో తేడా ఏమీ కనిపించలేదు.

దేశంలో కాంగ్రెసు చేపట్టిన 'రాజభరణాల రద్దు' పథకంగానీ, భూసంస్కరణల చట్టంగాని ప్రాథమికంగా భూస్వామ్య వర్గాల ప్రయోజనాలనేమీ తాకలేదు. పైగా ప్రజాధనాన్ని పలురూపాల్లో వారికి కట్టబెట్టారు. చట్టాల్లో వారికనుకూలంగా రూపొందించబడిన లొసుగుల్ని చక్కగా వినియోగించుకున్నారు.

ప్రభుత్వం ఆర్భాటంగా 6 కోట్ల 80 లక్షల ఎకరాలు మిగులు భూములు తేలుతుందని అంచనావేసి, తీరా 72 లక్షల 56 వేల ఎకరాల తేలినట్లు ప్రకటించింది. 62 లక్షల ఎకరాలు స్వాధీనం చేసుకొని 48 లక్షల 45 వేల ఎకరాలు మాత్రమే పెంచినట్లు ప్రకటించుకుంది. వెనకటి కెవడో పంచ పాండవులెంతమందంటే మంచం కోళ్ళలాముచ్చటగా ముగ్గురని చెప్పి ఒక వ్రేలు చూపించినట్లు!

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటాన్ని రక్తపు టేరుల్లో ముంచెత్తి నైజాం నవాబును రక్షించటంతో మొదలైన కాంగ్రెసు పాలన లోను, మధ్యలో అధికారంలోకి వచ్చిన ఇతర పాలకవర్గాల పాలనలన్నిటిలోను భూస్వామ్య వర్గాలకు బ్రహ్మాండమైన మేలు జరిగినట్లుగ కావల్సినన్ని అధికారగణాంకలే అందుబాటులో ఉన్నాయి. పైగా ఈ బడా బూర్జువా భూస్వామ్య వర్గాల పాలనలో భూములు గతంలో లాగా భూస్వాములకే కాక - పారిశ్రామిక వేత్తలకు కూడ రకరకాల పేర్లతో వేలాది ఎకరాలు కేటాయించారు. మరో వైపు దేశంలోకి వచ్చిన క్రిష్టయన్ మిషనరీల వంటి సంస్థలు కూడ క్షేత్రాలను సంపాదించి గూఢచార చర్యలను కూడ ఆ ముసుగులో నెరపగలుగుతున్నాయి.

ఈ నాటికీ బ్రిటిష్ కాలం నాటి కంపెనీలు సంపాదించుకొన్న లక్షలాది ఎకరాల టీ, కాఫీ, రబ్బరు తోటల జోలికి ఏ 'స్వదేశీ' ప్రభుత్వమూ వెళ్ళలేదు. దేశంలో వ్యవసాయరంగాన్ని బ్రిటిష్ పాలకులు నడిపించిన దానికి భిన్నంగా మనదేశ అవసరాల కోసం, మన కాళ్ళపై మనం నిలబడేట్లు చేయలేదు. రోజురోజుకు పాలకులనుసరిస్తున్న విధానాలు విభిన్న అంశాల్లో ఎలా పరాధీనత వైపుగా నెడుతున్నాయో చూద్దాం.

## గోధుమల దిగుమతితో మొదలైన విదేశీ పెట్టుబడి

'స్వదేశీ' పాలన ఆరంభమైనపుడు ఒకవైపు బ్రిటన్‌తో గతంలో ఉన్న సంబంధాలన్నిటినీ కొనసాగించటానికి, వారి పరిశ్రమలకు గ్యారంటీనిచ్చి వారి దోపిడిని కొనసాగించుకొనేందుకు అనుమతినివ్వడమేగాక - మనదేశంలోని విదేశీపెట్టుబడులను ఆహ్వానిస్తూ నెహ్రూ సామ్రాజ్యవాద దేశాలవైపు "మా దేశాన్ని కొల్లగొట్టుకు పోవటానికి స్వేచ్ఛగా అనుమతిస్తాం రండహో" అని పాలికేక వేశాడు.

రెండవ ప్రపంచయుద్ధంలో ప్రత్యక్షంగా పాల్గొనకుండా బయటవుండి ఆయుధాలమ్ముకోవటం ద్వారా బలపడ్డ అమెరికా వెనుకబడిన దేశాలన్నింటిలోకి ప్రవేశించేందుకు ప్లాను చేసింది. అమెరికా, బ్రిటను వదిలిన చెప్పుల్లో కాళ్ళుదూర్చి, మారిన

ప్రపంచ పరిస్థితుల్లో ప్రత్యక్షంగా దేశాలను పాలించే పాత వలస పద్ధతిలో కాకుండా 'సహాయం' పేరిట నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ఆర్థికవ్యవస్థలను ప్రభావితంచేయటానికి పూనుకొంది. ఆ విధంగా నయావలస విధానాలతో ముందుకు వచ్చింది.

నెహ్రూ ప్రకటించిన ఆడంబరమైన ప్రకటనలూ, మాటలూ చూసి భారతదేశాన్ని ప్రణాళికాయుతమైన ఆర్థిక అభివృద్ధివైపుకు, క్రమంగా స్వావలంబన (విదేశీ సహాయం లేకుండా తనకాళ్ళపై తను నిలబడడం) వైపుకు దేశాన్ని నడిపిస్తాడని చూసినవాళ్ళ ఆశలు అడియాసలే అయ్యాయి.

కా॥ తరిమెల నాగిరెడ్డి తన "తాకట్టులో భారతదేశం" గ్రంథంలో చెప్పిన క్రింది వాస్తవాలను గమనించండి :

1951 లో మొదటిసారిగా భారతదేశంలోని ఆహార అవసరాన్ని తీర్చటానికి 2 మిలియన్ టన్నుల గోధుమల్ని కొనుగోలుచేసుకోవటానికి రూ. 142.28 కోట్లు రుణమిచ్చింది. తనే ఆ గోధుమలు సరఫరా చేసింది. ఇందుకోసం అమెరికన్ సెనేట్ ఒక చట్టం చేసింది. ఆ చట్టం చూస్తే భారతదేశంతో అమెరికా ఎందుకు ఈ రకమైన సంబంధంలోకి వచ్చిందో అర్థమవుతుంది. "భారతదేశానికి అత్యవసర ఆహార సప్లై చట్టం 1951" లో "భారతదేశంతో సంప్రదింపులు సాగించే సందర్భంగా ఆచరణ సాధ్యమైనంత వరకు అవసరమైన, ప్రత్యేకంగా కీలకమైన, వ్యూహరీత్యా ప్రాధాన్యత కలిగిన పదార్థాలను తగినంత మొత్తాల్లో తక్షణంగా, నిరంతరాయంగా (భారతదేశం) సప్లైచేసే విధంగా చూడాలని పరిపాలకుడిని (అమెరికా అధ్యక్షుడు) ఆదేశిస్తూ" ఒక నిబంధన పొందుపరచబడినది. ఈ నిబంధన మోనజైట్ అనే ఖనిజానికి సంబంధించినది. దీనిలో థోరియం అనే మూలకం ఉన్నది. ఈ మూలకం అమెరికా అణుశక్తి కార్యక్రమాలకు కీలకమైనది. భారతదేశం సహాయంకోసం చేసిన మొట్టమొదటి విజ్ఞప్తి ఫలితంగా ఒక షరతు సహాయానికి అంటగట్టబడింది. అది భారతదేశపు సార్వభౌమాధికార భావనకు సవాలుగా ఉన్నది.

(పొలిటిక్స్ ఆఫ్ ఫారిన్ ఎయిడ్ - ఎల్డ్రిడ్జ్, పేజి 31)

ఈ విధంగా ప్రారంభమైన అమెరికా సహాయం షరతులలో కూడుకొన్నదని తెలిసినప్పటికీ భారతపాలకులు అమెరికాతో అనేక ఒప్పందాలను కుదుర్చుకొన్నారు. ఒక్క గోధుమపంటేగాక పత్తి, పొగాకు, సోయాచిక్కుడు, నూనె వంటివి కూడ ఇందులో ఉన్నాయి.

అమెరికన్ సహాయం మనదేశపు ఆహారధాన్యాల, వ్యవసాయోత్పత్తుల దిగుబడులను పెంచటంకోసంకాక ఏటికేటికీ మరింత పరాధీనతనే పెంచింది. పబ్లిక్‌లా 480 (PL - 480) అని పిలవబడే అమెరికన్ చట్ట ప్రకారం తనవద్దనున్న వ్యవసాయ సరుకుల్ని - గోధుమల్ని భారతదేశానికి దిగుమతిచేసింది. 1956 నుండి 68 వరకు ఈ పద్దు కింద భారతదేశానికి దిగుమతిచేసిన వ్యవసాయ సరుకుల మొత్తం విలువ రూ. 3,150 కోట్లు ఉంటుందని అంచనావేశారు.

అమెరికా సహాయంపేరిట ఇచ్చిన మొత్తాలన్నీ డబ్బురూపంలో కాక తన సరకులను ఎగుమతిచేసింది, లేదా సర్వీసుల రూపంలో ఇచ్చింది. వీటి రెండింటిలోనూ అధికరేట్లను గుంజింది. సరకులన్నిటి రేట్లు అప్పటి మార్కెట్‌రేట్ల కంటే 40 నుండి 50 శాతం పెంచి లెక్కకట్టింది. అలాగే దిగుమతిచేసే సరకులన్నీ తన ఓడల ద్వారానే చేసుకోవాలన్న నిబంధనపెట్టి రవాణా, పాకింగు ఛార్జీలు 43% నుండి 113% పెంచివేసుకొంది. అమెరికన్ ఓడల ఆదాయంలో 1/4 వ వంతు ఆదాయం ఈ రవాణావల్లనే వచ్చింది.

ప్రపంచబ్యాంకు వంటి తన ఆధీనంలోనున్న బ్యాంకుల ద్వారా భారతదేశానికి రుణాలిచ్చింది. అయితే ఏ ప్రత్యేక పథకానికి అప్పు ఇచ్చినా దేశ ఆర్థికవ్యవస్థను పరిశీలించే అవకాశం కల్పించాలన్న నిబంధనపెట్టి మనదేశంలో ఆర్థిక గూఢచార చర్యలకు తలపడింది. అంటే మన ఆర్థిక వ్యవస్థ అవసరాలను - ప్రభుత్వ బలహీనతలను గుర్తించడం ద్వారా మన ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చేందుకు వుపయోగించుకొంది. చివరకు ప్రపంచబ్యాంకు 1957 నుండి మనదేశపు ఆర్థిక, రాజకీయ పరిస్థితులపై నివేదికలు విడుదలచేస్తూ వస్తోంది. మన ప్రభుత్వాధికారులు బడ్జెట్ పెట్టబోయే ముందు ప్రపంచబ్యాంకు అధికారులతో సమావేశంకావాలి. మనదేశంలో ప్రపంచబ్యాంకు శాశ్వత కమిటీని ఒకదాన్ని వేశారు.

భారత పాలకుల్ని రాజకీయ విధానాల్లో లొంగదీసుకోవటానికి కూడా రుణసాయం ఉపయోగపడింది - 1965 లో భారత-పాకిస్తాన్ యుద్ధం సందర్భంగా ఆహార సరఫరాలు నిలిపివేసి ప్రభుత్వాన్ని బెదిరించింది. చివరకు ఆహారపదార్థాల దిగుమతులను సంవత్సరంపాటు పంపడంకాక ఏనెలకానెల పంపింది. వారి మాటల్లోనే "పొట్టి పాలుపుతాడు" విధానాన్ని అనుసరించింది. అంటే మేత పశువు గాటి చుట్టూ వున్నప్పటికీ తాడు పొట్టిగా కట్టివేయడంతో కొద్దికొద్దిగా తాడు వదులుచేసేకొద్దీ మాత్రమే తినగలిగే పరిస్థితి.

ఇంత అవమానకరంగా అమెరికా షరతులు విధించినప్పటికీ భారతపాలకులు, సామాన్య బిచ్చగాళ్ళపాటిగా కూడా వ్యక్తిత్వాన్ని నిలుపుకోకుండా అవమానాన్ని భరించారు.

అంతేకాక సోవియట్ అనుకూల విదేశాంగవిధానం సాగుతున్న కాలంలో 1971 లో వియత్నాం అమెరికాపై సాగించిన జాతీయోద్యమానికి అనుకూలంగా వ్యవహరించడంతో, అమెరికా బెదిరించడంకోసం ఆహారధాన్యాల సరఫరాను నిలిపివేసింది. అమెరికన్ అధికారులు వ్రాసినట్లు, "ఆందోళన చెందిన భారత అధికారులకు, మన బృందానికీ ఈ స్థితి ముళ్ళపై నిలబెట్టినట్లైంది. దీనితో భారత రేషనింగ్ విధానం ఇరకాటంలో పడింది .... అమెరికా ఓడరేవుల నుండి ఆహారధాన్యాల ఓడలు కొద్ది ఆలస్యంగా బయలుదేరినా దాని ప్రభావం అనావృష్టి ప్రాంతాల్లో దుర్భరంగా ప్రతిబింబిస్తూ ఉండేది". ఈ విధమైన బెదిరింపులు సాగించిన ఫలితంగా భారతప్రభుత్వం తన వైఖరిని మార్చుకొని వియత్నాం ప్రజలపై దురాక్రమణ యుద్ధం సాగిస్తున్న అమెరికన్ సైనికులను అలరింపజేయటానికి అప్పటి ప్రపంచసుందరిగా ఎన్నికైన భారతవనిత రీటాఫారియాను నృత్యం చేసేందుకు పంపే నైచ్యానికి దిగజారింది.

అమెరికా అనుసరించిన ఈ పద్ధతులు మచ్చుకు కొన్ని మాత్రమే. ఒకవైపు ప్రపంచంలో కీలకప్రాంతం అంతటా తన సైనిక స్థావరాలను నెలకొల్పుకొని బెదిరిస్తూ, ఇంకోవైపు నుండి పలురూపాలలో మూడవ ప్రపంచదేశాలపై తన నయావలస దోపిడీ సాగించింది. భారతపాలకులు ప్రణాళికా లక్ష్యాలను, పారిశ్రామిక విధానసారాన్ని పక్కనబెట్టి ఎరువులరంగంలో కూడా ఎలా పరాధీనతను పెంచారో చూద్దాం!

## సంయుక్తరంగం నుండి ప్రవేటురంగం చేతుల్లోకెళ్ళిన ఎరువుల పరిశ్రమ

వ్యవసాయంలో ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టటంతో కృత్రిమంగా తయారుచేసిన ఎరువుల ప్రాధాన్యత పెరిగింది. అందునా, హైబ్రిడ్ విత్తనాల పద్ధతి కనిపెట్టటంతో వాటి నుండి అధికదిగుబడి రాబట్టడంకోసం ఎరువుల వాడకం పెరిగింది.

వ్యవసాయానికి కావలసిన కీలక పరిశ్రమ అని చెప్పి ఎరువుల పరిశ్రమను 1956 పారిశ్రామిక పాలసీలో 'బి' కేటగిరిలో చేర్చారు. అంటే అసలు పూర్తిగా ప్రైవేటురంగాన్ని అనుమతించని 'ఏ' కేటగిరీలాగా కాకుండా "అప్పటికే వున్న ఎరువుల ఫ్యాక్టరీల్లో ప్రైవేటు పెట్టుబడిని ఒక్కసారి రద్దుచేయటం గాకుండా, వాటిని క్రమక్రమంగా ప్రభుత్వ యాజమాన్యం క్రిందకి తెచ్చుకొంటూ, నూతన ఫ్యాక్టరీల స్థాపనలో సాధారణంగా ప్రభుత్వమే చొరవతీసుకొనే పరిశ్రమగా" దీన్ని వర్గీకరించారు.

అయితే పరిశ్రమకోసం అనుసరించాల్సిన టెక్నాలజీని నిర్ణయించడంలోనే సామ్రాజ్యవాదానికి తన లొంగుబాటు ప్రదర్శించింది ప్రభుత్వం. మనదేశంలో విస్తారంగా దొరికే బొగ్గుపై ఆధారపడి ఎరువులు తయారుచేసే టెక్నాలజీ వుంది. దాన్ని అనుసరించకుండా ముడిసరుకుకోసం ఎప్పుడూ సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడేట్లుగా పెట్రోలియం నుండి తీసే 'నాఫ్తా' లేక ద్రవ అమోనియా (Liquid Ammonia) నుపయోగించే టెక్నాలజీని చేపట్టింది. బొగ్గుతో అతి చవకగా తయారుచేసేందుకున్న అవకాశాన్ని వదలివేసి నాఫ్తాతో 'ఖరీదైన ఎరువుల' తయారీకి పూనుకుంది.

అయితే ఈ ఎరువుల కర్మాగారాలు క్రమంగా ప్రభుత్వ పెట్టుబడి, యాజమాన్యంలోకి కాక ప్రైవేటు అందునా విదేశీ మిలాఖత్తు కంపెనీలుగా ఎలా రూపొందాయో మన పరిశ్రమలోని అనేక అనుభవాలు తీసిచెప్పుకోవచ్చు. ఆ తీరును అర్థం చేసుకోవటానికి మచ్చుకు కొన్ని ఉదాహరణలు :

1956-59 ల మధ్య ట్రాంబే వద్ద నిర్మించదలచిన ఎరువుల కర్మాగారానికి అమెరికన్ ఋణాలకోసం ఒప్పందం చేసుకొన్నారు. దాని ప్రకారం (రహస్య వాగ్దానం) విదేశీ ప్రైవేటు పెట్టుబడి పరిశ్రమలో చొరబడటానికి అనుమతించారు. ఉదాహరణకు మద్రాస్ ఫెర్టిలైజరు సంస్థను ప్రభుత్వరంగంలోనే నెలకొల్పారు. అయితే ఇందులో అమెరికాకు చెందిన ఇంటర్నేషనల్ ఆయిల్ కంపెనీకి 49% (ప్రతి నూరు రూపాయిల పెట్టుబడిలో రూ. 49) వాటాను అనుమతించింది. అంతేగాక కంపెనీ మేనేజింగు బోర్డులో ప్రభుత్వానికీ, అమెరికన్ కంపెనీకి సమానమైన సంఖ్యలో డైరెక్టర్లను పెట్టారు. ఇంకా మేనేజింగు డైరెక్టరును నియమించే అధికారం కూడ అమెరికన్ కంపెనీకే ఇచ్చారు. పేరుకు ప్రభుత్వకంపెనీ - అమెరికన్ మేనేజిమెంటు! ఎంత చక్కని ఒప్పందం!!

ఇది మద్రాసు ఫ్యాక్టరీలోనే కాదు - విశాఖ కోరమండల్ ఫ్యాక్టరీ, కాన్పూరులోని ఎరువుల ఫ్యాక్టరీ, గోవా వద్దగల బిర్లా ఎరువుల ఫ్యాక్టరీ అన్నింటిలో ఇదే పద్ధతి.

పేరుకు ప్రభుత్వ ఫ్యాక్టరీలు - విదేశీ పెట్టుబడిదార్ల, భారతదేశంలోని వారి తొత్తుల మేనేజిమెంట్లు. ముడిసరుకుకోసం విదేశాలపై ఆధారపడేటట్లు రూపొందించారని ముందే చెప్పుకొన్నాం గదా! దానికోసం వారికిష్టంవచ్చిన రేట్లు (విదేశాలకు) చెల్లిస్తాం. వారి యంత్రాలు దిగుమతి చేసుకొంటాం. వారిచే మేనేజిమెంటు చేయించుకొంటాం. ఏమి స్వావలంబన!

భోపాల్‌లో యూనియన్ కార్బైడు కంపెనీలో 1984 లో జరిగిన ప్రమాదం ఎరువుల కర్మాగారంలోనే. మిథైల్ ఐసోసైనెడు (MIC) అనే ప్రమాదకరమైన గ్యాసు విడుదలై వేలాదిమంది చావుకు, లక్షలాదిమందిని జబ్బులకు గురిచేస్తే, మన "స్వతంత్ర" పాలకులు

చేసిన నిర్వాకం మనకు తెలుసు. కంపెనీ యాజమాన్యంపై ప్రజలు ఆగ్రహావేశులై ఏమైనా చేస్తారేమోనని వాళ్ళకు కావల్సినంత రక్షణ కల్పించారు మన పాలకులు. ఆ కంపెనీ మేనేజరు ఆండర్సన్ అమెరికా నుండి వస్తుంటే విమానాశ్రయంలో గట్టి బందోబస్తు కల్పించి సురక్షితంగా మళ్ళీ అమెరికా చేర్చారు. మన బాధితులకు నష్టపరిహారంకోసం అమెరికన్ కోర్టుల చుట్టూ తిరిగి తిరిగి వాడిస్తానన్న నష్టపరిహారం కన్నా పైసా కూడా ఎక్కువ ప్రజలకు రాకుండా చేయగలిగారు.

## ముడుపులొస్తే చాలు : ఎంతకైనా విదేశాల వద్ద కొంటాం

ఈ పరాధీనత క్రమంగా పెరుగుతూ వచ్చింది. 1991 లో మన పాలకుల విధానాలకు అద్దంపట్టే వార్తలొచ్చాయి. 20.7.91 నాటి ఫ్రంట్‌లైన్ పత్రికలో ఒకప్పటి ప్రణాళికా సంఘ సభ్యుడు అరుణ్‌ఘోష్ ఈ వివరాలు వ్రాశారు.

1980 లో హల్దార్ టాప్‌సీ (హాలెండ్), స్నాంప్రొగెట్టీ (ఇటలీ) అన్న రెండు కంపెనీలు మూడు ఎరువుల ఫ్యాక్టరీలు నిర్మాణానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని భారతదేశానికి అమ్మాయి. రోజుకు 1350 టన్నుల అమోనియా ఉత్పత్తిచేసే సామర్ధ్యంగల ఈ ఫ్యాక్టరీలో టన్ను అమోనియా తయారీకి 85 లక్షల కిలో కేలరీల శక్తి అవసరమవుతుంది. ఇదే ఫ్యాక్టరీని ఈ కంపెనీలే థాయిలాండుకు ఇండియాకు అమ్మిన ధరలో 1/3 వ వంతు ధరకు అమ్మాయి. విదేశీసహాయం తీసుకొని ఈ ఫ్యాక్టరీలను నిర్మించారు. అప్పు తీసుకొన్నాం గనక అప్పు ఇచ్చేవాడు చెప్పిన దగ్గరే కొనాల్సిరావటంతో ఇంత ఎక్కువ రేటు పెట్టాల్సివచ్చింది.

ఇంతకన్నా దారుణ విషయం ఏమంటే - అదే కాలంలో విదేశాల్లో స్థిరపడ్డ భారతీయుడొకరు రోజుకు 400 టన్నుల అమోనియా కెపాసిటీగల ప్లాంటును మనకమ్మటానికి ముందుకొచ్చాడు. దీనిలో టన్ను అమోనియా తయారీకి 66 లక్షల కిలోకేలరీల శక్తి అవసరమవుతుంది. అంటే భారత ప్రభుత్వం కొన్నదానికంటే 25% తక్కువ ఖర్చుతో దీనిలో అమోనియా తయారవుతుంది. ఇంతేకాదు దీనికి కావలసిన యంత్రాలన్నీ ఇండియాలోనే తయారవుతాయి. సహజవాయువు దొరికిన చోటనల్లా లేదా ఆ పైపులైన్ల వెంబడి (గోదావరి బేసిన్ వంటి ప్రాంతాల్లో) ఈ ప్లాంటులను నిర్మిస్తే తక్కువ ధరలకే ఎరువులు తయారయ్యేది. కానీ, ప్రభుత్వం ఈ ప్రతిపాదనను తోసిపుచ్చింది. తిరిగి స్నాంప్రొగెట్టీ (ఇటలీ) వద్దే పైన చెప్పిన ఎక్కువ రేట్లకే మరో 8 ప్లాంట్లను కొన్నది.

మన పాలకులకు కావలసింది ముడుపులే తప్ప ప్రజలకు తక్కువ ధరలకు సరకులందటం కాదుకదా! మన పయనం స్వావలంబనవైపుగాక మరింతగా సామ్రాజ్యవాదులకు దేశసంపదను దోచిపెట్టి, ప్రజలను సామ్రాజ్యవాదుల లాభాలకు బలిపెట్టటంపై పని చెప్పటానికి పై ఆధారాలు చాలు.

## ప్రపంచంలోకే ఎక్కువ మన ఎరువుల, పురుగుమందుల ధరలు

మనదేశంలో హరితవిప్లవకాలం నుండే ఎక్కువగా ఎరువులు, పురుగుమందులు వాడబడుతున్నాయి. 1960 లో దేశం మొత్తం మీద ఎరువులు 2 లక్షల టన్నులు, పురుగుమందులు 2 వేల టన్నులు వాడగా, 1985 నాటికి అవి వరుసగా 78 లక్షల టన్నులకు, 72 వేల టన్నులకు పెరిగాయి. 1991 - 92 నాటికి ఎరువుల వినియోగం 1 కోటి 20 లక్షల టన్నులకు పెరిగింది.

ఈ వాడబడుతున్న వాటిల్లో కూడా స్వదేశీ పరిశ్రమల్లో తయారయ్యే వాటికన్నా విదేశీ దిగుమతులే ఎక్కువ. 1980లో తీసిన లెక్కల ప్రకారం మనంవాడే నైట్రోజన్ ఎరువుల్లో 29%, ఫాస్ఫరస్ ఎరువుల్లో 24%, పొటాష్ ఎరువులు 100% దిగుమతి చేసుకొంటున్నారు. తాజా లెక్కల ప్రకారం కూడ మొత్తం ఎరువుల్లో 40% దిగుమతి చేసుకొంటున్నారు.

వీటి ధరల సంగతి చూస్తే జపాన్‌లో 1 కిలో నత్రజని కొనడానికి 0.75 కిలోల ధాన్యం సరిపోతుండగా, కొరియాలో 1.32 కిలోలు, బంగ్లాదేశ్‌లో 1.60 కిలోలు, శ్రీలంకలో 1.63 కిలోలు, ఇండోనేషియాలో 2 కిలోలు, తైవాన్‌లో 2.7 కిలోలు, థాయ్‌లాండ్, పాకిస్తాన్, ఫిలిప్పీన్స్‌లలో 3.12 కిలోల ధాన్యం సరిపోతుంటే మనదేశంలో 5 కిలోల ధాన్యం అమ్మితేగాని 1 కిలో నత్రజని రాదు.

(30.10.83 ఆంధ్రజ్యోతిలో Y. శివాజీ)

ఇతర దేశాల్తో పోల్చితే మన ఎరువుల వాడకం (కొనుగోలు శక్తి) కూడా తక్కువే. ప్రపంచంలో సగటున హెక్టారు (2 1/2 ఎకరాలు) కి 97 కిలోలు వాడుతుంటే మనదేశంలో 72 కిలోలు మాత్రమే వాడుతున్నారు. అదే యూరోపియన్ దేశాలలో 200 కిలోలు వాడుతున్నారు.

పురుగుమందుల విషయానికొస్తే ప్రస్తుతం 83 వేల 600 టన్నులు వాడుతున్నారు. ఈ పురుగుమందుల వాడకం ప్రధానంగా హైబ్రిడ్ రకాల విత్తనాలపై సేద్యంచేసే ప్రాంతాల్లో కేంద్రీకృతమై వుంది. వీటి వాడకంలో ఏ శాస్త్రీయ పద్ధతీ అమలుజరగటం లేదన్నది ఒక అంశమైతే వాటి ధరల విధానం మరీ దారుణంగా వుంది. ఉత్పత్తిచేసేవాళ్ళు కల్తీలు చేసినా పట్టించుకునే దిక్కేలేదు. (ఇలాంటివి 210 భోగస్ కంపెనీలు రంగంలో ఉన్నాయి.)

ర్యాలిస్ (RALLIS), హెచ్.ఐ.ఎల్ (HIL), ఐ.సి.ఐ (I.C.I), ట్రూఫిన్ (TRUFIN), షావాలిస్ (SHAW WALLACE), టాటా, హెచ్.పి.ఎం. (HPM), సర్ల్, శాండోజ్, సీబా తదితర కంపెనీల పురుగుమందులు మార్కెట్లో అమ్ముడవుతున్నాయి. ఈ కంపెనీలు పురుగుమందుల ధరలను లీటరు రూ. 6, 7 వందలపైనే అమ్ముతున్నాయి. భవిష్యత్తులో నష్టంచేసే ప్రమాదకరమైన పురుగుమందులుగా గుర్తించి, విదేశాల్లో నిషేధించిన సింథటిక్ పైరిథ్రాయిడ్‌ల వంటి వాటిని కూడా మనదేశంలో యధేచ్ఛగా అమ్ముతున్నారు. 1980 దశకం చివరలో భారత ఆహారమంత్రిత్వశాఖవేసిన ఎస్.ఎన్. బెనర్జీ కమిటీ పరిశీలన జరిపి - దేశంలో వాడబడుతున్న క్రిమిసంహారక మందుల్లో 70% ఎక్కడో ఒక దేశంలో నిషేధానికి గురైనవేనని తేల్చిచెప్పింది. 1992 నాటికి అందులో కొన్నింటిని నిషేధించారు కూడ.

ఆంధ్రలో ప్రత్తి రైతులను ఆత్మహత్యలకు ప్రేరేపించటంలో ఈ పురుగుమందు కంపెనీల పాత్ర వుందన్న విషయం మనందరకూ తెలిసిందే.

## ఎరువుల సబ్సిడీలు – IMF, ప్రపంచబ్యాంకుల కత్తివేటు

పెరిగిన వ్యవసాయ ఖర్చులతో వ్యవసాయం గిట్టుబాటుకాకపోవడంతో రైతాంగం పదేపదే వీధుల్లోకి వచ్చారు. 1977 లో అధికారంలోకి వచ్చిన జనతా ప్రభుత్వం ఎరువుల ధరల పెరుగుదలకు కారణమైన పారిశ్రామిక విధానంలోని లోపాలను (మన బొగ్గుపై ఆధారపడని పరిశ్రమలు వగైరా) సరిదిద్దటానికి పూనుకోకుండా - రాయితీలివ్వటానికి

పూనుకొంది. రిటెన్షన్ ప్రైస్ సిస్టం అన్న పేరుగల ఈ విధానం ప్రకారం - ఎరువుల ధరలను ప్రభుత్వం నిలకడగా వుంచుతుంది. ఉత్పత్తి ఖర్చుకు, మార్కెట్లో అమ్మేరేటు (కంట్రోలులోనే) కు మధ్యనున్నతేడాను ప్రభుత్వమే ఫ్యాక్టరీలవాళ్ళకు చెల్లిస్తుంది. అంటే ఫ్యాక్టరీకి మూలపెట్టుబడిపైనా, అదివాడే ముడి పదార్థాల పెట్టుబడిపైనా కనీస లాభం 12% లేకుంటే ప్రభుత్వమే దాన్ని పరిశ్రమలకు చెల్లిస్తుంది.

దీని ప్రకారం ప్రభుత్వం దేశంలో ఉత్పత్తయ్యే ఎరువుల ఉత్పత్తిదార్లకు, విదేశాల నుండి దిగుమతయ్యే వాటికి కూడా సబ్సిడీలు చెల్లిస్తూ వచ్చింది. అయితే ఈ సబ్సిడీలలో 48% అసమర్ధమైన మేనేజిమెంటు ఉన్న పరిశ్రమలే తినివేశాయని ఒక సర్వేలో బయటపడింది. అంతేగాక 5/8/81 న "హిందూ" పత్రికలో మాజీప్రధాని V.P. సింగ్ తన వ్యాసంలో ఇంకో మోసం బయటపెట్టాడు. ప్రైవేటు కంపెనీలు తమకు కావల్సిన యంత్రసామాగ్రిని విదేశాల నుండి తెచ్చుకొనే రేటుకు 10% నుండి 15% ఎక్కువజేసి చూపుతూ ఆ మొత్తంపై కూడా 12% లాభాలు ప్రభుత్వం నుండి పొందుతున్నారనీ, విదేశాల నుండి దిగుమతిచేసుకొనే ఎరువుల రేట్లు (మన రేవులకు చేరేసరికి) రైతులకు అమ్ముతున్న రేట్లకంటే తక్కువే ఉన్నాయనీ, అందువల్ల ప్రభుత్వం చెల్లిస్తున్న ఎరువుల సబ్సిడీ వాస్తవానికి రైతులకు చెల్లిస్తున్నది కాక పారిశ్రామికవేత్తలకు చెల్లిస్తున్న లాభాలేనన్నాడు. ఎరువుల పరిశ్రమ మోసాన్ని, చేతకానితనాన్ని రైతులపై మోపుతున్నారన్నది స్పష్టం.

అయితే ఈ బడ్జెట్ దోపిడీ విషయం కాసేపు ప్రక్కనపెడితే - 1977 లో ఈ విధానం ప్రవేశపెట్టిన తర్వాత ఎరువుల పంపిణీ కంట్రోలు చేయబడి మార్కెట్‌లో ధరలు నిలకడగా ఉంటూవచ్చాయి. మనకు అప్పులిచ్చే అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF), ప్రపంచబ్యాంకులు చేపట్టిన సరళీకరణ విధానం (లిబరలైజేషన్), వ్యవస్థాగత సర్దుబాట్ల కార్యక్రమం (STRUCTURAL ADJUSTMENT PROGRAMME - SAP) ప్రభావం ఈ ఎరువుల సబ్సిడీపై పడింది. వాళ్ళుపెట్టిన షరతులకు తలొగ్గుతూ పి.వి. నరసింహారావు ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే రూపాయి విలువను 20% దిగకోయటమే కాకుండా రైతాంగానికిచ్చే సబ్సిడీలను కూడా కత్తిరించింది. 1977 లో రూ. 375 కోట్లతో మొదలైన సబ్సిడీ పెరిగి రూ. 6,000 కోట్లకు చేరిందనీ, ఆ భారం మొయ్యలేనంటూ సబ్సిడీ దిగకోసి ఎరువుల ధరలను 40%పెంచుకోవటానికి పరిశ్రమల వాళ్ళను అనుమతించింది. దాంతో దేశవ్యాప్తంగా రైతాంగం ఆందోళనకు దిగింది. మన రాష్ట్రంలో చిలకలూరిపేటలో రైతులపై కాల్పులు కూడ సాగించారు. రైతాంగ ప్రతిఘటనతో దాన్ని 30% కు సవరించారు. అయితే పరిశ్రమల వాళ్ళు ఆ తర్వాత సంవత్సరంలో రెట్టింపు ధరలు పెంచినా ప్రభుత్వం పట్టించుకోలేదు. ఇది రైతాంగంపై అదనపు భారంపెంచి ఎరువుల వాడకం తగ్గడమేగాక పంటల దిగుబడి తగ్గటానికి కూడ దారితీసింది.

రైతాంగానికిచ్చే సబ్సిడీని ఉపసంహరించి - మరోవైపు ఎరువుల దిగుమతిపై వేసే సుంకాన్ని ఐ.యం.ఎఫ్. ఆదేశంమేరకు తగ్గించడంతో ఎరువుల దిగుమతులు పెరిగి దేశంలోని పరిశ్రమల మూసివేతకు దారితీసింది.

ప్రస్తుతం ముందుకువస్తున్న డంకెల్ ప్రతిపాదనలు అమలుజరిగితే ఈ సబ్సిడీలు పూర్తిగా ఉపసంహరించబడతాయి. మరోవైపు వాణిజ్యాన్ని సరళతరంచేయటం, గ్లోబలైజేషన్‌లో భాగంగా ఇప్పుడు సాగుతున్న ఎరువుల దిగుమతులు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతాయి. దేశంలో అరకొరగా వున్న ఎరువుల పరిశ్రమలు మూతపడి అటువైపు కార్మికులు నిరుద్యోగులవుతారు. మరోవైపు ఎరువుల ధరలు ఈ రెండేళ్ళలో

పెరిగినదానికంటే ఇంకా వేగం అందుకొంటాయి. దీని ఫలితంగా చిన్నరైతుల వ్యవసాయ పెట్టుబడులు పెరగటం, మార్కెట్‌లో గిట్టుబాటు ధరలు లేకపోవటంతో దివాళాతీసి సేద్యం మానుకొని - కూలీలుగా మిగులుతారు.

అందువల్ల ఎరువుల పరిశ్రమ 1956 పారిశ్రామిక తీర్మానంలో చెప్పబడినట్లు క్రమక్రమంగా ప్రభుత్వాధీనంలోకి రావడంకాక దాని పయనం తిరోగమనంవైపు - అంటే ప్రభుత్వరంగ పరిశ్రమల మూసివేతకు, పూర్తిగా సామ్రాజ్యవాదుల, వారి దళారులైన బడా పెట్టుబడిదార్ల దోపిడీ కేంద్రంగా మారుతున్నదన్నది స్పష్టమే.

ఎరువుల ధరలు పెరిగిన ఈ రెండేళ్ళలోనే ఎరువుల వినియోగం 16.9 లక్షల టన్నుల నుండి 15 లక్షల టన్నులకు పడిపోయింది. ఆహారధాన్యాల ఉత్పత్తి 123 లక్షల టన్నుల నుండి 117 లక్షల టన్నులకు పడిపోయింది. ఎరువులపై కంట్రోలు ఎత్తివేత పరోక్షంగా పెంచే కరువును కూడా ఇందులో చూడవచ్చు.

## జాతీయ లక్ష్యాలను గాలికొదిలేసిన శాస్త్ర, సాంకేతిక పరిశోధనలు

మన వ్యవసాయశాస్త్ర, సాంకేతిక విషయాల్లో అమెరికా, సోవియట్ యూనియన్ జోక్యం చేసుకున్నాయి. సోవియట్ యూనియన్ వ్యవసాయ క్షేత్రాలను పెట్టి అక్కడక్కడా పరిశోధనలు సాగించినా అది మన వ్యవసాయ పరిశోధనలపై పెద్దగా జోక్యం చేసుకోలేదు. కాని అమెరికా మనకు చేసిన పలు "సహాయ" రూపాల్లో సాంకేతిక పరిజ్ఞానం అందించడం కూడ ఒకటి.

1968 సంవత్సరం నవంబరు 30 నాటి 'కామర్సు' పత్రిక ఇచ్చిన సమాచారం ప్రకారం "అమెరికా తదితర దేశాల వ్యవసాయ సమస్యల పరిష్కారంలో అనుభవజ్ఞులైన సుమారు 30 మంది నిపుణులు 6 రాష్ట్రాల్లో ఆహారధాన్యాల ఉత్పత్తిని ఇతోధికం చేయడానికి భారతీయ నిపుణులతో కలిసి పనిచేస్తున్నారు". "వీరు ఆచరణకు సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలో ప్రత్యక్ష అధ్యయనంసాగిస్తూ మెరుగైన పద్ధతులను రూపొందించే క్షేత్ర ఉత్పత్తి బృందాల కృషిలో పాల్గొంటున్నారు".

"1952 నుండే వ్యవసాయ, పశువైద్య (వెటర్నరీ) కళాశాలలకు సంబంధించిన ఉపాధ్యాయులు కేంద్ర, రాష్ట్ర వ్యవసాయశాఖలకు చెందిన అధికారులు మొత్తం సుమారు 1700 మంది భారతీయులు అమెరికాలో ఉన్నత శిక్షణను పొందారు. అదే కాలంలో అమెరికాకు చెందిన 400 కు పైగా వ్యవసాయ శాస్త్రజ్ఞులు, తదితర నిపుణులు భారతదేశంలో వుండి పనిచేశారు".

"ఆహారోత్పత్తి రంగాలలో పనిచేసే వీరుగాక నేల, నీరు నిర్వహణకు చెందిన 9 మంది అమెరికన్ నిపుణులు భారతదేశంలో పనిచేస్తున్నారు". 1955 ఫిబ్రవరి 'స్పాన్' (Span) అనే అమెరికన్ పత్రిక మనదేశానికి అమెరికాచేసే 400 కోట్ల సహాయం దేనికి దేనికి ఖర్చుపెట్టాల్సిందీ వివరించింది. అందులో వ్యవసాయ విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, వ్యవసాయ పరిశోధనా కేంద్రాలకు, చేపలు పట్టడం, పశుగణాభివృద్ధిని విస్తరించడం, ట్రాక్టర్ల వాడకంలో ట్రైనింగుకు, వ్యవసాయ అర్థశాస్త్రంలో పరిశోధన గురించి శిక్షణ ఇవ్వడం వగైరా పలు పథకాలున్నాయి.

ఆధునిక విజ్ఞానం, టెక్నికల్ సహాయం పేరిట ప్రారంభించిన అమెరికా ప్రయత్నాలు మన వ్యవసాయం పై కీలక కంట్రోలు సాధించే వైపుగాసాగాయి. 1988 లో (IARI) భారత వ్యవసాయ పరిశోధన సంస్థ పునరుద్ధరించబడింది. అమెరికన్ రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ మాజీ డైరెక్టరును దీనికి అధ్యక్షునిగా చేశారు.

మార్చి 26, 1986 నాటి ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా పత్రికలో క్లాడ్ ఆల్వారిస్ వ్రాసిన వ్యాసం శాస్త్రపరిశోధనలో మన పాలకులు ఎంత లొంగుబాటును, సామ్రాజ్యవాద విధేయతను ప్రదర్శిస్తూ, వాళ్ళకు మన సర్వస్వాన్ని పాదాక్రాంతం చేస్తూన్నారో స్పష్టంచేస్తోంది.

1955 లో ఒరిస్సాలోని కటక్‌లో కేంద్రీయ వరి పరిశోధనా సంస్థ (CRRI) ని ఏర్పరచారు. తక్కువకాలంలో కోతకు వచ్చే వరదలకు, ఎక్కువ నీటికి తట్టుకొని, గాలికి పడిపోకుండా ఉండే; గింజ పొలంలో రాలకుండా ఉండే; గింజ గట్టిగా ఉండే; తాలు లేకుండా ఉండే; తెగుళ్ళను తట్టుకొనే, ఎరువును బాగా గ్రహించగలిగే మొత్తం 91 మంచి లక్షణాలు గల అధిక దిగుబడి వరి వంగడాలను రూపొందించడం దీని లక్షణం. ఈ పరిశోధన సంస్థకు 1959 లో డా॥ రిచారియా అనే ఆయన డైరెక్టరుగా నియమించబడ్డారు. వరి పరిశోధనలో విశేషమయిన అనుభవం పట్టుదల ఉన్న ఈయన నాయకత్వంలో ఈ సంస్థ అతికొద్ది కాలంలోనే మన వాతావరణ పరిస్థితికి అనువుగా ఉండే తెగుళ్ళను తట్టుకొని అధిక దిగుబడినిచ్చే వరి వంగడాలను రూపొందించారు. ఆయన స్వయంగా జపాన్, తైవాన్ వంటి దేశాల వరి వంగడాలపై పరిశోధచేసి తైచుంగ్‌నేటివ్ అనే కొత్తరకం వంగడాన్ని రూపొందించారు. ఇది మామూలుగా వచ్చే తెగుళ్ళను తట్టుకోవడమే కాక ఎకరాకు 9000 పౌన్లు (40 క్వింటాళ్ళు) దిగుబడిని ఇవ్వగలదు.

ఈయన కృషి ఇలాగే సాగనిచ్చి ఉంటే భారతదేశంలో అద్భుతమైన దిగుబడిని సాధించే అనేక రకాల వరివంగడాలను కనిపెట్టడం సాధ్యపడి ఉండేది. అయితే ఇంతకు ముందు మనం చూసినట్లు అమెరికా మనదేశ వ్యవసాయరంగంలో జోక్యం చేసుకొనేందుకు ఈ విత్తన పరిశోధనలో కూడ జోక్యం చేసుకొంది. ఓ ప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్త అన్నట్లు ఎవరైతే వరిధాన్యాన్ని నియంత్రిస్తారో, ఎవరైతే దానిని సప్లయి చేస్తారో వారే ఆసియాను తమ గుప్పెట్లో పెట్టుకోగలరు. ఆసియాలోని ప్రజలకు ప్రధానమైనది పెట్టుబడిదారీ విధానం కానీ, సోషలిజం కానీ, మరో రాజకీయ విధానం కానీ కాదు. "ఆహారం; అంటే ప్రాణం, ఆసియాలోని ఎక్కువభాగాలలో ఆహారం అంటే వరి మాత్రమే". ఈ విషయాన్ని గుర్తించిన అమెరికా అసలు తన దేశంలో 'వరి' వాడకపోయినప్పటికీ వరి పరిశోధనలో అడుగుపెట్టింది. అందుకు తన తొత్తు ప్రభుత్వం వున్న ఫిలిప్పైన్స్‌లోని మనీలాను కేంద్రంగా చేసికొని అంతర్జాతీయ వరి పరిశోధనా సంస్థ (IRRI) ను స్థాపించింది. అమెరికాలోని రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్, ఫోర్డ్ ఫౌండేషన్స్ దీనికి కావలసిన నిధులను సమకూర్చాయి. దానికి చాండ్లర్‌ను డైరెక్టరుగా నియమించింది. ఈ పదవిని చేపట్టేవరకు ఆయన ఏనాడూ వరి మొక్కను చూడలేదని తనే స్వయంగా అంగీకరించారు.

## అమెరికన్ సామ్రాజ్యవాదులకు అమ్ముడుపోనందుకు వేధింపులకు గురైన భారత శాస్త్రవేత్త రిచారియా

సహజంగానే ఈ IRRI తన అమెరికన్ పద్ధతిలో భారతదేశంలో వరిపై కంట్రోలు సాధించడానికి ప్రయత్నం ప్రారంభించింది. 1962 లో చాండ్లరు భారత పర్యటనకు

వచ్చినపుడు CRRI ను సందర్శించాడు. ఆ సందర్భంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్రలు తెలియని అమాయక శాస్త్రవేత్త అయిన రిచారియా తన పరిశోధనా క్షేత్రంలో సాగుతున్న కృషిని చాండ్లరుకు వివరించడమేగాక తాను కనిపెట్టిన TN-1 (తైచుంగ్ నేటివ్) గురించి కూడా వివరించాడు.

ఇక్కడే వ్యవహారం మొదలయింది. చాండ్లర్ తిరుగు ప్రయాణంలోనే ఢిల్లీలోని భారత ఆహార మంత్రిత్వశాఖ, భారత వ్యవసాయ పరిశోధనా మండలి (ICAR) అధికారులతో తాము రెండు కొత్త వంగడాలను (TN-1, IR-8) రూపొందించామని అవి అధికోత్పత్తిని సాధిస్తాయనీ వాటితో సస్య విప్లవాన్ని సాధించవచ్చనీ చెప్పివెళ్ళాడు. అయితే నిజానికి వారి వద్ద అటువంటి నూతన రకాలేవీ లేవు. చాండ్లర్ వచ్చి వెళ్ళిన 4 సంవత్సరాలకుగానీ కష్టపడి IR-8 ను రూపొందించలేకపోయారు.

ఇంతకూ విశేషమేమిటంటే ఈ కొత్తగా రూపొందించిన రకం వరి రసాయనిక ఎరువులు, క్రిమిసంహారక మందులు వినియోగించకపోతే మామూలు రకాలు ఇచ్చే దిగుబడిని కూడా ఇవ్వలేదు. అమెరికన్ ఎరువుల, పురుగుమందుల కంపెనీలకు తమ సరుకులను అమ్ముకోవడానికి బాగా సరిపడే రకం అన్నమాట.

హఠాత్తుగా ఒకనాడు కేంద్ర వ్యవసాయ మంత్రిత్వశాఖ కార్యదర్శి డా॥ B.P.పాల్ డా॥ రిచారియాను ఢిల్లీకి పిలిపించాడు. అక్కడ అమెరికన్ రాక్‌ఫెల్లర్ సంస్థకు చెందిన డా॥ కామింగ్స్ కూడా ఉన్నారు. డా॥ పాల్ రిచారియాతో IRRI కి చెందిన డా॥ చాండ్లర్ తనకు TN-1 అనే వంగడాన్ని ఇచ్చాడనీ, దానిని దేశంలో ప్రవేశపెట్టాలనీ కోరాడు. దానికి రిచారియా అభ్యంతరం చెబుతూ తాను కనిపెట్టిన TN-1 రకం వేరనీ, వారు తయారుచేసిన TN-1 రకం ప్రవేశపెడితే దాని నిండా రోగాలూ, తెగుళ్ళూ, సూక్ష్మక్రిములూ సోకే ప్రమాదం ఉండవచ్చని అభ్యంతరం చెప్పారు. అయితే 'పాల్' గారు ఇప్పటికే టన్నుల కొద్దీ వంగడాలను బహుమానంగా వారు పంపుతున్నారనీ, బహుమానంగా పంపేవాటిని స్వీకరించకుండా ఎలా ఉండగలమనీ అన్నారు. దానితో డా॥ రిచారియా ఆ కొత్త వంగడాల వల్ల వచ్చే తెగుళ్ళకు తాను బాధ్యతవహించననీ అందువల్ల ఆ విత్తనాలను తాను రికమండ్ చేయననీ చెప్పారు.

గతంలో తైచుంగ్ రకాలు సత్ఫలితాలు ఇస్తాయని చెప్పిన డా॥ రిచారియా ఇప్పుడు వాటినే వద్దంటున్నాడని భారతప్రభుత్వం తర్వాత చెప్పచూసింది. అయితే రిచారియా ఆవేదన ఏమిటంటే సహజంగా విత్తనాలను ఎన్నోరకాలుగా పరిశోధించి చిన్నచిన్న భూఖండాలలో వివిధ రుతువులలో వివిధ వాతావరణాలలో పరీక్షించి వాటి నుంచి మంచి విత్తనాలను సేకరించి వాటిని మాత్రమే పెద్ద మొత్తాలలో తయారుచేసి విడుదలచేయాల్సి ఉంటుందని. రకరకాల మొక్కల నుంచి విత్తనాలు సేకరించేటట్లయితే చీడ పీడలకు ఆస్కారమిస్తాయి. ఈ విషయాలు తెలిసిన రిచారియా సహజంగానే తెలియకుండానే అమెరికన్ విత్తనాలను విడుదలచేయడంవల్ల వచ్చే ప్రమాదం గుర్తించారు. కనుకనే అమెరికన్ విత్తనాలను తిరస్కరించారు. కానీ జాతీయ ప్రయోజనాలను గాలికి వదలివేసిన బ్యూరోక్రాట్ అధికారులకు ఈ విషయాలేవీ పట్టలేదు. ఆ విత్తనాలను విడుదలచేశారు. అవి దేశంలోకి అనేక తెగుళ్ళను తెచ్చాయి.

తర్వాత మరొక సందర్భంలో కూడా డైరెక్టరయిన చాండ్లర్ కటక్ వచ్చినపుడు తనతోబాటు '311' రకాల వరి విత్తనాల నమూనాలను తెచ్చారు. రిచారియా కిస్తే

స్వీకరించడని వ్యతిరేకిస్తాడని తెలిసిన చాండ్లర్ CRRI లోని క్రిందిస్థాయి ఉద్యోగికి లంచం ఆశచూపి వాటిని అప్పచెప్పాడు. అందులో సగం రకాలను కటక్‌లోనే ఉంచి మిగిలిన వాటిని హైదరాబాద్‌లోని వరి పరిశోధనా సంస్థకు పంపమని కూడా చెప్పాడు. చాండ్లర్ అక్కడ ఉండగానే ఆ క్రిందిస్థాయి ఉద్యోగి రిచారియాకు ఈ విషయం చెప్పడంతో ఆ ఉద్యోగిని రిచారియా మందలించాడు. వాటికి క్వారంటైన్ సర్టిఫికెట్ ఉందా అని అడిగారు. సహజంగా ఏ దేశమైనా తమ దేశంలోకి కొత్త విత్తనాలు, మొక్కలు వచ్చేటప్పుడు వాటి ద్వారా కొత్త తెగుళ్ళు, రోగాలు, కలుపు మొక్కలుగానీ వస్తాయేమో క్వారంటైయిన్‌లో పరీక్షించుకొనిగానీ విడుదల చేయరు. ఈ విధంగా కొంతకాలంపాటు రకరకాల పరిశీలనలను చేయడాన్నే క్వారంటైన్ అంటారు. తమకు ప్రమాదం ఏదీలేదని నిర్ధారణ అయ్యాకే కొత్త విత్తనాలకు క్వారంటైన్ సర్టిఫికెట్‌ను మంజూరు చేస్తారు.

ఈ ప్రశ్నతో ఆగ్రహోదగ్రుడైన ఛాండ్లర్ 'మీ దేశానికి తెగుళ్ళుసోకే విత్తనాలు అందిస్తున్నాననా మీ ఉద్దేశం" అని రిచారియాపై మండి పడ్డాడు (ప్రపంచ అధిపతి అయిన అమెరికా వారి ప్రతినిధిని ఒక బడుగు దేశపు శాస్త్రవేత్త ప్రశ్నించడమా!). 'చాండ్లర్ సరాసరి ఢిల్లీ వెళ్ళి వ్యవసాయమంత్రితో రిచారియా కనుక ఆ పదవిలో కొనసాగితే మనకు నష్టదాయకమన్నారు. అమెరికన్ సామ్రాజ్యవాదానికి అత్యుత్తమ ఏజంట్ అయిన ఆనాటి వ్యవసాయమంత్రి సి. సుబ్రహ్మణ్యం వెంటనే రిచారియాను తొలగిస్తూ ఆదేశించాడు. ఉద్యోగం పీకివేయడమేకాక రిచారియా పరిశోధనా పత్రాలను కూడా స్వాధీనంచేసుకొన్నారు. ఉద్యోగం కోల్పోయి నాలుగేళ్ళపాటు మానసిక క్షోభను అనుభవించి చివరకు కోర్టు ద్వారా మళ్ళీ డైరెక్టర్‌గా నియమించబడ్డారు. ఉద్యోగంలో చేరుతూనే స్వాధీనంచేసుకొన్న తన పరిశోధనా పత్రాలు తన చేతికి వచ్చేవరకు ఆ బాధ్యతలు స్వీకరించలేనన్నారు.

ఈ వివాదం సాగుతున్న కాలంలోనే మధ్యప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఆ రాష్ట్ర వరి పరిశోధనా మండలిని (MPRRI) మధ్యప్రదేశ్ రైస్ రిసర్చి ఇనిస్టిట్యూట్ స్థాపించింది. డా॥ రిచారియాను వ్యవసాయశాఖ సలహాదారుగా రమ్మని పిలవడంతో CRRI ని వదిలివేసి దానికి వెళ్ళాడు. సంవత్సరానికి కేవలం 20 వేల రూపాయలు మాత్రమే మధ్యప్రదేశ్ ప్రభుత్వం కేటాయించినప్పటికీ MPRRI కి కనీసం మైక్రోస్కోపులుగానీ, జీపులుగానీ సమకూర్చనప్పటికీ, ఉన్న ఆ కనీస వసతులతో రిచారియా ధైర్యంగా ముందుకుసాగి 6 సంవత్సరాలకాలంలో అద్భుతమైన జీన్ బ్యాంక్‌ను రూపొందించారు. తిరిగి కొత్త వంగడాలను రూపొందించాడు. అమెరికా స్థాపించిన IRRI రూపొందించి విడుదలచేసిన వంగడాలు వరుసగా విఫలంకాగా డా॥ రిచారియా హెక్టారుకు 8 - 9 టన్నుల దిగుబడినిచ్చే కొత్త వంగడాలను రూపొందించారు. దేశంలోని బక్క రైతుల మధ్య, వారిపొలాలనే తన పరిశోధనాగారంగా చేసికొని అద్భుత విజయాలు సాధించిన డా॥ రిచారియా IRRI కి సవాల్‌గా తయారయ్యారు.

రిచారియాను లొంగదీసుకోవాలని ప్రయత్నించి IRRI విఫలం అయ్యింది. దానితో అమెరికన్ సామ్రాజ్యవాదం తన నల్లని రెక్కలను మరలా చాచింది. ఫలితంగా MPRRI ని మూసివేయించారు. దీనిని ICAR (ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చి) లో కలుపడానికి నిర్ణయించి, అభివృద్ధిపరచడానికంటూ పథకాన్ని రూపొందించి, ప్రపంచబ్యాంకు '4' కోట్ల రూపాయల సహాయం చేసింది. ఈ సహాయంచేయడానికి MPRRI ని మూసివేయాలని షరతు పెట్టడం, దానిని ప్రభుత్వం అంగీకరించడం చకచకా జరిగిపోయాయి. అంతేగాక CRRI కి చెందిన అన్నిరకాల జీన్ బ్యాంకు నమూనాలను

అమెరికాలోని పోర్టు కారిన్స్‌కు ప్రభుత్వ అనుమతి లేకుండా కూడా తరలించగలిగారంటే శాస్త్రపరిశోధనా సంస్థల రహస్యాలను కాపాడడంలో ప్రభుత్వ శ్రద్ధను అర్థంచేసుకోవచ్చు. ఈ పని చేయించిన మధ్యప్రదేశ్ ప్రభుత్వ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, సాక్షాత్తు అమెరికన్ గుత్తసంస్థ ఫోర్డు ఫౌండేషన్ మాజీ ఉద్యోగి. రిచారియా రూపొందించిన జీన్ బ్యాంకును కూడా జవహర్‌లాల్‌నెహ్రూ కృషి విశ్వవిద్యాలయానికి తరలించారు. దీని వైస్‌ఛాన్సలర్ సుఖదేవ్‌సింగ్ అమెరికా సంస్థ IRRI బోర్డుట్రస్ట్‌లలో చేరిపోయాడు. MPRRI లో పనిచేస్తున్న శాస్త్రవేత్తలను శిక్షణకోసం ఫిలిప్పీన్స్‌లోని IRRI కి పంపించారు.

ఈ రకంగా రిచారియాను మళ్ళీ వీథిన పడవేశారు. ఒక ప్రసిద్ధ శాస్త్రవేత్త సామ్రాజ్యవాద ప్రయోజనాలకు అమ్ముడుపోనందుకు చెల్లించుకోవలసి వచ్చిన మూల్యం ఇది. భారతీయ నల్లప్రభువుల 'సార్వభౌమత్వానికీ,', 'స్వావలంబనా సిద్ధాంతాలకూ', 'దేశభక్తికీ' ఇంతకంటే ఏం రుజువులు కావాలి?

## విఫలమైన విదేశీ ప్రయోగాలు

IRRI స్వయంగా ప్రకటించుకొన్న "రిసెర్చి హైలైట్స్" లో ఇలావుంది : "ఆధునిక వరివంగడాలు ఎక్కువ మోతాదులో నత్రజని ఎరువులను ఉపయోగించినపుడు సత్ఫలితాలను ఇస్తున్నాయి. కానీ నత్రజనిని అధికంగా ఉపయోగించుకోవడంతో మొక్క ఎత్తు పెరిగి దిగుబడి పెరుగుతున్నది. దీనికితోడు ఈ ఆధునిక పొట్టి వంగడాలతో క్రిమి సంబంధమైన వ్యాధులు పెరుగుతున్నాయి. వ్యాధి నిరోధక శక్తి తగ్గుతున్నది".

అమెరికా కనుసన్నలలో రూపొందించబడి అమలుజరుపబడిన మన సస్యవిప్లవం సాధించిన ఫలితం ఇది. ఈ సైన్సు సాధించిన ప్రగతిని భరత్‌డోగ్రా ఇంకా వివరంగా చెప్పాడు:

"1970 - 71 లో కేవలం 1.25 కోట్ల ఎకరాల భూమితో ప్రారంభం అయి 1982 - 83 నాటికి 4.5 కోట్ల ఎకరాల విస్తీర్ణంలో అంటే దేశవ్యాపితంగా వరి సేద్యం అయ్యేదానిలో సగం విస్తీర్ణం అధిక దిగుబడి వంగడాలను (HYV) సాగుచేశారు. ఈ పంట ఎక్కువ మోతాదులో నీటిని, NPK మిశ్రమ ఎరువులను కోరింది. సేద్యపు విస్తీర్ణం పెరిగినప్పటికీ ఎరువుల వాడకం, నీటిపారుదల సౌకర్యాలు పెరిగినప్పటికీ వరి ఉత్పత్తి పెరుగుదల చాలా తక్కువస్థాయిలో మాత్రమే ఉంది. పైన చెప్పిన 12 సంవత్సరాలకాలంలో విస్తీర్ణం 3.25 కోట్ల ఎకరాలకు పెరిగినప్పటికీ ధాన్యం ఉత్పత్తిలో పెరుగుదల కేవలం 40 లక్షల టన్నులు మాత్రమే. అంటే ఎకరాకు కేవలం 124 కిలోలు మాత్రమే. అంటే పెరుగుదల అతి తక్కువే. అధిక దిగుబడి రకాలు లేకపోయినా గ్రామాలలో లభించే వనరులు వినియోగించుకొని ఇంతకంటే ఎక్కువే సాధించగలిగి ఉండేవాళ్ళం." భారతప్రభుత్వ వ్యవసాయ మంత్రిత్వశాఖ ఏర్పరచిన 33 మందిగల అధికార సభ్యుల బృందం తేల్చిందేమంటే సస్య విప్లవం తర్వాత సాధించిన ప్రగతి అంతకుముందు సాధించిన దానికంటే తక్కువగా ఉందని.

మన ప్రభుత్వ యంత్రాంగం పై అమెరికన్ పట్టును నిరూపించిన మరోఘటన 1982లో జరిగింది. ప్రణాళికా సంఘానికి ఉపాధ్యక్షుడుగానూ, మంత్రివర్గపు శాస్త్రీయ సలహాసంఘం అధ్యక్షునిగానూ, ఆహారమంత్రిత్వశాఖ కార్యదర్శిగానూ కీలక పదవులు నిర్వహించిన డా. స్వామినాథన్ ఈ పదవులన్నింటినీ వదులుకొని ఫిలిప్పైన్స్‌లోని డైరెక్టర్ జనరల్‌గా వెళ్ళాడు. అమెరికన్ సామ్రాజ్యవాదపు డబ్బే ఇతన్ని వేలమంది శాస్త్రవేత్తలకు

నాయకత్వంవహించే స్థానం నుండి అతి చిన్న సంస్థకు మారడానికి పురికొల్పిందన్నది నిస్సందేహం.

ఇంతకంటే ముఖ్యంగా ఇక్కడ మనం గమనించాల్సింది ఏమిటంటే జాతీయ ప్రయోజనాలను కాపాడుకోవాలని పట్టుదల ఉంటే ఏ ప్రభుత్వం కూడా దేశానికంతటికి సంబంధించిన వైజ్ఞానిక రహస్యాలు అందులోనూ ఆహారంగానికి సంబంధించి తెలిసిన వ్యక్తిని రాత్రికి రాత్రే ఒక ప్రవేటు సంస్థలో, అదీ అమెరికన్ సామ్రాజ్యవాదానికి ఊడిగంచేసే సంస్థలో ఉద్యోగిగా చేరడాన్ని అనుమతించదు. మన ప్రభుత్వం అందుకు సమ్మతించిందంటే కారణాలు వేరే చెప్పనక్కరలేదు కదా.

46 సంవత్సరాల కాలంలో మనం సాధించిన 'ప్రగతి' దేశవ్యాపితంగా మన పంటల దిగుబడులు ఎలా వున్నాయో క్రింది పట్టిక ద్వారా అర్థమవుతుంది.

(ప్రక్క పేజీలోని పట్టిక)

అనేక పంటల ఉత్పత్తిలో అంతర్జాతీయస్థాయిలో ఉత్పత్తిచేస్తున్న సగటుకన్నా మనదేశ సగటు ఉత్పత్తి చాలా తక్కువ. ఉదాహరణకు వరిపంట విషయమే తీసుకొంటే ప్రపంచం మొత్తం ఉత్పత్తిలో చైనా మొదటిస్థానంలోను, మనదేశం రెండో స్థానంలోను ఉంది. అయితే ఎకరాకు లేదా హెక్టారుకు ఎన్ని కిలోలు పండిస్తున్నాము అని లెక్కలు తీస్తే మాత్రం మనం 54వ స్థానంలో ఉన్నాం.

మనం ఈ దుస్థితిలో వుండడానికి ఇతరత్రా కారణాలతోపాటు వ్యవసాయరంగంలో పరిశోధనలు సరైన లక్ష్యంతో సాగకపోవడమే కారణము. పాలకులు సామ్రాజ్యవాదులకు దళారులుగా వ్యవహరిస్తూ రిచారియా వంటి శాస్త్రవేత్తను ఎలా వేధించారో చూశాం. మన డబ్బుతో రీసెర్చి డిగ్రీలు, ట్రైనింగులూ పొందిన అనేకమంది వ్యవసాయ శాస్త్రవేత్తలు అంతర్జాతీయ గుత్తసంస్థల వుద్యోగాల్లోకి వెళ్తూవుంటే, మన జర్మ్‌ప్లాజంతో సహా తీసుకెళ్తున్నారన్న అనుమానం వుంటే కూడ ప్రభుత్వం గుడ్లప్పగించి చూస్తూ వుంది.

ఆంధ్రరాష్ట్రంలో పఠాన్‌చెరు (హైదరాబాద్) వద్ద మనకు, అమెరికాకు మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం మెట్టపంటల పరిశోధనా కేంద్రం 'ఇక్రిసాట్' (ICRI SAT) పెట్టారు. ఇందులో వుండే మన శాస్త్రవేత్తలు రెండవ శ్రేణి పౌరులుగా జీవించాల్సి వస్తోందని, పరిశోధనల రహస్యాలన్నీ విదేశీ శాస్త్రవేత్తల చేతుల్లోనే వున్నాయని ఆందోళనచేసినా మన పాలకులకు చీమ కుట్టినట్లయినా లేదు.

## పరిశోధనలకు నామమాత్రమైన కేటాయింపులు :

మరోవైపు వ్యవసాయ యూనివర్సిటీల నిండా అంతులేని అధికార దుర్వినియోగం, బంధుప్రీతి, కులవివక్షత వంటివన్నీ అమలుజరుగుతున్నాయని ప్రభుత్వంవేసిన అనేక విచారణ కమీషన్లు నిర్ధారించాయి. నిజాయితీ కలిగిన శాస్త్రవేత్తలు తమకు తగిన ప్రోత్సాహం లేనందువల్ల ఆత్మహత్యలకు కూడా పూనుకున్నారు. అలాంటి వాళ్ళ సంఖ్య పదుల్లోనే వుంది.

## 1950 – 51 నుండి 1996 – 97 వరకు ఆహారధాన్యాల సగటు దిగుబడి

| | 1950-51 | 1వ పం. ప్రణాళిక 1951-56 | 2 వ పం. ప్రణాళిక 1956-61 | 3 వ పం. ప్రణాళిక 1961-66 | ప్లానులేని 66 - 69 | 4వ ప్లాను 69 - 74 | 5వ ప్లాను 1974-79 | 79-80 నుండి | 85-86 నుండి | 1996-97 సాధించింది |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| అన్ని ఆహారధాన్యాలు | 552 | 600 | 652 | 692 | 738 | 836 | 937 | 1046 | 1256 | 1615 |
| పప్పులు | 441 | 474 | 493 | 466 | 468 | 491 | 502 | 488 | 549 | 694 |
| బియ్యం | 668 | 817 | 915 | 986 | 992 | 1112 | 1203 | 1304 | 1612 | 2023 |
| గోధుమ | 655 | 738 | 757 | 834 | 1062 | 1272 | 1442 | 1716 | 2101 | 2722 |
| జొన్నలు | 353 | 436 | 497 | 486 | 527 | 488 | 670 | 699 | 726 | - - |
| మొక్కజొన్న | 547 | 750 | 857 | 1000 | 1018 | 1052 | 1068 | 1208 | 1335 | - - |
| సజ్జ | 288 | 309 | 303 | 342 | 363 | 476 | 448 | 498 | 507 | - - |
| వేరుశనగ | 775 | 724 | 760 | 711 | 672 | 781 | 812 | 849 | 899 | - - |
| చెరకు | 33 | 32 | 38 | 44 | 46 | 50 | 52 | 56 | 62 | - - |
| ప్రత్తి | 88 | 92 | 105 | 114 | 120 | 130 | 153 | 164 | 202 | - - |
| జనపనార | 1044 | 1045 | 1034 | 1068 | 1029 | 1110 | 1140 | 1237 | 1507 | 1710 |
| తృణధాన్యాలు | 565 | 605 | 624 | 630 | 666 | 758 | - - | - - | - - | - - |

(పై లెక్కలు హెక్టారు సగటు దిగుబడి కిలోల్లో - చెరకు మాత్రం టన్నుల్లో)
మూలం : 7వ, 8వ ప్లాను డాక్యుమెంట్లు, ఎకనమిక్ సర్వేలు

మన పాలకుల నిర్లక్ష్యాన్ని అర్థంచేసుకోడానికి ఈ క్రింది పట్టిక ఒక నిదర్శనం.

## వ్యవసాయ పరిశోధనల కేంద్రాలకు కేటాయింపులు

| సంస్థ | ప్రభుత్వ ఆర్థికసహాయం సం॥కి లక్షల రూపాయల్లో | | | |
|---|---|---|---|---|
| | 1989–90 | 1990–91 | 1991–92 | మొత్తం |
| 1 AAU, జోర్హట | 0.000 | 2.915 | 0.780 | 3.695 |
| 2. APAU, హైదరాబాద్ | 16.792 | 12.887 | 12.969 | 42.648 |
| 3. DAU, రాంచీ | 1.627 | 3.816 | 3.123 | 8.566 |
| 4. BCKVV, కళ్యాణి | 1.074 | 4.644 | 3.081 | 8.799 |
| 5. BHU, వారణాసి | 0.000 | 1.500 | 0.400 | 1.900 |
| 6. CAZRI, జోద్‌పూర్ | 0.470 | 1.870 | 0.840 | 3.180 |
| 7. CICR, నాగపూర్ | 11.160 | 8.820 | 1.900 | 21.880 |
| 8. CPRI, సిమ్లా | 0.470 | 10.320 | 3.540 | 14.330 |
| 9. CRRI, కటక్ | 3.300 | 5.920 | 0.840 | 10.060 |
| 10. CSUA & T కాన్పూర్ | 11.708 | 7.427 | 9.326 | 28.461 |
| 11. DOR, హైదరాబాద్ | 0.000 | 27.250 | 13.700 | 40.950 |
| 12. DPR, కాన్పూర్ | 0.000 | 10.620 | 11.540 | 22.160 |
| 13. DRR, హైదరాబాద్ | 0.470 | 16.220 | 12.290 | 28.980 |
| 14. IARI, న్యూఢిల్లీ | 5.160 | 21.280 | 11.680 | 38.120 |
| 15. DT4 OF వెజిటబుల్ రీసెర్చి వారణాసి | 0.000 | 9.600 | 10.200 | 19.800 |
| 16. GAU, జాయ్‌నగర్ | 5.075 | 10.621 | 8.371 | 24.067 |
| 17. GBPUA & T, పంత్‌నగర్ | 0.299 | 2.040 | 2.155 | 4.494 |
| 18. HAU, హిస్సార్ | 6.578 | 5.395 | 7.495 | 19.468 |
| 19. UHPKVV, పాలమూర్ | 5.617 | 4.264 | 2.734 | 12.615 |
| 20. NRCS, ఇండోర్ | 0.000 | 8.300 | 9.600 | 17.900 |
| 21. DWR, కర్నాల్ | 0.000 | 19.950 | 10.650 | 30.600 |
| 22. RAU, పూసా (బీహార్) | 5.397 | 1.630 | 10.021 | 17.048 |
| 23. IGFRI, ఝాన్సీ | 5.580 | 8.820 | 11.450 | 25.850 |
| 24. IIHR, బెంగుళూర్ | 2.240 | 1.070 | 4.890 | 8.200 |
| 25. IISR, లక్నో | 0.000 | 7.000 | 2.680 | 9.680 |
| 26. CRIJAF, బరక్‌పూర్ | 5.470 | 12.260 | 10.530 | 28.260 |
| 27. JNKUV, జబల్‌పూర్ | 9.696 | 15.078 | 10.923 | 35.967 |

| | | | | |
|---|---|---|---|---|
| 28. KAU, త్రిచూర్ | 0.907 | 2.318 | 0.935 | 4.160 |
| 29. KKU, డపోలి | 3.457 | 3.867 | 3.582 | 10.906 |
| 30. MAU, ప్రభాని | 2.371 | 7.383 | 13.861 | 23.615 |
| 31. MPKV, రహూరి | 16.239 | 17.557 | 22.138 | 55.934 |
| 32. NBPGR, న్యూఢిల్లీ | 0.000 | 23.900 | 10.100 | 34.000 |
| 33. NDUA & T, ఫైజాబాద్ | 2.334 | 7.179 | 9.272 | 18.785 |
| 34. NROG, జునాఘర్ | 8.970 | 8.570 | 1.540 | 19.080 |
| 35. NRCS, హైదరాబాద్ | 11.180 | 19.040 | 8.520 | 38.740 |
| 36. OUAT, భువనేశ్వర్ | 11.341 | 6.192 | 12.668 | 30.201 |
| 37. PAU, లూథియానా | 13.926 | 18.673 | 13.329 | 45.298 |
| 38. PKB, అపోలా | 8.637 | 15.219 | 11.475 | 35.331 |
| 39. RAU, బికనీర్ | 6.738 | 14.258 | 12.036 | 33.032 |
| 40. SKVAS & T, శ్రీనగర్ | 0.824 | 3.120 | 1.000 | 4.944 |
| 41. TNAU, కొయంబత్తూర్ | 4.596 | 4.656 | 3.049 | 12.301 |
| 42. UAS, బెంగుళూర్ | 5.342 | 20.443 | 21.980 | 47.765 |
| 43. UAS, ధర్బాద | 2.321 | 2.446 | 1.876 | 6.643 |
| 44. VPKAS, అల్మోరా | 3.690 | 7.940 | 0.800 | 12.430 |
| 45. Dr. YSPUHF, సోలన్ | 4.104 | 0.650 | 1.244 | 5.998 |
| Total | 204.530 | 424.928 | 337.113 | 966.571 |

**ఆధారం :** మార్చి 9, 93 నాటి ICAR నివేదిక

భారతీయస్థాయిలో వ్యవసాయ పరిశోధనకోసం ఏర్పరచిన ICAR దేశంలోని విభిన్న యూనివర్సిటీలకు, పరిశోధన సంస్థలకు, ఇచ్చే సహాయం ఎంత చిన్న మొత్తమో చూడవచ్చు. సంవత్సరానికి 45 సంస్థలకు కలిపి కూడ ఇచ్చేది 2 నుండి 3 లేదా 4 కోట్ల మధ్య వూగులాడుతోందంటే ఈ డబ్బుతో ఏ పరికరాలు కొంటారు? ఎంతమందికి జీతాలిస్తారు? ఎన్ని బిల్డింగులు కడతారు? అమెరికన్ గుత్త సంస్థ కార్గిల్ తన పరిశోధనలకోసం పెట్టే ఖర్చు సంవత్సరానికి 5 లక్షల కోట్ల రూపాయలు పై చిలుకు వుంది. దాంతో పోలిస్తే మన పరిశోధనలకోసం పెట్టే ఖర్చు ఏ మూలకు? ఇక అమెరికన్ గుత్తసంస్థతో పరిశోధనలో మన పోటీ ఎలా వుంటుందో వూహించండి.

పరిస్థితిని ఇంకొంత తేలిగ్గా అర్థంచేసుకోవడానికి మనరాష్ట్రంలోని పరిస్థితి చూద్దాం. 15/3/91 ఈనాడు పత్రికలో రైతేరాజు శీర్షికలో వచ్చిన వ్యాసంలోని ఈ వివరాలు చూడండి :

మన రాష్ట్రంలోని వ్యవసాయ విశ్వవిద్యాలయానికి కేటాయించే బడ్జెట్ సంవత్సరానికి కేవలం రూ. 29 కోట్లు. సాధారణ విశ్వవిద్యాలయం బడ్జెట్ కన్నా ఇది ఎక్కువకాదు.

ICAR కేటాయించిన 3 కోట్లు, ఇతర సంస్థలు కేటాయించిన 1 1/2 కోట్లు రూపాయిలు కూడా ఇందులోనే కలిసివున్నాయి.

1500 మంది శాస్త్రవేత్తలు, 2700 మంది సాంకేతిక సిబ్బంది జీతాలు; 500 మంది B.Sc. (Ag) వ్యవసాయ విద్యార్థులు, వెటర్నరీ (పశువైద్యం) విద్యార్థులు (BVSc), Phd చదివే విద్యార్థులకు బోధన ఇతర ఖర్చులన్నీ కూడా ఇందులోనుండే. హైదరాబాదు, బాపట్ల, తిరుపతిలో ఈ యూనివర్సిటీ కాలేజీలు వున్నాయి. ఈ ఖర్చులన్నీ పోతే పరిశోధనకు ఏమి మిగలదని వేరే చెప్పనవసరంలేదు.

రాష్ట్రంలో 60 వ్యవసాయ పరిశోధనా స్థానాలున్నాయి. అయితే ఇవి ఆ జిల్లాల్లో పండే పంటలపై వచ్చే తెగుళ్ళపై కాక జాతీయస్థాయి పరిశోధనా కార్యక్రమాల్లో నిమగ్నమై వుంటాయి. ఒక్క వరిలోనే సక్రమంగా పరిశోధన సాగిస్తే 10 నుండి 15 శాతం అధిక దిగుబడి సాధించి సంవత్సరానికి 210 కోట్ల మేరకు పంటను పెంచవచ్చు. మారుటేరులో ఇందుకోసం పరిశోధనలు సాగిస్తున్నా అందుకు సరిపోను నిధులులేవు.

ప్రత్తిపంటపై తెల్లదోమ నివారణకు, కృష్ణా, గోదావరి జిల్లాల్లో వందలకోట్ల రూపాయలు నష్టం కలిగించిన మామిడి పంటపై మంగు తెగులు నివారణకు నిధులు లేనందువల్లే సకాలంలో పరిశోధనలు జరిపి చర్యలు తీసుకోలేకపోయారు. కనీసం 50 లక్షల రూపాయలు రిజర్వ్ నిధులు వుంచితే జిల్లాల్లో పరిశోధనలు సాగించవచ్చు.

ఈ అంతులేని నిర్లక్ష్యంపై ఇక వ్యాఖ్యానం అనవసరం కదా! దేశం మొత్తం మీద 6000 కోట్ల రూపాయలు నుండి 7000 కోట్ల రూపాయల విలువచేసే పంట చీడ పీడలవల్ల నష్టం జరుగుతోందని అంచనా. పంట పెంచకపోతేపోయారు. కనీసం దాన్ని రక్షించుకున్నా ఎంతో ఉత్పత్తి మిగులుతుంది. అందుకోసం పాలకులకు శ్రద్ధా, జాతీయతాభావమూ వుంటేగదా!

ఇటీవలి కాలంలో ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి ఖర్చులు తగ్గించుకోమని ప్రభుత్వంపై చేసిన వత్తిడి ప్రభావం ఈ పరిశోధనలకుచేసే కేటాయింపుపై కూడా పడింది. అవసరాలు పెరిగే కొద్దీ బడ్జెట్ కేటాయింపులు పెరగాల్సిందిపోయి 90-91 సంవత్సరంలో కంటే 91-92 సంవత్సరంలో తగ్గడాన్ని మనం ఇంతకు ముందు చూసిన ICAR పట్టిక నుండి కూడా గమనించవచ్చు.

డంకెల్ ప్రతిపాదనల పర్యవసానం ఈ పరిశోధనల రంగంపై కూడ వుంటుంది. తర్వాతి అధ్యాయాల్లో వ్యవసాయశాస్త్ర సాంకేతికరంగాల్లో వస్తున్న మార్పులు చూస్తాం. పేటెంట్ హక్కుల చట్టాన్ని డంకెల్ కోరినట్లు గనుక అంగీకరిస్తే శాస్త్రపరిశోధన అంతా సామ్రాజ్యవాదుల చేతుల్లోనే కేంద్రీకృతమవుతుంది. అందువల్ల ఇకపై ఇపుడు సాగుతున్న పరిశోధనకు కూడ మన పాలకులు స్వస్తి చెబుతారని నిస్సందేహంగా చెప్పవచ్చు.

# సామ్రాజ్యవాదుల చొరబాటును, భూ స్వామ్య వర్గాల పట్టును బలోపేతం చేసిన హరిత విప్లవం

ఆధునిక వ్యవసాయ పద్ధతుల ద్వారా అంటే నూతన హైబ్రీడ్ విత్తనాల వాడకం, కృత్రిమ ఎరువుల వాడకం, మెరుగైన సేద్య పద్ధతులను అనుసరించడం ద్వారా ఆహార ఉత్పత్తిని పెంచి దేశ ప్రజల ఆకలిని రూపుమాపడం లక్ష్యమంటూ పాలకులు హరిత

విప్లవాన్ని (పైరు పచ్చ విప్లవం - Green Revolution) ప్రచారంలో పెట్టారు. 1967 నుండి దేశంలో అమలు పరచబడింది.

ఇంతకు ముందే మనదేశ వ్యవసాయ రంగంలోకి అమెరికన్ పెట్టుబడులు ఎలా ప్రవేశించాయో చెప్పుకున్నాం. ఆహార దిగుమతుల ద్వారా మనదేశంలో తన పెట్టుబడిని పెంచుకున్న అమెరికా మన విధానాలను కూడా రూపొందించడంలో కీలక పాత్ర నిర్వహించిందని కూడా ఇంతకు ముందే చెప్పుకున్నాం. ఈ హరిత విప్లవాన్ని రూపొందించడంలో కూడా అమెరికన్ సామ్రాజ్యవాదుల పాత్ర ప్రధానమైనదనడంలో ఎవరికీ సందేహం ఉండనక్కర లేదు.

ఈ హరిత విప్లవ కాలంలో ప్రపంచబ్యాంకు 1966 - 71 మధ్య మన వ్యవసాయం కోసం 1000 కోట్ల రూపాయిల అప్పుపెట్టుబడిగా పెట్టుకోమని ఇచ్చింది. ఇది అంతకు ముందరి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయానికి కేటాయించిన దానికంటే ఆరురెట్లు ఎక్కువ. ప్రపంచబ్యాంకు ఇచ్చిన ఈ అప్పుతో అమెరికన్ సామ్రాజ్యవాదం లాభాలు పిండుకుంది. ఎలాగంటే ప్రభుత్వానికి ఇచ్చిన ఈ అప్పులో అధిక భాగం రసాయనిక ఎరువులు, విత్తనాల దిగుమతికి; అవికొనుక్కోవడానికి రైతాంగానికి పెట్టుబడులను కోపరేటివ్ బ్యాంకులు, పంచాయితీ సంస్థల వంటి వాటి ద్వారా అప్పులు ఇవ్వటానికి వినియోగించారు. అమెరికన్ సరుకుల అమ్మకానికి అనుగుణంగా ప్రపంచబ్యాంకు ఆనాడు పై చెప్పిన వాటి కోసం ప్రభుత్వం ద్వారా సబ్సిడీలను కూడా ఇప్పించింది.

ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF) అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ (IDA), ఆసియా డెవలప్ మెంట్ బ్యాంకు (ADB) వంటి సంస్థలు ప్రభుత్వానికి పెద్ద ఎత్తున అప్పులు ఇచ్చాయి. ఈ అప్పులన్నీ ప్రధానంగా నీటిపారుదల, విద్యుత్ తదితర పునాది సౌకర్యాల కోసం భారత ప్రభుత్వంచే బడ్జెట్ల ద్వారా కేటాయించేటట్లు చేసారు.

నీటి పారుదల వసతులు పెరగడంతో వ్యవసాయ యోగ్యమైన భూములన్నింటిలో హైబ్రీడ్ వరి, గోధుమల పెంపకానికి విత్తనాలను అమెరికానే సరఫరా చేసింది. వీటిని వీలైనంత ఎక్కువ రసాయనిక ఎరువులు గ్రహించగలిగే లక్షణం గలవిగానూ, చీడపీడలకు తట్టుకోలేని విధంగానూ తయారు చేయడం వల్ల అమెరికన్ బహుళజాతి కంపెనీల ఎరువు, పురుగు మందులకు బ్రహ్మాండమైన మార్కెట్ సృష్టించబడింది.

ఇదే కాలంలో కేంద్రప్రభుత్వం విదేశాలతో సంబంధాలు పెట్టుకోవడమే కాకుండా రాష్ట్ర ప్రభుత్వాలని కూడా నేరుగా అంతర్జాతీయ సంస్థల వద్దకు, అమెరికా వద్దకు వెళ్ళేటట్లుగా ప్రోత్సహించింది. ప్రపంచ బ్యాంకు ముందు మన రాష్ట్ర ప్రభుత్వాలు తమ అభివృద్ధి పథకాలకోసం అంటూ క్యూలో నిలబడి పత్రాలు సమర్పించు కున్నాయి. ఈ పథకాలను ఆమోదిస్తూ ప్రపంచబ్యాంకు మంజూరు చేసిన ఋణం నుంచి గుజరాత్ 2000 ట్రాక్టర్లు, పంజాబ్ 8000 ట్రాక్టర్లు ఉత్తరప్రదేశ్‌లో వ్యవసాయ అభివృద్ధికి అవసరమైన యంత్రాలు, కర్మాగారాలు, మైసూరు 10000 ట్రాక్టర్లు ఇలా అన్ని రాష్ట్రాలు యంత్రాలు కొనుగోలు చేసే పథకాలన్నీ ఇందులో ఇమిడి ఉన్నాయి. ఈ యంత్ర పరికరాలన్నీ అమెరికా నుండి కొనుగోలు చేశారని వేరుగా చెప్పనక్కరలేదు.

1966 - 71 కాలపు తొలిదశలోనే మన వ్యవసాయానికి అవసరమైన సరుకులు రూ. 1114 కోట్ల మేర దిగుమతి అయ్యాయని ఒక అంచనా. ఈ కాలంలోనే PL 480 పథకం ద్వారా మన రిజర్వ్ బ్యాంక్‌లో అమెరికా నిల్వ చేసిన 2,000 కోట్ల రూ॥ పై చిలుకు

మొత్తాన్ని ఒకసారిగా ప్రైవేటు పెట్టుబడులుగా మళ్ళించి దేశంలోని పరిశ్రమలపై కూడా ఆధిపత్యంసాధించగలిగింది.

## స్తంభించిపోయిన ఆహార దిగుబడులు

అతి ఆర్భాటంగా మొదలైన ఈ హరిత విప్లవపు అధిక ధిగుబడులు అతికొద్ది కాలంలోనే ఆగిపోయాయి. 1970వ దశకం తొలి సం।రాల్లోనే ఆహార ధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల స్తంభించిపోయింది. ఈ పథకపు తొలిదశలో ఉత్పత్తిలో కొంత పెరుగుదల కన్పించింది. అయితే మన దేశంలో వున్న అర్థఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాలు, చిన్నకమతాలు వ్యవసాయ రంగంలో యాంత్రీకరణ పెరగడానికి అడ్డుగా నిలిచాయి. పెద్ద పెద్ద క్షేత్రాలను ఏర్పరచి వ్యవసాయాన్ని సాగించే పరిస్థితులలో మాత్రమే అనుసరించడానికి వీలైన ఆధునిక వ్యవసాయ పద్ధతుల వల్ల మనలాంటి దేశాల ప్రజలకు ప్రయోజనం ఏమీ వుండదని ఈ హరిత విప్లవపు అనుభవం రుజువు చేసింది. ఒక వైపున సామ్రాజ్య వాదులకు సేవ చేస్తూనే మరోవైపు దేశంలో ఉనికిలో వున్న అర్థఫ్యూడల్ వ్యవస్థను బలీయం చేసుకోగలిగాయి. ఇందుకోసం ఒక ద్విముఖ వ్యూహాన్ని అమలు పరిచాయి.

ఈ హరిత విప్లవాన్ని అమలు చేయడంలో పాలకవర్గాలు ఒక వైపున వ్యవసాయ కూలీలకు, పేద రైతులకు భూముల పంపకం చేస్తానని భ్రమలు పెడుతూనే - మరొకవైపు పంచాయతీరాజ్ లాంటి రాజకీయ సంస్థల ద్వారా భూస్వాములకు ట్రాక్టర్లు, హైబ్రీడ్ విత్తనాలు, పురుగు మందులు, విద్యుత్ మోటార్లు తదితర వ్యవసాయానికి అవసరమైన సాధన సామాగ్రిని సంపాదించుకోడానికి కావాల్సిన ఆర్థిక సహాయం చేయడం ద్వారా, గ్రామీణ ప్రాంతాల్లో భూస్వాముల పట్టును మరింత బలీయ మొనర్చే లక్ష్యాన్ని కూడా సాధించుకున్నాయి.

హరిత విప్లవం గ్రామీణ ప్రాంతాల్లో బీద, ధనికుల మధ్య అంతరాలు పెరగడానికి తోడ్పడింది. పైన చెప్పినట్లు ఆధునిక వ్యవసాయ పద్ధతి భూస్వామ్య వర్గాలకు వరంగా తోడ్పడగా పేద రైతాంగాన్ని దివాళా తీయించింది. పెరిగిన వ్యవసాయ పెట్టుబడులను చిన్న రైతాంగం తట్టుకోలేక పోయింది. సాంప్రదాయక విత్తనాలతో సేద్యం చేయడానికి పూనుకున్నా - పక్క చేలలో హైబ్రీడ్ మొక్కలపై వచ్చిన తెగుళ్ళు వీటికి కూడ సోకడంతో రైతాంగం నష్టపోయింది. అప్పో సప్పో చేసి ఆధునిక పద్ధతికి అలవాటు పడాలని ప్రయత్నించినా , పెరిగిన వ్యవసాయ పెట్టుబడులు, నిలకడలేని వ్యవసాయ పంటల మార్కెట్ చిన్న రైతాంగాన్ని తమ పొలాలు కోల్పోయేలా చేసింది.

ఇవేళ్ళ హరిత విప్లవ అమలు తర్వాత కూడ పంజాబ్‌లో నూటికి 50 మందికి పైగా దారిద్ర్య రేఖ దిగువన నివశిస్తున్నారు. పంజాబ్ గ్రామాల్లో దారిద్ర్యం తాండవిస్తూనే వుంది. ఇప్పటికీ పంజాబ్ గ్రామాల్లో పేడను వంట చెరకుగా (పిడకలుగా ఎండ బెట్టి వాడడం) వాడడం చూస్తాం. హరిత విప్లవం సామ్రాజ్య వాదులకు మార్కెట్‌ను సృష్టించే పని మాత్రం చేసింది. పల్లెల్లో తయారైన ఆహార సంపదను పట్నాలకు మళ్ళించింది. పంజాబ్‌లో టెర్రరిజం ఆవిర్భావం వెనుక హరిత విప్లవ వైఫల్యాలు కూడ ఆర్థిక కారణాలుగా వున్నాయని సామాజిక శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. ఆంధ్రాలో ఆకలి చావులు, రైతుల ఆత్మహత్యలు దాని ఫలాలే, హరిత విప్లవం ప్రజల ఆకలి మధ్యనే వ్యాపార మార్కెట్‌ను మాత్రం అభివృద్ధి చేసింది.

ఇక్కడే మరొక విషయం కూడా చెప్పుకోవాలి. హైబ్రిడ్ వంగడాలు అంటే కేవలం వరి,గోధుమ వంటి పంటలపైనే హరిత విప్లవం కేంద్రీకరించింది. దీనితో ఇతర ఆహార పంటల ఉత్పత్తి తీవ్రంగా పడిపోయింది. ఉదా: మనుషుల ఆహారంలో ప్రదానమైన ప్రొటీనులను అందించే పప్పుధాన్యాల దిగుబడి రేటు హరితవిప్లవ పూర్వకాలంలో 1.39% ఉంటే ఈ కాలంలో అది 0.78% కు తగ్గింది. ఆ కొరత ఈ నాటికి పూడడం లేదు. 1961 లో తలసరిన, రోజుకు 69 గ్రా. కందిపప్పు లభ్యం కాగా 1990కి 36.5 గ్రా. కి పడిపోయింది.

## తీవ్రమైన పర్యావరణ సమస్యలు

ఎరువుల, పురుగుమందుల వాడకాన్ని పెంచింది. సాంప్రదాయకంగా మన దేశంలో రైతాంగం చేలలో పంట సారాన్ని కాపాడుకోటానికి పంటల మార్పిడి పద్ధతి, మిశ్రమ పంటల పద్ధతిని అనుసరించింది. విభిన్న పంటల పెట్టును వాడడం , పచ్చి రొట్ట, ఎరువును (పంట కోసంకున్నాక మిగిలే చొప్పను చేలోనే కుళ్ళ బెట్టటం) వాడడం వంటి పద్ధతులను కూడా అనుసరించే వాళ్ళు. తెగుళ్ళు వస్తే కూడా వేపనూనె వంటివి చల్లడం, పొగాకు రసాన్ని చల్లడం వంటి పద్ధతులను అనుసరించే వాళ్ళు. ప్రభుత్వం దిగుబడులను పెంచే వ్యూహాన్ని రచించుకునేటప్పుడు మనదేశంలో అప్పటికే అమలులో వున్న మెరుగైన పద్ధతులను పరిగణనలోకి తీసుకుని వాటికి ఆధునిక పద్ధతులను జోడించి వుండ వల్సింది. అలా అయితే రైతాంగం ఒక్కసారిగా అంత పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టాల్సిన అవసరం కూడా వచ్చేది కాదు.

అయితే సామ్రాజ్యవాదుల వ్యూహం ప్రకారం తయారయిన హరిత విప్లవం విచకణారహితంగా ఎరువుల, పురుగుమందుల వాడకాన్ని ప్రోత్సహించింది. దీంతో నేలసారం విపరీతంగా దెబ్బతినడం, మొక్కలకు ప్రకృతిలో సహజ సిద్ధంగా మేలు చేసే జీవజాలం నశించడం (నేలను కుళ్ళగించే ఎర్రలు, పురుగులను తినే కీటకాలు, కప్పలు, ఎలుకలను తినే పాములు) జరిగాయి. అంతేగాక పెరిగిన పురుగు మందుల వల్ల మొక్కల్లో రోగ నిరోధక శక్తి తగ్గి తెగుళ్ళు పెరిగాయి.

17-1-93వ తేదీన 'ది హిందుస్థాన్ టైమ్స్' పత్రిక గోవాలో జరిగిన ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ సదస్సు వార్తను ప్రచురించింది. దాని వ్యవసాయ విభాగపు అధ్యక్షుడు, భారత వ్యవసాయ పరిశోధనా కౌన్సిల్ (ICAR) లో ప్రొఫెసర్ అయిన డా. గంగోపాధ్యాయ ప్రత్యామ్నాయ వ్యవసాయ వ్యూహన్ని గురించి చెప్పాడు. హరిత విప్లవకాలంలో పెరిగిందనుకున్న ఉత్పత్తి ప్రస్తుతం తగ్గిపోతున్నదని, దాని క్రమంగా బియ్యం దిగుమతి చేసుకోవాల్సిన స్థితిలో పడుతున్నామని అన్నారు. హైబ్రిడ్ విత్తనాలు వాడిన ఇండోనేషియా అనుభవమే పంజాబు, హర్యానా రైతులు చవి చూశారని, తెగుళ్ళు కంట్రోలు కావడం లేదని, మన పాత వ్యవసాయ పద్ధతుల ద్వారా కూడా (పశువుల పేడను స్ప్రే చేయడం వంటివి) కంట్రోలు చేయవచ్చని రుజువయిందని మనదేశంలో చౌకగా అందుబాటయ్యే పద్ధతులను అనుసరించ లేక పోతున్నామని ఆవేదన వెలిబుచ్చారు.

పెరిగిన రసాయనాల వల్ల వాతావరణ కాలుష్యం, నీటి కాలుష్యం పెరిగాయి. ఆహార పంటలపై వేసిన మందుల ప్రభావం అవి తినే మనుషులపై కూడా పడి దీర్ఘకాలంలో అనేక జబ్బులకు గురిచేస్తున్నట్లు రుజువయ్యింది.

## అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆర్థిక, రాజకీయ లక్ష్యంలో భాగమే

ఇంతకు ముందే చెప్పినట్లు ఈ హరిత విప్లవం అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆర్థిక సంక్షోభాన్ని బీద దేశాలపై రుద్దడానికి ఉద్దేశించబడింది. ఈ పథకపు లక్ష్యాలను కా॥ తరిమెల నాగిరెడ్డి తన 'తాకట్టులో భారతదేశం' లో వివరంగా పేర్కొన్నారు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే -

"ఈ వ్యూహం సామ్రాజ్యవాదుల పారిశ్రామిక సరుకులు అమ్ముకోడానికి బ్రహ్మాండమైన మార్కెట్ సమకూర్చి పెడుతోంది. పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాల్లో నానాటికీ పెరుగుతున్న నిరుద్యోగం, ఉత్పత్తి మాంద్యాన్ని తట్టుకోడానికి; ఆ విధంగా తమ ఆర్థిక సంక్షోభ భారాన్ని భారతదేశం నెత్తి కెత్తడానికి ఇది ముఖ్యమైన అంశం."

ఈ హరిత విప్లవం వెనుక రాజకీయ లక్ష్యాలు కూడా వున్నాయి. ఆ కాలం నాటి ప్రపంచ రాజకీయ పరిస్థితిని గమనిస్తే కమ్యూనిస్టు భావజాలం, విప్లవోధృతి పెరుగుతున్న కాలం. విజయవంతమైన చైనా విప్లవం ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లో విప్లవ శక్తులకు ఉత్తేజాన్ని ఇచ్చింది. స్టాలిన్ మరణం తర్వాత రష్యాలో రివిజనిజం రావడంతో 1960 లలో ప్రపంచ ఆధిపత్యం కోసం సోషలిస్టు ముసుగులో సోవియట్ కూడా రంగం మీదకి వచ్చింది. ప్రపంచాధిపత్యం కోసం అమెరికా, రష్యాల మధ్య పోటీ పెరిగిన కాలం అది.

కంపూచియా, వియత్నాం, లావోస్ (ఇండోచైనా) వంటి దేశాల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విముక్తి పోరాటాలు సాగుతున్న కాలం. రష్యాలో రివిజనిజానికి వ్యతిరేకంగా విప్లవ శక్తులన్నీ కా॥ మావో నాయకత్వాన పురోగమించిన కాలం అది. భారతదేశంలో కూడా కమ్యూనిస్టు ఉద్యమంలోని విప్లవ శక్తులు రివిజనిజంతో తెగతెంపులు చేసుకున్న కాలం. భారత్ లాంటి విశాల దేశంలో కమ్యూనిజం వ్యాప్తి చెందితే అది ఎంత ప్రమాదమో సామ్రాజ్య వాదులకు తెలుసు. ఈ చారిత్రక కారణాల రీత్యానే ఆకలితో వున్న ప్రజలను కొంత ఉపశమింపచేయడం ద్వారా విప్లవాన్ని మరికొంత కాలం వాయిదా వేయడానికి ఈ పథకాన్ని సామ్రాజ్యవాదం ఎంచుకొంది.

# పరాధీన విత్తనాలు

రైతాంగం సాంప్రదాయకంగా తమ జీవిత అనుభవం నుంచే మేలైన విత్తనాలను ఎంపికచేస్తూ అభివృద్ధి పరచారు. ఇలా మెరుగుపరిచిన విత్తనాలు ఒక రైతు నుండి మరొక రైతుకు మారకం జరిగేవి. అది వ్యాపారంగా కాక పరస్పర ప్రయోజనం కోసం అవగాహనతో జరిగేది. వృక్షశాస్త్రం అభివృద్ధి చెందే కొలదీ ఒక మొక్కను మరొక మొక్కతో సంకర పరచడంవల్ల రెండింటికీ సంబంధించిన మెరుగయిన లక్షణాలుగల మరో కొత్త తరహా మొక్క తయారుచేసే ప్రక్రియను కనుగొన్నారు. దీనినే 'సంకర పరచడం' లేదా 'హైబ్రిడైజేషన్' అంటారు.

సమాజపు అవసరాలు పెరిగే కొద్దీ వ్యక్తిగత అవసరం కోసం ఉత్పత్తి చేసే స్థాయి కన్నా అదనపు ఉత్పత్తిని సాధించి సమాజపు అవసరాలు తీర్చడం సహజంగానే సామాజిక బాధ్యతగా తయారవుతుంది. ప్రజాప్రయోజనాల దృష్ట్యా సాగే ఏ పాలనలోనయినా, ఏ సంక్షేమ ప్రభుత్వం అయినా సహజంగా శాస్త్ర విజ్ఞాన ప్రగతిని ఇలాంటి అంశాలకు జోడించి సమాజ అవసరాలు తీర్చేటందుకు పూనుకొంటుంది.

బ్రిటీషు వలస వాద ప్రభుత్వం మనదేశ వ్యవసాయరంగంలో ఎలాంటి పాత్ర నిర్వహించిందో ఇంతకు ముందే చూశాం. అప్పటికే కొంత మేరకు విత్తన పరిశ్రమ అభివృద్ధి చెందింది. అప్పటి వరకు మన దేశానికి తమకు అవసరమైన పొగాకు, కాఫీ, తేయాకు విత్తనాలు దిగుమతి చేస్తూ వచ్చిన వలస వాదులు రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రవాణా ఇబ్బంది ఏర్పడినపుడు మాత్రమే మన దేశంలో విత్తన పరిశ్రమ ఏర్పాటు చేశారు.

స్వదేశీ మార్కు పాలకులు అధికారంలోకి వచ్చాక స్వావలంబన వైపు మన వ్యవసాయ రంగాన్ని, పారిశ్రామిక రంగాన్ని నడిపిస్తామని గొప్పలు చెప్పుకొన్నా ఆచరణలో వ్యవసాయరంగానికి అత్యంత కీలకమైన విత్తనరంగాన్ని కూడా క్రమంగా సామ్రాజ్య వాద ప్రయోజనాలకు దాసోహం చేస్తూ వచ్చారు. నేడు అంతిమంగా పూర్తిగా ఈ రంగాన్ని వారి గుప్పెట్లో పెట్ట చూస్తున్నారు.

వ్యవసాయోత్పత్తిని అధికం చేయడమన్నది మన పంచవర్ష ప్రణాళికల లక్ష్యంగా ప్రకటించారు. అధికోత్పత్తిని సాధించడం కోసం అవసరమైన నాణ్యమయిన విత్తనాలను రూపొందించే లక్ష్యంతో జాతీయ విత్తనాభివృద్ధి సంస్థ (నేషనల్ సీడ్స్ కార్పొరేషన్ — NSC) ని 1963 మార్చి '3'వ తేదీన ఏర్పాటు చేశారు. ఇంతకుముందే మనం హరిత విప్లవం గురించి చెప్పుకొన్నాం. సామ్రాజ్య వాదం ఒక పథకం ప్రకారం వ్యవసాయరంగంలో తన పారిశ్రామిక ఉత్పత్తులను (ట్రాక్టర్లు, ఎరువులు, పురుగు మందులు) అమ్ముకొనేందుకు అనుగుణంగా రూపొందించిన పథకంలో భాగంగానే ఈ జాతీయ విత్తనాభివృద్ధి సంస్థను కూడా మలుచుకొన్నారు. 1967లో ప్రపంచ బ్యాంకు NSC కి అప్పు ఇవ్వడం ద్వారా తన కంట్రోలులోకి తెచ్చుకొని ఈ క్రింది లక్ష్యాలను ప్రకటింపజేసింది. (A) విత్తనాలను తయారు చేయడం - ప్రభుత్వ రంగ సంస్థలైన NSC, SFCI (స్టేట్‌ఫామ్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా) రాష్ట్రాల విత్తన కార్పొరేషన్లు, ప్రయివేటు కంపెనీలు తయారు చేసే విత్తనాలను సర్టిఫై చేయటం. (B) విత్తనాల ఉత్పత్తి, ప్రాసెస్ చేసి పంపిణీ చేయడాల మధ్య సమన్వయం చేసే ప్రాథమిక అంగంగా రూపొందించటం, ఇందుకవసరమైన పథకాలను రూపొందించి సలహాలివ్వడం (C) విత్తనాల పరీక్షకూ, విత్తనాల పరిశోధనకు అవసరమైన నూతన సౌకర్యాలను ఏర్పరచి, ఉన్న వాటిని పటిష్ట పరచడం.

NSC ని పై విధంగా రూపొందించటమే గాక ప్రపంచ బ్యాంకు '13' మిలియను డాలర్లు అప్పిచ్చి తెరాయ్ విత్తనాభివృద్ధి సంస్థ (తెరాయ్ సీడ్స్ కార్పొరేషన్ T.S.C) ను ఏర్పాటు చేయించింది. 1967లో ప్రారంభమయిన "హరిత విప్లవ" అవసరాలను తీర్చేందుకు జాతీయ విత్తన పథకం (నేషనల్ సీడ్స్ ప్రోగ్రాం) అన్న దానిని రూపొందించి, రెండు దశలుగా ప్రపంచ బ్యాంకు ఋణాలిచ్చింది. మొదటదశలో ఒక మిలియనుడాలర్లిచ్చి హర్యానా, పంజాబ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లలో పథకం ప్రవేశ పెట్టారు. రెండవదశలో బీహార్, కర్నాటక,ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్‌లకు విస్తరింపజేశారు. " ఈ దశలోనే ఈ ప్రాజెక్టుకోసం ప్రపంచ బ్యాంకు ఇచ్చిన అప్పుతో ప్రయివేటు రంగంలో విత్తన పరిశోధనకు అవసరమైన సహాయాన్ని, పెట్టుబడులను సమకూర్చారు. ఈ విత్తన కంపెనీలకు అవసరమైన పెట్టుబడిలో 70% ను బ్యాంకులు సమకూర్చాయి జాతీయ వ్యవసాయాభివృద్ధి బ్యాంకు (నాబార్డ్) ఇలా ఋణాలిచ్చిన బ్యాంకులకు 90% రీఫైనాన్స్ సౌకర్యాన్ని కూడా కల్పించింది. (ఆ బ్యాంకులకు ఆ ఋణాలు వసూలు కాకపోతే "నాబార్డ్" ఆ బ్యాంకులకు రాని మొత్తాన్ని చెల్లిస్తుందన్నమాట) అమెరికా నుండి ఈ విత్తన పరిశోధనకు అవసరమైన పరిశోధనా సామాగ్రిని కొనుగోలు చేసుకొనేందుకు

అవసరమైన రుణాలను, విదేశీ మారకాన్ని సమకూర్చి పెట్టారు. (సీడ్ ఇండస్ట్రీ ఇన్ ఇండియా పుస్తకం నుండి రచయితలు గురుదేవసింగ్ తదితరులు)

ఈ రుణాలలో ప్రయివేటు కంపెనీల సంఖ్య "500"కు పెరిగింది. అందులో 35 పెద్ద కంపెనీలు - వాటిలో కొన్ని హైబ్రిడ్ విత్తనాలు తయారీలో ఉండగా, మరికొన్ని (పెరల్ మిల్లెట్, జొన్న, ప్రత్తి, మొక్కజొన్న పొద్దుతిరుగుడు ప్రధానంగా) ఎగుమతి చేసే దశకు కూడా పెరిగాయి. ఈ జాతీయ విత్తన పథకంలో భాగంగానే '133' ప్రయివేటు కంపెనీలు కాయధాన్యాలు, పప్పులు, నూనెగింజలు విత్తనాలు దిగుమతి చేసుకోవడానికి అనుమతి కోరాయి. ఒక క్రమంలో విత్తన రంగంలో ప్రయివేటు కంపెనీల భాగస్వామ్యం పెరుగుతూ వచ్చింది. F-1 రకం ప్రత్తి విత్తనాలు మొదటిసారిగా రూపొందించి పెద్ద ఎత్తున పంపిణీ చేయడంలో, భారతమార్కెట్‌లోకి, కూరగాయల హైబ్రిడ్ విత్తనాలను విడుదల చేయడంలోనూ, ప్రత్యేకించి ప్రొద్దు తిరుగుడు హైబ్రిడ్ విత్తనాలను రైతుకు అందజేయడంలోనూ ఈ ప్రయివేటు కంపెనీలే ముందున్నాయి.

జాతీయ విత్తన సంస్థ (NSC) రజతోత్సవాల సందర్భంగా విడుదల చేసిన పత్రికలో ఈ విత్తన పథకం (NSP) రూపకల్పనలో అమెరికన్ సామ్రాజ్య వాదుల పాత్ర గురించి చెప్పుకొంది. అమెరికాకు చెందిన రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్, ప్రపంచ ఆహార, వ్యవసాయ సంస్థ (FAO) లకు విత్తనాల నిపుణుడైన జాన్సన్ E. డగ్లాస్ నిర్వహించిన పాత్ర గురించి ఇలా చెప్పింది. "ఆయనచే రూపొందించబడి, ఆ తరువాత పార్లమెంటుచే ఆమోదించబడ్డ విత్తనాలకు చెందిన నియమ నిబంధనల రూపకల్పనలో ఆయన పాత్ర ప్రముఖమైనది." ఈ మాటల అర్థం వేరే చెప్పనక్కర లేదు. 1957లోనే భారత వ్యవసాయ పరిశోధనా కౌన్సిల్ (ICAR) అమెరికాకు చెందిన రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌తో చేసుకొన్న ఒప్పందం ప్రకారం మొక్కజొన్న విత్తనాల ప్రాజెక్టు చేపట్టడంతో ప్రారంభమైన "సామ్రాజ్య వాదుల సహకారం" మూడు కాయలూ ఆరు విత్తనాలుగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఇంతకు ముందు అధ్యాయంలో చెప్పుకొన్నట్లు డా॥ రిచారియా నిరాకరించినప్పటికీ అమెరికన్ సామ్రాజ్యవాదుల పరిశోధనా సంస్థ (IRRI) రూపొందించిన తైచుంగ్ నేటివ్ - 1 అనే రకం హైబ్రిడ్ వరి విత్తనాలకు ఎగుమతి చేసుకొని భారీఎత్తున పునరుత్పత్తి చేశారు. ఇలా సాగుతూ వచ్చిన పెత్తనం చివరకు 1976కు వచ్చే సరికి పార్లమెంటులో చట్టం చేయించే వరకు వెళ్ళింది. పైన చెప్పిన "డగ్లాస్" భారత విత్తన పరిశ్రమ ఆరంభపు రోజుల గురించి ఇలా రాశారు "హైబ్రిడ్ విత్తనాల పరిశ్రమ ఆరంభంకావడానికి పునాదిగా విత్తనాలపై కేంద్రీకరించాలన్న నిర్ణయం తప్పని సరి. తొలిరోజుల్లో విత్తనాల తయారీదారులకు, జాతీయ విత్తన సంస్థ అందించిన సాంకేతిక సహాయం వారు విజయవంతం కావడానికి కీలకాంశంగా పనిచేసింది. దీనితోబాటే ఇంకో ముఖ్యమయిన విషయం ఏమంటే ప్రయివేటు ఉత్పత్తి దారులకు దిగుమతి అయిన శాస్త్ర సాంకేతిక పరికరాలను అద్దెకు లేదా కొనుగోలు పద్ధతిలో అందజేయడం. ఇందుకోసం భారత వ్యవసాయ మంత్రిత్వ శాఖ, అమెరికాల మధ్య ఇలా సాంకేతిక పరికరాలను, జాతీయ విత్తనాభివృద్ధి సంస్థ ద్వారా అందజేసేందుకు కుదిరిన ఒప్పందం విత్తనాభివృద్ధి కోసం ప్రయివేటు పబ్లిక్ రంగాల మధ్య సహకారానికి ఒక చక్కని నిదర్శనంగా నిలుస్తుంది".

ఆయన ఇంకా ఇలా అన్నారు. "పబ్లిక్, ప్రయివేటు రంగాలలోని సంస్థలకు అవసరమైన శిక్షణా పథకాలను అందించడం ద్వారా జాతీయ విత్తనాభివృద్ధి సంస్థ

అందించిన నాయకత్వ పాత్ర కూడా ఒక దేశంలో విత్తనాలను ఎలా అభివృద్ధి చేయాలి, అనే దానికి ఆదర్శంగా నిలుస్తుంది. IARI రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్, USAID ల మధ్య కుదిరిన సహకారం కీలకమయింది అయితే జాతీయోభివృద్ధి సంస్థ ఎక్కువ మంది ఉద్యోగులనూ, సౌకర్యాలనూ కల్పించి దీనిని కొనసాగించింది". ఈ మాటల అర్థం స్పష్టమే. దేశంలో ప్రయివేటు విత్తన రంగం పెరగడానికి అవసరమైన శాస్త్ర సాంకేతిక పరికరాలను తాను అమ్ముకోడానికి అమెరికన్ సామ్రాజ్య వాదులు ఈ పథకం (NSP) ఎలా రూపొందించారో వేరుగా చెప్పనవసరం లేదు.

NSC బోర్డులో ఏకంగా సామ్రాజ్య వాదుల గుత్త కంపెనీల ప్రతినిధులు సభ్యులుగా తీసుకోబడ్డారు. NSC కి మొట్ట మొదటి సెక్రటరీ మరియు ప్రధాన పరిపాలనాధికారిగా పని చేసిన J. వీరరాఘవన్ ఆ కాలంలో హిందుస్తాన్ లీవర్ కంపెనీ 'అధ్యక్షుడుగాఉన్న డా॥ ప్రకాష్‌టాండన్ తనతోపాటు బోర్డులో వుండడం వలన ఆయన నుండి విత్తనాల మార్కెటింగ్‌కి సంబంధించిన ఎన్నో విషయాలు నేర్చుకో గలిగానని వ్రాసాడు.

ఈ విధంగా మనదేశపు విత్తన పరిశ్రమ ఆరంభకాలం నుండీ అమెరికన్ సామ్రాజ్యవాద ప్రయోజనాల కనుగుణంగానే రూపుదిద్దుకుంటూ వచ్చింది. ఎరువులు, పురుగుమందులు అమ్మకంలో భారీమార్కెట్‌లు సృష్టించుకున్న బహుళజాతి సంస్థలు విత్తన పరిశ్రమ విస్తృతికున్న అవకాశాల్ని చూసి కార్యరంగంలోకి దిగాయి. మనదేశంలోని ప్రయివేటు రంగ పరిశ్రమలతో మిలాఖత్ ఒప్పందాలు చేసుకొన్నాయి. ఆరకంగా 1988 నాటికి ప్రపంచ బ్యాంకు మూడవ దఫా (NSP III) 150 మిలియన్ డాలర్ల ఋణాన్ని మనదేశ విత్తన పరిశ్రమకివ్వడం ద్వారా మళ్ళీమరో కొత్త చట్టాన్ని చేయించుకొంది అమెరికా. రాజీవ్‌గాంధీ కాలంలో రూపొందించిన నూతన విత్తన పాలసీ (New Seed Policy) ఇదే.

మొదటి రెండు పథకాలకు ఈ మూడో దానికి తేడా ప్రధానంగా మొదటి రెండు అమెరికన్ సాంకేతిక పరికరాల్ని అమ్ముకోడానికి ఉద్దేశించబడితే - ఈ మూడో పథకం, దీనితో బాటు వచ్చిన నూతన విత్తన పాలసీ అమెరికా వారి మల్టీనేషనల్ కంపెనీల విత్తన వ్యాపారం కోసం వుద్దేశించబడ్డాయి. ఈ పాలసీ ప్రధానంగా MNC లకు విత్తనాలకు దిగుమతి చేసుకోడానికి అనుమతినిస్తుంది. ఏ దేశమైనా తనదేశం లోకి నూతన విత్తనాలు రావడం ద్వారా రాదగిన చెడును నివారించడానికి కొన్ని విధానాలు రూపొందించుకొంటుంది.

## విత్తనాల దిగుమతి వల్ల విస్తరించిన కలుపు, తెగుళ్ళు

ప్రభుత్వం చేసిన నూతన పాలసీలోనే గతంలో విదేశాల నుండి దిగుమతి చేసుకొన్న విత్తనాల వలన వచ్చిన దుష్ఫలితాల గురించి చెప్పారు. పొద్దు తిరుగుడుపై అంతకుముందు వరకూ లేని డినీ - మిల్ - డీవ్ అనే తెగులూ, ఆవాలపై వచ్చిన "వైట్‌రెస్ట్", టమోటో పై వచ్చిన "స్పోట్టెవిల్ట్" అనే వైరస్, బంగాళాదుంపలపై "గోల్డెన్ నిమటోడ్" అనే తెగుళ్ళు, దిగుమతి అయిన విత్తనాల వల్లే వచ్చాయని పేర్కొన్నారు మనదేశంలోకి అమెరికన్ గోధుమతో వచ్చిన పార్థీనియం (Parthenium) అనే కలుపు మొక్క (గుంటూరు, కృష్ణాజిల్లాల్లో మాచర్లకంప, కాంగ్రెస్ గడ్డి అనే పేర్లతో పిలుస్తారు) మన రైతాంగానికి తలనొప్పిగా తయారైంది. కోట్లాది రూపాయల నష్టం కల్గిస్తోంది. ఈ మొక్కలోని పువ్వులోని పుప్పొడి పీలిస్తే ఆస్మా (ఉబ్బసం) వచ్చే ప్రమాదముంది. బెంగుళూరులో ఒక

వ్యవసాయ శాస్త్రవేత్త ఈ మొక్కతో వచ్చిన ఆరోగ్య సమస్య వల్ల ఆత్మహత్య చేసుకున్నాడు. అలానే వాటర్ హైసింత్ అనబడే కలుపు మొక్క కూడ విదేశీ విత్తనాల నుండి వచ్చిందే. దిగుమతి చేసుకునేటప్పుడు ఆ విత్తనాల వల్ల వచ్చే ప్రమాదాలను పరిశీలన జరిపి వాటి వల్ల నష్టం లేదని నిర్ధారణ అయ్యాక అనుమతించాలని చెప్పారు. ఇందుకోసం తీసికొనే చర్యలలో "క్వారంటైన్" అన్నది ప్రధానమైన విధానం.

## క్వారంటైన్ (Quarantine) అంటే ఏమిటి?

పైన పేర్కొన్నట్లు దిగుమతి చేసుకొనే విత్తనాలు లేదా మొలకల ద్వారా నూతన తెగుళ్ళు లేదా కలుపుమొక్కలు దేశంలో ప్రవేశించవచ్చు. ఇవి రైతాంగానికి తీవ్రమయిన నష్టాలను కలిగించిన అనుభవాలున్నాయి. అందువల్ల ఈ విత్తనాలను సంపూర్ణంగా పరీక్షిస్తారు. విత్తనాలను లేబరేటరీలో పరీక్ష చేయడమే గాక నేల మీద కూడా పెంచి చూస్తారు. దిగుమతి కాక ముందు పరిశోధనేకాక, దిగుమతి చేసుకున్న తర్వాత కూడా రైతుల పొలాల్లో పరిశీలించే పద్ధతి వుంది. దేశంలోని విభిన్న శీతోష్ణస్థితులలో 15-20 చోట్ల కూడా వీటిని పండించి చూసి వాటికి నేల నుంచి వచ్చే తెగుళ్ళను తట్టుకోవడానికి రోగ నిరోధకశక్తి ఉందో లేదో నిర్ధారణ చేయాలి.

సహజంగా దిగుమతి చేసేవారే విత్తనాలు - అంట్లు, మొగ్గలు, దుంపలు, కణుపులు మొదలయిన వంటి వాటి నమూనాలను అందించడమే గాక వాటిని వారే పండించేది ఏర్పాటు చేయాలి. వీటిని వ్యవసాయ యూనివర్సిటీలు లేదా పరిశోధనా సంస్థలు పర్యవేక్షించాలి.

మనకు నష్టం లేదని తేలిన తర్వాతే వాటిని దిగుమతి చేసుకొనే లైసెన్సు మంజూరు చేయాలి.

## అయితే అమలు జరుగుతున్న దేమిటి?

1963లో ఏర్పడిన జాతీయ విత్తన సంస్థల లక్ష్యాలలో విత్తనాలను పరిశీలించి వాటి నాణ్యతను ధృవీకరిస్తూ సర్టిఫికెట్ జారీ చేయడం ఒకటి. అయితే ప్రభుత్వరంగ సంస్థలుగానీ, ప్రయివేటు రంగ సంస్థలుగానీ తాము కొత్తగా రూపొందించిన విత్తనాలను తప్పని సరిగా సర్టిఫైచేయించుకోవాలనే నిబంధన ఏమీలేదు. అది ఆకంపెనీల ఇష్టం. దీనివల్ల ఆకంపెనీలు విడుదల చేసే నూతన విత్తనాల వల్ల ఏమయినా చెడు పర్యవసానాలు వచ్చినా ఆ విత్తనాలను తయారు చేసిన వారిపై ఎలాంటి చర్యా ఉండదు.

1966 చట్టంలో ఖచ్చితంగా ప్రభుత్వంచే సర్టిఫైచేయించుకోవాలన్న నిబంధన లేకపోవడం వల్ల ఆరంభంలో పెద్ద సమస్య కాలేదు. ఎందుకంటే అపుడు విత్తన పరిశోధన ప్రధానంగా ప్రభుత్వ రంగ సంస్థలే చేసేవి. అయితే క్రమంగా ప్రైవేటు రంగ పరిశ్రమలు విస్తరించిన తర్వాత, అవి తయారు చేసిన విత్తనాలు ఏ పరీక్షకు గురి చేయడబకుండానే విడుదల చేయడంతో పంటలను తుడిచి పెట్టినట్లు నాశనం చేయగల తీవ్రమైన తెగుళ్ళు కూడ దేశంలో వ్యాపించాయి. (ఇలాంటి అనుభవాలు తర్వాత భాగంలో వివరించబడ్డాయి.) అందువల్లే అనేక కంపెనీలు నాసిరకం విత్తనాలను అధిక ధరలకు అమ్మి ఎటువంటి శిక్షలకు గురికాకుండా కోట్ల రూ॥లు సంపాదించగలుగుతున్నాయి.

అయితే సామ్రాజ్యవాద దేశాలలో అనుసరించే పద్ధతి దీనికి పూర్తిగా భిన్నంగా వుంది. ఉదాహరణకు యూరోపియన్ ఎకనమిక్ కమ్యూనిటి - EEC దేశాలలో నూతనంగా తయారయిన విత్తనాలను ఖచ్చితంగా ప్రభుత్వ పరిశోధనా సంస్థలలో పరిశోధనలకు గురి చేస్తారు. ఆ మొక్క ప్రత్యేకత్వ వివరాలను తెలుపుతూ ఆ మొక్కకు సంబంధించిన పునాది జన్యు పదార్థాన్ని నిల్వ ఉంచడం కోసం ప్రభుత్వ సంస్థలకు అందించాలి. మూడు సం॥ల పాటు ప్రయోగశాలలో పరీక్షచేస్తారు. ఇందులో మూడు అంశాలను పరీక్షిస్తారు. వాటి ప్రత్యేకత్వం (డిస్టింక్టివ్‌నెస్), సాదృశ్యకత (యూనిఫార్మిటీ), స్థిరత్వం (స్టెబిలిటీ). DUS అనబడే ఈ పరీక్ష అయిన తర్వాత ఓ నెలపాటు సాగుబడిచేసి పరీక్షిస్తారు. ఈ రకంగా ప్రజల వినియోగంలోకి తెచ్చే ముందు అయిదేళ్ళపాటు పరీక్షించిగానీ రైతులకు విడుదలచేయరు. ఈ పరీక్షకు గురిచేయబడే రకాలకు ముందుగానే రిజిస్ట్రేషన్ ఫీజు చెల్లించాలి. ఒక వేళ ఆ విత్తనాలు ప్రమాణాలకు సరిపడకపోతే ఈ ఫీజు తిరిగి ఇవ్వరు. ఈ రకంగా విత్తనాలకు ధృవీకరణ తప్పనిసరి.

అదే విధంగా అమెరికాలో పండ్లతోటలకు ప్రసిద్ధి చెందిన కాలిఫోర్నియా రాష్ట్రంలోకి ఇతర దేశాల నుంచి కాదు గదా! ఆదేశంలోని ఇతర రాష్ట్రాలనుంచి కూడా క్వారంటయిన్ పరీక్షకు గురి కాకుండా ఒక్క విత్తనాన్నిగానీ, మొక్కని గానీ, లోపలికి ప్రవేశించనీయరు.

దేశంలో తయారయిన విత్తనాలకు సర్టిఫికెట్ ఉండి తీరాలన్న నిబంధన పెట్టలేని మన పాలకులు విదేశీ గుత్త కంపెనీల ముందు మరింత సాగిలపడిపోయారు. ఎలాంటి క్వారంటయిన్ పరీక్ష లేకుండానే "హరిత విప్లవం" కాలంలో అమెరికన్ ఫోర్డ్ ఫౌండేషన్ వత్తిడితో TN-1 అనే వరి విత్తనాలను దిగుమతి చేసికొని తద్వారా తెగుళ్ళను ఎలా వ్యాప్తి చేశారో ఇంతకు ముందు చూశాం. 1988 నూతన విత్తన పాలసీలో ఇలాంటి ప్రమాదాల గురించి ఒక వైపు హెచ్చరిస్తూనే మరోవైపు తిరిగి అంతకంటే ప్రమాదకరమైన విధానాలను ఆ పాలసీలో రూపొందించారు. ఇందులో ముతక ధాన్యాలూ, నూనెగింజలూ, పప్పుల విత్తనాలను '3' వారాలలో పరిశీలించి లైసెన్సు లివ్వాలని, అలాగే కూరగాయలు - పూల విషయంలో '50' రోజులలో లైసెన్స్ లివ్వాలనీ వ్రాశారు. ఈ కాలం నిజంగా విత్తనాల ద్వారా వచ్చే ప్రమాదాలను గుర్తించడానికి ఏ మాత్రం చాలదు. యూరపియన్ దేశాల్లో చేస్తున్నట్లుగా నిజానికి హైబ్రీడ్ రకాన్ని పూర్తిగా పరీక్ష చేసి మార్కెట్‌లోకి విడుదల చేయాలంటే కనీసం 5 సం॥ పాటు పరిశోధన చేయాల్సిందే.

## సామ్రాజ్య వాద విత్తనాలకు గేట్లు బార్లా తెరిచిన 1988 నూతన విత్తన పాలసీ

1988 సెప్టెంబరు 16వ తేదీ కేంద్ర ప్రభుత్వంచే ప్రకటించబడిన 'నూతన విత్తనాభివృద్ధి విధానం' తన లక్ష్యాలను ఇలా ప్రకటించింది. "భారత రైతులకు ప్రపంచంలోని అత్యుత్తమ విత్తనాలు లేదా మొలకలను అందించడం ద్వారా ఉత్పత్తిని పెంచడం, రాబడులను పెంచడం మరియు విదేశాలకు ఎగుమతి చేయడం ద్వారా ఆదాయాలను పెంచడం."

ఈ పాలసీలో వరి, గోధుమ వంటి కాయ ధాన్యాల విత్తనాలను గురించి ప్రస్తావన లేదు. ఎందుకంటే ఇవి మన వ్యవసాయ పరిశోధనా సంస్థ ICAR అమెరికన్ పరిశోధనా సంస్థలతో చేసుకున్న ఒప్పందం ప్రకారం రూపొందించబడడం లేదా దిగుమతి చేసుకోవడం చేస్తున్నారు.

ఇక ముతక ధాన్యాలు, పప్పుదినుసులు, నూనె గింజలు వంటి విత్తనాలను ఒక కేటగిరి క్రింద పెట్టారు. ఈ విత్తనాలను విదేశాల నుండి దిగుమతి చేసుకోవచ్చునన్నారు. అయితే క్వారంటైన్‌లో పరీక్షలకు గురిచేయడానికి ICAR కు విత్తనాలు ఇచ్చి అవి మనదేశంలోకి కొత్త తెగుళ్ళు, కలుపు మొక్కలు ప్రమాదాన్ని తేకుండా వుండేట్లుగా చూసి అనుమతించాలన్నారు. ఈ దిగుమతులు కూడ కేవలం 2 సం॥ మాత్రమే అనుమతిస్తామని, ఈలోగా విదేశీ కంపెనీలు అసలయిన తల్లి విత్తనాలను మన దేశపు కంపెనీలకు ఇవ్వడమో లేదా ఆ విత్తనాలను తయారు చేసే టెక్నాలజీని మన కివ్వడమో చేయాలన్నారు.

మూడో క్యాటగిరీలో కూరగాయల విత్తనాలు, పూలు, అలంకరణ మొక్కలు, దుంపల అంట్లు, చిన్న మొలకలు, కణుపులు వంటివున్నాయి. వీటిని ఏ విధమైన పరీక్షలు లేకుండానే ఇష్టం వచ్చినట్లు దిగుమతి చేసుకోవచ్చు. దీనినే ఓపెన్ జనరల్ లైసెన్స్ (OGL) విధానమన్నారు. అంటే ప్రభుత్వ రంగ సంస్థలే కాక, ప్రైవేటుగా రిజిస్టరు చేసుకున్న కంపెనీలు, ఆహార ప్రాసెసింగ్‌లో వున్న కంపెనీలు కూడ (పెప్సికో వంటివి) దిగుమతి చేసుకోవచ్చు.

4వ కేటగిరిలో పండ్ల మొక్కలున్నాయి. వీటిని ఏ కేసుకు ఆకేసు పరీక్షలు చేసుకుని రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయం డైరెక్టరేట్లు దిగుమతి చేసుకోవాలాలేదా అన్నది నిర్ణయించాలన్నారు.

## ప్రభుత్వం చెప్పేవన్నీ కుంటి సమర్ధనలే

పై పాలసీలో నూతన విత్తనాలను అభివృద్ధి చేయడానికి మన స్వంత కాళ్ళపై నిలబడడమన్నదే మీ లేదు. పాలసీనిండా విదేశాల నుండి దిగుమతుల గురించే చెప్పారు. వాటిని బలపరచడానికి ప్రభుత్వం చెప్పే వాదనలను పరిశీలిద్దాం.

మొదటి సమర్ధన - మన దేశంలో మెరుగైన వ్యవసాయ పద్ధతులు లేవనీ - అందువల్ల పెద్ద మొత్తాల్లో విత్తనాలు దిగుమతి చేసుకొని దిగుబడులు పెంచుకోవచ్చనీ, అందువల్ల దీన్ని టెక్నాలజీ బదిలీగా పరిగణించ వచ్చునని సమర్థించుకో జూస్తున్నారు.

అయితే నిజానికి విదేశాల్లో తయారైన ఆధునిక టెక్నాలజీని మనం బదిలీ చేసుకోడం, మన అవసరాలకోసం వుపయోగించుకొనే పద్ధతులే లేవా? ఆధునిక టెక్నాలజీ ప్రకారం విదేశాల్లో తయారైన జన్యుపదార్థాన్ని (జర్మప్లాజం) సంపాదించి దాన్ని మన అవసరాల కనుగుణంగా రూపొందించుకోవచ్చు. మన వ్యవసాయ నైపుణ్యాన్ని పెంచుకోవచ్చు లేదా ఇంకో పద్ధతి ఏమిటంటే విదేశాల్లో తయారైన మేలైన విత్తనాల్ని కొద్ది మొత్తంలో దిగుమతి చేసుకొని అవి మన దేశ పరిస్థితులకు సరిపడేట్లయితే వాటిని మన నేలల్లో పండించడం లేదా ఇతర పద్ధతుల్లో విత్తనాలను ఎక్కువ మొత్తాల్లో తయారు చేసుకోవచ్చు (Multiplication).

అయితే ఈ పాలసీలో పై రెండు రకాల ఆలోచనలే లేవు. పెద్ద మొత్తాల్లో విదేశాల నుండి విత్తనాల దిగుమతి చేసుకోడాన్ని అనుమతిస్తుందిది. మనకు సైకిళ్ళు కావాలంటే - దాన్ని తయారు చేసే యంత్రాలను దిగుమతి చేసుకోవడం లేదా వాళ్ళ నుండి నేర్చుకుని యంత్రాలను తయారు చేసుకోవడం ద్వారా సైకిళ్ళు ఉత్పత్తి చేసుకోవడం గాక దేశానికి అవసరమైన సైకిళ్ళన్నీ దిగుమతి చేసుకోవాలనడం ఎంతో ఇదీ అంతే.

ఇందులో చెప్పినట్లు మన దేశంలో మేలైన వ్యవసాయక పద్ధతులు వున్నాయో లేవో తర్వాత చూద్దాం.

ప్రభుత్వ పాలసీ యొక్క లక్ష్యంగా - మన దేశం నుండి పుష్పాల (పూల) ఎగుమతి ద్వారా విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించమన్నది కూడ చెప్పబడింది. అయితే పూల ఎగుమతి చేయ్యాలంటే ముందు మనం అభివృద్ధి చెందిన దేశాల నుండి పూల మొక్కల అంట్లను దిగుమతి చేసుకోవాలి.

కర్నాటక రాష్ట్రంలోని తుంకూరు జిల్లాలో 42 కోట్ల రూ॥ పెట్టుబడితో పూర్తిగా ఎగుమతి వుద్దేశ్యంతో (Export Oriented) ఒక పథకం చేపట్టారు. దీని కోసం అవసరమైన పెట్టుబడిని డచ్చికి చెందిన AMRO బ్యాంకు స్వల్ప వడ్డీపై 36 కోట్ల రూ॥ ఋణం ఇచ్చింది. ఈ రకంగా డచ్చి పెట్టుబడి పెట్టడానికి కారణం పూలతోటల పెంపకం వల్ల పెరుగుతున్న వాతావరణ కాలుష్యంపై ఆదేశంలో తలెత్తిన ఆందోళనే. విపరీతంగా పురుగుమందులు వాడడం వల్ల నీటి వుపరితలంలో ఆప్రభావం పెరిగింది.

అందువల్ల ఆ పురుగు మందుల ప్రభావం మనల్ని, మన తోటల కార్మికుల్ని భరించమని ప్రోత్సహించడమే సామ్రాజ్య వాదుల వుద్దేశ్యం. మన దళారీ పాలకులు మహదానందంతో ఆకర్తవ్యాన్ని స్వీకరించి పూలతోటలు పెంచి మన తోటల కూలీలను బలిపెట్టడానికి వుత్సాహంతో ముందు కెళ్ళారు. అయితే పూల కోసం ఆశించిన విదేశీ ఆర్డర్లు పడిపోవడంతో విదేశీ మారకం సంపాదించడం అనే ఆశ ఇప్పటికే హుళక్కి అయింది. మనకు చివరకు మిగిలింది - సామ్రాజ్యవాదుల అప్పు, కలుషితమైన వాతావరణం, పురుగుమందుల వల్ల దెబ్బతిన్న వ్యవసాయ కూలీల ఆరోగ్యాలు.

ప్రభుత్వం చెప్పిన మూడోవాదన ఇంకా చిత్రమైనది. ఈ పాలసీ స్మగ్లింగును కంట్రోలు చేస్తుందట. బంగ్లాదేశ్, నేపాలు సరిహద్దుల నుండి మన దేశంలోకి జరుగుతున్న భారీ విత్తనాల స్మగ్లింగు దీని వల్ల అరికట్టబడుతుందట. మరికొకైన్ (Cocaine) లాంటి మత్తు మందుల దొంగ రవాణా భారీ ఎత్తున జరుగుతోందిగదా! వాటిని కూడా దిగుమతి చేసుకోడానికి చట్టం చేస్తారేమో! ఎంత సిగ్గు మాలిన వాదనలైనా చేయడానికి సమర్థులు గదా మన పాలకులు!

## చెప్పిన కనీసపాటి జాగ్రత్తలు కూడ పాటించరు!

భారీ ఎత్తున దిగుమతుల్ని అనుమతించిన ఈ పాలసీలోనే ఆ దిగుమతులు చేసుకునే విత్తనాలను పరిశోధన చేసే సౌకర్యాలు (క్వారన్‌టైన్) మనకు తక్కువగా వున్నాయనీ, అందువల్ల వాటిని పెంచేందుకు చర్యలు తీసుకుంటామన్నారు. దీని ప్రకారం మొదటి సం॥లో 20.53 కోట్ల రూ॥ పరికరాలు (ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ వంటివి) కొనుగోలు చేయాలని అంచనా వేశారు. సిబ్బందిని 300 మందికి రెట్టింపు చేయాలనుకున్నారు. కాని సంవత్సర కాలంలో ఒక్కరంటే ఒక్కర్ని కూడ ఉద్యోగంలోకి తీసుకోలేదు. 20 కోట్ల రూ॥ బదులు 2.5 కోట్లు మాత్రం కేటాయించి భూమిని మాత్రం కొనుగోలు చేశారు.

క్వారంటైన్ సౌకర్యాలు లేవుగదా అని పోనీ దిగుమతులేమైనా ఆపారా అంటే అలాంటిదేమీలేదు. తొలి సం॥లోనే 120.7 టన్నుల విత్తనాలను, 12.4 లక్షల అంట్లు మొదలగు వాటిని దిగుమతి చేసుకున్నారు. వీటిని పరిశీలించడానికి శాస్త్రవేత్తలకు

ఎలక్ట్రాన్ మైక్రోస్కోపులు కూడ ఇవ్వలేదంటే - పాలకుల బాధ్యతా రాహిత్యం వేరుగా చెప్పనక్కర లేదు కదా! వీటివల్ల కొత్త తెగుళ్ళు కలుపు మొక్కలు వస్తే? అదంతా రైతుల ఖర్మ (దుర దృష్టం) అంటారేమో!

## వ్యవసాయ శాస్త్రవేత్తల హెచ్చరికలు

ఈ నూతన విత్తన విధానం ప్రవేశపెట్టబోతున్నప్పుడే మన దేశానికి సంబంధించిన వ్యవసాయ శాస్త్రవేత్తలు అనేక హెచ్చరికలు చేశారు. ఆ పాలసీ వల్ల రాబోయే పర్యవసానాలను ప్రభుత్వం దృష్టికి తెస్తూ 800 మంది వ్యవసాయశాస్త్రవేత్తలు పార్లమెంటుకు మెమొరాండం కూడ ఇచ్చారు. అయితే వారి మెమొరాండం చర్చకు రావలిసిన సమయానికి బోఫోర్స్ కుంభకోణంపై రగడ చెలరేగడంతో అది చర్చకు నోచుకోకుండా పోయింది. ఢిల్లీ సైన్సు ఫోరం ఈ నూతన విత్తన పాలసీని విశ్లేషిస్తూ 'పరాధీన విత్తనాలు' (Seeds of Dependence) పేర ఒక చిన్న పుస్తకం ప్రకటించారు.

వ్యవసాయ శాస్త్రవేత్తలంతా ఈ విత్తన పాలసీని నూతన విత్తన పాలసీ అని పిలవడం కంటే 'విత్తన దిగుమతి పాలసీ' అని పిలవడం సహజంగా వుంటుందన్నారు. ఎందుకంటే ఏ స్వతంత్ర దేశమైనా తన స్వంత టెక్నాలజీని, సైన్సును అభివృద్ధి చేసుకుని ఒకరి వత్తిళ్ళకు లొంగాల్సి రావడం, వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడడం గాక తన స్వంత పాలసీలను రూపొందించు కుంటుంది.. మన పాలసీ కొత్త విత్తనాలను అభివృద్ధి చేసుకోవడం గాక సామ్రాజ్యవాదులపై పరాధీనతను పెంచుతుందని, మనశాస్త్ర సాంకేతిక నైపుణ్యాల (Research & Development) ఎదుగుదలకు గాక దాన్ని చావు దెబ్బగొట్టే తీరుగా తోడ్పడుతుందన్నారు. మన రైతాంగానికి, దేశ వ్యవసాయ రంగానికి జరిగే నష్టం గురించి హెచ్చరించారు. సామ్రాజ్య వాదులు ప్రవేశపెట్టే లేక రూపొందించే విత్తనాలు మన పంటల దిగుబడులు పెంచేందుకు గాక వారి ఎరువులు, పురుగు మందులు అమ్ముకునేందుకు వుద్దేశించబడిన అనుభవాన్ని గుర్తు చేశారు. అంతకు ముందు వరకు చిన్న చిన్న ప్రైవేటు విత్తనాల కంపెనీల చేతిలో వున్న విత్తన వ్యాపారం, క్రమంగా బహుళజాతి గుత్త సంస్థల (MNC) చేతుల్లోకి పోతున్న తీరును ఎత్తి చూపారు.

## మన పంటలను తెగుళ్ళతో ముంచెత్తిన నూతన విత్తనాలు

ఇంతకుముందే చెప్పుకున్నట్లు సక్రమంగా క్వారన్‌టైన్ సౌకర్యాల్ని ఏర్పరచుకొని నూతనంగా తయారయ్యే దేశీయ విత్తనాల్నిగానీ, విదేశీ విత్తనాల్నిగానీ పరిశోధన చేసి మాత్రమే విడుదల చేయాలి. పప్పుధాన్యాల విత్తనాలు వైరస్‌లకు ఆస్కారమిస్తాయి. కూరగాయలు, పూలు, వైరస్‌లనే గాక శిలీంధ్రాలకు (Pathogens) వాహకాలుగా పనిచేస్తాయి. అలాగే దుంపలు, అంట్లు గూడా.

వీటిని పరీక్ష చేసి దిగుమతి చేసుకున్నాక కూడ పొలాల్లో పరిశోధన (Post - entry Quarantine - P.E.Q) చేయాలి. అయితే ప్రధానంగా తెగుళ్ళకు వాహకాలుగా పనిచేసే మొక్కలను ఈ పరీక్ష నుండి మినహాయించారు.

టమోటాపై టమెటా రింగ్‌స్పాట్, టమోటా బ్లాక్‌రింగ్, టమోటా స్పాట్‌విల్ట్ అనే మూడు రకాలు వైరస్ తెగుళ్ళను గుర్తించారు. ఈ మూడు తెగుళ్ళు ఆర్థికంగా నష్ట పరచడమే గాక అనేక దేశాల్లో ఈ పంట విస్తీర్ణాన్ని కుదింప చేశాయి. తగిన పరిశీలన

(P.E.Q) గనుక వుండి వుంటే వీటిని నివారించడం సాధ్యపడేది. ఈ ప్రమాదం తెలిసినా ఇప్పటికీ టమోటా విత్తనాల్ని జనరల్ లైసెన్స్ క్రింద అనుమతిస్తున్నారు.

తగిన సిబ్బంది, సౌకర్యాలు లేనందున వైరస్‌లను కనుక్కోలేక పోవటమేగాక ఫంగస్, బ్యాక్టీరియాల వల్ల వచ్చే తెగుళ్ళను కూడ కనుక్కోలేక పోతున్నారు. దిగుమతి దారులే పై చెప్పిన P.E.Q సౌకర్యాలను ఏర్పరచాలి. రాష్ట్రాల వ్యవసాయ యూనివర్సిటీలు వాటిని పర్యవేక్షించాలి. అలాంటి నిబంధనలేమీ మన పాలకులు పెట్టడం లేదు.

వైరస్‌లను కనిపెట్టడానికి ఎక్కువ సమయం పడుతుందని తెలిసినా ప ప్పుగింజలను 3 వారాల్లోనే పరిశీలించి అనుమతి మంజూరు చేయాలన్నారు. (పాలకులకు రైతులకన్నా విత్తనాలు దిగుమతి చేసుకొనే విదేశీ గుత్త కంపెనీలే చుట్టాలు కదా!) వివిన్న సెక్షన్ల నుండి వత్తిడి వచ్చిన తర్వాతే ఆకాలాన్ని 56 రోజులకు పెంచారు.

అమెరికన్ గోధుమల్ని 2 మిలియన్ టన్నులు దిగుమతి చేసుకున్నారు. మన వ్యవసాయ శాస్త్రవేత్తలు హెచ్చరికలు చేసినా వినలేదు. డ్వార్ఫ్ బంట్ (Dwarf Bunt), ఎర్గాట్ (Ergot) అనే రెండు రకాల తెగుళ్ళు తగిలిన ఈ గోధుమల వల్ల మన దేశపు చల్లని కొండ ప్రాంతాల్లో ఈ వ్యాధి పూర్తిగా వ్యాపించింది.

వేరుశనగపై 1970 వరకు కనిపించని వేరుశనగ రస్ట్ (Ground nut rust) అనే తెగులు విత్తనాల ద్వారా వ్యాపించి వేరుశనగ పంటని తగ్గించేట్లు చేసింది.

మొక్కలపై వచ్చే తెగుళ్ళలో కొన్ని హఠాత్తుగా వ్యాపించే లక్షణం (epidemic) గలవి వున్నాయి. మనుషులకు కలరా, ప్లేగు వచ్చినట్లుగానే.

1730లో పంజాబ్‌లోని కర్నల్ ప్రాంతంలో కనుగొన్న కర్నాల్ బంట్ అనే తెగులు 1970 వరకు భారతదేశంలో వ్యాపించలేదు. కానీ ఇటీవల ఇది విదేశీ రకాలతో విస్తారంగా ప్రబలి కొన్ని చోట్ల 50 శాతం నుండి మరికొన్ని చోట్ల 90 శాతం పంటను కూడ నష్టపరిచింది. W.G. 377, WL 711 అనే పేర్లు గల గోధుమ విత్తనాలు జబ్బులకు తేలికగా ఆస్కారమిచ్చి ఒక చిన్నపాటి తెగులును దేశమంతా విస్తరించిన విస్తారమైన (Major) తెగులుగా మార్చివేశాయి. పాలరీస్ మైనర్ అనే తెగులుకూడ గోధుమ విత్తనాలతో విభిన్న రాష్ట్రాలకు వ్యాపించింది. పొద్దు తిరుగుడు పంటపై వచ్చే డౌనీమైల్ డ్యూ (Downy Mildew) అనే తెగులు కూడ మహారాష్ట్రలోని లాతూరు ప్రాంతంలో ప్రారంభమై ఆవిత్తనాలతో పాటుగా దేశమంతా వ్యాపిస్తోంది.

అలాగే తమిళనాడులో ఒక ప్రైవేట్ విత్తన కంపెనీ ఐ.ఆర్. 50 (I.R. - 50) అనే వరి వంగడాన్ని ఎలాంటి పరీక్షా లేకుండానే విడుదల చేసింది. ఫలితంగా అగ్గితెగులు తమిళనాడు అంతటా వ్యాపించడమే గాక మనలాంటి పొరుగు రాష్ట్రాలకు కూడ వ్యాపించి అన్ని పైర్లను నాశనం చేసింది. దీని వల్ల బ్లాస్ట్ ఫంగస్ (Blast Fungus) అనే కొత్త జాతి వృద్ధిచెంది అధికోత్పత్తి రకాలన్నిటినీ దెబ్బతీసింది. పంట గింజపాలు పోసుకునే దశలో రసం పీల్చే కీటకాన్ని వ్యాపింపజేస్తాయి. ఇది సుడి తెగులును హఠాత్తుగా వ్యాపింపజేసే ప్రమాదం వుండడం వల్ల వరి పండించే రైతులందరికీ ప్రమాదంగా పరిణమించింది.

1979లో సెంట్రల్‌రైస్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (CRRI) లో సమావేశమైన టాస్క్‌ఫోర్స్ బృందం వ్రాసిన రిపోర్టు ఇలా పేర్కొంది.

"నూతన అధిక దిగుబడి రకాల విత్తనాలు (క్రిమికీటకాలు, తెగుళ్ళు, పరిస్థితిలో గుర్తించదగిన మార్పును తెచ్చాయి. గాల్‌మిడ్జ్, బ్రౌన్ ప్లాంట్ హూపర్, ఆకుముడత, వోర్ల్ మాగ్గట్ (Gall Midge, brown Planthooper, Leaf Folder, Whorl Mogget) వంటివి ఇందులో కొన్ని. ఇప్పటి వరకు విడుదలైన అధిక దిగుబడి రకాల్లో అత్యధిక భాగం తెగుళ్ళకు గురయ్యేవే. (రోగ నిరోధక శక్తిలేనివి). వీటి వల్ల 30 నుండి 100 శాతం వరకు కూడ (అంటే పంట పూర్తిగా) నష్టం కల్గిస్తున్నాయి. అందువల్ల దిగుబడులు నికరంగా రావాలంటే తెగుళ్ళకు తట్టుకోగలిగే రకాలను రూపొందించాలి." గాల్ మిడ్జ్ తెగులును తట్టుకోగలిగే రకాల వరి వంగడాల కోసం జరిగిన ప్రయత్నాలను గురించి చెబ్తూకూడ అధిక దిగుబడి లక్షణంతో పాటు నిలకడైన, తెగుళ్ళను తట్టుకోగలిగిన లక్షణాలను కలిగలపాలని టాస్క్‌ఫోర్స్ చెప్పింది.

ఆంధ్ర రాష్ట్రంలో కూడ అగ్గి తెగులు, టుంగ్రోవైరస్‌లు వచ్చి మన వరి పంటనంతా నాశనం చేయడాన్ని చూశాం. అలాగే ప్రత్తి పంటను సర్వనాశనం చేసి ప్రకాశం జిల్లా ప్రత్తి రైతుల ఆత్మహత్యలకు కూడా తలపడాల్సిన దుస్థితికి నెట్టివేసిన 'తెల్లదోమ' కాటును కూడా భరించాము.

## పెప్సికో వాడందించిన అనుభవం

శాస్త్రజ్ఞులు ఎన్ని హెచ్చరికలు చేసినా వినకుండా పై పాలసీని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఇదే సందర్భంలోనే అమెరకన్ బహుళ జాతి కంపెనీ పెప్సికోతో ఆహార ప్రాసెసింగ్ (చెట్ల నుండి వచ్చే కాయలు, లేదా గింజలను ఆహార పదార్థంగా మార్చడం ఉదా: రొట్టె, కేకు, జ్యూస్ తయారు చేయడం) ఒప్పందాన్ని మన పాలకులు కుదుర్చుకున్నారు.

ట్రిబ్యూన్ పత్రిక 8 మే, 1990 నాడు వ్రాసిన వార్త రైతాంగపు మరో చేదు అనుభవాన్ని బయట పెట్టింది. పెప్సి కంపెనీ పేరు కూడ బయట పెట్టని ఒక టమెటా విత్తనాన్ని పండించేందుకు రైతాంగంతో ఒప్పందం కుదుర్చుకుంది. ఆ కంపెనీ వ్యవసాయ నిపుణుల పర్యవేక్షణలో ఒక్కోరైతు కనీసం 5 ఎకరాలకు తక్కువగా కూడా ఈ పంట పండించాలి.

కంపెనీ రైతులకు టన్నుకు 750 రూ॥ చొప్పున టమోటా పంటను కొంటానని వాగ్దానం చేసింది. ఎకరాకు 15 టన్నుల పంట వస్తుందని చెప్పింది. తీరా పంట వేసిన తర్వాత ఫంగల్ జబ్బు (తెగులు) వచ్చింది. దీనికి వాడమని సూచించిన తెగులు మందు (ఫంగిసైడ్) కూడ అత్యంత ఖరీదైంది.

పంట దిగుబడి ఎకరాకు కేవలం 3 టన్నులు వచ్చింది. ఇది మన భారతీయ రకాల కన్నా అతి తక్కువ దిగుబడి. ఈ పంటనయినా పెప్సి కంపెనీ కొన్నదా అంటే అదీ లేదు. ఎన్ని సార్లు రైతులు మొరపెట్టుకొన్నా కంపెనీ కొనక పోవడంతో రైతాంగం స్థానిక మార్కెట్‌లోనే అతి తక్కువ ధరకు (దాని రంగు, సైజు మనవాళ్ళకు నచ్చని కారణంగా) అమ్ముకోవాల్సివచ్చింది.

పెప్సికో కంపెనీ ఒక వేళ పంట దిగుబడి రాకుంటే నష్ట పరిహారం చెల్లిస్తానని ముందేమో రైతులకు ఆశచూపి తీరా పంట వచ్చిన తర్వాత మనదేశపు వేడి పరిస్థితులకు తట్టుకోలేక పోవడం, ఫంగల్ జబ్బులకు తట్టుకోలేక పోవడం వల్ల దిగుబడి తగ్గిందని చేతులు దులుపుకుంది.

అదే ట్రిబ్యూన్ పత్రిక మార్చి 22, 1990న వ్రాసిన వార్తలో ఇద్దరు శాస్త్రవేత్తల ఆందోళనను ప్రచురించింది. అందులో వాళ్ళు 1988 నూతన విత్తన పాలసీవల్ల భారీమొత్తాల్లో చేసుకున్న దిగుమతుల వల్ల కొత్త తెగులును కనుగొన్నట్లు విదేశీ హైబ్రీడ్ విత్తనాల వల్ల బక్ ఐ రాట్ (Buck - Eye Rot) అనే తెగులు టమోటా పంటను 15 నుండి 20% నష్ట పరిచినట్లు పంజాబ్‌లో జరిపిన సర్వేలో బయట పడినట్లు వ్రాశారు.

## రైతాంగపు అవసరాలకు భిన్నమైన విత్తనాలు

గతంలో హరిత విప్లవ కాలంలో విడుదలైన విత్తనాలు మన స్థానిక రకాల విత్తనాలను ఎలా దెబ్బతీశాయో ఇంతకు ముందే చూశాం. వారి ఎరువులు, పురుగు మందులు అమ్ముడు బోయేందుకు వుద్దేశించినవే తప్ప మన అవసరాలు వాళ్ళకు పని లేదు. అలాగే మన వ్యవసాయ వుత్పత్తులు, ప్రధానంగా ఆహార ధాన్యాల వుత్పత్తిని దెబ్బ తీయడం ద్వారా సామ్రాజ్య వాదులపై ఆధారపడేట్లు చేయడం కూడ వారి మరో లక్ష్యం.

వ్యవసాయ శాస్త్రవేత్తలు రైతాంగపు ప్రయోజనాలకు భిన్నంగా బహుళజాతి కంపెనీలు సాగిస్తున్న ఈ మోసాన్ని బట్ట బయలు చేస్తున్నారు. పబ్లిక్ రంగంలో సక్రమంగా సాగే పరిశోధన రైతాంగ ప్రయోజనం దృష్ట్యా నైతే గుత్త సంస్థలు చేసే పరిశోధన వాళ్ళ లాభాపేక్ష దృష్ట్యా తప్ప వేరు గాదు. ఈ పట్టిక చూడండి.

### విత్తనాల తయారీలో భిన్న దృక్పథాలు

| రైతు ప్రయోజనం రీత్యా పబ్లిక్ రంగం | లాభాపేక్షతో ప్రైవేట్ రంగం |
|---|---|
| రైతులకు ఆదాయకరంగా వుండాలి. | కంపెనీ ఆదాయం తప్ప రైతు ప్రయోజనంతో పని లేదు. |
| సమాజపు అవసరాలు తీర్చేట్లుగా పోషక విలువలు వుండాలి. | దిగుబడి పరిమాణం తప్ప ఆహార విలువతో పని లేదు. |
| పంట సురక్షితంగా సకాలంలో కోతకు రావాలి. | దీంతో ప్రమేయం లేదు. దిగుబడి ఎక్కువ వస్తే చాలు. |
| తక్కువ ఖర్చుతో ( ఎరువులు, పురుగు మందులు వగైరా) పంట పండేట్లు వుండాలి | రసాయనాలు ఎంత ఎక్కువ వినియోగించాల్సి వస్తే MNC లకు అంత మంచిది. |
| విత్తనాలు, మొక్క గట్టితనంగా వుండేట్లు పంట రుచికరంగా వుండేట్లు (Flavours) కోరుతారు. | విత్తనాలు ఎక్కువ దిగుబడి, పంట సారూప్యంగా ఒక సైజులో వుండడం, తన చేయదలచుకున్న ఆహారోత్పత్తి ప్రాసెసింగ్‌ను అనుగుణంగా వుండాలి. |
| తెగుళ్ళను తట్టుకునేట్లుగా మొక్కలుండాలి సహజ పోషక విలువలను రూపొందించు కునేట్లుగా వుండాలి. | తమ కంపెనీలు తయారు చేసిన ఎరువులు, పురుగు మందులు, కలుపు మందులకు అను గుణంగా వుండాలి. |
| రైతు తను మళ్ళీ విత్తనాలు కట్టుకొనేట్లు గా అనువైన హైబ్రీడ్లు తయారు చేస్తారు. (Apomictic Hybirdes) | ప్రతి సం॥ మార్కెట్‌లో విత్తనాలను రైతు కొనుగోలు చేసేట్లుగా కోరుకుంటారు. |

| | |
|---|---|
| వుత్పత్తికి, పరిశోధనకు అయ్యే ఖర్చుతో విత్తనాలు మార్కెట్లో ఇస్తారు. | వుత్పత్తికైన ఖర్చుకన్నా 4 కాదు 10 కాదు వీలును బట్టి ఎన్ని రెట్లు లాభంకైనా విత్తన ధర నిర్ణయిస్తారు. |
| ఒకే పంట వుండడం వల్ల తెగుళ్ళకు గురయ్యే ప్రమాదం పెరుగుతుంది. | విస్తారమైన ప్రాంతంలో ఒకే పంటను కోరు కుంటారు. |
| మల్టీలైన్ కాయధాన్యాల రకాలను కోరుతారు రైతాంగం. | వీటికి పేటెంట్ చేసుకోవడం కష్టం గనుక ఈ రకాలు వాళ్ళకు పనికి రావు. |
| విత్తనాలతో నూతన రకాలు అభివృద్ధి కావాలంటే అందుబాటులో వుండే వివిధ రకాల విత్తనాలను పరస్పరం మార్పిడి కోరుకుంటారు. | పేటెంట్‌ను కోరుతారు గనుక రహస్యంగా విత్తనాలు వుంచుతారు. ఇతరులు ఇస్తే తీసుకుంటారు తప్ప వాళ్ళు మాత్రం ఇతరులకు ఇవ్వరు. |

## MNC లకు తమ ప్రాసెసింగ్‌కు అనువుగా వుండే రకాలైతే చాలు:

ఫత్‌రాయ్‌మూనీ వ్రాసిన పుస్తకంలో ఇలాంటి అనేక వుదాహరణలను పేర్కొన్నాడు. అమెరికాలో రైతులు ఏ రకమైన పైర్లని పండించాలో ఆ దేశపు మాల్టింగ్ పరిశ్రమ నిర్ణయిస్తోంది. అమెరికాలోని టమోటా పంటలో 50% పైగా కేనరీస్ (Canneries ఆహార పదార్థాలను ప్యాకింగ్ చేసే కంపెనీలు) చేత కుదుర్చుకున్న ఒప్పందాల ప్రకారం యంత్రాలతో కోత కోయడానికి అనువైన రకాల్ని రైతాంగం పండించాల్సి వస్తోంది. అలాగే అమెరికాలోని బంగాళాదుంపల రైతాంగం కూడ వత్తిడికి గురవుతుందన్నారు.

మనదేశంలో కూడ ఇలాంటి అనుభవమే వుంది. సాంప్రదాయకంగా మనదేశంలో దొరికే టమోటాలు ఒకరకమైన వాసనలు వెదజల్లుతూ బ్రహ్మాండమైన రుచిని కలిగి వుంటాయి. మనదేశంలో పిల్లల నుండి పెద్దల వరకు పచ్చి టమోటాలు తినడం నుండి పెద్దలు సైతం చట్నీ తింటూ కూడ ఆరుచిని ఆస్వాదిస్తున్నారు. అయితే ఈ రోజు హైబ్రీడ్స్ మీద పరిశోధన చేసే కంపెనీలకు మన రుచిని నిలబెట్టడంతో పనిలేదు. పెప్సీవంటి గుత్త కంపెనీలు టమోటా సూప్‌ను పెద్ద మొత్తాల్లో తయారు చేసే పరిశ్రమలు పెడుతున్నారు. వాళ్ళకు చెట్ల నుండి కాయలు యంత్రాలతో కొయ్యడానికి అనువైన రకాలు కావాలి. వాటినే ప్రోత్సహిస్తున్నారు. దాంతో స్థానిక రకాల టమోటాలను మనం పొంద లేక పోతున్నాం. ఇప్పటికే టమోటాలు ఎక్కువ రోజులు నిల్వ వుండడం కోసం బెంగుళూరు రకం టమోటాలు (తొక్క మందంగా వుండేవి) మన మార్కెట్లోకి వచ్చాయి. వీటిని రుచి రీత్యా కొనడానికి మన ప్రజలు ఎవరూ సిద్ధ పడరు. కాని మార్కెట్లో అవి తప్ప అందుబాటులో లేనందువల్ల తప్పడం లేదు.

అలాగే బంగాళాదుంపలు - చిప్స్ తయారు చేసే కంపెనీలు అందుకనుగుణమైన హైబ్రీడ్ రకాలనే పండించమని రైతుల్ని కోరుతున్నారు. ఇక వాటి రుచి, అందులోని పోషక విలువ సంగతి వారికనవసరం.

బార్లీ విషయం కూడ అంతే. ఒకప్పుడు ఇది మన ఆహారంలో ప్రధాన భాగంగా వుండి ప్రత్యేకంగా వేసవికాలంలో చల్లదనం కోసం వాడబడేది. ప్రస్తుతం దీన్ని ఎక్కువగా బీరు తయారీ కోసం వాడుతున్నారు. బీరు పరిశ్రమకు అనుగుణంగా వుండే బార్లీ విత్తనాలే ప్రోత్సహించబడతాయన్న మాట. మన రుచి, చల్లదనం అవసరాలు వాళ్ళకనవసరం.

అలాగే గతంలో మన దేశంలో పండే సజ్జలు, జొన్నలు కంకి లేత దశలో పాలు గారుతూ తియ్యటి రుచి నిచ్చేవి. జొన్న చొప్ప పశువులు తినడమే గాక మనుషులు గూడ తింటూ చెరుకు లాంటి తీపిని ఆస్వాదించే వాళ్ళు. ప్రస్తుతం సజ్జ, జొన్న, మొక్కజొన్న వంటి హైబ్రీడ్ విత్తనాలు ఏ రుచీ లేకుండా వుంటున్నాయి. వాటి చొప్ప ఇక పశువుల తిండిగా కూడా వుపయోగపడడం లేదు. కారణం రసాయన ఎరువుల, పురుగు మందుల వాడకమే.

అలాగే హైబ్రీడ్‌లలో కూడ గుత్త కంపెనీలు ప్రతి సం॥ రైతులు తమ విత్తనాలే కొనాలని కోరుతారు. రైతు నిల్వ చేసుకోగలిగే హైబ్రీడ్ రకాలు అందునా జొన్న వంటి రకాలు మనదేశంలో ప్రపంచ ఆకలిని తీర్చ గలిగేంత స్థాయిలో వుత్పత్తి చేయగల పరిస్థితి వుంది. అయితే ఇలా అభివృద్ధి అయితే గుత్త కంపెనీలకు నష్టం గనుక ముందుకు రానివ్వడం లేదు.

రైతు నిల్వ చేసుకొని మరుసటి సం॥కి వాడగలిగే రకాల హైబ్రీడ్లను అభివృద్ధి చేయడానికి తక్కువ ఖర్చు, తక్కువ కాలం మాత్రమే పడతాయి. హైబ్రీడ్ రకాలను ఉత్పత్తి చేయడానికి ( ఏ సం॥కి ఆ సం॥కి మాత్రమే పనికి వచ్చేవి) 4 నుండి 10 సం॥ వరకు కూడ ఒక్కో రకం రూపొందించడానికి అవసరమవుతుంది. అయితే ఒకసారి రూపొందించిన తర్వాత పేటెంట్ పొందితే విస్తారమైన మార్కెట్‌ను సృష్టించుకోవచ్చు గనుక గుత్త కంపెనీలు దానికే ప్రాధాన్యతనిస్తున్నాయి.

అలాగే గుత్త కంపెనీలు విత్తనాల్లో సారూప్యతగల లేదా నూటికి నూరు పాళ్ళు నమూనాగా వుండే మొక్కల విత్తనాల వుత్పత్తి పైనే దృష్టి పెడతాయి. అయితే ఈ పద్ధతి వల్ల తెగుళ్ళు తేలిగ్గా వ్యాప్తి చెంది విపరీతమైన నష్టాలకు గురి చేస్తాయి. దీన్ని నివారించడం కోసం అంతర్జాతీయ స్థాయిలో జరిగిన చర్చలలో కూడ వేరు వేరు తల్లి మొక్కల నుండి తయారుచేసిన కాయధాన్యాల (Multiline Cereals) వుత్పత్తిని చేపట్టడం మంచిదని శాస్త్రవేత్తలు అభిప్రాయబడ్డారు. అంటే ఈ పద్ధతిలో సంకర పరచే మొక్కలలో ఒకే రకమైనవి వాడడం గాక దగ్గర దగ్గర లక్షణాలుండే భిన్న మొక్కలను వాడతారు. ఈ పద్ధతి వల్ల మొక్కల్లో జన్యు వైవిధ్యం ఉండడం వల్ల అవి తెగుళ్ళను తట్టుకోగలుగుతాయి. కాని గుత్త కంపెనీలకు కావలసింది ఈ లక్షణం కాదు గదా! వీటిని అభివృద్ధి చేస్తే రైతులు తమ ఎరువుల్ని, పురుగు మందుల్ని కొనడం తగ్గుతుంది. అంతకంటె ముఖ్యం ఈ మొక్కల్లో భిన్నత్వం వుండడం వల్ల పేటెంట్ పొందడం కష్టమవుతుంది. అందువల్ల ఇవి రైతాంగానికి వుపయోగపడే విధంగా తక్కువ పెట్టుబడితో ఎక్కువ ఫలసాయం రాబట్టేందుకు తోడ్పడే విధంగాను, విభిన్న వాతావరణ పరిస్థితులకు, నేల సారాలకు తగినట్లుగాను, పోషక విలువలు పెంచేట్లుగా, ప్రజల రుచుల కనుగుణంగా వుండే విత్తనాలను అభివృద్ధి కానివ్వవు. తమ లాభాపేక్ష తప్పవీటికి మరేమీ పట్టదు. దీర్ఘ కాలంలో మనలాంటి దేశాలకు జరిగే నష్టాల్లో జన్యువైవిధ్యాన్ని కోల్పోవడం ఇంతకంటే తీవ్రమైనది.

## దేశంలో మంచి రకాల విత్తనాలు లేక విదేశీ విత్తనాలను దిగుమతి చేసుకుంటున్నామా?

వ్యవసాయ శాస్త్రవేత్తలు ఈ ప్రశ్నను కూడ ప్రభుత్వానికి సూటిగా వేశారు. మన వ్యవసాయ శాస్త్రవేత్తలు ప్రపంచ ప్రమాణాలతో తట్టుకోగల ఎన్నో రకాలనూతన విత్తనాలను రూపొందించారు. అవి మన వాతావరణ పరిస్థితులకు సరిపోయేట్లుగా వుండడం మనకు అనుకూలమైన ముఖ్య లక్షణం.

వరి పంట విషయంలో రిచారియా రూపొందించిన రకాలు ఎంత నాణ్యత గలవో ఇంతకు ముందే చెప్పుకున్నాం. అలాగే గోధుమ పంటలో హరిత విప్లవకాలంలో వచ్చిన అధిక దిగుబడి కూడ విదేశీ రకాల వల్ల గాక మన శాస్త్రవేత్తలు అభివృద్ధి చేసిన విత్తనాల వల్లనే. మొక్కజొన్న, సజ్జ పంటల్లో మనదేశంలో అత్యుత్తమ పథకాలున్నాయి. జొన్న పంటలో ప్రపంచంలోనే అగ్ర భాగంలో ఉండి అంతర్జాతీయ ప్రయోగాలలో ప్రమాణాలుగా తీసుకోబడుతున్నాయి.

నూనె గింజరకాల్లో కూడ వేరుశనగ ఎకరాకు 16 క్వింటాళ్ళు, ఆవాలు 10 క్వింటాళ్ళు, నువ్వులు 3 క్వింటాళ్ళు వంతున పండించగల రకాలు మన వద్ద వున్నాయి. అయితే ఈ రకాలను అవసరమైన ఆదర్శవంతమైన పంట పరిస్థితులు (నీరు, ఎరువులు తదితర ) లేనందువల్ల ఈ రకాలు వెనుకబడి వున్నాయి.

ఇక పప్పు ధాన్యాల విషయానికొస్తే ఒక్క పెసరవంటివి తప్ప మిగిలిన పప్పుధాన్యాలు కేవలం మన దేశంలో మాత్రమే పండుతున్నాయి.

అమెరికన్ గుత్త సంస్థ కార్గిల్ కంపెనీపై కర్నాటక రైతులు దాడి చేసిన సందర్భంలో కూడ మన విత్తనాలే మెరుగైనవని బయటపడింది. అది విడుదల చేసిన పొద్దు తిరుగుడు విత్తనాలు 4 బస్తాలు ఎరువు వాడినా 6 క్వింటాళ్ళు కూడా పండలేదు. మన దేశ వాళీ విత్తనాలు ఒక బస్తా ఎరువుతోనే 8౹క్వింటాళ్ళు దిగుబడి నిచ్చాయని తేలింది.

కేవలం కూరగాయల విషయంలో మాత్రమే మనదేశపు రకాలకు ప్రపంచ స్థాయి హైబ్రీడ్ రకాలకు ఎక్కువ తేడా వుంది. అయితే మన దేశంలో పూలు, కూరగాయలు ఉద్యానవన మొక్కలు వంటి రకాలపై మనదేశపు శాస్త్రవేత్తలు పరిశోధనలు ఆరంభించింది చాలా ఆలశ్యంగా 1970లలోనే. వీటిలో కూడ కొన్ని మేలు రకాలను రూపొందించారు. కాలిఫ్లవర్ పంటలో 'స్నోబాల్' రకం అలాంటి వాటిలో ఒకటి. అతి స్వల్పమైన నిధులు, పరిమితమైన పరిశోధనా సౌకర్యాలతోనే మన శాస్త్రవేత్తలు ఇతర విషయాల్లో మేలిమి విత్తనాలు రూపొందించినట్లే వీటిని కూడ రూపొందించగలరనేది నిస్సందేహం.

అయితే విదేశ గుత్త కంపెనీల డైరెక్టర్లు ప్రధాన మంత్రికి సూచనలిచ్చే కమిటీలో ముఖ్యులుగా వున్న ఈ దేశంలో (అతి పెద్ద MNCలలో ఒకటైన హిందూస్థాన్ లివర్ కంపెనీ అధ్యక్షుడు శ్రీ గంగూలీ రాజీవ్ గాంధీకి ప్రధానమంత్రిగా వున్నపుడు సలహాదారుడు) స్వతంత్ర పరిశోధనలను ఎలా వూహించగలం? MNC ల రంగ ప్రవేశంతో విత్తన పరిశ్రమ అంతకు ముందున్న రూపురేఖలే మార్చబడ్డాయి. 1988 విత్తన పాలసీ అందుకోసమే చేయబడింది. ఈ చట్టం చూసి బహుళ జాతి గుత్త సంస్థలు (MNC) ఎంత సంబర పడుతున్నాయో చూద్దాం:

## మహదానంద పరవశులైన MNC లు

నూతన విత్తన పాలసీలో క్వారంటైన్ పరీక్షలకు గేట్లు ఎత్తి వేయడమే గాక బహుళజాతి కంపెనీల కోసం అంతకుముందు వరకు విదేశీ దిగుమతులపై 95% సుంకం వసూలు చేస్తుండగా దాన్ని 15% కి తగ్గించారు.

1986 వరకు మన విత్తన పరిశ్రమలో చిన్న, మధ్య తరగతి విత్తన కంపెనీలకే ప్రైవేటు రంగంలో కూడ ప్రాధాన్యత వుండేది. ఈ విత్తన పరిశ్రమ అపెండిక్సు - 1 లో చేర్చకుండా వుండడంతో విదేశీ పెట్టుబడి అనుమతించబడేది కాదు. అయితే 1986లో ఈ అవరోధం

కూడ తొలగించబడి 1956 పారిశ్రామిక చట్టంలో విదేశీ మారక ద్రవ్య నియంత్రణ చట్టం (FERA), గుత్త వ్యాపార నిరోధక చట్టం (MRTP) చట్టాల పరిధిలోకి వచ్చే కంపెనీలకు కూడ అవకాశం కల్పించబడింది.

అతికొద్ది కాలంలోనే రసాయనాలు, మందులు, తయారు చేసే పెట్రో కెమికలు కంపెనీలన్నీ విత్తన రంగంలోకి చకచకా దూకేశాయి. చిన్న చిన్న కంపెనీలతో ఒప్పందాలు చేసుకోడమో, కొనివేయడమో చేశాయి. భారతదేశంలో విత్తన వ్యాపారం సం॥కి 500 కోట్ల రూ॥ నుండి 600 కోట్ల రూ॥ వరకు వుంటుందని ప్రస్తుత అంచనా. ఈ పాలసీ తర్వాత విత్తనాల దిగుమతులు 1988లో 18 లక్షల టన్నుల నుండి, 1990 - 91 కి 60 లక్షల టన్నులకు పెరిగాయి. కేవలం టమోటా, కేబేజి విత్తనాలే 50,000 టన్నులు దిగుమతి చేసుకున్నారు. పైగా ఈ విదేశీ దిగుమతులకు ఇంకా ఆటంకం లేకుండా 1992 లో దిగుమతి చేసుకునే విత్తనాలపై అంతకుముందే 15% తగ్గించిన సుంకం పూర్తిగా రద్దు చేశారు. ఈ రాయితీలతో వచ్చిన విదేశీ కంపెనీల వివరాలు పట్టికలో వున్నాయి.

**భారతదేశపు విత్తనరంగంలోని విదేశీ కంపెనీలు – వాటి కార్యకలాపాలు**

| భారతదేశంలోని దాని కేంద్రం | ఏ విదేశీ కంపెనీతో మిలాఖత్ ఉన్నది ఆదేశం పేరు | కార్యకలాపాలు | మిలాఖత్ స్వభావం |
|---|---|---|---|
| విమ్‌కో లిమిటెడ్ బొంబాయి | స్వీడిష్ మేచ్ AB/ హిల్లె షాగ్ AB, స్వీడన్ (3/1983) | ఆగ్రో ఫారెస్ట్రీకి విత్తనాలు, నారు మొక్కలు సరఫరా చేయడం | ఆర్థిక సహాయం |
| మహారాష్ట్ర సీడ్స్ కంపెనీ -బొంబాయి | సీడ్‌టెక్ ఇంటర్నేషనల్ అమెరికా (9/1983) | హైబ్రిడ్ పొద్దు తిరుగుడు విత్తన ఉత్పత్తి | సాంకేతిక సహాయం |
| ఐ.టి.సి, ఆగ్రోటెక్ లి. సికిందరాబాద్ | కాంటినెంటల్ గ్రెయిన్స్ ఆస్ట్రేలియా (9/1988) | హైబ్రిడ్ విత్తనాల ఉత్పత్తి | సాంకేతిక సహాయం |
| బెజోషీతల్ సీడ్స్ ప్రయివేట్ లి. జల్నా | బెజోజడాన్ BV, హాలండ్ (9/1988) | హైబ్రిడ్ విత్తనాల ఉత్పత్తి | ఆర్థిక సహాయం |
| PHI బయోజెని ప్రయివేట్ లి. న్యూఢిల్లీ | పయనీర్ ఓవర్ సీస్ కార్పొరేషన్ అమెరికా (10/1988) | హైబ్రిడ్ విత్తనాల ఉత్పత్తి | ఆర్థిక సహాయం |
| బీహార్ సీడ్స్ కార్పొరేషన్ చంపారన్ | పసిఫిక్ సీడ్స్ ఆస్ట్రేలియా (11/1988) | హైబ్రిడ్ పొద్దు తిరుగుడు విత్తనాల తయారీ | సాంకేతిక సహాయం |
| వాధ్‌సీడ్స్ ప్రై. లి ఔరంగాబాద్ | డోబిగాన్ అండ్ కంపెనీ అమెరికా (11/1988) | హైబ్రిడ్ పొద్దు తిరుగుడు విత్తనాల ఉత్పత్తి | సాంకేతిక సహాయం |

| | | | |
|---|---|---|---|
| వెల్కం సీడ్స్ ప్రై. లి ఢిల్లీ | NRI కేసెస్ / ఇండియా /UK ఇంగ్లండ్ (9/1989) | కూరగాయల విత్తనాల ఉత్పత్తి | ఆర్థిక సహాయం |
| బిట్ట్ ట్రి టెక్ ప్రై. లి న్యూఢిల్లీ | ప్లాంటెక్స్ ఆస్ట్రేలియా (9/1989) | అంట్లు, మొలకలు పుష్పాల ఉత్పత్తి విస్తరింప చేయడం | సాంకేతిక సహాయం |
| ఒమేగా ఆగ్‌సీడ్ ఇండియా లి. బొంబాయి | ఆగ్‌సీడ్స్ ప్రై. లి ఆస్ట్రేలియా (3/1990) | అభివృద్ధి పరచిన విత్తనాలు. | ఆర్థిక సహాయం |
| భారత్‌పల్వరైజింగ్ మిల్స్ లి. బొంబాయి | నోవాసీడ్స్ అమెరికా (3/1990) | నూనె గింజలు పప్పు గింజలు కూరగాయల విత్తనాల తయారీ | ఆర్థిక సహాయం |
| బిస్ కో సీడ్ టెక్ ప్రై. లి. ఢిల్లీ | అగ్రిప్రో బయోసైన్సెస్ అమెరికా (6/1990) | హైబ్రిడ్ విత్తనాల తయారీ | సాంకేతిక సహాయం |
| వార్ సీడ్స్ లి. ఔరంగాబాద్ | K.Z. జిబ్రోడర్స్ స్లూయిస్ స్లూయిస్ BV (6/1990) | హైబ్రిడ్ కూర గాయల విత్తనాల తయారీ | ఆర్థిక సహాయం |
| మహారాష్ట్ర హైబ్రిడ్ సీడ్స్ కం. లి. బొంబాయి | ఆస్‌గ్రో సీడ్ కంపెనీ అమెరికా | హైబ్రిడ్ కూర గాయల విత్తనాల తయారీ | సాంకేతిక సహాయం |
| ఇ.సి.యల్. అగ్రో టెక్ కలకత్తా | కాంట్రో కో ఆపరేషన్ యుగోస్లేవియా (9/1990) | సంకర విత్తనాల తయారీ | సాంకేతిక సహాయం |
| హారిసన్ మల యాళం లి. ఎర్నాకుళం | అగ్రి సాటన్ గాంభ్ ప. జర్మనీ (1/1991) | హైబ్రిడ్ కూర గాయల ఇతర విత్తనాల ఉత్పత్తి | సాంకేతిక సహాయం |
| శాండజ్ (ఇండియా) లి. బొంబాయి | జాడునియా హాలండ్ (11 / 1987) | అధిక దిగుబడి విత్తనాల తయారీ | సాంకేతిక సహాయం |
| శాండజ్ (ఇండియా) లి. బొంబాయి | వార్ రుప్ కింగ్ కం. అమెరికా (11/1987) | అధిక దిగుబడి విత్తనాలు మొక్కల తయారీ | సాంకేతిక సహాయం |
| హారిసన్ మల యాళం ఎర్నాకుళం | పెమె నియా షాట్జ్ గాంబ్ (2/1991) | హైబ్రిడ్ మరియూ అధిక దిగుబడి పంటల విత్తనాలు | సాంకేతిక సహాయం |
| హారిసన్ మలయాళం ఎర్నాకుళం | గ్రీన్ టెక్/కల్ టిస్ హాలెండ్ (ఇంకా అంగీకారం కుదర లేదు) | ప్లాంట్ టిష్యూ కల్చర్ | సాంకేతిక సహాయం |

| | | | |
|---|---|---|---|
| రౌనక్ ఇంటర్నేషనల్ న్యూఢిల్లీ | యూనివర్సిటీ ఆఫ్ అగ్రికల్చర్ "నొవిసాట్" యుగోస్లావియా (అక్టో/నవం/1992) | హైబ్రిడ్ విత్తనాలు | ఆర్థిక-సాంకేతిక సహాయం |
| పదరవ్ పెట్రో కెమికల్స్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ మద్రాసు | పయనీర్ ఓవర్సీస్ కార్పొరేషన్ - అమెరికా (1/1992) | హైబ్రిడ్ విత్తనాలు | ఆర్థిక సహాయం |
| పయనీర్ ఓవర్ సీస్ కార్పొరేషన్ న్యూఢిల్లీ | పయనీర్ ఓవర్సీస్ కార్పొరేషన్(1/1993) అమెరికా | నూరుశాతం హైబ్రిడ్ విత్తనాలపై స్వంత పరిశోధన | |

(బ్రాకెట్‌లలో ఇచ్చిన నెల, సంవత్సరాలు ఒప్పందంలోకి వచ్చిన కాలాన్ని తెలియజేస్తాయి.)

**మూలం:** ఫిబ్రవరి 1993లో అగ్రాలో జరిగిన విత్తనాలపై జరిగిన జాతీయ సదస్సులో కేంద్ర ప్రభుత్వ వ్యవసాయ మంత్రిత్వశాఖ ఉత్తర ప్రదేశ్ వ్యవసాయ మంత్రిత్వశాఖతో కలిసి సంయుక్తంగా సమర్పించిన ఎజెండా పత్రం.

నూతన విత్తన పాలసీపై కంపెనీల ప్రతి స్పందనలు చూద్దాం.

కోయంబత్తూరుకు చెందిన సేన్స్ అండ్ కంపెనీ ప్రతినిధి రామనాధన్ "1966 నుండి మేం విత్తన వ్యాపారంలో వున్నప్పటికీ 1988 చట్టం తర్వాతే మళ్ళీ నూతనోత్సాహన్ని, యౌవ్వనాన్ని పొందాం" అన్నాడు.

పెక్ట్ (MNC) కంపెనీ 3 ఏండ్ల క్రిందట మార్కెట్‌లోకి దిగింది. 15 కోట్ల రూపాయల టర్నోవరు కలిగివున్న ఈ కంపెనీ ప్రత్తి, కూరగాయల విత్తనాల్లో అగ్రస్థానం కోసం ప్రయత్నిస్తోంది. కార్గిల్ కంపెనీ వాళ్ళ విత్తనాలను ఇండియాలో మార్కెట్ చేయడానికి ఒప్పందం కుదుర్చుకున్న ర్యాలిస్ ఇండియా ప్రతినిధి "ప్రొద్దు తిరుగుడు, జొన్న, మొక్కజొన్న విత్తనాలపై కేంద్రీకరిస్తాం. ఎదుగుదల గురించి మాకు చాలా ఆశలున్నాయి" అన్నాడు. 3 సం॥లలో 50 కోట్ల రూ॥ టర్నోవరుకు చేరతామన్నాడు.

ఈ ప్రైవేటు కంపెనీలు ఒక వైపు స్వంత హైబ్రీడ్ విత్తనాలు రూపొందించుకోవడం కోసం ప్రయత్నిస్తూనే, మరోవైపు ప్రభుత్వ రంగంలో వ్యవసాయ యూనివర్సిటీలు, పరిశోధన సంస్థలచే అభివృద్ధి చేయబడిన హైబ్రీడ్ విత్తనాలను కూడ మల్టిప్లై చేసి మార్కెట్ చేస్తున్నాయి.

కార్గిల్ సీడ్స్ ఇండియా లిమిటెడ్ అనే అమెరికన్ గుత్త సంస్థ బ్రాంచి రూ. 7 కోట్ల పెట్టుబడితో విత్తనాల పరిశోధన కోసమూ, ప్రాసెస్ చేయడం కోసమూ పెద్ద ప్లాంటును నెలకొల్పింది. కార్గిల్ సంస్థ తన మార్కెట్ గురించి కూడ చాల ఆశాజనకంగా వుంది. "కార్గిల్ సంస్థ మన దేశానికి అవసరమైన 8000 టన్నుల పొద్దు తిరుగుడు విత్తనాల మార్కెట్‌లో 25% వాటా సంపాదించడంపై దృష్టి పెడుతుంది." అని ఆ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ హామిల్టన్ "ది ఎకనమిక్ టైమ్స్" పత్రికకు చెప్పారు.

మన దేశంలో పొగాకు కొనుగోలు చేసిన ఐ.ఎల్. టి.డి కంపెనీ (ILTD) ప్రస్తుతం ఐ.టి.సి. గా పేరు మార్చుకుని పొగాకు రంగంలోనే గాక అనేక రకాల వుత్పత్తుల్లో విత్తనాల రంగంలోకి కూడ ప్రవేశించింది. ఆదర్శ్ పేరుతో వస్తున్న విత్తనాలు వీరివే. ఈ కంపెనీ హైద్రాబాద్ జనరల్ మేనేజర్ ధీరేంద్ర కుమార్ 'బిజినెస్ ఇండియా' పత్రికతో మాట్లాడుతూ " 7 నెలల్లో 200% అభివృద్ధి (3 రెట్లు) సాధించాం" అని గర్వంగా చెప్పాడు.

ఇప్పటికే అనేక రాయితీలు పొందిన ఈ ప్రైవేటు, గుత్తకంపెనీలు చట్టాల్లో వున్న కొద్ది పాటి షరతులను కూడ ఎత్తి వేయాలని డిమాండు చేస్తున్నాయి. పెద్ద MNC లలో ఒకటైన హెక్స్ట్ (HOECHST) ప్రతినిధి ఇలా అంటున్నాడు.

"దిగుమతి సుంకాలను తొలగించడం (రద్దు చేయడం) ఆహ్వానించదగింది. ఇది తాజా విత్తనాలు, పరిశోధనా సామగ్రి, స్వేచ్ఛగా రావడానికి అవకాశం ఇస్తుంది. మా మార్కెట్, షేర్లు పెరుగుతాయి. కొత్త హైబ్రీడ్‌ను తేవడం తేలికవుతుంది. ఇప్పటికే రంగంలో వున్న కంపెనీలతో పోటీ పడడానికి, గుత్త కంపెనీలు తమ సామాగ్రిని తయారు చేసుకోడానికి ఇది తోడ్పడుతుంది. అయితే ఇక మిగిలిందేమంటే ప్రభుత్వం, దాని సంస్థ అయిన జాతీయ మొక్కల జన్యు వనరుల బ్యూరో (NBPGR) అనుసరిస్తున్న జాప్యంను నివారించడమే షరతులు. తొలగించి టెక్నాలజీని స్వేచ్ఛగా దేశంలోకి వచ్చేటట్లు చూడడమే."

ఈయన మాట్లాడినది 1988 విత్తన పాలసీలోని ఒక షరతు గురించి. అందులో ఒక వైపు స్వేచ్ఛగా విత్తనాల దిగుమతిని అనుమతిస్తూనే ఆదిగుమతి చేసుకునే విత్తనాల్లోంచి కొద్ది శ్యాంపిల్స్‌ను మన జీన్ బ్యాంకు NBPGR కు ఇవ్వాలని కోరుతున్నారు. కార్గిల్ కంపెనీ ప్రతినిధి జాన్‌నేఫ్‌కిన్స్ ఈ విషయం గురించే చెప్తూ.

"సం॥ల తరబడి మిలియన్ల డాలర్లు ఖర్చు పెట్టి అభివృద్ధి చేసిన రకాల్ని తమతోపాటు ఇతరులు పంచుకోడాన్ని ఏ కంపెనీ అనుమతించదు. ఇది మేధోసంపత్తి హక్కులకు సంబంధించిన సమస్య" అన్నాడు. దీని అర్థం స్పష్టమే.

ఒక వైపు ప్రైవేటు కంపెనీలు తమకు సంబంధించిన విత్తన రకాలపై, విజ్ఞానంపై తమ గుత్తాధిపత్యం వుండాలని కోరుకుంటూనే మరోవైపు ప్రభుత్వ రంగంలోని విజ్ఞానం మాత్రం తమకు ఎలాంటి ఆటంకం లేకుండా అందాలని కోరుకొంటున్నారు. ప్రభుత్వ జీన్ బ్యాంకునుండి జర్మ్‌ప్లాజంను నిరాటంకంగా సప్లై చేయాలని కోరుకుంటున్నారు. 28-2-93 నాటి 'ది ఎకనమిక్ టైమ్స్' పత్రికలో వాషింగ్‌టన్ నుండి వ్రాసిన వార్త ఇటీవలి ప్రపంచ బ్యాంకు రిపోర్టు భారత విత్తన పరిశ్రమ గురించి ఏం చెప్పిందో బయట పెట్టింది:

"విత్తన తయారీ, పరిశోధన, విత్తనాల మల్టిప్లికేషన్, విత్తనాల మార్కెటింగ్‌లలో ప్రైవేటు రంగానికి లాభాలు సంపాదించి పెట్టడంలో అటు అభివృద్ధి చెందుతున్న దేశాల్లోనూ, పారిశ్రామిక దేశాల్లోను ప్రభుత్వరంగం మంచి తోడ్పాటు పాత్ర నిర్వహించింది. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో కూడ ఈ ప్రభుత్వ రంగ విత్తన పరిశ్రమ అంతం కాకూడదు" ఇదీ ఆరిపోర్టు ఇచ్చే సలహా. అంతేకాదు.

ప్రపంచంలోని మొదటి 10 విత్తన మార్కెట్‌లలో ముందుండే ఇండియా విత్తన మార్కెట్‌లో ప్రభుత్వరంగం ప్రైవేటు రంగం అభివృద్ధికి ఎంతగా తోడ్పడిందో

ప్రచురించింది. ప్రైవేటు విత్తన పరిశ్రమ గడిచిన దశాబ్దంలో ఎంతవేగంతో పెరిగిందో ప్రచురించింది.

1990లో 7 నుండి 8 వందల కోట్ల రూ॥ విత్తన వ్యాపారం జరిగినట్లు అందులో 30% ప్రైవేటు కంపెనీలు చేసినట్లు చెప్పింది. భారత దేశంలో మొత్తం రైతులు వుపయోగించే విత్తనాల పరిమాణంతో పోల్చినపుడు ఈ వాణిజ్య మార్కెట్లో అమ్మిన విత్తనాలు అతి తక్కువే. అయినా బ్రిటన్, కెనడా, జర్మనీ వంటి దేశాల్లో అమ్ముడుపోయిన ముఖ్య ధాన్యాలు, పప్పుగింజల విత్తనాలకన్నా ఈ మార్కెట్లో ఎక్కువ విత్తనాలు అమ్ముడు పోయాయి.

ఈ రిపోర్టు ప్రైవేటు కంపెనీలచే విత్తనాల తయారీకి వాడిన జర్మ్ ప్లాజంలో అధిక భాగం ప్రభుత్వరంగ జాతీయ విత్తన కార్పోరేషన్, రాష్ట్రాల విత్తన కార్పోరేషన్ల నుండే పొందాయని కూడ బయట పెట్టింది.

అందుకే మందుల రంగంలో మన భారత మందుల సంస్థ (IDPL) తయారు చేసిన పునాది మందుల్ని ప్రైవేటు కంపెనీలు చక్కగా మార్కెట్ చేసి లాభాలు సంపాదించుకున్నట్టుగానే విత్తన రంగంలో కూడ ప్రభుత్వరంగ సంస్థలు కల్పించిన పునాదిరంగ అవకాశాల్ని (Infra-structure) తమకు అనుగుణంగా కొనసాగనివ్వాలని కోరుకుంటున్నాయి.

ప్రపంచ బ్యాంకు ఈ గుత్త కంపెనీల సేవలో వుండేట్లుగా మన ప్రభుత్వం పాలసీలు ఎలా తయారు చేయ్యాలో ఎప్పటికపుడు శాసిస్తూ వస్తోంది. ఆగస్టు 23 - 29, 1992 నాటి 'సండేమెయిల్' పత్రిక అలాంటి ప్రపంచ బ్యాంకు రిపోర్టు గురించి VVP శర్మ వ్యాసాన్ని ప్రచురించింది. ఆయనిలా అంటున్నాడు.

"కేంద్ర క్యాబినెట్ మీటింగు లెప్పుడు జరగాలన్న దాన్ని, అందులో ఏం చర్చించాలి అన్నదాన్ని ప్రపంచబ్యాంకు శాసిస్తోందా? జాతీయ విత్తన పథకం - 3 (NSP - III) ను సమీక్షిస్తూ, బ్యాంకు తానుకోరినట్లుగా జాతీయ విత్తన కార్పోరేషన్ (NSC) స్టేట్ ఫారమ్స్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా (SFCI) లను విలీనం చేయాలన్న ప్రతిపాదనకు జూన్ 15 లోగా కేంద్ర క్యాబినెట్ ఆమోదించాలని చెప్పింది".

ఆ రిపోర్టు రాష్ట్రాల విత్తన కార్పోరేషన్లకు ఎంతెంత రుణాలు ఇవ్వాలో అవి ఏ పథకాలు చేపట్టాలో కూడ సూచించింది. ఇంకా ఆయనిలా వ్రాశాడు. " ఈ రిపోర్టు 'మే'లో తయారు చేయబడింది. మార్చిలో మొదలైన సమీక్ష అప్పటికి పూర్తి అయింది. ప్రపంచ బ్యాంకు జూన్ 15లోగా క్యాబినెట్ ఆమోదాన్ని కోరింది. అయితే ఈ గడువుకు నెల రోజుల ముందుగానే విడుదలైన రిపోర్టు ఎన్.ఎస్.సి, ఎస్.ఎఫ్.సి.ఐ. (NSC, S.F.C.I) ల విలీనకరణ పథకాలు పూర్తిగాకుంటే నిధులు ఇచ్చేది లేదని చెప్పింది."

ఎంత కంట్రోలు! తమకంటూ ఆత్మాభిమానం, జాతీయత ఏ కోశానాలేని పాలకులు ఎంతటి లొంగుబాటును ప్రదర్శించగలరో ఇంతకన్నా నిదర్శనాలేం కావాలి?

డంకెల్ ప్రతిపాదనల్లో పేటెంట్ హక్కుల్ని గుర్తించడం ద్వారా ఈ పరాధీనత పరాకాష్టకు చేరుతుంది. మనదేశంలో మన అవసరాలకోసం విత్తనాలు గాక సామ్రాజ్యవాదులు నియంత్రతలో వారి ఆదేశాల మేర విత్తనాలు వాడాల్సి వస్తుంది.

# ఇరిగేషన్ పాలసీ : ఎప్పటికీ పూర్తిగాని ప్రాజెక్టులు

1947కు పూర్వం బ్రిటిష్ వలసవాదం మన పూర్వపు ఆసియాటిక్ గ్రామీణవ్యవస్థలో రూపొందించిన చెరువులు, ఇతర చిన్ననీటి వనరుల్ని పట్టించుకోకుండా ఎలా నాశనం చేసిందో కాటన్ మాటల్లోనే చూశాం. అయితే పంటలన్నీ నాశనమై పన్నులుకూడ వసూలుకాని దశలో ఎంతోకొంత ప్రాంతంలో తనకు పన్నులు గ్యారంటీ చేసుకోవడం కోసం వలస ప్రభుత్వం కాటన్ చేత కొద్దిపాటి నీటిపారుదల పథకాలు అమలు జరిపించడానికి పూనుకుంది. దక్షిణ భారతదేశంలో కావేరి, పెన్న, కృష్ణ, గోదావరి వంటి నదులపై కాటన్ కట్టిన ప్రాజెక్టులు (పథకాలు) ఆక్రమంలోనివే. అయితే అదేకాలంలో మిగిలిన చెరువుల్ని, చిన్ననీటివనరుల్ని పట్టించుకోని విధానం అలాగే కొనసాగింది. ఫలితంగా ప్రాంతాల అభివృద్ధిలో తీవ్రమైన అంతరాలు ఏర్పడ్డాయి.

1947 తర్వాతి పాలకులకు స్వతంత్ర విధానాలను అవలంబించగల సత్తావుంటే విప్లవం తర్వాత చైనాలో కొద్దికాలంలో సాధించగలిగినట్లే సమగ్ర నీటిపారుదల పథకాలు చేపట్టడం సాధ్యపడేది. కరువు, వరదల నివారణ వీలుపడి దేశంలో సాగుకు వీలుపడే భూమి విస్తీర్ణం గణనీయంగా పెరిగివుండేది. అయితే తమకంటూ ఏ స్వంతవిధానమూ లేని మనదేశపాలకులు నీటిపారుదల విషయంలో బ్రిటిష్ వాడి పరిపాలనా కాలంలో నాశనమైన చెరువులు, కుంటలు, చిన్న చిన్న కాల్వలు, నదులపై అక్కడక్కడా అడ్డుకట్టలుకట్టి పారించుకోవడం వంటి వాటిని పునరుద్ధరించడంపై దృష్టి పెట్టలేదు. ఉత్తరభారతదేశంలో వున్న గంగనుండి దక్షిణాన వున్న కావేరి వరకు గల నదుల్ని కలుపుతూ సమగ్రంగా వున్న నీటినంతటినీ వినియోగంలోకి తేవడం ద్వారా ఒకవైపు వరదల్ని నివారించుకుంటూ, మరోవైపు విస్తారమైన భూభాగాలను, ఎత్తైన ప్రాంతాలతో సహా సాగులోకి తేవడం వీలయ్యేది.

ఋతుపవనాల ద్వారా వచ్చే వర్షం ఎంతో ముందే లెక్కగట్టుకోగలిగిన వాతావరణ పరిశోధనా శాస్త్రం (Metereology) మనకు అందుబాటులో వుంది. ఆ విజ్ఞానాన్ని ప్రజల ప్రయోజనం కోసం వినియోగపెట్టిన పరిస్థితి లేదు.

పైగా సామ్రాజ్యవాదుల వలసపాలన కాలంలో అనుసరించినట్లే అడవుల్ని తమ పారిశ్రామిక అవసరాలకోసం ఇష్టం వచ్చినట్లు నాశనం చేసే పద్ధతి కొనసాగడంతో (పేపర్ పరిశ్రమలకు గుజ్జు వగైరాలకోసం) విస్తారమైన, సంపన్నమైన అడవులన్నీ నాశనం కావడంతో వర్షపాతంపై కూడ దాని ప్రభావం పడింది. ఋతుపవనాల వల్లపడే వర్షాల కన్నా మన ఆంధ్రకోస్తా తీరంలాంటి చోట్ల తుఫాన్ల వల్లవచ్చే వర్షంపై ఆ ధారపడాల్సిన దుస్థితి వచ్చింది.

ఈ 47సం॥ "స్వతంత్ర" పాలనలో దేశంలో 7 పంచవర్షప్రణాళికలు అమలైన తర్వాత కూడ భూములు సాగు అందునా నీటిపారుదల కల్పించబడిన భూమి వివరాలు చూద్దాం:

| వివరం | దేశం | రాష్ట్రం |
|---|---|---|
| | కోట్ల ఎకరాలు | |
| మొత్తం భూమి | 82.18 | 6.86 |
| అడవుల క్రింద | 16.69 | 1.57 |
| నికరసాగు భూమి | 35.27 | 2.76 |
| నీటిపారుదల వున్నభూమి | 16.00 | 0.88 |

ఈ పట్టికలో చూపిన ప్రకారం నికరసాగు వసతివున్న భూమి అంతా ప్రాజెక్టుల క్రింద వుందనుకొంటే పొరపడినట్లే. రైతాంగం తమ చొరవతో తాము నిలబెట్టుకున్న చెరువులు, కుంటలు, చిన్ననీటిపారుదల ద్వారా నిలబెట్టుకున్న నీటిపారుదల ప్రాంతమే ఇందులో ఎక్కువ. మన రాష్ట్రంలో పరిస్థితి చూస్తే మొత్తం నికరసాగులో వున్న భూమిలో చెరువులక్రింద 22శాతం, బావులక్రింద 32 శాతం వుంది.

## పెరుగుతున్న ప్రాజెక్టుల అంచనాలు – తరుగుతున్న నిధుల కేటాయింపులు

సామ్రాజ్యవాదులనుండి పదులవేల కోట్ల రూ॥ అప్పులు తెచ్చి భారీనీటి పారుదల ప్రాజెక్టులు కట్టిన తర్వాత కూడ పరిస్థితి ఇది – ఈ పథకాలు అమలు జరిగిన కాలం కూడ ప్రధానంగా హరిత విప్లవకాలం. ప్రజావిప్లవ వెల్లువను అడ్డగించడంకోసం ఒకవైపు-సామ్రాజ్యవాదుల యంత్రపరికరాలు, ఎరువు, పురుగుమందులు అమ్మకంకోసం అవసరమైన పునాది నిర్మాణంలో భాగంగానే ఈ భారీనీటిపారుదల ప్రాజెక్టులు రూపొందించబడ్డాయి. సామ్రాజ్యవాదులనుండి అప్పులు ఎన్నితెచ్చినా దేశబడ్జెట్‌లో వ్యవసాయ రంగపు కేటాయింపులు తక్కువ కావడంతో నిర్మాణం అనుకున్న కాలానికి పూర్తిచేయలేకపోవడం వల్ల ప్రాజెక్టుల నిర్మాణం ఖర్చులు అంచనాలను మించి భారీయెత్తున పెరిగాయి.

మనం నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణ వ్యయాన్నే చూస్తే 1955లో వేసిన అంచనా 91.12 కోట్లు అయితే, 7వ ప్లాను కాలం నాటికే 849.63 కోట్లకు పెరిగింది. అంతఖర్చు చేసినా ఇంకా ప్రాజెక్టు పూర్తికాలేదు. 7వ పంచవర్ష ప్రణాళిక మధ్యలో వేసిన అంచనాల ప్రకారం దేశంలో 181 మేజరు ప్రాజెక్టుల వ్యయం 13,154.13 కోట్లు రూపాయల నుండి 32,633.24 కోట్లు రూపాయలకు పెరిగింది. పెరిగిన ఈ అంచనాలలోని తేడాయే 19,479.11 కోట్లు రూ॥ . అయితే ఈ 7వ పంచవర్ష ప్రణాళికలో ఇందుకు కేటాయించింది కేవలం 11,555.56 కోట్ల రూ॥ మాత్రమే.

అంటే మొత్తం కేటాయింపులకంటే పెరిగిన నిర్మాణ అంచనాలే ఎక్కువగా ఉన్నాయంటే ఇక ఆ ప్రాజెక్టులు ఎప్పటికీ పూర్తిచేయలేరని వేరుగా చెప్పనవసరంలేదు.

బ్రిటిష్ పాలకుల విధానాల కొనసాగింపు కూడా మనం ఇక్కడ చూస్తాం. ఇంతకు ముందే చెప్పుకున్నట్లు దేశంలో భారీ నీటిపారుదల ప్రాజెక్టుల క్రింద సాగవుతున్న భూమికన్నా రైతాంగం తమ స్వంత చొరవతో ఏర్పరచుకున్న బావులు, చెరువులు వంటి వాటి క్రిందే సేద్యం ఎక్కువ. అయితే భూగర్భజలాల వాడకం పెరిగింది కానీ ఆ మట్టాన్ని కొనసాగించేటట్లుగా వాటర్ షెడ్ మెయిన్‌టెయినెన్స్ వంటి పథకాలకు కేటాయింపులేదు. దానితో భూగర్భజలాలపై ఆధారపడి సేద్యం సాగే ప్రాంతాల్లో అనేక చెడు ఫలితాలు కూడా మొదలయ్యాయి. నీటిమట్టం తరిగే కొద్దీ ఇంకా బోర్లు లోతులు పెరుగుతున్నాయి. దాంతో దీర్ఘకాలంలో తీవ్రమైన చెడుపర్యవసానాలను చవిచూడాల్సి వస్తుందని నిపుణులు ఊహిస్తున్నారు.

పైగా 8వ పంచవర్ష ప్రణాళిక గురించి 1993 ఆగస్టు 'యోజన' వ్యవసాయరంగం ప్రత్యేక సంచికలో ప్రణాళికా సంఘం సభ్యుడైన జయంత్ పాటిల్ ఇలా వ్రాస్తున్నారు:

"వ్యవసాయరంగంలో 1950-51 లో రూ.1260 కోట్లున్న (1980-81 రూపాయ మారకపు రేటు ప్రకారం) పెట్టుబడి 1978-79 నాటికి 5246 కోట్ల రూ॥కు పెరిగింది. అయితే 78-79నుండి వ్యవసాయరంగ పెట్టుబడులు క్రమంగా తగ్గిపోయి 1990-91 సంవత్సరానికి 4692 కోట్లుస్థాయికి చేరుకొన్నాయి."

"1950-51 లో మొత్తం పెట్టుబడులలో వ్యవసాయరంగానికి పెట్టిన పెట్టుబడులు 22% కాగా, 1980-81 నాటికి అవి 19%, 1990-91 నాటికి 10%కి తగ్గిపోయింది. నీటిపారుదలపై ప్రభుత్వం పెట్టే పెట్టుబడిపై ఇది ప్రతికూల ప్రభావం చూపింది. 1980-81లో 1735 కోట్లున్న నీటిపారుదల రంగంపై పెట్టుబడులు ఏటా 3.5% చొప్పున తగ్గుతూ 1990-91 నాటికి 1215 కోట్లుకు చేరుకున్నాయి. ఈతగ్గుదల రేటు 7వ ప్రణాళికాకాలంలో మరీ ప్రస్ఫుటంగా 6.1% ఉంది. ఆరవ ప్రణాళికలో ఈ తరుగుదల రేటు 2.2% మాత్రమే".

## నిధుల దిగకోతకు సామ్రాజ్యవాదుల మారిన ప్రాధాన్యతలే కారణం

ఈ రకమైన మార్పు భారత వ్యవసాయరంగంపట్ల సామ్రాజ్యవాదుల వైఖరిలో వచ్చిన మార్పు ఫలితమన్నది స్పష్టమే. అమెరికన్ సామ్రాజ్యవాదులే మన ప్రణాళికల ఆరంభ కాలంలో ప్రభుత్వ పెట్టుబడుల్ని పారిశ్రామిక రంగంనుండి దృష్టిమళ్ళించడం కోసం వ్యవసాయరంగం వైపు మళ్ళిస్తున్నామని చెప్పడం ఇంతకుముందే చెప్పుకున్నాం. వ్యవసాయరంగంలో వాళ్ళ వుత్పత్తుల అమ్మకానికి అనువైన పరిస్థితుల్ని సృష్టించుకోవడం కోసం కూడా ఇలా చేశారు.

అయితే ఇపుడు అమెరికా తన దేశంలోని బహుళజాతి గుత్తసంస్థల (MNC) చేతుల్లో పేరుకుపోయిన ఆహారధాన్యాల నిల్వల్ని మూడో ప్రపంచదేశాల మార్కెట్లోకి కుమ్మరించచూస్తోంది. మనలాంటి దేశాలలో ఆహారపంటల ఉత్పత్తిని వీలైనంత తగ్గించడమే దాని లక్ష్యం. అందులో భాగమే మన ప్రణాళికల్లో ఈ నిధుల తగ్గింపు. నర్మదా ప్రాజెక్టుకు ప్రపంచబ్యాంకు ఇస్తానన్న అప్పును కూడా ఆపివేసింది.

అంతేకాక అక్కడక్కడా ప్రాజెక్టుల కోసం ఇస్తున్న అప్పులు కూడా షరతులతో ముడి పెడుతున్నారు. ఆంధ్రరాష్ట్రంలో శ్రీరాంసాగర్ ప్రాజెక్టుకోసం 150కోట్ల రూ॥ అప్పు ఇస్తూ ఆ ప్రాజెక్టు క్రింద వరి పంటలాంటి ఆహారధాన్యాలను పండించడానికి వీల్లేదన్న షరతులను జోడించారు. చిత్తం ప్రభూ అంటూ ఆ షరతులను అంగీకరించి మన పాలకులు ఆ అప్పు తెచ్చారు.

ప్రపంచబ్యాంకు ఇటీవల కాలంలో తాజాగా ఇచ్చిన "అప్పులు పాత ప్రాజెక్టులున్న ఏరియాలు ప్రధానంగా డ్రైనేజీల (మురుగుకాల్వల) రిపేర్లకోసం ఉపయోగించడంలో కూడా ఈ మార్పును మనం గమనించవచ్చును. తుఫాను అత్యవసర పునర్నిర్మాణ పథకం (CFRP) క్రింద ప్రస్తుతం కోస్తా జిల్లాలో వందలకోట్ల రూపాయల ప్రపంచబ్యాంక్ నిధులు ప్రధానంగా డ్రైన్లపనులకు, రోడ్లకే వినియోగించబడడం ఇందులో భాగమే.

డంకెల్ ప్రతిపాదనలల్లో ఆహారధాన్యాలను తప్పని సరిగా దిగుమతి చేసుకోవాలన్న షరతు మనపై పెట్టడంలోని వుద్దేశం ఇదే. దీనిప్రకారం ఇక నీటిపారుదల రంగంలో ప్రభుత్వపు పెట్టుబడులు ఇప్పుడున్న స్థాయికంటే కూడా ఇంకా తీవ్రంగా కోతకు గురిఅవుతాయన్నది నిస్సందేహం. గతంనుండి సామ్రాజ్యవాదం అనుసరిస్తున్న పద్ధతి ప్రాంతాల మధ్య అంతరాలు పెంచడం - కొన్ని ప్రాంతాలని పట్టించుకోకుండా నిత్యం క్షామ పీడిత ప్రాంతాలుగా వుంచి పాలకవర్గాలకు అవసరమైన కూలీలను సప్లయ్‌చేసే కేంద్రాలుగా వుంచుకోవడం ఇంకా కొనసాగుతుందన్న మాట.

## పెరుగుతున్న నీటి తీరు వాసెస్సులు – కరెంటు బిల్లులు

మరొకవైపు ప్రభుత్వ ప్రాజెక్టుల క్రిందా, చెరువులక్రిందా నీటిపారుదల వసతి వున్న భూములపై నీటి తీరువా పన్నులు వేసింది. బెటర్‌మెంట్ పన్నుల పేరుతో కూడ, నీటి పన్నులు సాగుతున్నాయి. డ్రైనేజీ నిర్వహణను చేపట్టకపోయినా డ్రైనేజీ సెస్సులు కూడా పెంచుతూ వచ్చారు. వున్న పన్ను రెట్టింపు స్థాయికి కూడా పెంచిన సందర్భాలున్నాయి.

డంకెల్ ప్రతిపాదనల ప్రభావం ఈ అంశంపై కూడా పడుతుంది. సబ్సిడీలను లెక్క వేసే పద్ధతిలో ఇది కూడా వుంది ఉదాహరణకు ఆంధ్రరాష్ట్రంలో 1992 వరకు మేజరు, మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టులపై కలిపి షుమారు 3325 కోట్ల రూ॥ ఖర్చుపెట్టారు. దీనిపై రావలసిన ఆదాయశాతం నికరంగా నిర్ణయిస్తారు. 3% ఆదాయం రావాలని నిర్ణయిస్తే సంవత్సరానికి రూ. 100కోట్ల నీటిపన్ను ఈ ప్రాజెక్టుల క్రింద సాగయ్యే ప్రాంతాలనుండి రావాలి. ప్రస్తుతం నీటి తీరువా క్రింద 10కోట్ల రూ॥ వసూలవుతుందనుకుంటే (ఊహించు కోవడం కోసం) మిగిలిన 90 కోట్లరూ॥ ప్రభుత్వానికి రావలసిన ఆదాయం రానట్లుగా లెక్కకట్టి అదికూడా సబ్సిడీగానే భావిస్తారు. డంకెల్ ప్రతిపాదనల ప్రకారం సబ్సిడీలను ఉపసంహరించడం అంటే నీటిపారుదల పన్నును ప్రస్తుతం వున్నదానికి 9రెట్లు పెంచాలన్న మాట!

అలాగే వ్యవసాయంలో నీటిపారుదలకోసం బావులనుండి నీరుపైకి తోడే పద్ధతి కూడా పెరిగింది. గతంలో డీజిల్ లేదా కిరోసిన్ ఇంజన్లను ఉపయోగించి నీరుతోడే పద్ధతినుండి క్రమంగా విద్యుచ్ఛక్తి(కరెంటు) మోటర్ల వాడకం పెరిగింది. పారిశ్రామిక అవసరాలకోసం వాడే కరెంటుకు సబ్సిడీ రేట్లతో కరెంటు సప్లయ్ చేయడం ఒక విధానంగా చాలాకాలం నుండి అనుసరిస్తున్నారు. అలాగే మనరాష్ట్రంలో కరెంటును వ్యవసాయదారులు వినియోగానికి ఇవ్వడంలో కూడా కొన్ని రాయితీలు ప్రకటించారు. తెలుగుదేశం ప్రభుత్వకాలంలో మోటారు హార్సుపవర్ (HP) ను బట్టి సం॥ 1HP కి 50రూ॥చొప్పున వసూలుచేసారు. ఎంతకరెంటు వాడుకున్న శ్లాబు (Slab) రేటున లెక్కకట్టారు. కాంగ్రెస్ ప్రభుత్వం విద్యుత్ బోర్డుకు నష్టాలు వస్తున్నాయంటు వ్యవసాయదారుల కరెంటు రేట్లు పెంచింది. రూ. 50 ఉన్నదాన్ని 1 H.P కి 150రూ॥కు కూడా పెంచింది. అదేమని అప్పటి ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డిని అడిగితే ఆంధ్రప్రదేశ్ ఎలక్ట్రిసిటీబోర్డు తన అభివృద్ధికోసం ప్రపంచ బ్యాంకును అప్పుఅడిగితే దాని పెట్టుబడిపై 12% లాభాలు చూపించాలని షరతు పెట్టిందనీ అందువల్ల పెంచాల్సివచ్చిందని చెప్పారు.

గతంలో రైతాంగం కరెంటు శ్లాబురేటును ఇచ్చినందువల్ల బోర్డు కోల్పోయే ఆదాయానికి బదులు ప్రభుత్వం ఆ లోటు పూడ్చేది. ఇదికూడా సబ్సిడీ క్రిందకే వస్తుంది.

ఇప్పుడున్న నూతన పథకాల ప్రకారం ప్రభుత్వం కరెంటు ఉత్పత్తిని కూడా గుత్తసంస్థల చేతిలో (విదేశీవాటితో సహా) పెట్టబోతోంది. ప్రైవేటురంగంలో వాళ్ళు ఉత్పత్తిచేసి ప్రభుత్వానికి ఇస్తారు. ప్రభుత్వం దాన్ని వినియోగదార్లకు సరఫరా చేసి చార్జీలు వసూలు చేసుకోవాలన్న మాట.

డంకెల్ ప్రతిపాదనల ప్రకారం సబ్సిడీల రద్దుతో రైతాంగపు కరెంటు బిల్లులు కూడా తడిసి మోపెడవుతాయి. ఇండ్లకు వసూలుచేసే కరెంటుకు యూనిట్ రేటు లెక్కన వసూలు చేసినట్లే ఇకరైతులు వాడే కరెంటు మోటర్లకు కూడా చెల్లించుకోవాల్సివస్తుంది.

అందువల్ల గతంలో లాగా పునాదిరంగం (INFRASTRUCTURE) పై (నీటిపారుదల, కరెంటు వగైరా) పెట్టుబడుల కోసం సామ్రాజ్యవాదులు ప్రభుత్వానికిచ్చే అప్పులు తగ్గించబడతాయి. వీలైన అన్నికోణాల్లోకి ప్రవేటు పెట్టుబడి అందునా నేరుగా విదేశీ పెట్టుబడి చొరబడుతుందన్న మాట.

ఈ విధంగా ప్రపంచం మొత్తం భూమిలో 11% మాత్రమే సాగుకు అనువుగా ఉండగా మనదేశంలో 50% పైగా సాగవడానికి అవకాశము ఉన్నా నీటివనరులు ఉండికూడా అందుబాటులోకి రాని పరిస్థితే కొనసాగుతుంది.

# వ్యవసాయ పంటల మద్దతుధరలు

పారిశ్రామిక ఉత్పత్తులను వుత్పత్తిదారులే నేరుగా వినియోగదార్లకు పంపిణీ చేసుకుంటున్నారు. అయితే దేశజాతీయాదాయంలో 1/3వంతు అందించే వ్యవసాయ పంటల మార్కెటింగును ఆ పంటను పండించే రైతు నేరుగా చేసుకోలేడు. పండించే రైతుకు, వినియోగదారునికి మధ్య మార్కెటింగు ఏజన్సీలు ఏర్పడడానికి అవకాశం కల్గింది ఇందువల్లే. ప్రజాసంక్షేమాన్ని కోరుకువే ప్రభుత్వాలయితే ప్రజలందరకు అవసరమయిన ఆహార ధాన్యాలను ప్లాను ప్రకారం ఉత్పత్తిచేయడానికి రైతాంగానికి మార్గదర్శకత్వం వహించి ఆపంటల మార్కెటింగు తానే చేసి దేశంలోని ప్రజలకు అవసరాన్ని బట్టి ఒక రాష్ట్రం నుండి మరొక రాష్ట్రానికి చేర్చవచ్చు. ఫెడరల్ విధానం నిజంగా అమలు జరిగితే రాష్ట్రాలు అయినా ఆరకమయినా బాధ్యత వహించి ఉత్పత్తిదారునికి గ్యారంటీ వుండేలాగా ప్లానుచేసి విభిన్న ప్రాంతాలలో వున్న వాతావరణం, నేలస్వభావం, నీటివనరులను బట్టి పంటలను ప్లాను చేసి పండించేట్లు చేయవచ్చు. మరోవైపు ప్రజల అవసరాలు తీరేట్లుగా ఉత్పత్తి ఖర్చులకే వినియోగదారులకు మార్కెట్‌లో అందించవచ్చు.

అయితే ప్రభుత్వం ఆ బాధ్యతను చేపట్టక పోవడంతో మార్కెటింగ్‌లో మధ్య దళారీ వ్యవస్థ ఏర్పడింది. మార్కెట్‌ను కంట్రోలు చేయగల మధ్య దళారుల చేతుల్లో అటు రైతాంగం, ఇటు వినియోగదారులు నలిగిపోతున్నారు. బ్రిటిష్ వలసపాలనకాలంలో దానికి క్రిందిస్థాయివరకు యంత్రాంగం లేకపోవడంతో రైతుల నుండి పంటలు కొనుగోలుకు (ఎగుమతికోసం), తిరిగి దిగుమతులను పంపకం చేయడం కోసం మధ్య దళారులపై ఆధారపడ్డారు. వాళ్ళే పంటలనన్నిటిని తమ చేతుల్లో పెట్టుకొని కృత్రిమ కొరత (బ్లాక్‌మార్కెట్) సృష్టించడం ద్వారా కృత్రిమ కరువులను సృష్టించి ధరలు పెంచుకోగలిగారు. ప్రజలు ఆకలితో మలమలమాడేట్లు చేశారు.

ఈ మధ్యదళారీ వ్యవస్థనే మన "స్వతంత్ర" పాలకులు కూడ కొనసాగిస్తున్నారు. పాలకులు తమకు కావలసిన లెవీధాన్యం మాత్రం తక్కువ ధరకు సేకరించుకొని చేతులు దులుపుకుంటున్నారు. లెవీగా ప్రభుత్వం నిర్ణయించే రేటుకన్నా మార్కెట్‌లో ధరలే ఎప్పుడూ ఎక్కువ వుండేవి కూడ. 1965కు ముందు ప్రభుత్వం వద్ద వున్న నిల్వలు అతి పరిమితం. అవి కూడా దిగుమతి చేసుకున్న గోధుమలు, బజార్లో మార్కెట్లో కొన్న ధాన్యం తప్ప పెద్దగా నిల్వలు వుండటంగానీ, ప్రజాపంపిణీ వ్యవస్థద్వారా పంపిణీ గానీ వుండేవికావు.

1965లో కేంద్రప్రభుత్వం జాతీయ వ్యవసాయధరల కమీషన్‌ను ఏర్పరచింది. అప్పటిమండి వివిధ రాష్ట్రాల్లో వున్న సగటు ధరను దృష్టిలో వుంచుకొని మద్దతు ధర (Support price) నిర్ణయించబడేది. అయితే చాలా సందర్భాల్లో మద్దతు ధరకన్నా

మార్కెట్లో ధరలు ఎక్కువగా వుండడంతో రైతాంగానికి జరిగిన మేలు అతి తక్కువ. వివిధ సందర్భాల్లో విభిన్న పంటలు పండించే రైతాంగం ఆత్మహత్యలు చేసుకోవలసిన దుస్థితి ఇందువల్లే వచ్చింది.

ప్రభుత్వం వ్యవసాయం కోసం అవసరమైన సరుకుల (ప్రధానంగా కృత్రిమ ఎరువులు రావడం, హరితవిప్లవం తర్వాతే ఇవి పెరిగాయి) ధరలపై ఎలాంటి కంట్రోలు చేయకుండా ఆయా కంపెనీల దోపిడీకి రైతాంగాన్ని బలిపెడుతోంది. రైతాంగం పండించిన పంటలపై మాత్రం తన ఇష్టం వచ్చినంత పన్నులు వసూలు చేసుకుంటుంది. పంటలు ప్రకృతి అనుకూలంగాక పండనప్పుడో, లేక మార్కెట్లో రైతు మధ్యదళారీల దోపిడీకి తీవ్రంగా గురవుతున్న సందర్భాల్లో కూడ కొద్దిపాటి సబ్సిడీలు ఇవ్వడానికి కూడ మొండికేసిన సందర్భాలు అనేకం. పరిస్థితి అర్థం కావడానికి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

## ఆహారధాన్యాలు

వరి, గోధుమ ఇప్పటి మనదేశపు పంటల్లో ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ముతకధాన్యాలు (రాగి, జొన్న, మొక్కజొన్న, సజ్జలు వంటివి) క్రమంగా నీటి పారుదల వున్న ప్రాంతాల్లో ప్రజలకు ప్రధాన ఆహారం కాకుండా పోయాయి. వరి, గోధుమలకు ప్రభుత్వం మద్దతు ధరను ప్రకటిస్తోంది. మిల్లర్ల నుండి లెవీ ధాన్యాన్ని సేకరిస్తోంది.

## వరి

వరిపంటకు గోధుమతో పోలిస్తే ఖర్చు, శ్రమ ఎక్కువయినా బియ్యం సేకరణ ధరను తక్కువగానే నిర్ణయిస్తున్నారు. వరిపై 1980లో వేసిన లెక్కల ప్రకారం బియ్యం అమ్మకాలపై 4%చొప్పన ఊకపై 1% చొప్పన ఆంధ్రప్రభుత్వం 50కోట్లు రూ॥ అమ్మకం పన్నుపొందింది. టుంగ్రో వైరస్ వంటి తెగుళ్ళు వచ్చి ఆంధ్రరాష్ట్రంలో వరిపైరు నాశనమయినపుడు కూడ పండించే రైతుకు ప్రభుత్వం తోడ్పడిందేమీ లేదు.

## గోధుమ

దేశం మొత్తం మీద ప్రధాన ఆహారధాన్యం గోధుమ. అమెరికా వంటి దేశాల్లో కూడ ఈ పంట పండడం వల్ల ప్రభుత్వం అక్కడనుండి దిగుమతి చేసుకోవడానికి చూపిన శ్రద్ధ మనరైతుకు ప్రోత్సాహం ఇవ్వడంపై లేదు. 1974లో దిగుమతి చేసుకున్న గోధుమ ధర టన్నుకు 200 డాలర్లు.

ఆ సంవత్సరం మన రైతుకు చెల్లించింది కేవలం టన్నుకు 134 డాలర్లు మాత్రమే. పైగా మన గోధుమ నాణ్యమైనది కూడ. డంకెల్ ప్రతిపాదనలపై చర్చ జరుగుతున్న సందర్భంలోనే గత సం॥ కూడ ఇదే జరిగింది. మనరైతుకు క్వింటాల్ రూ. 260 చెల్లించ నిరాకరించిన పాలకులు అమెరికానుండి క్వింటాల్‌కు రూ. 517 చెల్లించి దిగుమతి చేసుకున్నారు.

## వాణిజ్యపంటలు – పొగాకు

మనదేశంలో అంతకుముందు లేని పొగాకును బ్రిటిష్ వలసవాదం తన అవసరాలకోసం సుమారు 80సం॥క్రితం ప్రవేశపెట్టింది. మొదటి రోజుల్లో రైతాంగానికి విత్తనాలు ఉచితంగా ఇచ్చి ప్రోత్సాహకాలు కూడ ఇచ్చింది. ఇష్టం వచ్చినట్లు రైతాంగాన్ని కొల్లగొట్టింది.

1947 తర్వాత కూడ, ప్రభుత్వం పొగాకుపై సెంట్రల్ ఎక్సైజ్ సుంకాన్ని, విదేశీమారకాన్ని వసూలు చేసుకుంటుందే తప్ప రైతాంగానికి మాత్రం మద్దతు ధర కోసం చేసిందేమీలేదు. 1983లో మార్కెట్‌లో తీవ్ర సంక్షోభం ఏర్పడినపుడు ఆందోళన చేసే రైతాంగంపై కాల్పులు జరిపి ముగ్గురు మన రైతుల్ని, కర్నాటకరాష్ట్రం నిప్పాణిలో ఆందోళన చేస్తే 9మందిని కాల్చి చంపారు. 1983 ఆందోళన తర్వాతే కనీసం పొగాకు కొనుగోలును నియంత్రించడానికి టుబాకో బోర్డును రంగంలోకి దింపింది. అంతకుముందు వరకు రైతులనుండి పొగాకు వ్యాపారులు కొని డబ్బు ఎగవేస్తుండేవాళ్ళు (తక్కువగా నిర్ణయించినరేట్లుగూడ). అయితే ఇపుడు టుబాకో బోర్డుద్వారా కొంటే కంపెనీలు తప్పనిసరిగా డబ్బుచెల్లించే పద్ధతి మాత్రం రైతాంగం ఆందోళన ద్వారా సాధించుకున్నారు. గత సం॥ కూడ టుబాకో బోర్డు, కేంద్ర ప్రభుత్వాలు వ్యాపారులు పొగాకు రేటును దిగకోస్తే ఎలాంటి హామీ ఇవ్వలేకపోవడం చూశాం. కొన్ని వివరాలు చూద్దాం:

దేశంలో పండే పొగాకు మొత్తం - 80 లక్షల టన్నుల నుండి 130 లక్షల టన్నుల వరకు వుంటుంది. ఈపంటపై ఆధారపడే రైతాంగం 7లక్షలు. 30లక్షల మంది కూలీలు ఈ పంటపై ఆధారపడుతున్నారు. ఈ పంటపై ఎక్సైజు సుంకం ద్వారా రూ. 2,500కోట్లు విదేశమారకం ద్వారా 250 కోట్లు రూ॥ కేంద్ర ప్రభుత్వానికి వస్తుంది. అయితే ఈ పంటపండే మొత్తం విస్తీర్ణం సాగుబడి అయ్యే భూమిలో కేవలం 0.25% మాత్రమే.

మరోవైపు పరిశ్రమద్వారా వచ్చేపన్ను - దేశంలో అమ్మే ప్రతిసిగరెట్టు పెట్టెలోను రూపాయలో, 0-70పై ఎక్సైజ్ సుంకం వుంటుంది. రైతాంగం ఈ పంటద్వారా పొందేదిమాత్రం కేవలం రూ. 200కోట్ల మాత్రమే. విపరీతంగా పెరిగిన ఖర్చులలో రైతాంగానికి మిగులు కూడ అన్ని సంవత్సరాల్లో వుండడం లేదు. అప్పుల్లో కూరుకుపోతున్నారు. మధ్యదళారులు, ఐ.యల్.టి.డి. కంపెనీ వాడు మాత్రం వేలకోట్లు రూపాయలు సంపాదించారు.

## ప్రత్తి

ఈ పంట మనదేశంలో ముఖ్యమైన పంటల్లో ఒకటి. ప్రపంచంలో ప్రత్తి పండే ప్రతి 4 ఎకరాల్లోను 1 ఎకరా మనదేశంలో వుంది. ఈపంటపై 10లక్షల రైతుకుటుంబాలు ఆధారపడివున్నాయి. 1990నాటికి మన ప్రజలకు 1600కోట్లు మీటర్ల(మనిషికి 2మీ॥ మాత్రమే అంచనా వేశారు) గుడ్డ అవసరం కాగలదని అంచనావేశారు. దీనికోసం $1\frac{1}{2}$ కోటి బేళ్ళు (150 లక్షలబేళ్ళు) దూది కావాలని అంచనా (1బేలు = 170 కిలోలు). అయితే ఈ పంట ఇటీవల పెరుగుదల రేటు తగ్గి 120 లక్షల బేళ్ళు మాత్రమే పండుతోంది.

3కిలోల ప్రత్తినుండి 1కిలోదూది, 2కిలోల గింజవస్తుంది. కిలోదూదినుండి 8మీ॥గుడ్డ తయారవుతుంది. విత్తనాల నుండి నూనెను కూడ తీస్తున్నారు.

గింజరేటు కిలో రూ. 5 వేసుకున్నా - గుడ్డధర సగటున మీటరు రూ. 20 చొ॥న అమ్ముకున్నా 165రూ. వుత్పత్తి వస్తుంది. అయితే రైతుకు ప్రస్తుతం తాజాగా ఇస్తున్న ధర కిలోకు 14రూ॥ మాత్రమే వుంది. మిగిలిందంతా మధ్యదళారులు, పారిశ్రామికవేత్తలు, ప్రభుత్వం కలిపి పంచుకొంటున్నారు. (కిలోకు - రూ. 151లెక్కన) మరొకవైపున ప్రభుత్వం కృత్రిమ రసాయనాలతో తయారయ్యే సింథటిక్ నూలుకు, విస్కోస్ వంటి వాటికి వున్న

సుంకాలు కూడ తగ్గించి ఆ బట్టలు పరిశ్రమలకు రాయితీనిస్తోంది. దాంతో ప్రత్తి వినియోగం తగ్గి మార్కెట్ ఒడిదుడుకులను రైతాంగం ఎదుర్కొంటోంది.

విత్తనాల సప్లై నాణ్యమైనవి లేనందువల్ల, మార్కెట్లో ఇష్టం వచ్చినట్లుగా పురుగుమందుల కంపెనీలు మోసపూరితంగా కొల్లగొట్టడంవల్ల, ఎరువులు, పురుగు మందుల ధరలు పెరగడంవల్ల మన రాష్ట్రంలో ప్రత్తిరైతాంగం విపరీతంగా నష్టపోయారు. ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో ప్రత్తిరైతాంగం చేసిన అప్పులు తిరిగి చెల్లించలేక పురుగుమందులు తాగి ఆత్మహత్యలు చేసుకున్న విషయం మనకు తెలిసిందే.

ప్రభుత్వం ఏర్పరచిన కాటన్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా (CCI) పై రైతాంగం మద్దతు ధరలకోసం ఎంతో వత్తిడి తెచ్చింది. అయినా రైతాంగం అయిదంటే అయిదుకోట్లు సబ్సిడీఇచ్చి CCI ద్వారా కొనుగోలు చేయించమంటే అంగీకరంచలేదు. ప్రభుత్వం అదే సం॥ బొంబాయి బట్టల మిల్లులకు 500కోట్లు రూ॥ సబ్సిడీలు ఇచ్చింది.

ప్రభుత్వం అనుసరించిన ఈ దుర్మార్గ విధానాలవల్లే ప్రత్తిపండించే విస్తీర్ణం 1980-90ల మధ్య 20లక్షల ఎకరాలనుండి 17.5 లక్షల ఎకరాలకు తగ్గిపోయింది.

## చెఱుకు

రాష్ట్రంలోని, దేశంలోని ప్రధానమైన పంటల్లో చెఱకు ఒకటి. దేశం మొత్తం మీద 32లక్షల హెక్టార్ల భూమిలో 24కోట్ల టన్నుల చెఱకు పండుతోంది. ఆంధ్రరాష్ట్రంలో సుమారు $3\frac{1}{2}$ లక్షల ఎకరాల్లో ఈ పంట పండుతోంది.

దేశంలో సగటున హెక్టారుకు చెఱకు 64.3టన్నులకు, చక్కెర దిగుబడి హెక్టారుకు 10.04 టన్నులకు పెరిగాయి. ఆంధ్రలో సగటున హెక్టారుకు 72.6 టన్నుల చెఱకు, చక్కెర 5.5 టన్నులకు పెరిగాయి.

దేశంలో పండే చెఱకులో 122 మి.టన్నులను మాత్రమే దేశంలోని 385 చక్కెర ఫ్యాక్టరీలు వుపయోగించుకోగల్గుతున్నాయి.

దేశంలో వుత్పత్తయ్యే చక్కెర 20 మి.టన్నులు (2కోట్లటన్నులు). ఇందులో 35% ఎగుమతి చేయాలని ఆలోచన. 5లక్షల టన్నుల చక్కెర ఎగుమతి చేసి250 నుండి 300 కోట్లవరకు సంపాదించానని చెబుతోంది ప్రభుత్వం.

ప్రభుత్వం ప్రతి సంవత్సరం చెరకుకు మద్దతు ధర ప్రకటిస్తూ వస్తోంది. అయితే ఉత్తరాది రాష్ట్రాల్లో టన్ను 500రూ॥ కూడ-కొన్ని రాష్ట్రాల్లో రైతులకు - చెల్లిస్తుండగా మన రాష్ట్రంలో రైతులకు 295 రూ॥ మాత్రమే ప్రకటిస్తున్నారు. (అంటే వంట చెరకుకు అందునా జపాన్ తుమ్మవంటి పర్రభూముల్లో కూడ పెరిగే కట్టెలకు వున్నరేటు కూడలేదు.) ఆంధ్రరాష్ట్రంలో ఆత్మహత్యలు చేసుకొనే రైతుల లిస్టులో చెరకు రైతులను కూడ మన పాలకులు చేర్చగలిగారు.

## పాలకులకేమో పన్నుల పంటలు - రైతులకేమో కన్నీళ్ళు కష్టాలు

పాలకులు చేసే దోపిడి మాత్రం పెరుగుతుంటే రైతు దివాళాలోకి నెట్టబడుతున్నాడు. టన్ను చెరకు నుండి రాష్ట్ర ప్రభుత్వం మొలాసిస్‌ను పారిశ్రామిక అవసరాలకు, సారా

అవసరాలకు ఉపయోగించుకోవడం, ఇతర పన్నులు వేయడం ద్వారా టన్నుకు 1235-67రూ॥ పొందుతుంది - కేంద్ర ప్రభుత్వం టన్నుపై రూ.61-34 మొత్తం మీద రూ. 1297-01 పొందుతున్నాయి. అంటే ఎకరాపై ప్రభుత్వాలు పొందుతున్నది సగటున సుమారు 39,000 రూ॥ కాగా రైతు ఆరుగాలం కష్టపడి పండిస్తే ఖర్చులు పోను పొందగల్గుతున్నది ఎకరాకు కేవలం 640రూ॥లని లెక్కవేశారు.

చెరకు ద్వారా ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం సం॥నికి రూ. 727కోట్ల ఆదాయం పొందుతుంది. దేశం మొత్తంమీద చెరకు పంటద్వారా జాతీయాదాయంలో రూ. 12,000కోట్ల జమ అవుతోంది.

తాజాగా వచ్చిన వార్తప్రకారం లిబరలైజేషన్ పాలసీలో భాగంగా మొలాసిస్‌పై కంట్రోలు ఎత్తివేయడం వల్ల మొలాసిస్ ధర విపరీతంగా పెరిగింది. అయినప్పటికీ ఆ వచ్చేది పాలకులకే తప్ప - చెరకు రైతుకు మిగిలేది మాత్రం చేదే.

ఇదే పరిస్థితి ఇతర పంటల విషయంలో కూడా వుంది. పారిశ్రామిక అవసరాలకు రైతాంగం పంటలు పండించేట్లు అలవాటు చేయడం, ఆ తర్వాత ఆ పంటనుండి బయటపడకుండా చేసి అతితక్కువ రేట్లకు కొల్లగొట్టడం అన్ని వాణిజ్యపంటల లోను చూస్తాం. ఆంధ్రరాష్ట్రంలో పండే ముఖ్యమైన పంటలలో నూనెగింజల, అందునా ప్రధానంగా మెట్టప్రాంతాల్లో వర్షాధారంపై పండించే వేరుశనగరైతుల పరిస్థితిగానీ, మిర్చిరైతుల పరిస్థితిగానీ, జనపనార, జీడిపిక్కలు వగైరా ఏ పంటలు పండించే రైతులు పరిస్థితి కూడ ఇదే... మహరాష్ట్ర నాసిక్‌లో వుల్లిపాయల గిట్టుబాటుధరకోసం పెద్ద ఎత్తున ఆందోళన చేసిన విషయం మనకు తెలిసందే.

ప్రభుత్వం ఏ పంటలపై పన్ను ఎలా వేసుకోవచ్చో, లేక విదేశాల ఎగుమతికి వీలయితే ఆర్డరిచ్చి విదేశీమారకం సంపాదించవచ్చన్న ఆలోచన తప్ప పండించే రైతాంగానికి ప్రోత్సాహకాలివ్వడమన్నది అరుదుగా జరుగుతోంది. అయితే, ఈ ధరల విధానంలో కూడ భూస్వామ్య వర్గాలు, ధనిక రైతాంగం తట్టుకొని నిలబడ గల్గుతున్నారు. లాభాలు సంపాదించగలుగుతున్నారు. కారణం తమకు అనుకూలంగా మార్కెట్ రేట్లు వచ్చేవరకు వాళ్ళు పంటలను ఆపుకోగలుగుతున్నారు. చిన్న, మధ్యతరగతి రైతులే దివాళా తీసి భూములను అమ్ముకొని వ్యవసాయ కూలీలుగా మారుతున్నారు. ఇవన్నీ స్పష్టంగా మనం కళ్ళారా చూస్తూనే వున్నాం.

లిబరలైజేషన్ పాలసీపేరుతో పి.వి. ప్రభుత్వం తీసుకున్న విధానం వల్ల ఇప్పటికే పొగాకు లాంటి పంటల్లో వున్న బహుళజాతి కంపెనీలు( MNC) నూనెగింజలలోకి కూడా దిగాయి. ఉత్పత్తయ్యే నూనెగింజలను కొని ప్రాసెస్ చేసి నూనె తయారుచేయడానికి ఐ.టి.సి. రంగంలోకి దిగింది. కూరగాయల ప్రాసెసింగ్‌లోకి పెప్సికంపెనీ దిగింది.

ఈ వ్యవసాయ పంటలను, తత్సంబంధిత పరిశ్రమలను ప్రభుత్వ సబ్సిడీలేకుండా స్వయంపోషకం చేయడమన్నది లిబరలైజేన్ (సరళతరం చేయడం) లో భాగంగా ప్రచారం చేయబడుతుంది. ప్రాసెసింగ్ (పంటలను ఆహారపదార్థంగా మార్చడం, కూరగాయల సూపు, చిప్సు, నూడిల్స్, సేమ్యాలు రిఫైండ్ ఆయిల్ వగైరా) చేసేందుకు అనుగుణమైన పంటలను పండించేట్లు ప్రోత్సాహించడానికి; రైతాంగం వాటికి అలవాటు పడినతర్వాత రేట్లు లేకుండా చేసి వారి జీవితాలతో చెలగాటమాడటానికి దారులు వేస్తున్నారు.

డంకెల్ ప్రతిపాదనలలో మద్దతు ధరల పద్ధతి రద్దు చేయాలని కోరడం ఇందుకే. అది ఎత్తివేస్తే వ్యవసాయ రంగంలోకి ప్రవేశించే MNC లకు ఏ ఆటంకాలు లేకుండా రైతాంగాన్ని కొల్లగొట్టుకోవచ్చునన్నమాట. ఒకవైపున రైతాంగం వ్యవసాయ పంటలకు తగినంత మద్దతు ధర ఇవ్వడం లేదని ఆందోళన చేస్తోంది. అమెరికా, EEC దేశాలు, జపాన్‌వంటివి తమతమ దేశాల్లో వ్యవసాయరంగానికి అత్యధిక సబ్సిడీలిస్తున్నారు. అయితే గాట్ చర్చల్లో మన మూడవ ప్రపంచదేశాలు వ్యవసాయ రంగానికిచ్చే సబ్సిడీలు మాత్రం తగ్గించాలంటున్నారు. వ్యవసాయ పంటలకు ప్రస్తుతం వుత్పత్తి ఖర్చులను బట్టి ప్రకటించే మద్దతు ధరల విధానం కూడ రద్దు చేయ్యాలని గాట్ అంటోంది. అంటే అంతర్గతంగా మనదేశంలో మనం నిర్ణయించుకోవలసిన విధానాల్ని కూడా సామ్రాజ్యవాదం బహిరంగంగా నిర్ణయించి ప్రకటిస్తోందన్నమాట.

అవి అమలు చేయడమంటే పంట పండించే రైతాంగానికి మార్కెట్‌లోని దళారీలు, గుత్త సంస్థలనుండి రక్షణ కల్పించడమన్న భావనకే ఎసరు వస్తుందన్నమాట. ఏ పంటకూ కూడా మద్దతు ధర ప్రకటించకుండా రైతుకు దళారులు, లేదా MNCలు ఎంత ధర చెల్లిస్తున్నా ప్రభుత్వం నోరుమూసుకు కూచోవాలన్నమాట. ఇప్పటికే భారత రైతాంగం తమకు మార్కెట్ దోపిడి నుండి రక్షణ లేదో అని తప్పని సరైనపుడు వీధుల్లోకొచ్చి అంతో ఇంతో ప్రభుత్వం నుండి పొందుతున్న రక్షణలకు కూడ అవకాశం లేకుండా చేసి, MNCల దయాదాక్షిణ్యాలకు రైతాంగాన్ని అప్పజెప్పడం - పర్యవసానంగా చిన్న రైతుల్ని వ్యవసాయరంగం నుండి బయటకి పంపడమన్నదే ఈ విధాన సారాంశం.

# నిలువు దోపిడీకి గురవుతున్న వినియోగదార్లు - రద్దుకానున్న ప్రజాపంపిణీ వ్యవస్థ

ఉత్పత్తిదారుల పరిస్థితి ఇలావుంటే వినియోగదారులను కొల్లగొట్టుకోడానికి మార్కెట్‌లోని మధ్యదళారులకు అడ్డంలేకుండాపోయింది. పండించేరైతుకు ఎంత గిట్టుబాటు అవుతున్నదన్న దానితో సంబంధం లేకుండానే మార్కెట్లో అన్ని వ్యవసాయ ఉత్పత్తుల ధరలు వుంటున్నాయి. 'అమ్మబోతే అడవి - కొనబోతే కొరివి' అన్న నానుడి అందులో నుండి వచ్చిందే. తానే అమ్మిన ఉత్పత్తిని కూడ రైతు మళ్ళా మార్కెట్లో కొనుక్కోవాల్సి వస్తే 2, 3 రెట్ల ధరలను కూడ చెల్లించాల్సి వస్తున్న పరిస్థితి చూస్తున్నాం.

మార్కెట్లో ధరలు మరీ తీవ్రంగా పెరిగినపుడు, ప్రజల నుండి ఆందోళన పెరిగినపుడు మాత్రం ప్రభుత్వం అపుడపుడు జోక్యం చేసుకుంటుంది. (అందువా ఎన్నికల ముందు మాత్రం). తను తీవ్ర సంక్షోభంలో వున్నపుడు మాత్రం బహిరంగ మార్కెట్లో ధరలు కంట్రోలులో వుంచడమన్న విధానం ప్రకటిస్తుంటారు. ఇందిరాగాంధీ ప్రకటించిన అత్యవసర పరిస్థితి (ఎమర్జెన్సీ) లో మనం ఈ అనుభవాన్ని (కొద్దికాలంపాటు) చూశాం. మార్కెట్‌పై కంట్రోలు వుండే దళారీ బుర్జువావర్గం తమకు అధికార యంత్రాంగంలో వున్న పట్టుతో మార్కెట్‌పై ఏ రకమైన ప్రభుత్వ కంట్రోలు లేకుండాచేసి, కొల్లగొట్టగలుగుతూ వుంది.

అయితే 1960, 70 దశాబ్దాల్లో పెరిగిన ప్రజావుద్యమాలు, వాటి నుండి ప్రధానంగా ముందుకొచ్చిన భూమికోసం డిమాండు అన్న అంశం నుండి ప్రక్కదారులు పట్టించి భూసంస్కరణల చట్టాన్ని ప్రవేశపెట్టడంతోపాటు, ప్రజల ఆకలిని తీర్చడంకోసం కూడ కొన్ని చర్యలు చేపట్టడానికి ప్రభుత్వం పూనుకొంది. ప్రజాపంపిణీ వ్యవస్థ (PDS) అన్న ఆలోచన అందునుండి వచ్చిందే - మరొకవైపు విశాలంగా వున్న దేశంలో వాతావరణ పరిస్థితుల్లో

వస్తున్న ఒడిదుడుకుల నుండి (కరువు, వరదలు, తుఫాన్లు) తట్టుకోవడానికి కూడ ఇది అవసరమైంది. హరిత విప్లవం వల్ల ఇతర పంటలను బలిపెట్టి వరి, గోధుమల ఉత్పత్తిని పెంచడంవల్ల ఇది సాధ్యమైంది.

ప్రజల ప్రధాన ఆహార అవసరమైన కాయధాన్యాలు - ముఖ్యంగా వరి, గోధుమలను ప్రజల నుండి పెద్ద ఎత్తున సేకరించి ప్రభుత్వ గోడౌన్లలో నిల్వవుంచి వాటిని పంపకం చేయవలసి వచ్చినపుడు చేయడం ఆనాడు ప్రభుత్వం అనుసరించిన విధానం. క్రమంగా చక్కెర, నూనెలను కూడ ఇందులోకి చేర్చారు.

గతంలో బ్రిటీష్ ప్రభుత్వం తన మిలటరీ అవసరాలకోసం రైతాంగం నుండి లెవీ వసూలుచేసే పద్ధతిని సాగిస్తూ వచ్చింది. 1947 తర్వాత ప్రభుత్వం ఆ పద్ధతిలోనే రైతాంగం లేదా మిల్లర్ల నుండి ధాన్య సేకరణ అన్న విధానాన్ని కొనసాగించింది. అలాగే చక్కెర మిల్లులలో ఉత్పత్తి పైన కూడ కంట్రోలు విధించి కొంతభాగాన్ని ప్రభుత్వం సేకరిస్తుంది.

దేశవ్యాపితంగా వేర్‌హౌసింగ్ కార్పొరేషన్ గోడౌన్లను, ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా గోడౌన్లలో ధాన్యం నిల్వలు చేస్తున్నారు. ఇది దేశంలో పండే 17 కోట్ల టన్నుల బియ్యం, గోధుమల్లో 3 కోట్ల టన్నులకు పైగా సేకరిస్తుంది. వివిధ రాష్ట్రాల్లోని ప్రజా పంపిణీ వ్యవస్థల ద్వారా సేకరించిన బియ్యం, గోధుమ, చక్కెర, నూనె వంటి పంపకాలు చేస్తున్నారు.

ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (FCI) తన బఫర్ స్టాక్‌లను కొనసాగించడానికి ప్రభుత్వానికి రూ. 9,600 కోట్ల నుండి రూ. 10,500 కోట్ల వరకు ఖర్చు కాగలదని 1980 లో అంచనావేశారు. FCI నిల్వచేసే ప్రతి టన్ను ధాన్యానికి రూ. 276 ఖర్చు అవుతున్నట్లు 1983లో అంచనావేశారు. (ఇందులో గోడౌన్ల అద్దెలు, తరుగు, ఎలుకలు, పందికొక్కులు నిర్మూలన తదితర ఖర్చులు).

FCI సేకరించిన ధాన్యం ఏవిధంగా వినియోగించబడుతున్నాయన్న దానిని మనం అర్థంచేసుకోవాలంటే 30.5.86 నాటి 'ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ' సంపాదకీయం చూస్తే చాలు : "1984 లో FCI గోడౌన్ల నుండి ప్రైవేటు పిండి మిల్లులను అమ్మిన గోధుమలు 1 కోటి 33 లక్షల టన్నుల నుండి 1985 లో 1 కోటి 54 లక్షల టన్నులకు పెరిగింది. అంతేగాక అతిగా ప్రచారంచేస్తున్న ప్రజాపరఫరా వ్యవస్థ ద్వారా పంపకం జరిగిన 30 లక్షల టన్నుల ఆహారధాన్యల కంటే ప్రభుత్వం ప్రైవేటు పిండి మిల్లులకు అమ్మిన గోధుమలు చాలా అధికంగా వున్నాయి. మరోమాటలో చెప్పాలంటే గోధుమలు కొనుగోలు, నిల్వవుంచడం, రవాణా మొదలగు విషయాల్లో ప్రైవేటు వ్యాపారుల తరుపున ఏజంటుగా భారత ఆహారసంస్థ పనిచేస్తుందనడంలో అతిశయోక్తి లేదు".

"1986-87 బడ్జెటు ఇచ్చిన వివరణలలో గోధుమ నిల్వల వల్ల FCI కి అవుతున్న మొత్తం ఖర్చు క్వింటాలుకు రూ. 263.03 (అంటే టన్నుకు రూ. 2630). 1985లో ప్రభుత్వ నిల్వలు నుండి జరిగిన గోధుమల అమ్మకాలలో ప్రైవేటు వ్యాపారులకు, మిల్లలకు జరిగిన అమ్మకాలు 60% వరకు వున్నాయి. కనుక గోధుమ 'ప్రజాపంపిణీకి' అని చెబుతున్నా, బడ్జెట్‌లో ఇచ్చిన సబ్సిడీ నుండి లబ్ది పొందుతున్నది ఎవరో గమనించడం కష్టంకాదు".

అదే సంపాదకీయం మరోవైపు పేదలకు జరుగుతున్న పంపిణీ తీరు కూడ పేర్కొంది. నిరిపేదలకుద్దేశించిన 'జాతీయ గ్రామీణ ఉపాధి పథకం' '(NRDP, గ్రామీణ భూమిలేనివారి ఉపాధి పథకం' (RLEGP) ల కోసం 1986 జనవరి వరకు 1.82 లక్షల టన్నుల ఆహార

ధాన్యాలు మాత్రమే పంపిణీ జరిగాయని వ్యవసాయ మంత్రిత్వశాఖ చెపినట్లు వ్రాసింది. నిత్య జీవితావసరాలైన ఆహారధాన్యాలను కోట్లాది గ్రామీణ పేదలకు అందుబాటులోకి రావడాన్ని మెరుగుపరచడంలో ప్రభుత్వం వద్ద పేరుకుపోయిన ఆహారధాన్యాల నిలువలకు ఎలాంటి పాత్రలేదని కూడ ఆ పత్రిక విమర్శించింది.

పై విషయాలు ప్రభుత్వ దుర్మార్గాన్ని, అది ప్రైవేటు వ్యాపార వర్గాలకు ఎంతగా సేవచేస్తున్నదీ స్పష్టం చేస్తున్నాయి. ఇంకా ఇందులో జరుగుతున్న వృధా గురించి చెప్పాలంటే మరో అధ్యాయమే అవుతుంది. గోడౌన్లలో సరైన సౌకర్యాలు లేక ఎండకు వానకు వదిలేసిన సందర్భాలు, ముక్కిపోతే సముద్రంలో కలిపిన సందర్భాలు (దానికోసం రవాణా మరొక అదనపు భారం) అనేకం.

ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ కోసమూ, ప్రకృతివైపరీత్యాల సందర్భాల్లో ఆదుకోవడానికి ఉద్దేశించిన నిల్వలు ఈవిధంగా దుర్వినియోగం అవకుండా ఆపమని ప్రజలూ, పత్రికలు గొంతెత్తి అరుస్తున్నారు. దోపిడిపాలనలో పేరుకుపోయిన అవినీతి, అశ్రద్ధ, అసమర్థ నిర్వాకాలు అందుకు ఆటంకంగా వున్నాయి.

పాలకులకు చిత్తశుద్ధి వుంటే ప్రజావసరాలను తీర్చేందుకు అవసరమైనట్లుగా మార్కెట్‌పై కంట్రోలు సాధించవచ్చు. ఉత్పత్తి ధరకు, వినిమయదారునికి అందే ధరకూ మధ్య సమన్వయం చేయవచ్చు. మరోవైపు సమాజంలోని బలహీన వర్గాలను దృష్టిలో వుంచుకొని అవే ప్రకటించినట్లుగా ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా ఆహారపదార్థాల్లో కిరోసిన్ వంటివి అందించవచ్చు. ప్రభుత్వ వైఫల్యానికి ప్రస్తుతం వున్న ధరల పరిస్థితి చక్కగా అద్దం పడుతుంది. గత 6 నెలల క్రిందటి ధరలను ప్రస్తుత మార్కెట్ ధరలతో 5.11.93 నాటి **ఈనాడు** వార్త పోల్చింది.

| సరుకు | 93 ఏప్రిల్ ధర | ప్రస్తుత ధర |
|---|---|---|
| సూపర్‌ఫైన్ బియ్యం | 9.50 | 11.50 |
| వేరుశనగ నూనె | 20.00 | 36.00 |
| పెసరపప్పు | 10.00 | 15.00 |
| కందిపప్పు | 17.00 | 21.00 |
| పుట్నాలు (తినే శనగపప్పు) | 12.00 | 23.00 |
| గోధుమపిండి | 4.50 | 7.50 |
| పంచదార | 8.00 | 11.75 |
| బెల్లం | 8.00 | 15.00 |
| చింతపండు | 14.00 | 23.00 |
| ఉల్లిపాయ | 1.00 | 7.00 |
| వెల్లుల్లి | 28.00 | 40.00 |

(ఈ ధరలు కిలోకు రూపాయల్లో)

వేరుశనగ నూనెపంట మార్కెట్‌లోకి వచ్చినపుడు ఈ సంవత్సరం దిగుబడి బాగుందని, నిల్వలు వున్నాయంటూ రైతుల్ని కొల్లగొట్టారు. కొంతకాలంపాటు కిలో రూ. 20.00 గానే వుంచి హఠాత్తుగా సమయంచూసి ధరలు పెంచారు. పన్నెండు రకాల నిత్యావసర వస్తువుల ధరలను దేశంలోని 35 మార్కెట్ల నుంచి సేకరించి ఎప్పటికపుడు ధరలను పర్యవేక్షించి అదుపుచేస్తున్నామని కేంద్ర పౌరసరఫరాల శాఖమంత్రి ఎ.కె.ఆంటోని పలుమార్లు ప్రకటించాక, 44 వేల టన్నుల సోయాబీన్ నూనె, కొంత పామాయిల్ తక్షణమే దిగుమతి చేసుకుంటున్నామని మంత్రి ప్రకటించిన 3 నెలలకు ధరలు ఈ విధంగా పెరిగాయి.

## ఆహార సబ్సిడీలపై కత్తివేటు

ఇటీవల ప్రపంచబ్యాంకు, IMF ల వత్తిడి పెరిగిన తర్వాత లిబరలైజేషన్ పాలసీ ప్రభావం ఈ సబ్సిడీలపై కూడ పడింది. 1992 బడ్జెట్‌లోనే ఆహార పదార్థాలకిచ్చే సబ్సిడీని కుదించే విధానం ముందుకు వచ్చింది. ఆహారానికిచ్చే సబ్సిడీలను క్రమంగా తగ్గించి కంట్రోలు ధరలను కూడ పెంచారు. ఆంధ్రరాష్ట్రంలో తెలుగుదేశం ( పభుత్వం తన జనాకర్షక పథకంలో భాగంగా రూ. 2 కిలో బియ్యం పథకం పెట్టి కుటుంబానికి 25 కిలోల చొప్పున ఇచ్చింది. దీనిని 16 కిలోలకు కుదించి కిలో రేటును 3.50 కు పెంచింది కాంగ్రెసు ప్రభుత్వం. చక్కెర, నూనె ధరలను కూడ పెంచారు. కేంద్ర ప్రభుత్వం 93-94 బడ్జెట్‌లో ప్రజాపంపిణీ వ్యవస్థకోసం కేవలం 3 వేల కోట్లు రూపాయలు కేటాయించింది. అంటే మనిషికి సంవత్సరానికి రూ. 37 ఖర్చు చేస్తారన్నమాట.

ప్రస్తుతం ముందుకొస్తున్న డంకెల్ ప్రతిపాదనల ప్రకారం మొత్తం ప్రజాపంపిణీ వ్యవస్థనే (PDS) ఎత్తివేసేందుకు ప్లాను చేస్తున్నారు. "వర్తమాన మార్కెట్ ధరల ప్రకారం ప్రభుత్వం లేక ప్రభుత్వ సంస్థలు కొనుగోలుచేయాలి. ప్రభుత్వ నిల్వల నుండి జరిగే అమ్మకాలు మార్కెట్ ధరలకు తగ్గకుండా వుండాలి" అని డ్రాఫ్టులో వ్రాసిన ఈ మాటల అర్థం స్పష్టమే. సగంమందిదాకా ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన వున్న దేశంలో పాలకులు ప్రజలను కొంతమేర సంతృప్తి పరచడంకోసం ఇస్తున్న ఆహార రాయితీలను కొనసాగించడానికి వీల్లేదన్నమాట. బహిరంగ మార్కెట్ ధరకే ప్రభుత్వం అమ్మితే ప్రజలకు ఒరిగేదేమిటి?

ప్రజల్ని ఆదుకునేందుకు రెండు పూటలా కాకున్నా ఒక్కపూటైనా తినేందుకు నెలలో రోజూ కాకున్నా 10 రోజులైన తినేందుకు ఎంతో కొంతగా సాగుతున్న తోడ్పాటును కూడ ఆపెయ్యాలి. కొనుక్కోగలవాడే తిండితినాలి. లేనివాడి సంగతి మాకనవసరం. బహిరంగ మార్కెట్‌లో కొనుక్కోగలవాడికే మా 'స్వేచ్ఛాయుతపోటీ' (అది ప్రజలకే సుమా! మల్టీ కంపెనీలపై మాత్రం మా గుత్తాధిపత్యమే వుండాలి.) సిద్ధాంతంలో స్థానం వుంటుందని చెప్పడం తప్ప ఇందులో మరేమైనా వుందా?

# పేపర్లపై భూసంస్కరణల చట్టాలు – పెరిగిన భూమి కేంద్రీకరణ

1933 లో గాంధీ, ఉత్తరప్రదేశ్ జమీందార్ల కిచ్చిన ఇంటర్వ్యూలో హామీ ఇచ్చినట్లే 'రాకుమారుని' 'పేదవాని' హక్కులను కాపాడడమన్న విధానం 47 కు ముందే కాంగ్రెసు ఆచరించింది. జమీందారీ విధానం రద్దు కావాలంటూ జమీందారీ ప్రాంతాల్లో ఆనాడు పెద్ద

ఎత్తున ఆందోళనోద్యమాలు సాగాయి. అప్పటి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం నియమించిన ప్రకాశం కమిటీ జమీందారీ విధానంలో రైతాంగపు దురవస్థల గురించి నివేదిక సమర్పించి, జమీందారీ విధానంలో చేయాల్సిన మార్పుల గురించి సూచనలు చేసినప్పటికీ వాటిని చర్చించడంలో కాలహరణం చేసి చివరకు ఏ చట్టం చేయకుండానే 1939 లో కాంగ్రెస్ ప్రభుత్వం రాజీనామా చేసింది. జమీందారీ వ్యతిరేక ఉద్యమాన్ని ముందుకు పోనివ్వకపోవడమేగాక, కనీసం శాసనమైనా చేస్తారని ఆశపడిన రైతాంగాన్ని తీవ్ర ఆశాభంగానికి గురిచేశారు.

1947 తర్వాత కూడ జమీందారీ విధానాన్ని పూర్తిగా రద్దు చెయ్యలేదు. ఇండియన్ యూనియన్‌లో కలుపుకున్న సంస్థానాధీశులకు కూడా భారీ మొత్తాలలో రాజభరణాలు చెల్లించారు. నైజాం నవాబుకి సంవత్సరానికి 50 లక్షల రూపాయలు నష్టపరిహారం, ఆయన భూములను తీసుకున్నందుకు మరో 50 లక్షల రూపాయలు చెల్లించారు. రాజభరణాలు రద్దుచేస్తూ కాంగ్రెసు చేసిన చట్టం ప్రకారం కూడ ఒకేసారి భారీ మొత్తాల్లో నష్టపరిహారం చెల్లించడంవల్ల వాళ్ళకు మేలే జరిగింది. నెహ్రూ పెద్ద ఎత్తున సోషలిజం గురించి చేసిన ప్రకటనలన్నీ వుత్త వాగాడంబరంగానే మిగిలాయి. భూసంస్కరణల చట్టాలూ, 'గరీబీహఠావో' నినాదాలు ఆచరణలో భూసంబంధాల్లో అంతకు పూర్వం వున్న స్థితి నుండి మార్పేమీ చేయలేక పోయాయని ఈ క్రింది పట్టిక రుజువు చేస్తుంది.

**విభిన్న సంవత్సరాలలో భూ సంబంధాల పరిస్థితి**

| కమతం సైజు | 1924 | | 1939 | | 1961 | |
|---|---|---|---|---|---|---|
| | జనాభా శాతం | విస్తీర్ణ శాతం | జనాభా శాతం | విస్తీర్ణం శాతం | జనాభా శాతం | విస్తీర్ణం శాతం |
| 5 ఎకరాల లోపు | 58.3 | 12.1 | 63.7 | 12.2 | 55.8 | 11.8 |
| 5-10 ఎకరాల మధ్య | 18.3 | 15.1 | 16.9 | 13.1 | 19.0 | 14.5 |
| 10 ఎకరాలు అంతకు పైన | 23.3 | 62.8 | 19.4 | 74.7 | 25.2 | 73.7 |

**మూలం: తాకట్టులో భారతదేశం - కా॥ తరిమెల నాగిరెడ్డి**

10 ఎకరాలు అంతకుమించిన కమతాలు వున్న కుటుంబాల జనాభా సుమారు 25% వుండగా వారిచేతిలోని భూమి విస్తీర్ణం సుమారు 70 నుండి 75% వుంది. ఇంకా వివరంగా జనాభా ప్రకారం విడగొట్టివేసిన అంచనాల ప్రకారం సమాజంలో నూటికి 10 మందిగా వున్న ఉన్నతస్థాయి వాళ్ళ చేతిలో 55% భూమి వుండగా అట్టడుగున వున్న 10% చేతిలో 0.1 % మాత్రమే వుంది.

ఈ పరిస్థితి గురించే 1970 లలో అప్పటి కేంద్ర ఆహార, వ్యవసాయమంత్రి బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహాసభలో అధ్యక్షోపన్యాసం ఇస్తూ "వ్యవసాయంపై ఆధారపడి జీవనం సాగించే కుటుంబాలలో 41% కుటుంబాలకు ఒక్క ఎకరం లోపుగానే వుండగా మరో 22% కుటుంబాలకు అసలు భూమే లేకపోగా 3 నుండి 4% గా వున్న పెద్ద వ్యవసాయదారుల కుటుంబాలు సమస్త అధికారమూ, పలుకుబడీ కలిగివున్నాయి" అన్నాడు.

20 సంవత్సరాలకు పైగా సాగిన కాంగీ పాలనలో భాగస్తుడుగా జగ్జీవనరాం చెప్పిన మాటలివి. 'హరిజన' మంత్రులుగా ఇలాంటి వాళ్ళను మంత్రివర్గంలో పెట్టుకొని నిరుపేదలైన

దళితవర్గాల్ని బుజ్జగించే మాటలు చెప్పిస్తూ భూస్వాముల ప్రయోజనాల కనుగుణంగా నెహ్రూ, ఇందిరల కాలం నుండీ కాంగ్రెసుపాలన సాగుతోంది.

## ఏనుగు దూరేంత కంతలున్న భూసంస్కరణ చట్టాలు

కాంగ్రెసు ప్రభుత్వం కేంద్రంలో భూసంస్కరణల చట్టంచేసి, ఎక్కడకక్కడ రాష్ట్రాల్లో చట్టాలుచేసి అమలుపరచమని చెప్పింది. దాని ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలు భూసంస్కరణల చట్టాలు చేశాయి. ఈ చట్టాలు వస్తున్నాయని ముందుగానే తెలిసిపోవడంవల్ల భూస్వాములు తమ భూములను ఆ చట్టాల పరిధిలోకి రాకుండా చేసుకోగలిగారు.

పండ్లతోటలు, ఉద్యానవనాల భూములు, కొండప్రాంతంలోని భూములు, పరిశ్రమలకు అనుబంధంగా వున్న భూములు, ట్రస్టు వగైరా సంస్థల భూములు, దేవాలయ భూములు వగైరాలన్నీ ఈ చట్టాల నుండి మినహాయించబడ్డాయి. దేశంలో సామ్రాజ్యవాదులు, దేశంలోని బడాపెట్టుబడిదారులు కొండవాలుల్లో పెంచుకున్న వేలాది ఎకరాల టీ, కాఫీ ప్లాంటేషన్లన్నీ ఈ చట్టం నుండి తప్పుకున్నాయి.

మన ఆంధ్రరాష్ట్ర అనుభవమే చూస్తే రెండు పంటలు పండే భూములైతే 10 నుండి 18 ఎకరాలు ఒకే పంట పండే మాగాణి అయితే 15 నుండి 27 ఎకరాలు, మెట్టభూమి అయితే 35 నుండి 54 ఎకరాలు గరిష్ఠ పరిమితిగా నిర్ణయించారు. నీటి సౌకర్యాలు తక్కువగా వుంటే పై పరిమితిని ఇంకా 12.5% నుండి 25% వరకు పెంచడానికి అనుమతించారు. అయితే కుటుంబంలోని ప్రతి సభ్యుడ్నీ ఏదో ఒకరకంగా వాటాకు యోగ్యుల్ని చేయడం ద్వారా, ఇల్లరికం వచ్చిన అల్లుళ్ళ వాటాలు వగైరా పద్ధతుల్లో గరిష్ఠ భూపరిమితి ఆచరణలో 180 నుండి 360 ఎకరాల మాగాణిగానూ, మెట్ట అయితే 1080 నుండి 2160 ఎకరాల వరకు వుందనీ 28.2.70 నాటి మెయిన్ స్ట్రీమ్ పత్రిక వ్రాసింది.

ఈ చట్టం ప్రకారమే చల్లపల్లి జమీందారు తన వేలాది ఎకరాల భూముల్ని చక్కెర ఫ్యాక్టరీకి అనుబంధంగా లెక్కచూపించుకోగలిగాడు. ఇలాంటి వుదాహరణలు ఆంధ్రరాష్ట్రంలో అన్ని జిల్లాల్లోను వున్నాయి. తాను ముఖ్యమంత్రిగా వున్నపుడే ఆంధ్రాలో భూసంస్కరణల చట్టం తెచ్చి ప్రస్తుతం ప్రధానమంత్రిగా వున్న పి.వి. నరసింహారావుకు చెందిన 1000 ఎకరాల పై చిలుకు భూమి ఈ చట్టం క్రింద మినహాయించి ఎలా లెక్కలు చూపిందీ ఇటీవలే బయటపడిన విషయం అందరూ ఎరిగిందే.

1947 కు పూర్వమే బ్రిటిష్ టీ కంపెనీలు మనదేశంలో ఆక్రమించుకున్న లక్షలాది ఎకరాల టీ, కాఫీ ప్లాంటేషన్లు, విదేశీ మిషనరీలు పొందిన భూములేవీ ఈ చట్టం క్రిందికి రాలేదు. దేశంలోని పారిశ్రామికవేత్తలు భూములు కూడ ఈ చట్టాల నుండి మినహాయించబడ్డాయి. ఉదాహరణకు బిర్లా కుటుంబానికే అల్‌మయ్ వద్ద 4000 ఎకరాలు, హైదరాబాదుకు దగ్గరలో తిమ్మాపురం వద్ద 500 ఎకరాల క్షేత్రం, పాట్నా వద్ద మరో క్షేత్రం, తమిళనాడు రాష్ట్రంలోని నీలగిరి జిల్లాలో 3,200 ఎకరాల టీ ఎస్టేటు, పంజాబులో రోపార్ వద్ద 1000 ఎకరాల క్షేత్రం, పిపారా వద్ద చక్కెర ఫ్యాక్టరీ పేరిట 4000 ఎకరాల భూములున్నాయి. ఇది బిర్లాకున్న భూముల పూర్తి లిస్టు కాదంటే ఎంత పెద్ద ఎత్తున భూములున్నా ఈ చట్టం క్రిందకు ఎలా రాలేదో అర్థంచేసుకోవచ్చు.

వివిన్న రాష్ట్రాల్లో చేసిన ఈ చట్టాల ప్రకారం 6 కోట్ల 80 లక్షల ఎకరాల భూమి బయటపడుతుందని అంచనావేస్తే 1992 నాటికి ప్రభుత్వం ప్రకటించిన మిగులు భూమి

72 లక్షల 56 వేల ఎకరాలు మాత్రమే. ఇందులోను ప్రభుత్వం 62 లక్షల ఎకరాలను మాత్రమే స్వాధీనం చేసుకున్నట్లు, అందులోనూ 48.45 లక్షల ఎకరాలు మాత్రమే పంచినట్లు ప్రకటించుకుంది. ఇందులో 16% భూమి తుప్పలూ, పర్రలూ, కొండగుట్టలనీ, సేద్యానికి పనికిరాదనీ ప్రభుత్వమే ప్రకటించింది. పశ్చిమబెంగాల్‌తో సహా ఏ రాష్ట్రంలోనూ 50 ఎకరాలకు మించివున్న కమతాల క్రింద భూమిలో 10% భూమిని కూడ భూసంస్కరణల చట్టాల ప్రకారం పంచలేదంటే ఈ చట్టాల వైఫల్యం అర్థంచేసుకోవచ్చు.

ఆంధ్రప్రదేశ్ అనుభవమే మనకు పరిస్థితిని తేటతెల్లం చేస్తుంది. 1978లో 12 లక్షల 85 వేల ఎకరాల విస్తీర్ణాన్ని మిగులు భూమిగా ప్రకటించారు. అయితే ఇదికాస్త 1991 నాటికి 7 లక్షల 25వేలు మాత్రమేనని తేల్చారు. అంటే 5 లక్షల 60వేల ఎకరాల భూమి ఈ 13 సంవత్సరాల కాలంలో భూస్వాముల చేతుల్లోకి పోయిందన్నమాట. ప్రస్తుతం మిగులుగా ప్రకటిస్తున్న ఈ 7 లక్షల 25 వేల ఎకరాల్లో కూడ 25% (సుమారు లక్షా 85 వేల ఎకరాలు) భూమి కోర్టు వివాదాల్లో వున్నట్లు ప్రభుత్వమే ప్రకటించింది. పిల్లలను దత్తత తీసుకున్నట్లు, ఇల్లరికం అల్లుళ్ళున్నట్లు, పసుపు కుంకుమల క్రింద ఆడపిల్లలకు భూమిలిచ్చినట్లు అనేక సాకులు చూపించి కోర్టులకెక్కి భూస్వాములు ఇలా మిగుల్చుకోగలిగారు. అనుయాయులను, బంధువులను కౌలుదార్లుగా చూపించి కొందరు భూస్వాములు రక్షిత కౌలుదారీ చట్టం క్రింద భూములు కాపాడుకోగలిగారు. మేజరు కుమారుడికి ఆస్తిహక్కు, భర్తమరణానంతరం భార్యకు హక్కువంటి హిందూవారసత్వ చట్టాల నడ్డుపెట్టుకొని కూడ అనేకమంది బయటపడగల్గారని 11.11.91 నాటి 'ఈనాడు' పత్రిక వ్రాసింది.

## పెరుగుతున్న భూకేంద్రీకరణ

ప్రభుత్వ చట్టాలు భూస్వాముల చేతుల్లోని భూముల్ని పేదల చేతిలోకి తేలేకపోగా - వ్యవసాయంలో వచ్చిన కొత్త పద్ధతులు, వ్యవసాయంకోసం చేయాల్సివచ్చిన అప్పులకు పెరిగిన వడ్డీలు తదితర కారణాల వల్ల పేదరైతులు నానాటికి భూములు కోల్పోయి వ్యవసాయ కూలీలుగా మారారు. దేశవ్యాపితంగా ఎప్పటికప్పుడు భూసంబంధాలపై వేస్తున్న లెక్కలు దీన్ని రుజువుచేస్తున్నాయి.

హరిత విప్లవకాలంలో వ్యవసాయంలో వచ్చిన ఆధునిక మార్పులు సమాజంలోని పేదల పరిస్థితిని మరింత దుర్భరంచేశాయి. భూస్వాముల చేతుల్లోని భూములు మరింత పెరగగా చిన్న కమతాలున్న రైతులు తమ భూముల్ని కోల్పోయారు.

కౌలుదారీ విధానం క్రిందవున్న రైతులు కూడ ఇక్కట్లపాలయ్యారు. కౌలుదారీ చట్టం రావడంవల్ల భూములపై కౌలుదార్లకు ఎక్కడ రక్షణ ఏర్పడుతోందోనని భయపడ్డ భూస్వాములు మూజువాణి కౌలు పద్ధతిని అనుసరించారు. ఆధునిక వ్యవసాయ పద్ధతులవల్ల కౌలురైతులు ఎక్కువ మొత్తాల్లో కౌలు చెల్లించాల్సి వచ్చింది. మరోవైపు అంతకుముందు వ్యవసాయానికి దూరంగా ఉన్న భూస్వాములు కూడ ఆధునిక పద్ధతులవల్ల వ్యవసాయం స్వంతంగా చేసుకుని లాభాలు పిండుకోడానికి రంగంలోకి దిగడంతో కౌలు రైతులు అంతకుముందు తాము ఆధారపడుతున్న భూములను కూడా కోల్పోయారు.

ఈ 47 సంవత్సరాల కాలంలో పాలకవర్గాలు అనుసరించిన విధానాల వల్ల వేలాది ఎకరాల భూములు సంపన్నుల పరంకాగా మరోవైపు అడవిలోని గిరిజనుడు కూడ భూముల నుండి దూరం చేయబడ్డాడు. దేశంలోని గిరిజన ప్రాంతాన్నంతటినీ పరిశీలిస్తే గిరిజనులు తమ స్వంత భూముల్ని కోల్పోయి, అక్కడకు ఆఖరకు బయట ప్రాంతాల నుండి వెళ్ళి

భూస్వాములుగా తయారైన వారికి లోబడి వుండాల్సిరావడం కన్పిస్తుంది. ఒకవైపు ప్రభుత్వం అడవి నాశనమవుతుందని అంటూనే మరోవైపు పారిశ్రామికవేత్తలకు మాత్రం వేలు, లక్షల ఎకరాల దట్టమైన అడవుల్ని అప్పజెప్పింది. 1954లో బయట మార్కెట్లో టన్ను వెదురు 60 నుండి 80 రూపాయలు వుండగా, బిర్లా కంపెనీకి టన్ను రూ. 6.50 చొప్పున 20 సంవత్సరాలకు వేల ఎకరాల ఫారెస్టు నప్పజెప్పారు. ఇదే విధానం ఇప్పటికీ కొనసాగుతోంది. ఈ పారిశ్రామికవేత్తల వల్ల అడవంతా నాశనంకావడంతో మళ్ళీ వేలాది ఎకరాల ఫారెస్టు భూముల్లో ప్లాంటేషన్లు పెంచుకోడానికి, పేపరు మిల్లులకు, ఇతర పరిశ్రమలకు నామమాత్రమైన కౌలుకు పదుల సంవత్సరాలకు లీజుల కిచ్చారు.

మరొకవైపు అధికారంలోని వర్గాలు అనేక తరహాల భూములను ఆక్రమిస్తున్నారు. స్వాధీనం చేసుకుంటున్నారు. ఇలా స్వాధీనంచేసుకున్నవారిలో మంత్రులు, వారి ఏజంట్లు, మాజీ సైనికాధికార్లు, బ్యూరాక్రటిక్ అధికార్లు, విదేశీ మిషనరీలు వంటి సెక్షన్లవారు వున్నారు. వీరంతా రకరకాల కేటగిరీల క్రిందకు వచ్చే ప్రభుత్వ భూములను ఆక్రమించారు. పరిశ్రమలకు అనుబంధ భూముల పేరుతో, వెనుకబడిన ప్రాంతాల్లో పరిశ్రమల స్థాపన పేరుతో వేల ఎకరాల భూములు సంపన్న వర్గాలకు కేటాయించబడుతున్నాయి.

ఇటీవలికాలంలో ఆంధ్రరాష్ట్రంలో చంద్రబాబునాయుడు వంటి రాజకీయనాయకులు, మోహనబాబు, కృష్ణంరాజు వంటి సినిమా నటులు, అనేకమంది ఐ.ఎ.ఎస్. అధికారులు ప్రభుత్వంలోని విభిన్న శాఖలలోని లంచగొండి అధికారులు, బడాకాంట్రాక్టర్లు తమ ఆదాయాన్ని దొంగ లెక్కలు చూపడానికి కూడ వుపకరించగల సాధనంగా భూమిని ఎంచుకొని తోటల పెంపకం (Horticulture) వంటి పథకాలు చేపడుతున్నారు.

మరోవైపు ప్రభుత్వం ఒరిస్సాలోని చిలకాసరస్సు, ఆంధ్రాలోని పులికాట్ సరస్సు వంటి వాటిని ఉప్పు తయారీ పేరుతో కారు చౌకగా దీర్ఘకాలపు లీజులకిస్తున్నారు. ఉప్పు పండించే పేద రైతులకు కొద్దిపాటి గోడౌన్ సౌకర్యాలు కల్పించకుండా ఆ వృత్తిలో ఉన్న పేద రైతులు మార్కెట్‌లో తమ ఉత్పత్తులను కారుచౌకగా మధ్యదళారులకు అమ్ముకోవాల్సిన దుస్థితిని కల్పిస్తున్నారు. ఈ రైతాంగానికి భూములు లీజుకివ్వడంలో అనేక ఆటంకాలు కల్పిస్తున్నారు. బినామీ సాల్టు సొసైటీల పేరుతో భూస్వాములు భూములు కబ్జాచేయడానికి అనుమతినిచ్చారు.

## ప్రపంచబ్యాంకు, విదేశీసంస్థల పథకాలకోసం పెరుగుతున్న భూముల కేటాయింపులు

సామ్రాజ్యవాదుల అవసరాలకోసం భూముల కేటాయింపులు ఇటీవలికాలంలో దేశంలో పెరిగాయి. వ్యవసాయంలో కొత్త పరిశ్రమలుగా వస్తున్న పట్టుపురుగుల పెంపకం (Seri Culture), పూలతోటల పెంపకం (Floriture) వగైరాలకు ప్రపంచబ్యాంకు నిధులివ్వడంతో వాటికోసం భూములను ప్రభుత్వం కేటాయించి అభివృద్ధిపరుస్తోంది.

మరోవైపు పారిశ్రామిక అవసరాలకోసం తగినంత కలప లేకపోవడంతో 'సామాజిక వన పథకం' పేరిట ప్రపంచబ్యాంకు దేశంలో ఒక పథకాన్ని ముందుకు తెచ్చింది. ప్రత్యేక ఫారెస్టు డిపార్టుమెంటు ద్వారా లక్షలాది ఎకరాల్లో సామాజిక వన పెంపక పథకాలు చేపట్టారు. నర్సరీలు పెంచి రైతాంగానికి ఉచితంగా మొక్కలిచ్చి ఈ వనాలు (జామాయిల్, చవుకలు, సుబాబుల్ వగైరా) పెంచడాటన్ని ప్రోత్సహించారు.

ఇటీవల నీలివిప్లవం పేరిట సముద్రతీరప్రాంతంలో చేపట్టిన పథకాలు కూడ ఇందులో భాగమే. దేశ ప్రజలకు పౌష్టికాహారాన్ని అందించడం లక్ష్యంగా మొదట నీలి విప్లవాన్ని (చేపలు, రొయ్యల పెంపకం) ప్రచారంచేశారు. అయితే అది తర్వాత విదేశీమారకద్రవ్యం సంపాదించే పథకంగా దిగజారింది. ఇందుకోసం ప్రపంచబ్యాంకు సహాయంతో పథకాలు చేపట్టబడ్డాయి. ఎంపెడా (MPEDA) పేరుతో చేపల ఎగుమతికోసం ప్రత్యేక సంస్థను ఏర్పరచారు. బ్రాకిష్ వాటర్ డెవలప్‌మెంట్ ఏజన్సీ పేరిట ఫిషరీస్ డిపార్టుమెంటులో కొత్తశాఖను పెట్టారు.

ఆంధ్రప్రదేశ్ తీరంలో ఈ పథకపు అమలులో భాగంగా రాష్ట్రప్రభుత్వం 17.6.87 న జి.వో.యం.యస్. నెంబరు 233 ను జారీచేసింది. ఈ జి.వో. ప్రకారం ఎకరాకు సంవత్సరానికి 20 రూపాయల చొప్పున 15 సంవత్సరాలకు కాంట్రాక్టున ప్రభుత్వ భూములన్నీ లీజుకిచ్చారు. అయితే అది పేదలకు కాదు. 60% భూమిని సొసైటీలకు, 20% నిరుద్యోగ ఇంజనీర్లకు, 20% పారిశ్రామికవేత్తలకు కేటాయిస్తామని ప్రకటించారు. దీని ప్రకారం తీరప్రాంతంలోని ప్రతి జిల్లాలోను సముద్రతీరంలోని బంజర్లను గుర్తించి వాటిని కేటాయించడానికి కలెక్టర్లు స్వయంగా ఇంటర్వ్యూలు జరిపారు. సొసైటీలు సక్రమంగా ముందుకు రావడంలేదనీ అందువల్ల అవి రానట్లయితే మిగిలిన రెండు కేటగిరీల వాళ్ళకు భూములు కేటాయించమని ఆదేశిస్తూ ప్రభుత్వంపై జి.వో. ను సవరించి 16.3.91న నెంబరు 199 జి.వో.ను విడుదలచేసింది. ఇప్పటివరకు నెల్లూరు, కృష్ణా, ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో లభ్యమైన సమాచారంమేరకు ప్రభుత్వం దీని ప్రకారం కేటాయించిన భూమిలో అత్యధికభాగం పారిశ్రామికవేత్తలకే కేటాయించింది.

మరోవైపు ప్రపంచ బ్యాంకు పథకం క్రింద ఈ రొయ్యల సాగుకోసం పెద్ద మొత్తాల్లో ఋణాలు (లోన్లు) ఇస్తుండడంతో సంపన్నులంతా తీరప్రాంతంపైకి ఎగబడ్డారు. రైతాంగంలో చిన్నవాళ్ళ నుండి ధనికవర్గాలేగాక బడాపారిశ్రామిక సంస్థలైన థాపర్‌గ్రూపు (600 ఎకరాలు), మాగుంట సుబ్బరామిరెడ్డి (800 ఎకరాలు), రాంక్ ఆక్వా (Rank Aqua) వంటి సంస్థలన్నీ తీరప్రాంతంలో వందల ఎకరాల భూముల్ని పేదరైతుల నుండి కొనివేశాయి. వీలైనచోట్ల ఆక్రమించారు. దాంతో తీరప్రాంతంలో బంజరు భూములు పేదలకెవరికీ లేకుండాపోయాయి. తాత్కాలికంగా భూమిరేటు పెరిగినప్పటికీ జీవితాంతం ఆధారపడాల్సిన భూమి కోల్పోవడంతో ఆ ప్రాంతపు పేదరైతాంగం శాశ్వతంగా తమ జీవనభృతిని కోల్పోయారు.

ప్రభుత్వ సహకారంతో విదేశాలు ఈ రంగంలో ఎలా ముందుకు వస్తున్నవీ డెన్మార్క్ ఇంజనీర్ నీల్‌కాల్‌డేనియల్ సన్ కృష్ణాజిల్లా బందరులో ప్రకటించారు. 3.6.93 న ప్రకటించబడ్డ వార్త ప్రకారం :

ప్రభుత్వం రొయ్యలసాగు ద్వారా విదేశీమారకం పొందడానికి, ప్రపంచబ్యాంకు నుండి నిధులను పొంది, విదేశీ సాంకేతిక సహకారం దిగుమతిచేసుకుని రొయ్యలను ఎగుమతి చేసుకోడానికి తీవ్రప్రయత్నాలు చేస్తున్నది. . . దీనిలో భాగంగానే 300 కోట్ల ప్రపంచబ్యాంకు నిధులతో 6100 హెక్టార్లలో రొయ్యల పెంపకం చేపట్టనున్నట్లు 'సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కోస్టల్ ఇంజనీరింగ్ ఫర్ ఫిషరీస్' తరపున పశ్చిమబెంగాల్‌లో 750 ఎకరాలు, ఒరిస్సాలో 2750 ఎకరాలు, ఆంధ్రాలో 5250 ఎకరాల్లో, రొయ్యల సాగుకు సాంకేతిక ఆమోదం లభించిందని వచ్చే వర్షాకాలంలో ప్రాజెక్టు పనులు ప్రారంభం కానున్నాయని చెప్పారు. మన రాష్ట్రంలోని ఈ ప్రాజెక్టును కృష్ణాజిల్లా పల్లె తుమ్మలపాలెం, నెల్లూరు జిల్లా కోవూరు, ప్రకాశం జిల్లా చింతయ్యగారి పాలెం, తూర్పుగోదావరి జిల్లా భైరవపానిపాలెంలలో ఏర్పాటుచేయనున్నట్లు ఆయన తెలిపారు.

అలాగే ఇటీవలే యూనిలీవర్ కంపెనీ అనుబంధసంస్థ అయిన హిందూస్తాన్ లీవర్, గోద్రేజ్, ITC తదితర గుత్త సంస్థలు, ఆంధ్రరాష్ట్రంలో 40 లక్షల ఎకరాల్లో పామాయిల్ మొక్కల పెంపకం పథకం చేపట్టాయి. దీనికోసం ప్రభుత్వమే ప్రోత్సహించి అందుకు భూములు కేటాయించే శ్రద్ధ తీసుకుంటోంది. ఈ రకంగా సామ్రాజ్యవాదుల లాభాలకోసం వుద్దేశించిన ప్రాజెక్టుకు మన రైతాంగపు సేద్యపు భూముల్ని కట్టబెట్టేందుకు ప్లాను చేస్తోంది.

ఈ విధంగా అంతోఇంతో పేద ప్రజలకు దక్కాల్సిన బంజరు భూములు గుత్త కంపెనీల పరమవుతున్నాయి. తీరంలో సాగుచేసుకునే చిన్న కమతందార్లు కూడా తమ భూములను కోల్పోయారు.

## నేరుగా విదేశీ కంపెనీలకే భూములు

పైన చెప్పినట్లు రైతాంగాన్ని తన పథకంకోసం ప్రోత్సహించడమేగాక ఇటీవల నిబంధనలనన్నీ ప్రక్కకుపెట్టి కార్గిల్ కంపెనీకి గుజరాత్ రాష్ట్రంలోని కాండ్లారేవు వద్ద ముంద్రా అవే ప్రాంతంలో 15 వేల ఎకరాల భూమి తనకు కేటాయించమని కోరింది. 1992 జూలైలో కంపెనీ పెట్టిన పిటీషన్‌లో ఈ స్థలంలో ఉప్పు ఉత్పత్తిచేయగలమని సాలీనా 10 లక్షల టన్నులు ఉత్పత్తిచేసి నూటికి నూరు శాతం ఎగుమతి చేస్తామని, అందువల్ల ఏటా కోటి డాలర్ల విదేశీమారకం మన ప్రభుత్వానికి వస్తుందని చెప్పింది. దానికోసం ఒక చిన్నరేవు (జెట్టీ) నిర్మాణాన్ని కూడ అనుమతించమని కోరింది.

ప్రధానమంత్రి పర్యవేక్షణలోగల ఫారిన్ ఇన్వెస్టుమెంట్ బోర్డు, పరిశ్రమలశాఖ ఈ ప్రతిపాదనలను ఆమోదించాయి. కాని పోర్టుట్రస్టు, గుజరాత్ ప్రభుత్వం, గుజరాత్ నౌకాయాన బోర్డులు దీన్ని వ్యతిరేకించాయి. కాండ్లా ప్రాంతంలో అంత భారీఎత్తున ఉప్పు పరిశ్రమల స్థాపనను అంతకుముందే అహ్మదాబాద్‌లోని స్పేస్ అప్లికేషన్ సెంటర్, పర్యావరణ శాఖ, భారతప్రభుత్వ సాల్టు కమీషనర్, పూనాలోని సెంట్రల్ వాటర్ అండ్ పవర్ రీసర్చిస్టేషన్, జియోలజికల్ సర్వే మొదలైన సంస్థలు కూడ అంగీకరించలేదు. ఆ ప్రాంతంలో సముద్రపు పోటు ఎక్కువ రావడం, ఇసుకమేటలువేయడం, పర్యావరణం దెబ్బతినే ప్రమాదం, కాండ్లారేవు భవిష్యత్ విస్తరణ, భద్రత, సముద్రపు అలల శక్తితో విద్యుత్‌కేంద్రం స్థాపించే ఆలోచనవుండడం వంటివి ఆ నిరాకరణకు కారణాలు.

పైగా ఇంతకుముందే కొత్త ఉప్పు పరిశ్రమల స్థాపనకు స్థానికుల దరఖాస్తులను తిరస్కరించారు. చిన్న ఓడరేవు కట్టుకోవడానికి 'ఇఫ్కో' (ఇండియన్ ఫార్మర్స్ ఫెర్టిలైజర్ కార్పోరేషన్) కు అనుమతి నిరాకరించారు. పైగా కాండ్లా రేవు దేశ రక్షణరీత్యా కూడ అనుమతించరానిదని, అది పాకిస్తాన్ సరిహద్దుకు దగ్గరగా వుందని కూడ అభిప్రాయపడ్డారు.

ఇంకో కోణం నుండి చూసినా కొత్త పరిశ్రమకు అనుమతించాల్సిన పనిలేదు. ఎందుకంటే మనదేశపు ఉప్పు ఉత్పత్తి మన అవసరాలను తీరుస్తూ , ఉత్పత్తయ్యే మొత్తంలో 5% ఎగుమతి కూడ చేస్తూ వుంది. పైగా ఇంకా అవసరమైతే అదనంగా ఉత్పత్తిచేయగల స్థితిలో మనదేశపు ఉప్పు ఉత్పత్తిదారులున్నారు. ఉప్పు ఉత్పత్తిలో మనదేశం ఇప్పటికే ప్రపంచంలో 6వ స్థానంలో వుంది.

పైగా ఈ సంస్థ (కార్గిల్) తయారైన ఉప్పును పూర్తిగా ఎగుమతి చేస్తుందనేది కూడ బూటకం. ఇప్పటికే పంజాబ్‌లో పెప్సి సంస్థ పెట్టిన టమోటో సాస్ (పులుసు) ఫ్యాక్టరీ, బంగాళా దుంపల చిప్సు ఫ్యాక్టరీల ఉత్పత్తులను దేశంలోనే అమ్ముతున్నారు. అది హామీ

ఇచ్చినట్లు సంవత్సరానికి 7 నెలలపాటు 2వేల మందికి పని కల్పిస్తానన్నమాట కూడ నీటిమూటే. పెప్సి సంస్థ 50 వేల మందికి ఉద్యోగాలిస్తానని 400 మందితో సరిపెట్టింది. కార్గిల్ కంపెనీ అనుభవం కూడ అదే. ఆస్ట్రేలియాలో 22 లక్షల టన్నుల ఉప్పును పండిస్తూ ఉద్యోగుల సంఖ్యను 50 కి తగ్గించింది.

నెమ్మదిగా జొరబడిన తర్వాత అది కట్టే రేవును కూడ అచ్చగా ఉప్పు ఎగుమతికే వినియోగిస్తుందన్న గ్యారంటీ కూడలేదు. ఇవన్నీ తెలిసి కూడ భారతప్రభుత్వం దానికి అనుమతి ఇవ్వడం, రాష్ట్రప్రభుత్వంపై, ఇతర శాఖలపై వత్తిడి తీసుకురావడాన్ని మనం ఏమని అర్ధంచేసుకోవాలి? (ఇప్పటికే కార్గిల్ విత్తనాల కంపెనీకి కర్నాటకలో భూములు కేటాయించారు)

ప్రపంచబ్యాంకు, ఐ.యం.ఎఫ్. (IMF) లు విధిస్తున్న షరతులకు తలఒగ్గడంకాదా ఇది? విదేశీమారకం . . . విదేశీమారకం. ఈ పేరిట దేన్నైనా అనుమతించవచ్చన్నమాట. దేశభద్రత వంటి కీలక విషయాలు ఇమిడివున్నా, ఆ కంపెనీని అనుమతిస్తే ఎంత తీవ్ర పర్యవసానాలుంటాయో తెలిసినా మన ప్రజల సర్వాన్ని బలిపెట్టి అయినా సామ్రాజ్యవాదులకు సేవచేయగలగడంలో మేం దిట్టలమనిపించుకుంటున్నాయి మన పాలక వర్గాలు.

ఇలా భూముల కేంద్రీకరణ పెరుగుతోంది. సామ్రాజ్యవాద కంపెనీలు నేరుగా కంపెనీలు స్థాపించుకోడానికిగానీ, వాటి అవసరాలకోసం మన రైతాంగాన్ని హామీగా వుంచి బంధిత ఉత్పత్తి సాగించేలా చేయడానికిగానీ మన పాలకవర్గాలు సంసిద్ధంగా వున్నాయనడానికి నిదర్శనాలు కోకొల్లలు.

## రద్దుకానున్న భూసంస్కరణల చట్టాలు

అందువల్ల బంజరు భూములనయినా కొంతమేరకు వ్యవసాయ కూలీలు పొందే అవకాశం కూడ ఈ ఆర్థిక సంస్కరణలు, వ్యవస్థాగత సర్దుబాట్లు కార్యక్రమాలలో భాగంగానే కోల్పోతున్నారు. అడవిలో కూడ గిరిజనులు, రైతులు అడుగుపెడితే పెద్దగా అరుస్తూ గోలపెట్టే పాలకవర్గాలు వేలకువేలు ఎకరాలు కాదు చౌకగా లీజుకిస్తున్నారు. భూసంస్కరణల చట్టాలు ఎత్తివేయమని పాలకవర్గ శక్తులు ఇప్పటికీ ఆందోళన చేస్తున్నాయి.

ఇప్పుడిక డంకెల్ ప్రతిపాదనలు అమలులోకివస్తే భూసంస్కరణల చట్టాలు కూడ అసలు వుండవు. అంతా 'స్వేచ్ఛా' పోటీయే. ఎవరు భూములు పొందగలిగితే వారివే. ఇప్పటికే మహారాష్ట్ర ప్రభుత్వం తాను 1957 లో చేసిన భూసంస్కరణల చట్టాన్ని రద్దుచేయటానికి అనుమతించమని (గరిష్ఠ పరిమితి వుండడంవల్ల సంపన్నులకు స్వేచ్ఛగా భూములు కట్టబెట్టడానికి ఇబ్బందిగా వుందట, విదేశీమారకం సంపాదించడానికి అడ్డంగా వుందట. శరద్‌పవార్ విదేశీ పర్యటన సందర్భంగా విదేశీ కంపెనీలు, విదేశాల్లో వుండే భారతీయులు (NRI) భూసంస్కరణలు రద్దుచేయమని కోరారట). కేంద్రాన్ని కోరుతూ రికమండేషన్ వ్రాసి పంపారు. అదివుండే విదేశీ గుత్త కంపెనీలు రావడానికి ఆటంకంగా వుందని వ్రాశారు.

ఇదే పని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలచేత చేయిస్తారు. ఏకంగా కేంద్రమే ముందుండి అందుకోసం చట్టంచేస్తుంది. భూమి కావాల్సింది దున్నేవాడికి కాదు. తిండిగింజల కోసంకాదు. అలా కావాలనడం పాత సిద్ధాంతం. భూమికావాల్సింది విదేశీ గుత్త సంస్థల

లాభాలకోసం. విదేశీమారకంకోసం. ఇదీ మన పాలకవర్గాలు అమెరికా నుండి అరువు తెచ్చుకున్న ఆధునిక సిద్ధాంతం.

## నానాటికీ పెరుగుతున్న గ్రామీణ నిరుద్యోగం

పాలకవర్గాలు సంక్షేమం గురించి ఎంత వాగాడంబరం ప్రదర్శించినా ఆచరణలో అట్టడుగు ప్రజలకోసం అందునా గ్రామీణ ప్రజలకోసం చేసిందంటూ ఏమీలేదు. భూసంస్కరణలు ఎలా విఫలమైందీ ఇంతకుముందే చూశాం. రిజర్వుబ్యాంకు తన తాజా నివేదికలో కూడ "గ్రామీణ ధనిక కుటుంబాలకు మొత్తం గ్రామీణ ఆస్తులలో సగానికి పైగా వుండగా, 10 శాతం అట్టడుగు కుటుంబాలకు 0.1% మాత్రమే భూమి వుందని" చెప్పింది.

1947 కు పూర్వం నుండి గ్రామీణ ప్రాంతాల్లో నివసించే జనాభాయే వ్యవసాయంపై ఆధారపడే జనాభాయే మనదేశంలో అత్యధిక శాతంగా వుండడమన్న పరిస్థితి కొనసాగుతోంది. అందులో గ్రామీణప్రాంతాల్లో భూమిలేని నిరుపేదలు వ్యవసాయ కూలీలుగా దుర్భరమైన పరిస్థితుల్లో జీవిస్తున్నారు. వీరి సంఖ్య నానాటికీ పెరుగుతూవుంది. వ్యవసాయంలో వస్తున్న మార్పులవల్ల పేదరైతులు కూడ భూములు కోల్పోయి వ్యవసాయ కూలీలుగా దిగజారుతున్న పరిస్థితిని ఇంతకుముందే చెప్పుకొన్నాం.

| సంవత్సరము | గ్రామీణ కుటుంబాలు | అందులో వ్యవసాయ కూలీల కుటుంబాలు | |
|---|---|---|---|
| 1956 -57 | 6.66 కోట్లు | 1.63 కోట్లు | (24.5 %) |
| 1963 - 64 | 6.76 కోట్లు | 1.72 కోట్లు | (26 %) |
| 1974 - 75 | 8.21 కోట్లు | 2.5 కోట్లు | (30.7%) |
| 1980 - 81 | 8.93 కోట్లు | 2.7 కోట్లు | (30.8%) |

మనరాష్ట్రంలో పరిస్థితి కూడా ఇలాగే వుంది. 1981 లో జిల్లాలవారీగా సేకరించిన లెక్కలప్రకారం మొత్తం శ్రామికుల్లో వ్యవసాయకూలీల శాతం 36.8 వుండగా అది 1991 వచ్చేసరికి 40.8 కి చేరింది.

దేశం మొత్తం మీద గ్రామీణకుటుంబాలలో వ్యవసాయకూలీల శాతం సుమారు 25 గా వుంటూవస్తోంది.

ఈ వ్యవసాయ కూలీలు దేశంలోని అనేక ప్రాంతాల్లో పాలేర్లుగా వుంటున్న స్థితి వుంది. సంవత్సరానికి ఒకేసారి వేతనంపై పనిచేసే ఈ పద్ధతిలో పాలేరు యజమాని ఇంట్లోనే తిండితింటూ వుండి పనిచేయాల్సివుంటుంది. ఇందువల్ల సామాన్యంగా కూలీలుచేసే పనిగంటలకు రెట్టింపు పనిచేయాల్సి వుంటుంది.

గ్రామీణప్రాంతాల్లోని వ్యవసాయకూలీల్లో అత్యధికభాగం షెడ్యూలుకులాలు లేక జాతులకు చెందినవారే. అంటరానికులాలుగా చూడబడే వీరు మనుధర్మస్మృతి ప్రకారం పంచములుగా పరిగణించబడి ఆస్తిహక్కు లేకుండా చేయబడ్డారు.

వ్యవసాయకూలీలకు ధనికరైతులు లేదా భూస్వాములు పండగపబ్బాలకు, పెళ్ళిళ్ళకు కొద్దిపాటి అప్పునివ్వడం ద్వారా తమ పనులకు కట్టుబడి వుండేట్లు చేసుకుంటున్నారు. భూములున్న గిరిజనులు కూడ తాముచేసిన కొద్దిపాటి అప్పులకు భూములు కోల్పోయి తరాలతరబడి వెట్టిచేసినా అప్పుతీరని పరిస్థితి మనం చూస్తున్నాం. 1/70 చట్టం కూడ గిరిజనుల భూములు అన్యాక్రాంతం కాకుండా ఆపలేకపోతోంది. మైదానప్రాంతాల్లోని షెడ్యూలుకులాల పేదలు కూడ తమ సంప్రదాయాల కోసమో, లేక అనారోగ్యంకోసమని బయటపడడానికో చేసే అప్పులు తమ శ్రమను కూడ స్వేచ్ఛగా అమ్ముకోనివ్వని దుస్థితికి నెట్టిపడవేస్తున్నాయి. సాంద్రవ్యవసాయం లేక ఆధునిక పద్ధతులు వచ్చిన జిల్లాల్లో కూడ ఇప్పటికీ వ్యవసాయ కూలీలు ప్రధానంగా కూలిచేస్తూనో, కొంత పొలాన్ని కౌలుకు లేదా పాలుకు చేసుకొంటూనో గడుపుతున్నారు. వ్యవసాయ పెట్టుబడులకోసమూ, ఇతర సేద్యపు వుపకరణాలకోసమూ వీరు భూమి యజమానులపైనే ఆధారపడివున్నారు.

పాలకవర్గాల వ్యూహంలో భాగంగా కొన్ని ప్రాంతాలను అభివృద్ధిచేసి, కొన్ని ప్రాంతాలను తమకు లేబరును సప్లయిచేసే కేంద్రాలుగా ఏ అభివృద్ధికీ నోచుకోకుండా చేస్తున్నాయి. ఇలాంటి ప్రాంతాల నుండి వ్యవసాయ కూలీలు వ్యవసాయేతర పనులకోసం (మూటలుమోయటం, కట్టడపు పనులు, ఇంకా ఇతర అసంఘటిత కార్మికులుగా) వలసలుపోతున్నారు. సాంద్రవ్యవసాయం లేదా నీటిపారుదల గ్యారంటీ వున్న ప్రాంతాల నుండి కూడ వ్యవసాయ కూలీలు వలసపోవలసిన దుస్థితిలోనే వున్నారు.

వ్యవసాయకూలీల వేతనాలు నిర్ధారించడంకోసం 1948 లో కనీస వేతనాల చట్టంచేశారు. దీని ప్రకారం రాష్ట్రాలను జోన్లుగా విభజించారు. ఆయా ప్రాంతాల్లోసాగే వ్యవసాయ అభివృద్ధినిబట్టిచేసిన ఈ జోన్ల పరిస్థితిని బట్టి కూలీ రేట్లను నిర్ణయిస్తారు. ప్రతి 5 సంవత్సరాలకొకసారి ఇలా వేతనాలు నిర్ణయించాలని చట్టంలో చెప్పినప్పటికీ అలాచేసింది అతి తక్కువసార్లే. పైగా కూలీ ఇంతని ప్రకటించడం తప్ప పారిశ్రామిక కార్మికులకున్నట్లు దానిని అమలుజరిపే యంత్రాంగం కూడలేదు.

కౌలుదార్ల రక్షణ చట్టాలున్నప్పటికీ అవి కూడ పేపర్ల మీదే. ఇవి వచ్చిన తర్వాత మూజువాణి కౌలు పద్ధతి పెరిగింది. సాంద్రవ్యవసాయం వున్న ప్రాంతాల్లో కూడ కౌలుకు లేదా పాలుకు భూమిని సాగుచేస్తే ఈనాటి పెరిగిన వ్యవసాయ ఖర్చుల్లో మిగులుతున్నది తన కుటుంబం చేసిన కూలికి బొటాబొటిగా సరిపడేట్లే తప్ప మరింకేమీ వుండడంలేదు. నీటిపారుదల వున్న ప్రాంతాల్లో ఎక్కువ భాగం వ్యవసాయ కూలీలు పాలు అమ్మడం ద్వారా వచ్చే డబ్బుకోసం పశువులను మేపుకోవడంకోసం గడ్డి సంపాదించుకునేందుకు తప్పనిసరిగా ఈ కౌలు లేదా పాలు చేయాల్సివస్తోంది.

ప్రభుత్వం ప్రకటించిన లెక్కలప్రకారమే 1965 నాటికి వ్యవసాయకూలీలకు సగటున 200 రోజులకు మించి పనివుండలేదు. సస్యవిప్లవం తర్వాత ఈ పరిస్థితి మరింత క్షీణించింది. కూలిదినాలు తగ్గాయి. మెట్టప్రాంతాల్లో వ్యవసాయకూలీల పరిస్థితి అత్యంతదుర్భరం. పనివుండే రోజులు అతితక్కువ. అందులోనూ కూలి కూడ తక్కువ కావడంచే అత్యంత దయనీయపరిస్థితిలో జీవిస్తున్నారు.

ప్రభుత్వం భూసంస్కరణల చట్టంలో వైఫల్యం అంగీకరిస్తూ గ్రామీణ నిరుపేదలకు ఉపాధి కల్పిస్తానంటూ బయలుదేరింది. కొద్దిపాటి బంజరుభూములు పేదలకు ఇచ్చినచోట్ల 'జీవనాధార' పేర్లతో బాపులిచ్చారు. అధికార యంత్రాంగంలోని అవినీతి అందులోని

మొత్తాలను తినివేయడంతో ఆ బావులు నీరుపడే దశకు పోకుండానే పాడుబడుతున్నాయి. భూమిలేని నిరుపేదల ఉపాధి గ్యారంటీ పథకం (RLEGP), సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం (IRDP), గ్రామీణ నిరుపేదల స్వయంఉపాధిపథకం ఇలా పేర్లు మారుతూ పంచాయితీ నిధుల జవహర్‌రోజ్‌గార్‌యోజనగా పి.వి.గారి ప్రస్తుత పథకం ప్రకారం 'ప్రధాని రోజ్‌గార్‌యోజన' వరకు పథకాలపేర్లయితే ప్రమాణంచేశాయిగానీ ఇందువల్ల కల్పించబడిన పనిమాత్రం అతితక్కువ.

ప్రపంచబ్యాంకు, ఐ.యం.ఎఫ్. లు తమ విధానాలు రుద్దడంలో భాగంగా ఇందుకోసం కేటాయింపులను కూడ బడ్జెట్‌లో దిగకోస్తున్నాయి. అందువల్ల ఇక పై ప్రభుత్వానికి ప్రచారంకోసం కూడ ఇందుకోసం ఏమీచేస్తున్నట్లు చెప్పుకోవడానికి మిగలదు.

వ్యవసాయంలో ఇటీవలకాలంలో వచ్చిన మార్పులు కూడ వ్యవసాయ కూలీల పనిదినాల్ని తీవ్రంగా తగ్గించాయి. దేశవ్యాపితంగా రైతుల పంటపొలాల్లో పెరుగుతున్న సామాజిక వనాలు పెరుగుతున్న రొయ్యల చెరువులు, ఇతర ఉద్యానవన పథకాలవంటివన్నీ శ్రామికుల పనిదినాల సంఖ్యను తగ్గించేవే. దీని కారణంగా పనిదినాల సంఖ్య ప్రస్తుతం సగటున 100 రోజుల కన్నా మించదు.

ఇప్పటికీ వివిధ ప్రభుత్వసంస్థలు ప్రకటిస్తున్న లెక్కల ప్రకారమే

* 25 నుండి 30 కోట్ల మంది భారతీయులు రాత్రిపూట ఆకలితోనే నిద్రపోతున్నారు.

* 25 కోట్ల మంది ఆరోగ్యంగా బ్రతకడానికి అవసరమైన దానిలో 3/4 వ వంతు ఆహారాన్ని, మరో 5.5 కోట్ల మంది అవసరమైనదాంట్లో సగంకన్నా తక్కువ ఆహారం తీసుకొంటున్నారు.

* దేశంలో తలసరి వార్షిక ఆహారం అందుబాటు 200 కిలోలు. అదే చైనాలో 330 కిలోలు. మనం చైనాతో సమానస్థాయికి రావడానికి 83 కోట్ల మంది (అపుడువేసిన అంచనా) కోసం కనీసం 27 కోట్ల టన్నుల ఆహారధాన్యాలు పండించాలి. (ప్రస్తుతంకన్నా 10 కోట్ల టన్నులు అధికంగా).

* భారత వైద్య పరిశోధనా మండలి (ICMR) నియమించిన జాతీయ పోషకాహార పర్యవేక్షణ బ్యూరో (NNMB) అంచనా ప్రకారం

  దేశంలోని ఉన్నతాదాయవర్గాలు నూనె పదార్థాల్ని రోజుకు 40 గ్రాములు వాడుతుండగా, మధ్య ఆదాయవర్గాలు 35 గ్రాములు, కార్మికులు - 22 గ్రాములు, శ్రామికవాడల పేదలు, గ్రామీణ శ్రమజీవులు సగటున - 10 గ్రాములు వాడుతున్నారు.

  రోజుకు సగటున 35 గ్రా. నూనెలు, కొవ్వు పదార్థాలు వాడాలని ఐ.సి.ఎం.ఆర్. సూచన చేస్తోంది. పై లెక్కలప్రకారం నూటికి 80 మంది అవసరమైన దానికన్నా చాల తక్కువ తింటున్నారు.

* 43 వ నేషనల్ శాంపుల్ సర్వే ప్రకారం రోజూ దాదాపు 1 కోటి మంది పని దొరకక విసిగివేసారిపోతున్నారు.

ఇవి పరిస్థితిని అర్థంచేసుకోడానికి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ప్రభుత్వం ఈ కోట్లాది అట్టడుగు వర్గాలకోసం ఇపుడు తీసుకునే చర్యలు కూడ ఇకపై వుండవు. పంటల

విధానంలో వచ్చే మార్పు గురించి, అది కలిగించే ప్రభావం గురించి ఇంతకుముందే చెప్పుకున్నాం. ప్రభుత్వం షెడ్యూలు కులాలకు షెడ్యూలు జాతులకు ఇచ్చే గొర్రెలలోను, బండి కాడెద్దులలోను కూడ బ్యాంకింగ్ వ్యవస్థకిచ్చిన ఆదేశాల ప్రకారం నిలుపుచేస్తుంది.

ప్రస్తుతం గుత్తకంపెనీల అవసరంకోసం వ్యవసాయంలో తెచ్చే మార్పులు, వాళ్ళు ప్రవేశపెట్టే యంత్రాల కనుగుణమైన పంటలు మరింతగా గ్రామీణ నిరుద్యోగాన్ని పెంచుతాయి. డంకెల్ డ్రాఫ్టు ప్రకారం వ్యవసాయ వాణిజ్యం మరింత పెరిగేకొద్దీ గ్రామీణ నిరుద్యోగం కూడ పెరుగుతుంది. మరోవైపు ఈ నిరుద్యోగానికి సబ్సిడీల కోత - ప్రజా పంపిణీ వ్యవస్థ రద్దువంటి చర్యలు తోడవుతాయి. దాంతో ఇపుడు దొరికే తిండి కూడ రాబోయే రోజుల్లో గ్రామీణ పేదలకు దొరకదు.

# జీవసాంకేతిక శాస్త్రం (బయోటెక్నాలజీ) పేటెంట్ హక్కుల ఆవిర్భావం

డంకెల్ ప్రతిపాదనల్లో వ్యవసాయరంగంలో పేటెంట్ హక్కులు అడగడం మనం చూస్తున్నాం. ఇంతకు ముందు వరకు పెద్ద ప్రాధాన్యత లేకుండా ఇపుడు వ్యవసాయంలో పేటెంట్ హక్కుల కోసం సామ్రాజ్యవాదులు ఎందుకు వత్తిడి చేస్తున్నారో అర్థం చేసుకోవాలంటే మనం బయోటెక్నాలజీ - వ్యవసాయరంగంలో అదిసాధించిన, సాధించడానికి అవకాశమున్న అద్భుత ఫలితాలను కొంతైనా తెలుసుకోవడం అవసరం.

హరిత విప్లవకాలంలో హైబ్రిడ్ వంగడాల వాడకం మనం చూశాం. అంతకుముందు వరకు మనిషి తర తరాలుగా ఒక పంటకారు నుండి మరో పంట కారుకు మేలైన విత్తనాలు కట్టుకుంటూరావడం వెనుకవున్న శాస్త్ర పరమైన అంశాల్ని గుర్తించి (హైబ్రిడైజేషన్) సంకరీకరణం చేయడం ద్వారా హైబ్రిడ్ విత్తనాలు తయారయ్యాయి. మొక్కలోని స్త్రీ అంశం, పురుష అంశం కలవడం ద్వారానే మరొక మొక్క తయారవుతుంది. అలా తయారయ్యే మొక్కలో తల్లి, తండ్రి, ఇద్దరి లక్షణాలు వుంటాయి. ఈ అంశాన్ని ఆసరాగా చేసుకుని తనకు కావలసిన మెరుగైన లక్షణాల కోసం వేర్వేరు లక్షణాలు గల అండాన్ని, పుప్పొడిని కలిపి హైబ్రిడ్ మొక్కల కోసం ప్రయత్నించే సైన్సు హరిత విప్లవకాలం నాటిది.

బయోటెక్నాలజీ అంతకంటే (హైబ్రిడైజేషన్) అభివృద్ధి చెందిన సైన్సు. జీన్సు (Genes) అన్న మాట మనం తరచు వింటూనే వుంటాం. వాటి ఆధారంగా అభివృద్ధి చెందిన సైన్సు ఈ బయోటెక్నాలజీ. అందులోనూ జెనెటిక్ ఇంజనీరింగ్ అన్న విభాగం. జీన్ అంటే మొక్కల్లోగానీ, జంతువుల్లోగానీ, మనుషుల్లోగానీ ఒక తరం నుండి మరొక తరానికి వంశపారం పర్య (వారసత్వ) లక్షణాలను మోసుకెళ్ళే సూక్ష్మాతి సూక్ష్మమైన నిర్మాణం. ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే -

మనందరి శరీరం (మొక్కదైనా - జంతువుదైనా) సూక్ష్మమైన పరమాణువులు ఇటుకల్లా పేర్చబడడం ద్వారా నిర్మాణమై వుంటుంది. ఆ పరమాణువులో కూడ కేంద్రకం అనేది వుంటుంది. అదే జీవానికి మూలం. అందులో క్రోమోజోములనబడేవి వుంటాయి. ఈ క్రోమోజోముల సంఖ్య ఒక్కో తరహా జంతువులో ఒక్కో సంఖ్య వుంటుంది. ఈ క్రోమోజోములలోని సూక్ష్మ అమరికనే జీన్సు అంటారు.

లక్ష మంది ఒకే చోటవున్నా అందులోమనకు కావలసిన మనిషిని వేరు చేసి గుర్తు పట్టగలగడానికి కారణం - మనుషుల్లో ఎన్ని సాధారణ లక్షణాలున్నా భిన్నత్వం ఉండడానికి కారణం ఈ జీన్సే. ఒకే జీవిలో గల వేర్వేరు రకాల లక్షణాలను వేర్వేరు జీన్సు తర్వాత తరాలకు మోసుకెళ్తాయి. మనుషుల్లో పొట్టి, పొడుగు, రంగుల్లో తేడా, వీటి వల్లే. అలాగే జంతువుల్లో ఎక్కువ పాలిచ్చేవి, తక్కువ పాలిచ్చేవి. మొక్కల్లో పొట్టి, పొడుగు - తక్కువ కాలంలో పండేవి, ఎక్కువ కాలంలో పండేవి. లావుకాయలు కాసేవి, చిన్నకాయలు కాసేవి. రోజాలాంటి మొక్కల్లో రకరకాల రంగుపూలుపూసేవి. ఇలా వేర్వేరు భిన్నత్వాలు జీవుల్లో వుండడానికి కారణం ఈ జీన్స్.

ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఈ జీన్సును వేరు పరచగలిగింది. ఒక మొక్కలోని కొన్ని జీన్సును, మరొక మొక్కలో మనకు అవసరమనుకున్న జీన్సుతో కలపడం ద్వారా రెండు మొక్కలనుండి మనం కోరుకున్న లక్షణాలతో కొత్త మొక్కను తయారు చేయడం సాధించగలిగింది. ఆధునిక సైన్సు. ఈ రకంగా జీన్సును కలిపే టెక్నాలజీనే జెనెటికల్ ఇంజనీరింగ్ అన్నారు. విత్తనాల్లోని వేర్వేరు జీన్సును ఇలా కలప గలుగుతున్నారు.

ఇందులోనే మరో పద్ధతి విత్తనాల నుండి కాకుండా మొక్క కాండం నుండి పదార్థం తీసి, దాన్నుండి కూడ నూతన మొక్కను రూపొందిస్తున్నాం. ఆ పద్ధతిని టిస్యూకల్చర్ అంటారు. ఈ రకంగా మనం కోరుకునే నూతన క్షణాలుగల మొక్కల రూపకల్పనలో బయోటెక్నాలజీ అన్న ఆధునిక విజ్ఞానం మార్పుకు పురోగమిస్తోంది.

అలాగే – ఒక పదార్థంపై వైరస్ లేదా బ్యాక్టీరియా పని చేయడం ద్వారా ఆ పదార్థంలో మార్పు తెచ్చి మరో కొత్త పదార్థం తయారు చేయడం కూడ బయోటెక్నాలజీనే. ఈ ప్రక్రియ వెనుకవున్న సైన్సు తెలియనప్పటికీ ఎప్పటినుండో దీన్ని మానవులు వుపయోగిస్తున్నారు. ఉదాః పాలకు మజ్జిగ కలపడం ద్వారా పెరుగు తయారు చెయ్యడం – మజ్జిగలో ఉండే ఒక రకం సూక్ష్మజీవి పాలను అలా మారుస్తుంది. అలాగే పులియ బెట్టడం – బార్లీ నుండి బీరు తయారుచెయ్యడం. గోగుకట్టెను నీళ్ళలో నానవేసి నారను తియ్యగలగడం ఇవన్నీ అలాంటివే. బ్యాక్టీరియా, వైరస్ నుపయోగించి ఒక పదార్థంలో మనం తేవాలనుకునే మార్పులు సాధించగలగడం కూడ బయోటెక్నాలజీనే.

## దీనివల్ల ఎలాంటి ఫలితాలు పొందవచ్చు?

ఆధునిక విజ్ఞానంలో బయోటెక్నాలజీ వల్ల బహుముఖమైన ఫలితాలు సాధించవచ్చని రుజువైంది. మొదట ఈ విజ్ఞానాన్ని వైద్యరంగంలో ఉపయోగించారు. వృక్షశాస్త్రంలో ఈ క్రమం ఆలస్యంగా మొదలైంది. వైద్యరంగంలో – చక్కెరవ్యాధి (డయాబెటిస్ లేదా సుగర్ జబ్బు) నయం చెయ్యడానికి వాడే ఇన్సులిన్‌ను మొదట పందులు, ఆవుల నుండి తమ శరీరం కోసం అవి తయారు చేసుకున్నదాన్నే బయటకు తీసే వాళ్ళు. అయితే తర్వాత ఒక రకపు బ్యాక్టీరియాలో మార్పులు తేవడం ద్వారా ఇన్సులిన్‌ను తయారు చేసే ప్రక్రియను కనుకొన్నారు. అందువల్ల ఇపుడు ఎంత పెద్ద మొత్తాల్లోనయినా ఇన్సులిన్‌ను తయారుచెయ్యడం వీలుపడింది.

మానవుడు ఊహించని అనేక ఫలితాలు దీని ద్వారా సాధించవచ్చని రుజువైంది. ఉదాకు పెట్రోలుపై ఒక రకం బ్యాక్టీరియానుపయోగించి ఆహార పదార్థంగాను – ఆహార పదార్థాన్ని పెట్రోలుగాను మార్చవచ్చు. సముద్రంపై ఓడల్లో తెచ్చే ఆయిలు టాంకులు పగిలిపోయి నీటిపై ఆయిలు తెట్టలు ఏర్పడి పెద్ద సమస్యగా అయ్యాయి. ఒక రకపు బ్యాక్టీరియాతో ఆ ఆయిల్ తినివేసేట్లు చేస్తున్నారు. పరిశ్రమల్లో వ్యర్థంగా బయటికి వచ్చిన పదార్థాలు చెడు వాసనలు వెదజల్లుతూ మనల్ని ఇబ్బంది పెడుతుంటాయి. వాటిని, నిర్మూలించడానికి, ప్లాస్టిక్‌లను నిర్మూలించడానికి కూడ బ్యాక్టీరియాలను కనుగొంటున్నారు.

వృక్షశాస్త్రంలోకి వస్తే – హైబ్రిడ్ విత్తనాల్ని, నూతన మొక్కల్ని దీని ద్వారా తయారు చేసుకోవచ్చు. పొడుగుగా వుండి అధిక దిగుబడిని ఇస్తూ పంటకు వచ్చినపుడు గాలికి తట్టుకోలేక పడిపోయే రకం వరిని – పొట్టిగా గట్టిగా వుండే వరి మొక్కల్లోని జీన్సును కలపవచ్చు. అలాగే పప్పుజాతిమొక్కలు వేరులోనే బుడిపె కలిగి వుండడం ద్వారా తమకు

కావలసిన నైట్రోజన్ ఎరువును స్వంతంగా తయారు చేసుకుంటాయి. ఈ లక్షణాన్నిచ్చే జీన్‌ను వరి మొక్కకు కలిపి నైట్రోజన్‌కు తమంత తాము తయారు చేసుకొనేట్లుగా రూపొందించవచ్చు.

అలాగే కొన్ని మొక్కలు 5,6 సం॥లకు గానీ కాయలు కాయవు - ఆ విత్తనాల కోసం అన్ని సం॥లు ఆగకుండానే ప్రయోగశాలలో రోజుల్లోనే ఆ మొక్కల్ని తయారు చేయవచ్చు. తెగుళ్ళను తట్టుకునేట్లుగా మొక్కల్ని రూపొందించవచ్చు. మొక్కలకు తెగుళ్ళు కల్గించే పురుగుల్ని తినేసే బాక్టీరియాలను కనుగొని తెగుళ్ళను నిర్మూలించవచ్చు.

రోజూగుడ్లు పెట్టే హైబ్రిడ్ కోళ్ళను, మాంసాన్ని ఎక్కువ మొత్తంల్లో ఇచ్చే కోళ్ళను, ఇతర జంతువుల్ని ఎక్కువ పాలిచ్చే బర్రెలు, ఆవుల్ని తయారు చేయగలిగింది ఈ టెక్నాలజీవల్లే.

దీని ద్వారా ఎంజైముల్ని పెద్ద ఎత్తున తయారు చెయ్యడం, ఫెర్మెంటేషన్ ప్రాసెస్‌లోను బయోటెక్నాలజీనే వాడుతున్నారు.

సారాంశంలో కొత్త విత్తనాలు, రసాయనిక ఎరువులు, పురుగు మందులు కనిపెట్టి తయారు చెయ్యడంలో, పండిన పంటను ఆహార పదార్థాలుగా తయారు చెయ్యడంలోను బయోటెక్నాలజీ వుపయోగాలు రోజు రోజుకు విస్తరిస్తున్నాయి.

## క్రమక్రమంగా బయోటెక్నాలజీపై ఆధిపత్యం సాధించిన గుత్త కంపెనీలు

ఈ బయోటెక్నాలజీని కనిపెట్టింది, అభివృద్ధి పరచింది శాస్త్రవేత్తలు. ప్రభుత్వ యూనివర్సిటీలు, పరిశోధనా సంస్థల్లోనే ఇవి కనిపెట్టబడ్డాయి. అయితే ఈ శాస్త్ర పద్ధతికున్న విస్తృతిని చూసిన ప్రైవేటు రంగం కన్ను దీనిపై కూడ పడింది.

అమెరికా వంటి దేశాల్నే చూస్తే దాదాపు 1980 వరకు బయోటెక్నాలజీ పరిశోధనలు ప్రభుత్వ యూనివర్సిటీల్లోనే జరిగేవి, లేదా ఆ యూనివర్సిటీల ప్రొఫెసర్లు, లేదా దానికి సబంధించిన పరిజ్ఞానంవున్న వాళ్ళు ప్రైవేటుగా చిన్న కంపెనీలు పెట్టుకుని పరిశోధనలు చేసే వాళ్ళు. మార్కెట్ చేసే వుత్పత్తిని తయారు చేసేవాళ్ళు.

అయితే క్రమంగా వృక్షశాస్త్రంలో, ఆహార రంగంలో కూడ బయోటెక్నాలజీకున్న విస్తృతమైన మార్కెటింగ్ అవకాశాల్ని లెక్క వేసుకున్న పెట్రోకెమికల్ (ఎరువులు, మందులు తయారు చేసేవి) గుత్త కంపెనీలు ఇందులోకి ప్రవేశించాయి. చిన్న పరిశోధన కంపెనీలతో ఒప్పందాలు చేసుకున్నాయి. కొనేశాయి. మరోవైపు యూనివర్సిటీలతో కూడ ఒప్పందాలు చేసుకుని - వాళ్ళకు ఫండ్సు (నిధులు) ఇవ్వడం ద్వారా అక్కడ జరిగే పరిశోధన తమ కంట్రోల్లోకి తీసుకున్నాయి. 1981 తర్వాత ఈ క్రమం వేగం పుంజుకుంది. 1985లో అమెరికాలో తీసిన లెక్కల్లో బయోటెక్నాలజీ రంగంలో ఇచ్చిన 1078 పేటెంట్లలో యూనివర్సిటీలు, వ్యక్తులు, చిన్న కంపెనీల భాగం 21% అయితే గుత్త సంస్థలు 79% హక్కులు సాధించాయి.

వైద్యానికి వాడే మందులు, ఎరువులు, పురుగు మందులు తయారు చేసే కంపెనీలే ఈ బయోటెక్నాలజీ రంగంపై కేంద్రీకరించి పరిశోధనలు పెంచాయి. ఉదాహరణకు మొన్‌శాంట్ డూపాంట్ సం॥నికి 200 మిలియన్ల డాలర్లు (రూ. 6000 కోట్ల) ఖర్చు

పెడుతోంది. అతి పెద్దదైన అమెరికన్ కార్గిల్ కంపెనీ తాజా లెక్కల ప్రకారం సం॥కి 5 లక్షల కోట్ల రూ॥ ఖర్చు పెడుతోంది.

వైద్యంలో వాడే మందునో, పురుగు మందునో కొత్తదాన్ని కనిపెట్టడానికి చాలా కాలం పడుతుంది. డబ్బూ ఖర్చవుతుంది. అయితే కొత్త విత్తనాన్ని కనుక్కోవడం త్వరగాను, తక్కువ ఖర్చుతోను చెయ్యవచ్చని గుర్తించిన గుత్త కంపెనీలు విత్తన రంగంపై దృష్టిని సారించాయి. విస్తారమైన విత్తన మార్కెట్ల కోసం ఎగబడ్డాయి. అంతేగాక మొత్తం వ్యవసాయంపైనే తమ టెంటకిల్సు (కొండెలు) సారించాయి.

## ఎరువులు – విత్తనాలే గాదు మొత్తం వ్యవసాయంపై కే

ప్రస్తుతం సాగుతున్న వ్యవసాయ ప్రక్రియలను 4 దశలుగా విభజించవచ్చు.

1. వ్యవసాయానికి అవసరమైన వస్తువుల్ని (Inputs) ఉత్పత్తి చేయడం (ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు, ట్రాక్టర్లు, టిల్లర్లు వగైరా యంత్రాలు)
2. పంటను పొలాల్లో పెంచడం
3. వ్యవసాయ ఉత్పత్తులను ఆహారంగా మార్చడం (గింజ నుండి నూనె, బిస్కట్లు, సూప్పు, చిప్పు, వంటి వాటి తయారీ)
4. వినియోగదార్లకి చేర్చడం అంటే మార్కెటింగ్.

ఈ నాలుగు దశల్లోను ఈ రోజు గుత్త కంపెనీలు రాజ్యం చేస్తున్నాయి. కొన్ని ఒక్క ప్రత్యేక దశలో పట్టుకలిగి వుండగా, మరి కొన్ని పై 4 దశల మీదా పట్టు కలిగి వున్నాయి.

10 బహుళజాతి గుత్త సంస్థలు ప్రపంచంలోని ఎరువులు, పురుగు మందుల మార్కెట్లో సగాన్ని కంట్రోలు చేస్తున్నాయి. వీటిలోని అధిక భాగం విత్తన మార్కెట్‌పై కూడ పట్టును కలిగి వున్నాయి. కొన్ని పంటల కోసం ఈ కంపెనీలు చిన్న రైతులను ప్రక్కకు నెట్టి పెద్ద పెద్ద ప్లాంటేషన్లు ఆక్రమించాయి. ఉదా॥ యూనిలీవర్ కంపెనీ పామ్ ఆయిలు మొక్కల కోసం ప్రపంచ మంతా ప్లాంటేషన్లు పెడుతోంది. మరో వైపు నూనె పరిశ్రమలో, దాని మార్కెటింగ్‌లో అన్నిటా కంట్రోలు కలిగి వుంది.

ఇలా వ్యవసాయరంగం అంతా బహుళజాతి కంపెనీ (MNC) ల కంట్రోలు పెరుగుతోంది.

## బయోటెక్నాలజీ ఫలితాలతో మూడవ ప్రపంచదేశాల ప్రజలను నిరుద్యోగులను చేస్తున్న సామ్రాజ్య వాదం

వలస పాలన ప్రత్యక్షంగా సాగిన కాలంలో మూడవ ప్రపంచ దేశాలు సామ్రాజ్యవాద దేశాలకు వారి పరిశ్రమలకు అవసరమైన ముడి సరుకులను (మసాలా దినుసులు, టీ, కాఫీ, రబ్బరు, పొగాకు వంటివి) ఉత్పత్తి చేసేవిగా మలచబడ్డాయి. ఇప్పటికీ ఈ ఉత్పత్తులను సరఫరా చేస్తూనే వున్నాయి. తర్వాత దశలో ఈ దేశాల్లో చౌకగా శ్రమశక్తి దొరుకుతుంది గనుక దాన్ని కూడ కొల్లగొట్టేందుకు కొన్ని పరిశ్రమలు పెట్టారు. (బట్టల తయారీ, కుట్టడం, టి.వి.సెట్లు విడిభాగాల్ని కూర్చడం వంటివి). అయితే ఆధునిక

పరిజ్ఞానంలో మైక్రో ఎలక్ట్రానిక్స్ వంటి పరిశోధనలు ముందు కెళ్ళడంతో ఆటోమేషన్, కంప్యూటరైజేషన్ పెద్ద ఎత్తున చేశారు. దాంతో కార్మికులను ఇళ్ళకు పంపించి మూడో ప్రపంచ దేశాల్లో కూడ నిరుద్యోగాన్ని పెంచారు. దాంతో మళ్ళీ ముడి సరుకుల సప్లయిదార్లుగానే మూడవ ప్రపంచదేశాలు మిగిలాయి.

అయితే బయోటెక్నాలజీ రావడంతో మూడవ ప్రపంచం ఈ అవకాశాన్ని కూడ కోల్పోతోంది. కొన్ని పదార్థాల్ని వ్యవసాయ ముడిపదార్థాలు లేకుండానో లేక వేరే పదార్థాలతోనో తయారు చేయడం సాధ్యపడడంతో మూడవ ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నిరుద్యోగానికి మరింతగా గురిచేయబడుతోంది.

ఒక్క ఉదాహరణతో మనం పరిస్థితి అర్థంచేసుకోవచ్చు. చక్కెర పంట మూడో ప్రపంచం నుండి జరిగే ఎగుమతుల్లో ఒకటి. ఈ పంటకు బదులుగా యూరపు దేశాల్లో • సుగర్ బీట్ అనే పంటను పండిస్తున్నారు. దీని నుండి యూరపు దేశాలు తమకు కావలసిన తీపి పదార్థాల్ని తయారు చేసుకుంటున్నాయి. అలాగే మొక్కజొన్న నుండి తీపి పదార్థాం తయారు చేస్తున్నారు. అమెరికా, జపాన్‌లలో ఈ పద్ధతిని అను సరిస్తున్నారు. ఎక్కువ తీపివున్న మొక్కజొన్న రసం (High fructose corn syrup - H.F. C.S) గా పిలవబడేదీన్ని అమెరికాలోని కోకోకోలా, పెప్సికోలా, 7 - అప్, సన్‌కిస్ట్ వంటి శీతల పానీయాలు (Soft Drinks) తయారు చేయడంలో బహుళ జాతి గుత్త సంస్థలు వాడుతున్నాయి. దీంతోఅమెరికా,జపాన్, యూరపు దేశాలు చక్కెర దిగుమతులను తగ్గించాయి. అమెరికా 1978లో 46 కోట్ల టన్నుల చక్కెర దిగుమతి చేసుకునేది, 1985కు వచ్చే సరికి 25 కోట్ల టన్నులకు (దాదాపు సగం) తగ్గించింది.

ఇంతేకాక అమెరికన్ గుత్త కంపెనీ మొన్‌శాంటో అస్పర్‌టేమ్ (Aspertame) అనే (చక్కెర కన్నా వందల రెట్లు తీపి) పదార్థాన్నీ, హెక్ట్ కంపెనీ ఆస్‌పుల్‌సెమ్ - కె (Acefulsame - K) అనే (130 రెట్ల తీపి) పదార్థాన్నీ ; ఇంగ్లండ్‌కు చెందిన టాటె - లైలె (Tate & Lyle) కంపెనీ, ఆంగ్లోడచ్చి యూనిలీవర్ కంపెనీలు థాయుమేటిన్ (Thaumatin) అనే (250 రెట్లు తీపి) పదార్థాన్ని తయారు చేశాయి. వందలకోట్ల రూ॥ మార్కెట్‌ను సృష్టించాయి.

దీని ప్రభావం మూడవ ప్రపంచ దేశాల్లోని 5 కోట్ల ప్రజలపై (చక్కెర వుత్పత్తి, పరిశ్రమలపై ఆధారపడేవాళ్ళపై) పడిందని అంచనా. చక్కెర వుత్పత్తి చేసి ఎగుమతి చేసే చిన్న దేశాల ఆర్థిక వ్యవస్థలపై తీవ్ర ప్రభావాన్ని ఇది కలిగించింది. ఫిలిప్పైన్స్ 5 లక్షల మంది వ్యవసాయ కూలీలు పనికోల్పోయారు. పెట్టుబడులు లేక పంటలు మార్పిడి చేయలేని పేదరైతులు భూముల్ని కూడ వదిలారు. ఫిలిప్పైన్ ప్రజల జీవన ప్రమాణం 4 ఏండ్లలో $\frac{1}{5}$ వ వంతు తగ్గింది.

ఇలాగే విభిన్న పంటల నుండి వేర్వేరు పదార్థాలు తయారు చేసేందుకు బహుళ జాతి గుత్త సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. సింథటిక్ రబ్బరు రావడం వల్ల రబ్బరు పండించే దేశాలు, సింథటిక్ నూలు తయారీవల్ల ప్రత్తి పండించే మన లాంటి దేశాలు, పామాయిల్ నూనె పంట రావడంతో వేరుశనగ, కొబ్బరి నూనె వంటివి పండించే దేశాలు, ఇలా , ఇలా .... బహుళ జాతి సంస్థలు ఈ దేశాల వుత్పత్తులతో, తద్వారా వాటిపై ఆధారపడి జీవించే ప్రజల జీవితాలతో చెలగాట మాడుతున్నాయి.

## ఈ విజ్ఞానం వల్ల పెరిగే దిగుబడులు ఆకలిని తీరుస్తున్నాయా?

బయోటెక్నాలజీ రావడంతో వుత్పత్తులు వేగంగా పెరగడానికి అవకాశం ఏర్పడింది. అయితే ఈ పెరిగే వుత్పత్తులు ప్రజలు ఆకలిని తీర్చేందుకు కాక ఆ వుత్పత్తిని కనుగొని వుత్పత్తి చేయించే బహుళజాతి కంపెనీల లాభాల దాహాన్ని తీర్చుకునేందుకు వుద్దేశించబడుతున్నాయి.

ఉదాహరణ మనదేశంలో కూడ విస్తృతంగా పెంచబోతున్న పామ్ ఆయిలు మొక్కలనే తీసుకుందాం. ఆంగ్లోడచ్చి కంపెనీ అయిన యూనిలివర్ (Unilever) కంపెనీ (మన దేశంలోని హిందూస్థాన్ లీవర్ దీనిదే) ఈ పంటపై పరిశోధనకు పేటెంట్ కలిగి వుంది. మామూలుగా ఈ మొక్కలు కావాలంటే విత్తనాలు కావాలి గనుక పంట వచ్చిన 5 సం॥ తర్వాతగానీ విత్తనాలు రావు. అయితే టిష్యూకల్చర్ అనే బయోటెక్నాలజీ పద్ధతిలో ఈ మొక్కల్ని యూనిలివర్ కంపెనీ తయారు చేస్తోంది. సం॥కి 10 లక్షల మొలకలను ఈ కంపెనీ తయారు చేస్తుంది. పంట దిగుబడిని కూడ 30 శాతం పెంచేట్లుగా మొక్కలు రూపొందించింది. వీటిని నాటి పంట తియ్యడం కోసం నేలలు కావాలి గదా! (90 వేల హెక్టార్లు) 2 లక్షల 25 వేల ఎకరాల క్షేత్రాలను ఇప్పటికే ఇందుకోసం సేకరించిన ఈ కంపెనీ 2000 సం॥ నాటికి (లక్షా 60 వేల హెక్టార్లలో) 4 లక్షల ఎకరాలలో పంట పండించాలన్న లక్ష్యంతో మన లాంటి దేశాలకు కూడ వస్తోంది.

ఇప్పటికి వేసిన ప్లాంటేషన్లను కూడ మూడవ ప్రపంచ దేశాల్లోనే వేశారు. ప్రపంచపు ఖాద్య (Vegetable Oils) నూనెలలో ఈ కంపెనీ 1/3 వ వంతును కంట్రోలు చేస్తోంది. ఈ పంట మూడవ ప్రపంచ దేశాల్లో స్థానికంగా పండేనూనెల మార్కెట్‌ను దెబ్బ తీస్తుంది. ఫిలిప్పైన్స్ కొబ్బరి నూనె పండించే రైతులు వేరుశనగ పండించే సెనెగల్ దేశరైతులు ఈ రకంగా దెబ్బతిన్నారు. మలేషియాలో పామాయిలు తోటలు పెరగడంతో రబ్బరు పంట దెబ్బతిని ఆ పంటపై ఆధారపడే కూలీలు పనికోల్పోయారు.

పామాయిలు పంట సాంప్రదాయకంగా పండే చోట ఆ విత్తనాలకుండె నూనెను తీసుకొని వాడుకుంటారు. అయితే ఈ కంపెనీ రీఫైండు ఆయిలు, (శుద్ధి చేసి) డబుల్ రీఫైండు ఆయిలు పేరుతో అధికధరలకు అమ్ముతోంది. మరోవైపు ఎంజైములు వాడకం ద్వారా పంట దిగుబడి పెంచే ప్రయత్నంలో పరిశోధనలు సాగిస్తోంది తప్ప, మొక్కలో పోషక విలువలు పెంచడం గురించిన అంశాన్నే పట్టించుకోవడంలేదు. మిగిలిన పంటల విషయంలో ఇతర బహుళ జాతి సంస్థలు కూడ ఇలాంటి పద్దతులనే అనుసరిస్తున్నాయి.

అందువల్ల బయోటెక్నాలజీపై గుత్త సంస్థల ఆధిపత్యమే కొనసాగితే మాత్రం మొక్కలు ఎంత అధిక దిగుబడులను ఇచ్చినా ప్రజల ఆకలి మాత్రం తీరదు. సామ్రాజ్య వాద కంపెనీలు మాత్రం తెగబలుస్తాయి. ఈ కంపెనీలు సాధించే అధికోత్పత్తి అంతకంతకు పెరిగి, మూడవ ప్రపంచ దేశాల మార్కెట్ల కోసం పోటీ పెరుగుతోంది. మూడవ ప్రపంచ దేశాల స్థానిక వుత్పత్తులు దెబ్బతిని, ప్రజల కొనుగోలు శక్తి పడిపోయి, భయంకరమైన ఆకలి సమస్యను ఎదుర్కొంటాయి.

## రసాయనాల వాడకాన్ని పెంచి డబ్బు జేసుకుంటున్న బహుళ జాతి కంపెనీ (MNC) లు

మనం పంటలపై వాడుతున్న రసాయనాలు మన నేలను, నీరుమ కలుషితం చేస్తున్నాయి. ఈ మందులను చేలపై చల్లే (Spray) కూలీల ఆరోగ్యం దెబ్బతీయడం

చూస్తున్నాం. కేన్సర్ వంటి జబ్బులకు కూడ గురి చేస్తున్నాయని పత్రికల్లో చదువుతున్నాం. అలాంటపుడు ఈ రసాయనాలు ఇలా వాడాల్సిందేనా? బయోటెక్నాలజీ ఇందుకేమీ తోడ్పడదా? అని మనకు సహజంగానే అనుమానం వస్తుంది.

బయోటెక్నాలజీ ద్వారా రసాయనాల వాడకాన్ని తగ్గించే అవకాశం ఖచ్చితంగా వుంది. ఎందుకంటే మొక్కల్లో తెగుళ్ళను తట్టుకోగలవీ వున్నాయి, తట్టుకోలేనివీ వున్నాయి. రోగ నిరోధక శక్తి ఎక్కువ వున్న మొక్కల జీన్లను తీసి ఎక్కువ దిగుబడి ఇచ్చే మొక్కలకు కలపడంవల్ల రెండు లక్షణాలూ గల మొక్కను రూపొందించగలం. అయితే బయోటెక్నాలజీ పరిశోధనలన్నీ పెట్రోరసాయనాలు (ఎరువులు, పురుగు మందులు) తయారు చేసే కంపెనీల చేతిలో వుండడంతో అవి వాటి వాడకాన్ని మరింత పెంచేది ఎట్లాగా అని ఆలోచిస్తున్నాయి. ప్రజల ఆరోగ్యాలూ, పంటలూ, పర్యావరణం ఏమైతే వాటికేం? వాటికి కావలసింది లాభాలు.

ప్రపంచపు మేలుకోరే వాళ్ళందరినీ ఈ రోజు కలచి వేస్తున్న సమస్యలలో ఒకటి పర్యావరణం. అందులో పెరిగిన రసాయనాల వాడకం సృష్టిస్తున్న సమస్యలు కూడ ప్రధానమైనవే. హైబ్రిడ్ మొక్కలు రావడంతో పంటల మిశ్రమ పద్ధతి, పంటల మార్పిడి పద్ధతి అంతరించాయి. పలురకాల మొక్కలు ఒక చోట పండేటప్పటికంటె ఒకే పంట వున్నప్పుడు (Monoculture) తెగుళ్ళు పంటను నాశనం చేయడం తేలిక. అలాగే టిష్యూకల్చర్‌లో తయారు చేసిన మొక్కలకు తెగుళ్ళు సోకడం ఇంకా ఎక్కువ. దాని వల్ల ఇటీవల కాలంలో పురుగుమందుల వాడకం పెరిగింది. 1983లో వేసిన అంచనాల ప్రకారం అమెరికాలో అప్పటికే సం॥కి 1300 కోట్ల డాలర్లు (సుమారు 39000 కోట్ల రూ॥) పురుగు మందులు అమ్ముడుపోయాయి. ఈ వాడకం ఏటేటా పెరుగుతూ పోతూ బహుళజాతి సంస్థల్ని మరింత సంపన్నం చేస్తున్నాయి. ఇన్ని పురుగుమందులు వాడుతున్నప్పటికీ తెగుళ్ళు ఆగకుండా పంటలో 20% నుండి 50% దిగుబడిని నాశనం చేస్తున్నాయని అమెరికాలోని ఆఫీస్ ఆఫ్ టెక్నాలజీ (OTA) అంచనా వేసింది.

అలాగే కలుపు మొక్కలు పెరగడం కూడ వ్యవసాయంలో మరొక సమస్య. మన దేశంలో కూలి రేట్లు తక్కువ గనుక కలుపును మొక్కల మధ్య సేద్యం చేయడం ద్వారాను, మనుషులే కలుపు మొక్కల్ని పీకడం ద్వారాను తొలగిస్తున్నాం. అయితే సామ్రాజ్యవాద దేశాల్లో కూలి రేట్లు ఎక్కువ గనుక కలుపు నివారణ కోసం కలుపు నివారణ (Herbicides or Weedicides) మందుల్ని వాడుతున్నారు. మొత్తం పురుగుమందుల అమ్మకాలలో 40% కలుపు మందులు అమ్ముడుపోతున్నాయి. ఇవి కేన్సర్‌ను తెప్పిస్తున్నట్లు రుజువైంది కూడ.

అయితే బయోటెక్నాలజీని వుపయోగపెట్టి కలుపు మందులు అవసరంలేని సేద్యపు పద్ధతుల్ని అభివృద్ధి చేయవచ్చు. మనలాంటి దేశాల్లో గతం నుండి అమలులోవున్న మిశ్రమ పంట పద్ధతి, పంటల మార్పిడి వంటి వాటిని సమర్థవంతంగా అమలు పరిస్తే ఎంతో ప్రయోజనం వుంటుందని పరిశోధనలు తేల్చాయి. అయినా గుత్త సంస్థల చేతుల్లో వున్న బయోటెక్నాలజీ పరిశోధనలు జరుపుతుండేది. ఈ వ్యవసాయ పద్ధతులపై గాదు.,

కలుపు మందుల్ని మరింత ఎక్కువగా అమ్ముకోడం కోసం. కలుపు నివారించడం కోసం వేసిన మందు అసలు మొక్కపై కూడ పనిచేసి నష్టం కలుగ జేయడంతో ఈ మందుల వాడకం ఒక దశలో తగ్గింది. గుత్త సంస్థలు ప్రయోగాలు చేసి

బయోటెక్నాలజీని ఉపయోగించారు. ఏ కంపెనీకి ఆ కంపెనీ తాను తయారు చేసే కలుపు మందు తను తయారు చేసే మొక్కపై ప్రభావం కలుగజేయకుండా ఉండేట్లు విత్తనాలు రూపొందించడానికి కృషి చేసింది. విత్తనంపై అలాంటి పరిశోధనలో మొదట సీబా - గెగీ అనే కంపెనీ విజయవంతమైంది. విత్తనాలపై ఒకరకమైన రసాయనిక పూతను తయారుచేసింది. ఆకలుపు మందు ప్రభావం మొక్కపై ఉండదని ప్రచారం చేసింది. తద్వారా ఏక కాలంలో విత్తనాల అమ్మకాలను కూడ కలుపు మందుతో పాటుగా పెంచుకోగలిగింది. అట్రజైన్ పేరుతో మనదేశ మార్కెట్‌లోని కలుపు మందు ఈ కంపెనీదే.

ఈ రకంగా మానవజాతికి తక్షణంగాను, దీర్ఘకాలికంగాను హాని చేసే రసాయనాల్ని బహుళజాతి సంస్థలు కుప్పలు తెప్పలుగా ఉత్పత్తి చేసి లాభాలు పిండుకుంటున్నాయి. మూడవ ప్రపంచ దేశాల్లోని అపారమైన ప్రకృతివనరుల్ని కొల్లగొడుతున్నాయి. నాశనం చేస్తున్నాయి. ప్రజల ఆరోగ్యాలకు అపారమైన హాని కలిగిస్తున్నాయి.

## బయోటెక్నాలజీ - పేటెంట్ హక్కులు

పెట్టుబడిదారీ ప్రపంచంలో ప్రతిదీ లాభాపేక్షతోనే చూడబడుతుంది. బయోటెక్నాలజీ రంగంలో వస్తున్న ప్రగతి తమ వ్యాపారానికి ఎంత విస్తృతిని కల్పిస్తుందో గమనించిన గుత్త కంపెనీలు జీవసంబంధమైన పేటెంట్ హక్కులను కోరాయి. అప్పటికి సామ్రాజ్యవాద దేశాలన్నిటిలోనూ పారిశ్రామిక పేటెంట్ హక్కులున్నాయి. అయితే విత్తనాల లక్షణాలు కూడ నిలకడగా ఉండక మారుతుండడంతో పేటెంట్ చట్టపు పరిధిలోకి రావడం కష్టమైనందున అంత ప్రాధాన్యత రాలేదు.

అయితే విత్తనాలపై కాకున్నా తాము తయారుచేసిన కొత్తరకం మొక్కలపైనైనా తమకే హక్కులు ఇవ్వాలని కోరుతూ హైబ్రిడ్ మొక్కలను తయారు చేసే వాళ్ళంతా నూతన మొక్కల రక్షణ యూనియన్ (Union for the protection of New Varieties - UPOV) ఏర్పరచారు. వీళ్ళు తాము తయారు చేసిన హైబ్రిడ్ మొక్కలను పునరుత్పత్తి (Multiply) చేసుకునే హక్కు తమకే వుండాలని కోరుతూ మొక్కల ఉత్పత్తి దార్ల హక్కులు (Plant Breeders Rights - PBR) తమకే వుండాలని కోరారు. 1961లో జరిగిన ఈ సదస్సులో యూరోపియన్ దేశాలు మాత్రమే పాల్గొన్నాయి. అమెరికా కూడ 1970 వరకు ఇందులో చేరలేదు. అప్పటికి అందులో కేవలం 17 దేశాలు మాత్రమే చేరాయి.

కొన్ని పారిశ్రామిక దేశాలు కూడ మొక్కలపై కొంత మందికే హక్కులు ఇవ్వడాన్ని నిరాకరించాయి. ఎందుకంటే ఈ గుత్త సంస్థలకు మొక్కలు తయారు చేసే హక్కులు ఇస్తే - ఒకే రకం మొక్కలు ఉత్పత్తి చేయడం వల్ల జన్యువైవిధ్యం నాశనమవుతుందని అవి భావించాయి. అంతకంటే తీవ్రంగా తమ దేశాల్లో జాతీయ వ్యవసాయ విధానాన్ని అభివృద్ధి కానివ్వదని భావించారు. మొక్కలన్నవి ఏ ప్రాంతానికి ఆ ప్రాంతంలో అనువైన రకాలు పెరగడానికి ఈ హక్కులు అడ్డుగా నిలుస్తాయని భావించారు.

## పారిశ్రామిక పేటెంట్ హక్కుల కోసం డిమాండు

ఒక వైపు పి.బి.ఆర్ గురించేపైన చెప్పిన చర్చ జరుగుతుంటే - ఈ అధ్యాయం మొదటి భాగాల్లోనే చెప్పుకున్నట్లు 1980 దశాబ్దంలో విస్తృతంగా ఈ రంగంలోకి వచ్చిన గుత్త

కంపెనీలు ఆయాదేశాల ప్రభుత్వాలను బయోటెక్నాలజీ రంగంలో తాము కనుగొన్న విషయాలకు పారిశ్రామిక వస్తువులకు ఇచ్చినట్లే పేటెంట్లు ఇవ్వాలని కోరాయి.

పి.బి.ఆర్‌లో మొక్కలను అవసరమైన సంఖ్యలో మళ్ళీ మళ్ళీ వుత్పత్తి చేసి (విత్తనాలు లేదా మొలకలు) అమ్ముకోవడం వరకే హక్కులున్నాయి. అయితే పారిశ్రామిక పేటెంట్‌లో వాళ్ళు కోరే హక్కులు ఇంకా విస్తృతమైనవి.

పారిశ్రామిక పేటెంట్లలో రెండు రకాలు వున్నాయి. ఒకటి ప్రాసెస్ పేటెంట్ - అనగా ఏ వస్తువునైనా వుత్పత్తి చేయాలంటే దానికి భౌతిక లేదా రసాయనిక చర్యలనేవి అవసరం. ఒక ప్రత్యేక పద్ధతిని కనుగొన్నందుకు ఒక సంస్థ లేదా వ్యక్తికి ఆపద్ధతిపై హక్కు ఇస్తారు. మరెవరు ఆ పద్ధతిని పేటెంట్ పొందిన వాళ్ళ అనుమతి లేకుండా వాడడానికి వీలు లేదు. అనుమతి ఇవ్వాలంటే సహజంగా వాడుకునే వాళ్ళు డబ్బు లివ్వాలి (రాయిల్టీలు). పేటెంట్ చేసిన వాళ్ళు వేరెవరూదాన్ని ఉపయోగించకుండా నిరాకరించి అటంక పరచవచ్చు కూడ.

ఉదాహరణకు మనం ఇంతకుముందు ఇన్సులిన్ వుత్పత్తిని గురించి చెప్పుకున్నాం. దాన్ని ఒక ప్రత్యేక బాక్టీరియాను వుపయోగించి చేస్తారని చెప్పుకున్నాం. ఆపద్ధతి నుపయోగించి ఇన్సులిన్‌ను తయారు చేయడాన్ని ఒక పద్ధతిగా రిజిస్టరు చేసుకుంటే పేటెంట్ చట్టం ప్రకారం మరెవరూ ఇన్సులిన్‌ను చెయ్యకూడదు. వేరే పద్ధతిలో కావాలంటే చేసుకోవచ్చు. అలాగే ఒక జీన్‌ను మొక్కకు సబంధించిగానీ, జంతుజాలంలోకి గానీ ప్రవేశ పెట్టడాన్ని ప్రాసెస్ చేసుకుంటే అనుమతిలేకుండా, మరెవరూ ఆ పద్ధతి వాడరాదు.

## నీ దేశంలోనే పండినా దాన్నినేను కనుగొన్నా – హక్కునాదే!

ఇక రెండో పేటెంటు పద్ధతి ప్రాడక్టు పేటెంట్. ఇది మొదటి దాని కంటె దుర్మార్గమైనది. ఏదైనా నూతన పదార్థాన్ని తయారుచేస్తే దాన్ని తనుకనుగొన్నానని పేటెంట్‌చేసుకోవచ్చు.

పైన చెప్పిన ఉదాహరణలో ఇన్సులిన్ నేనే కనుగొన్నానని పేటెంట్ చేస్తే ఇక మరెవరూ దాన్ని తయారు చెయ్యడానికి వీలు లేదు. అలాగే ఎవరైనా ఒక నూతన జీన్‌ను కనుగొని దాన్ని పేటెంట్ చేస్తే మరెవరూ ఆ జీన్‌ను వాడడానికి వీలు లేదు. మన వరిలో ఎర్ర కుళ్ళు తెగులును ఎదుర్కొనే లక్షణముంది. ఎవరైనా ఒక శాస్త్రవేత్త ఈ లక్షణానికి కారణమైన జీన్‌ను వెలికి తీసి పేటెంట్ చేసుకుంటే వేరెవరూ దాన్ని అతని అనుమతి లేకుండా వాడడానికి వీలు లేదు. ముళ్ళులేని రోజాలు, విత్తనాలు లేని దానిమ్మ ఇలా అనేక నూతన మొక్కలు చూస్తున్నాం. ఈ నూతన లక్షణాలకు ఆ విత్తనాల్లోని, లేదా మొక్కలోని ఒక ప్రత్యేకమైన జీన్ కారణమవుతుంది. దాన్ని కనుగొని పేటెంట్ చేస్తే కూడ వేరెవరూ వాడడానికి వీలులేదు.

ఇందులో విస్తృతమైన హక్కులున్నాయి. ముళ్ళులేకుండా వుండే రోజాకు సంబంధించిన జీన్‌ను కనిపెట్టాడను కుందాం. ముళ్ళులేని రోజా మొక్కల్లో ఇంకా అనేక రంగులకు సంబంధించినవి వున్నా వాటిపై పరిశోధన చెయ్యాలంటే కూడ ముళ్ళులేని రోజా కనుక ముందు పేటెంట్ చేసిన వారి అనుమతి కావాల్సిందే.

మన దేశంలో వుండే మొక్కలలోని లక్షణాన్ని ఏదో ఒక గుత్త కంపెనీ కనుగొందనుకుందాం. దానికి డబ్బులు చెల్లించకుండా ఆ మొక్కను మనం ఉపయోగించడానికి వీలులేదు.

థాయుమేటిన్ అనే మొక్క విషయంలో ఇదే జరిగింది. నైజీరియా, ఆఫ్రికా ఖండంలోని దేశాల్లో అది పెరుగుతుంటే ఆ మొక్కలోవున్న తీపి లక్షణాన్ని గుర్తించి (చక్కెరకు 250 రెట్లు తీపి) దాని నుండి తీపి పదార్థం బయటకు తీసే పద్ధతి కనుగొని టాటె & లైలె (Tate & Lyle) అనే బ్రిటిష్ కంపెనీ దాన్ని పేటెంట్ చేసింది. మొక్కలు తమ దేశంలో పండినా తమ స్వంత అవసరం కోసం కూడ (ఆదేశంలో పేటెంట్ చట్టాన్ని అంగీకరిస్తే) ఆ మొక్కను వాడుకోవడానికి ఆకంపెనీ కోరినంత మొత్తం రాయల్టీ చెల్లించాల్సిందే.

మనదేశంలోనే మన వేప చెట్టు నుండి వేప నూనె తీసే అలవాటు చాలా కాలం నుండి వుంది. ఎవడైనా ఒక గుత్త కంపెనీ వాడు ఆ నూనె తీసే పద్ధతిని గానీ - నూనెను గానీ పేటెంట్ చేస్తే - మనం మన అవసరం కోసం కూడ ఆ కంపెనీకి రాయల్టీ చెల్లించకుండా వాడుకోలేని దుస్థితి వస్తుంది.

అందుకే జీవసంబంధమైన పదార్థాలకు ఈ పేటెంట్ హక్కులు అంగీకరిస్తే వచ్చే విష ఫలితాల గురించి ప్రపంచ వ్యాపితంగా చర్చ జరుగుతోంది. ఒక ప్రత్యేక జీన్‌ను వుపయోగించి ప్రాసెస్ పద్ధతిపై గానీ, నూతన జీన్‌లపై ప్రొడక్టు హక్కు (వుత్పత్తిపై) గానీ ఇస్తే ఇకపై నూతన పరిశోధనల్లో ఆ రెంటిలోదేన్నయినా వాడుకోవాలంటే వాళ్ళ అనుమతి కావాల్సి వస్తుంది. అయితే పరిశోధనను, పేటెంట్ హక్కుల్ని గుత్తకు పుచ్చుకుని వుంది గుత్త కంపెనీలే కావడంవల్ల అవి పరిశోధనకు అడ్డం పడతాయి. ఎందుకంటే నూతన విషయంపై ఏదైనా కనుగొంటే తన వుత్పత్తులకు, మార్కెట్లకు అడ్డం పడే ప్రమాదం వస్తుంది. అందుకే అవి అడ్డు కుంటాయి.

బహుళ జాతి కంపెనీలకు శాస్త్ర సాంకేతిక రంగాలపై హక్కులివ్వడమంటే ప్రపంచ అభివృద్ధికి అడ్డుగోడ కట్టడమే తప్ప వేరు కాదు. బలహీన దేశాలపై పెత్తనం చెయ్యడానికి, గుత్త కంపెనీలన్నీ బకటై ఈనాడు ప్రపంచ వ్యాపితంగా పేటెంట్లు కావాలని కోరుతున్నాయి. దీన్ని అంగీకరించడమంటే మానవజాతి తరతరాలుగా కష్టపడి సంపాదించుకున్న విజ్ఞానాన్నంతటినీ కొద్ది కంపెనీల లాభాపేక్షకు బలిచెయ్యడమే. కోట్లాది ప్రజల ప్రాణాల్నీ, భవిష్యత్తును వారి దయాదాక్షిణ్యాలకు వదిలెయ్యడమే.

"ప్రస్తుత కాలపు బయోటెక్నాలజీ అసంఖ్యాక మానవుల కృషి ఫలితమే. వాళ్ళు వునాదులు వేశారు. గోడలు కట్టారు. ఆ బ్రహ్మాండమైన కట్టడానికి కావలసిన పై కప్పుకు సంబంధించిన బీమును (Roof Beam) కూడ కట్టారు. వీళ్ళందరి శ్రమ ఈ దశకు వచ్చిన తర్వాత గుత్త కంపెనీలు ఒక దానితో ఒకటి పోటీపడి ఈ కట్టడంపై చిన్న చిన్న పెంకులు మాత్రమే పెట్టి ఆకట్టడాన్నీ, ఆస్థలాన్నీ అంతటినీ తమ వేనంటున్నాయి."

సుహాన్‌జార్జి అనే శాస్త్రవేత్త చెప్పిన ఈ మాటలు పరిస్థితిని చక్కగా వివరిస్తున్నాయి.

## పేద దేశాల జన్యు సంపదను కొల్లగొట్టిన సామ్రాజ్య వాదం

బయోటెక్నాలజీ అభివృద్ధి కాక ముందు విత్తనాలను మాత్రమే నిల్వ వుంచుకోగలిగే వాళ్ళు. వాటిని సీడ్ బ్యాంకులని పిలిచే వాళ్ళు. విత్తనాల్లో ఎక్కువ కాలం అలాగే జీవించే లక్షణం మిగిలి వుండదు గనుక మళ్ళీ మళ్ళీ మొలిపిస్తూ విత్తనాల్ని నిల్వచేస్తూ వచ్చారు.

జీన్‌లను కనుగొన్న తర్వాత విత్తనాల్లోని కీలకమైన జన్యు పదార్థం (జర్మ్ ప్లాజం) ను నిల్వచేస్తున్నారు. వాతావరణ పరిస్థితిని బట్టి ప్రపంచాన్ని ఉష్ణమండలం, సమశీతోష్ణ మండలం, శీతల మండలంగా వర్గీకరించారు. ప్రకృతి పరిణామ క్రమంలో వచ్చిన

మార్పుల ఫలితంగా ఉష్ణమండలం, సమశీతోష్ణ మండలాలకు మధ్యనున్న ప్రాంతంలోనే అత్యధిక భాగం వృక్ష సంపద వుంది. ప్రకృతి వనరుల రీత్యా సంపద్వంతమైన ఈ ప్రాంతంలోనే అత్యధిక మూడవ ప్రపంచ దేశాలున్నాయి. ప్రపంచానికంతటికీ ఆహారాన్నీ, అందాన్నీ ఆహ్లాదాన్ని ఇచ్చే మొక్కలన్నీ ఇక్కడే వున్నాయి. ప్రస్తుతం ప్రపంచంలో కన్పించే ఆహార పదార్థాలన్నీ 20 పేద దేశాల్లో పండేవేనంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

హైబ్రిడ్ విత్తనాల పేరిట ప్రపంచంలో వున్న అత్యధిక రకాల విత్తనాలు ఈ పేద దేశాల మొక్కలనుండే రూపొందించబడ్డాయి. ఇంటర్నేషనల్ కోలిషన్ ఫర్ డెవలప్‌మెంట్ యాక్షన్ అన్న సంస్థ నివేదికలో కెనడాలో నేడు పండిస్తున్న గోధుమ రకాలలో మూడవ ప్రపంచలోని 14 దేశాల నుండి తెచ్చిన జీన్స్ వున్నాయని తేల్చింది. అమెరికాలోని దోసకాయల పంట చీడలను తట్టుకొనే శక్తినిచ్చే జీన్స్‌ను కొరియా, బర్మా, ఇండియాల నుండి తెచ్చుకుని వాడుకుంది. అమెరికాలో వుండే చిక్కుళ్ళు - మెక్సికో, సిరియా, టర్కీ, చిలీ, ఎల్‌సాల్వడార్‌ల రకాల నుండి రూపొందించినవే. మధ్య అమెరికా నుండి తెచ్చిన టమోటో విత్తనాల నుండి అభివృద్ధి చేసిన టమోటా రకాల ద్వారానే - అధిక దిగుబడి సాధించి అనేక రకాల టమాటా వుత్పత్తులను ప్రపంచమంతా అమ్ముకుని అమెరికా లాభపడింది. అలాగే ఆగ్నేయాసియా నుండి తరలించిన అరటి పండ్ల రకాలే 1960లలో అమెరికాలో అరటి తోటల తెగుళ్ళ నుండి రక్షించి ఆ పరిశ్రమను కాపాడాయి. అమెరికాలోని గోధుమను టర్కీ జాతి గోధుమతో సంకర పరిచి రక్షించారు. ఇలా చెప్పుకుపోతే ఎన్నో వుదాహరణలు.

సంపన్న దేశాల్లోవున్న మొక్కల్లోని మేలిమి రకాలన్నీ ఇలా మూడవ ప్రపంచదేశాల్లోని విలువైన జన్యువులను కలపడం వల్లే తయారయ్యాయి. అయితే పేద దేశాల్లోని ఈ విలువైన జన్యు సంపదపై సంపన్న దేశాల గుత్త సంస్థలు పేటెంట్ హక్కులు పొంది ఆ విత్తనాలను అమ్ముకోవడం ద్వారా ప్రతి సం॥ కొన్ని వేల కోట్ల రూపాయల సంపాదనను సమకూర్చుకుంటున్నాయి. ప్రపంచంలో దొరికే అరటి పండ్లలో మూడింట రెండు వంతుల రకాలు యునైటెడ్ బ్రాంట్స్ అనే గుత్త సంస్థ చేతిలో వున్నాయి. మొక్క జొన్న, జొన్న రకాలను 4 బహుళ జాతి సంస్థలే తమ గుప్పెట్లో పెట్టుకున్నాయి. ప్రపంచంలోని 80 శాతం చిక్కుడు రకాలపై యూనియన్ కార్బైయిడ్, అప్‌జాన్, శాండోజ్ కంపెనీలకే పూర్తి హక్కులున్నాయి. 700 రకాల లాటిన్ అమెరికా, ఈశాన్య ఇండియా రబ్బరు మొక్కలపై సర్వ హక్కులు ఫైర్ స్టోన్ అనే టైర్ల కంపెనీదే. విత్తనాల వ్యాపారంలో ఆంగ్లోడచ్చి కంపెనీ యూనిలీవర్ ఎలా రాజ్యం చేసిందో ఇంతకుముందే చూశాం. 90 శాతం ఆహార మొక్కలపై గుత్తాధిపత్యం అర డజను సంపన్న దేశాలదే.

## పేరుకేమో పరస్పర మారకం - పెత్తనంమాదే

ప్రపంచ ఆహార సంస్థ (FAO) దేశాల మధ్య జన్యువుల మారకం పరస్పరం జరగాలనీ అందువల్ల హైబ్రిడ్ రకాలను తయారు చేసుకోడానికి అవకాశం కలుగుతుందనీ చెబుతూవస్తోంది. అయితే ఈ సూత్రం సామ్రాజ్యవాదులు ఆచరిస్తున్న తీరు తాము పేదదేశాల నుండి తీసుకోడానికే తప్ప - తిరిగి ఇవ్వడానికి మాత్రం వర్తింప జెయ్యరు. ప్రపంచ ఆహార సంస్థ ఆధ్వర్యంలో అంతర్జాతీయ జన్యు వనరుల సంస్థ (Internal Board for Protection of Genetic Resources - IBPGR) ఏర్పరచారు. దీని నిధులన్నీ సామ్రాజ్య వాదులే సమకూర్చడంతో దానిపై వారే పెత్తనం సాగిస్తున్నారు. ఇదికాక

అంతర్జాతీయ వ్యవసాయ పరిశోధనల సమాలోచనల సంస్థ (కన్సల్టేటివ్ గ్రూప్ ఆఫ్ ఇంటర్నేషనల్ అగ్రికల్చరల్ రీసెర్చి - CGIAR) అన్న మరో సంస్థ వుంది. దీని ఆధ్వర్యంలో ఫిలిప్పీన్స్‌లోని మనీలాలో అంతర్జాతీయ వరి పరిశోధనాసంస్థ (IRRI); భారత దేశంలోని కేంద్ర వరి పరిశోధనా సంస్థ (CRRI), మెక్సికోలోని గోధుమ, మొక్కజొన్నల అంతర్జాతీయ పరిశోధనా కేంద్రం (CIMMYT), హైద్రాబాదులోని ఇక్రిశాట్ వంటివి వీటిలో కొన్ని.

కీలకమైన ఐ. బి. పి. జి. ఆర్ పేరుకు మాత్రమే ప్రపంచ ఆహార సంస్థ (FAO) ఆధ్వర్యంలో వుంటుంది. ఎఫ్. ఏ. ఓ పర్యవేక్షణ దీనిపై ఏమీ చెల్లదు. ఐ.బి.పి.జి.ఆర్, సిజి.ఐ.ఏ.ఆర్ రెండూ కలిసి సమన్వయంతో వ్యవహరించి పేదదేశాల జన్యు వనరులన్నీ కొల్లగొడుతున్నాయి. అవి ప్రచురించిన వివరాల ప్రకారమే - అవి సేకరించిన జర్మ్ ప్లాజంలో 91% జీన్సు పేదదేశాలవే. అయితే వీటిలో 15% జీన్సు మాత్రమే ఆ పేదదేశాలతో పంచుకున్నాయి. ఇపుడు పరిస్థితే మంటే అత్యధిక వృక్ష సంపదవున్న పేదదేశాల చేతుల్లో కేవలం 30% జన్యు నిలవలుండగా - సామ్రాజ్య వాదుల చేతుల్లో 70% నిల్వలున్నాయి. హైబ్రిడ్ విత్తనాల ప్రవేశంతోను, అడవుల నిర్మూలనతోను - రసాయనాలు సృష్టించిన పర్యావరణ సమస్యల వల్ల, వృక్షజాతులు అంతరించి పోతున్నాయి. ఉదాహరణకు మనదేశంలోనే మొత్తం 30 వేల రకాల వరి మొక్కలుండగా ప్రస్తుతం 50 రకాలు కూడ మిగిలిలేవు.

జీన్ బ్యాంకుల్లో వుండే జర్మ్ ప్లాజం కూడ అలాగే శాశ్వతంగా నిల్వ వుండదు. 4 సంll ల కొకసారి మళ్ళీ వాటిని మొలకెత్తించి విత్తనాలు సేకరించుకోవాలి. మొక్క పెరగడంపై వాతావరణ ప్రభావం వుంటుంది గనుక మన మొక్కలను అమెరికాలో పండిస్తే అదే రకం విత్తనాలు రావు. అందువల్లె ఎప్పటికపుడు సామ్రాజ్య వాద దేశాలు మన పేద దేశాల్లోని మంచి రకం మొక్కల్ని సేకరిస్తూనే వుంటాయి. తమ దేశాల్లో అంతరించే జీవ జాలాన్ని రక్షించుకోడానికి కూడ ఈ సేకరణ అవసరం. ఇటీవల సంపన్న దేశాలు పేదదేశాల్లోని తమ రాయబారుల్ని కూడ వుపయోగించి మంచి మొక్కల్ని సేకరిస్తున్నారన్న వార్తలు రావడం ఇందులో భాగమే.

సహకారం అనేది మాటల వరకేనని ఈ వివరాలన్నీ చెబుతున్నాయి. సంపన్న దేశాలు ఆర్థిక రంగంలో తమకున్న పెత్తనాన్నేగాక, ఈజన్యు బ్యాంకులను కూడా రాజకీయ ఆయుధంగా వుపయోగించగలవు. నికరాగువా అనుభవం ఇదే.

## రాజకీయ ఆయుధంగా మారిన జీన్ బ్యాంకు

సైన్సును కేవలం సైన్సుగా భావించే వాళ్ళను కళ్ళు తెరిపిస్తుంది, నికరాగువా అనుభవం. ఈ దేశంలో చాల కాలం పాటు అమెరికా తొత్తు ప్రభుత్వం వుండేంది. అది సాగించిన దుర్మార్గమైన దోపిడికి, అణచివేతకు వ్యతిరేకంగా శాండినిస్టా గెరిల్లాలు యద్ధం చేసి అధికారంలోకి వచ్చారు.

అయితే ఈ స్వతంత్రమైన ప్రభుత్వం అధికారంలో వుండడం ఇష్టంలేని అమెరికా ఆ దేశంలోకి అరాచక శక్తులను ప్రోత్సహించి అల్లర్లను రెచ్చగొట్టింది. మరోవైపు వాణిజ్య పరమైన ఆంక్షలు పెట్టింది. వాటితో పాటు శాస్త్రరంగంలో తనకున్న పట్టునుకూడ ఆప్రభుత్వాన్ని లొంగ దీసుకోటానికి వుపయోగించింది.

తనదేశంలో ఉత్పత్తి పెంచుకోడానికి జర్మ్‌ప్లాజం కావాలని శాండినిస్టా ప్రభుత్వం మెక్సికోలోని పరిశోధనా సంస్థ సిమ్మిట్ (CIMMYT) ను కోరింది. జర్మ్ ప్లాజంతో తన స్వంత జీన్ బ్యాంకును స్థాపించుకుంటానని నికరాగువా కోరింది. అయితే మెక్సికోలోని సిమ్మిట్ జర్మ్ ప్లాజంలను అమెరికా పంపించి తిరిగి తెప్పించి ఇచ్చింది. ఇలా ఇచ్చిన 64 రకాల జర్మ్ ప్లాజంలు కొన్ని పూర్తిగాను, కొన్ని సగభాగం చచ్చివున్నాయి. ఆరకంగా నికరాగువా అధిక దిగుబడి కోసం చేసిన ప్రయత్నం అడ్డగించబడింది.

ఇదే రకమైన అనుభవం తనను వ్యతిరేకించిన అల్బేనియా, క్యూబా, ఇరాన్, లిబియాలకు కూడ అమలు చేసి చూపింది అమెరికా. మన పేదదేశాల నుండి జీన్స్‌ను తీసుకెళ్ళేటపుడు మాత్రం మా వద్ద భద్రంగా వుంచడానికే తీసుకెళ్తున్నాం, మీరు కోరినపుడు ఇస్తాంగదా - అని ఐ.బి.పి.జి.ఆర్ చెప్పే మాటలు మోస పూరితమనడానికి, ఈ జీన్ బ్యాంకు కూడా అమెరికా చేతిలో రాజకీయ ఆయుధమనడానికి ఇంతకంటే ఆధారం ఏం కావాలి?

అంతేకాదు. రాజకీయంగా లొంగ దీసు కోవాలన్న దేశంలోకి తెగుళ్ళకు గురయ్యే విత్తనాలను, ఇతర జీవ సంబంధ పదార్థాల్ని పంపి ఆదేశంలోని పంటలను నాశనం చేసే వ్యూహాన్ని కూడ సామ్రాజ్య వాదులు అనుసరించగలరు. వియత్నాం యుద్ధంలో రసాయనాలను చల్లి ఆదేశపు పంటలను నాశనం చేసి లొంగదీసుకో జూసిన అనుభవం మనకళ్ళ ముందుంది.

## బయోటెక్నాలజీ ఫలితాలు ప్రజలకందేలా చేసుకోవాలి

బయోటెక్నాలజీ మానవుడి మహోన్నత విజ్ఞాన కృషి ఫలితంగా సాధ్యమైన శాస్త్రం. దాన్ని వుపయోగించి పెరుగుతున్న ప్రపంచ జనాభా ఆహార అవసరాలు తీర్చుకోవచ్చు. మొక్కలనుండి, జంతువులనుండి కావలసిన ఇతర అవసరాలను కూడ తీర్చుకోవచ్చు. ప్రకృతిని వీలైనంతవరకు దెబ్బతినకుండా పరిరక్షించుకుంటూనే మన అవసరాలు తీర్చుకోవచ్చు.

అయితే బయోటెక్నాలజీ గుత్త సంస్థలచేతుల్లో కేంద్రీకృతం కావడంతో, అది సాధించాల్సిన ఫలితాలు ప్రజల కోసం గాక, ఆ కంపెనీల లాభాల కోసం వుద్దేశించబడుతున్నాయి. సామ్రాజ్యవాదం ఈ దోపిడి ద్వారా సాధించే ఫలితాలతో పేదదేశాలను ఆర్థికంగా కొల్లగొట్టడమే గాక రాజకీయంగా కూడ కంట్రోలు చేస్తోంది. అందువల్ల పేదదేశాల ప్రజలు తమపై సాగేదోపిడికి వ్యతిరేకంగా సాగించే పోరాటంలో భాగంగానే శాస్త్ర, సాంకేతిక రంగాల ఫలితాలు ప్రజల కందాలన్న డిమాండు కూడ జోడించుకోవాలి.

# మూడవ ప్రపంచదేశాల పునర్వలసీకరణే డంకెల్ ప్రతిపాదనల లక్ష్యం

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ప్రపంచదేశాల మధ్య కొత్త ఏర్పాట్లు జరిగాయి. ఈ యుద్ధంలో అప్పటికి పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలన్నీ (జర్మనీ, బ్రిటన్, జపాన్) యుద్ధంలో పాల్గొని నష్టపోయివున్నాయి. సోవియట్ యూనియన్ కూడ స్వతంత్రంగా నిలబడే దశలోనే ఈ యుద్ధం వల్ల తీవ్ర నష్టం పొందింది. అమెరికా యుద్ధ ఒప్పందంలో వున్నప్పటికి నష్టపోయిందేమీలేదు - పైగా ఆయుధాలు అమ్ముకుని లాభపడిందికూడ. ప్రపంచదేశాలముందు తన బలాన్ని చాటుకోడానికి హిరోషిమా, నాగసాకిలపై అణుబాంబులువేసి విధ్వంసాన్ని సృష్టించింది.

అమెరికా 2వ ప్రపంచ యుద్ధం తర్వాత జరిగే నూతన ఏర్పాట్లలో తన ఆధిపత్యం ఉండేట్లు చూసుకోగలిగింది-1944లో తన దేశంలోని బ్రెట్టన్‌వుడ్స్‌లో జరిగిన సమావేశంలోనే ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలను ఏర్పరచింది. ఇదే సమావేశంలో వాణిజ్యాన్ని దేశాల మధ్య సరళతరం చేసేందుకు ఒకసంస్థను ఏర్పరచాలని అనుకున్నారు.

అమెరికా ఆధిపత్యం వుండేట్లుగా 1947లో వాణిజ్యసుంకాల ఒప్పందం (జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ అండ్ టారిఫ్ - గాట్) ఏర్పడింది-అంతర్జాతీయ వాణిజ్యసంస్థ (ITO) ఐక్యరాజ్యసమితి అంగాలలో భాగంగా ఏర్పాటుచేయాలని హవానా ఒప్పందంలో అనుకున్నా ఆమెరికా దాన్ని అంగీకరించలేదు-అటువంటి శాశ్వత వేదిక ఏర్పడితే తనుదీర్ఘకాలంపాటు దానిపై పెత్తనం చేయడానికి వీలుకాదనుకుంది. ఆ రకంగా 1947నుండి ఇప్పటివరకు తాత్కాలిక వేదిక అనుకుంటూ గాట్‌ను అమెరికా తన ఆధిపత్యంలో నడుపుతోంది. ఆనాటి సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టు దేశాలు అందులో చేరకుండా ఆనాడే జాగ్రత్తపడింది.

23 దేశాల సభ్యత్వంతో మొదలైన గాట్‌లో ప్రస్తుతం 109దేశాలున్నాయి. దాదాపు ప్రపంచంలో 90% వాణిజ్యం జరిగే దేశాలు ఇందులో వున్నాయి. ఇందులో ఆధిపత్యం సామ్రాజ్యవాదదేశాలదయినా సభ్యత్వం మూడవ ప్రపంచదేశాలదే ఎక్కువ. ఎవరికీ ఇందులో వీటో అధికారం లేదు.

ఇందులో 1వ భాగంలోని ఆర్టికల్ ఒకటిలో వున్న నియమం ప్రకారం (Most Favored Nation - MFN) ఒకదేశం అన్ని ఇతర దేశాలతో సమానంగా వ్యవహరించాలి. ఒకదేశానికి చెందిన వస్తువుపై సుంకం తగ్గిస్తే ఇతర దేశాలకు కూడ తగ్గించాలి. వివక్ష లేకుండా వుండడంకోసమే ఇలా చేశారు. అయితే యూరపియన్ దేశాలన్నీ కలిసి గాట్‌లో ఒకే యూనిట్‌గా( దేశంలాగే)యూరపియన్ కమ్యూనిటీగా వ్యవహరించడం దీనికి మినహాయింపు. అలాగే అమెరికా కూడ కెనడా, మెక్సికోలను కలుపుకుని నాఫ్టా (North American Free Trade Agreement - NAFTA) ఏర్పడింది. ఈ విధంగా రెండు బ్లాకులు ఏర్పడ్డాయి. జపాన్ ఒక్కటే మరొక బ్లాకు ఈ రకంగా గాట్ సంస్థలో ఈ మూడింటి ఆధిపత్యం సాగుతోంది.

గాట్‌లో ముఖ్యమైన విషయాలపై నిర్ణయాలన్నీ ఏకగ్రీవంగానే జరగాల్సివుంది. అయితే వాస్తవానికి గాట్‌కోసం సంబంధించిన చర్యలన్నీ పై మూడు బ్లాకుల మధ్యనే జరుగుతాయి. వాటి మూడింటి మధ్యనగానీ లేక పారిశ్రామిక దేశాలతో ఏర్పడిన G-7(జి-7) దేశాల వేదికలో గానీ ముఖ్యమైన నిర్ణయాలన్నీ చేయబడతాయి. మూడవ ప్రపంచదేశాలన్నీ ఈ కీలక విషయాల చర్చలో వుంటానికి అవి అంగీకరించవు. వాటి మధ్య అంగీకారం కుదిరితే మిగిలిన దేశాల మధ్య తెచ్చిపెట్టి (గాట్ సమావేశంలో) ఓటు చేయించుకునిపోతాయి. పైకి ఎన్ని మాటలు చెప్పినా అది ఆధిపత్యానికి నిలయం తప్ప ప్రజాస్వామ్యానికి కాదు - సామ్రాజ్యవాద దేశాల షరతుల ప్రకారం వాణిజ్య విధానాలు తప్ప స్వేచ్ఛావాణిజ్యం కాదు - గాట్ నడిచేతీరు ఇదీ.

## ఉరుగ్వే చర్చల ప్రత్యేకత

గాట్ సంస్థ పుట్టిన తర్వాత ప్రస్తుతం 8వ రౌండ్ సమావేశాలు జరుగుతున్నాయి. ఇంతకుముందెన్నడూ రానంతవెలుగులోకి గాట్ వచ్చింది ఈ రౌండులోనే. ఎందుకంటే ఈ రౌండ్‌లో జరుగుతున్న చర్చలకు ప్రాధాన్యత వుంది. గత 7రౌండ్లలో గాట్‌లో జరిగిన చర్చలన్నీ వస్తువులపై (Goods) సుంకాల తగ్గింపుకు సంబంధించి మాత్రమే జరిగాయి. పై మూడు బ్లాకులే సుంకాలు తమకు అనుకూలంగా, ప్రత్యేకించి అమెరికాకు అనుకూలంగా తగ్గించుకుంటూవచ్చాయి.

1986లో ఉరుగ్వేదేశంలో పుంటాడల్ ఎస్టె అనే పట్టణంలో మొదలై 7 సం॥లుగా సాగుతున్న ఈ చర్చలు దాదాపు ముగింపుకు వచ్చినట్లే- గాట్‌లో ఈ సారి జరుగుతున్న చర్చలలో ఎజండాలోకి కొత్తగా అనేక విషయాలను తేవడం వల్లనూ, వాటి విషయంలో ఆ మూడు బ్లాకుల మధ్యనే (అమెరికా, యూరప్ కమ్యూనిటీ, జపాన్) భేదాభిప్రాయాలు తలెత్తడం వల్లనూ చర్చలు ఇంత పొడిగించబడ్డాయి. వ్యవసాయం, సర్వీసులు, పేటెంట్ హక్కులు, వాణిజ్యపెట్టుబడులు వంటి విషయాలన్నీ గాట్‌లోకి ఈ సారి తేబడ్డాయి. వీటన్నిటి సారాంశాన్నే 1992 వరకు గాట్ ఛైర్మన్‌గా వున్న డంకెల్ పేరుతో ఒక ముసాయిదా ముందుకు తెచ్చారు.

ఇపుడు తెస్తున్న ప్రతిపాదనల ప్రకారం ఇప్పటివరకు అనుసరించబడుతున్న 'అభివృద్ధి నియమం' అనేది ఎత్తివేయబడుతుంది. కొన్ని నియమా లను అమలు జరపడంలో ఇప్పటివరకు 3వ ప్రపంచదేశాలకు ఇస్తున్న సడలింపులు లేక మినహాయింపులు ఇకపై రద్దు చేయబడతాయి. (కొన్ని విషయాలను అమలు పరచడానికి ఎక్కువ కాలపరిమితి ఇవ్వడం వంటివి). 'స్వేచ్ఛావ్యాపారం నియమం' పేరుతో ఇప్పటివరకు వీటికి ఇస్తున్న సడలింపు రద్దు చేయబడుతుంది.

## డంకెల్ ప్రతిపాదనల సారాంశం గుత్త సంస్థల వ్యాపారానికి హద్దు లేకుండా చేయడమే.

గతంలో మూడవ ప్రపంచదేశాలు అంతర్గతంగాను, విదేశీ సంబంధాలలోను పెట్టుకున్న పరిమితమైన రక్షిత విధానాల (Protectionism) ను కూడా రద్దు చేయడమే - ఈ దేశాలు తమ స్వతంత్ర అభివృద్ధిపై నిలబడడం, నిలదొక్కుకోడానికి ప్రయత్నించడం గాక తమదేశాల గేట్లను మొత్తాన్నీ సామ్రాజ్యవాద గుత్త కంపెనీలకు తెరచివుంచడమే డంకెల్ ప్రతిపాదనల సారం. గాట్ అధికారాన్ని వాణిజ్యసుంకాలకు సంబంధంలేని మరో 4రంగాలకు విస్తరించాలన్నది ఈ డ్రాఫ్టు కోరిక. దాని సారాంశం -.

## 1. సర్వీసుల రంగం

జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్ (GATS) పేరిట ఒక ప్రత్యేక భాగాన్ని వ్రాశారు. ఇప్పటికే సామ్రాజ్యవాదులు మార్కెట్‌లను ఏదోఒక రూపంలో ఆక్రమించుకున్నారు- మూడవ ప్రపంచదేశాల్లో ప్రభుత్వాల చేతుల్లో మిగిలింది సర్వీసుల రంగమే- సర్వీసులంటే ఫైనాన్సు (బ్యాంకులు వగైరా), పత్రికలు, వార్తా ప్రసారసాధనాలు, రవాణా, వుత్పత్తికవసరమైన, వ్యాపారసంబంధమైన సర్వీసులు, ఇన్స్యూరెన్సు, ఆరోగ్యం వంటి వన్నీ సర్వీసులకిందికి వస్తాయి. వీటిలో కూడ విదేశపెట్టుబడిని అనుమతించాలి. - ఎన్ని సర్వీసులుండాలి, సర్వీసుల విలువ ఎంత, దానివుత్పత్తి (Output) ఎంత, ఎన్నిమారకాలు (Transactions) చేస్తున్నారు, ఆప్రత్యేక సర్వీసుల రంగంలో ఎంతమంది వుద్యోగులను నియమించారు వంటివేవీ మూడవ ప్రపంచ దేశాలు పట్టించుకోరాదు. అంటే ఏదేశంలోనైనా సామ్రాజ్యవాదులు బ్యాంకులు, ఇన్సూరెన్సు సంస్థలు, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ వంటివి పెట్టుకోదలిస్తే వాటికి స్వేచ్ఛగా అనుమతివ్వాలి. వాటి పెట్టుబడి గురించిగానీ, లాభాలను గురించిగానీ అందులో ఎంతమందికి వుద్యోగాలిస్తారనేది గానీ ఏమీ అడగకూడదు. స్వదేశీ బ్యాంకుకు విదేశీ బ్యాంకుకు మధ్య వివక్షచూపకూడదు - అలాగే ఏదేని దేశం వాళ్ళను తమ సర్వీసు (బ్యాంకు) పెట్టుకోడానికి అనుమతి నిరాకరిస్తే కూడ ఆ సామ్రాజ్యవాద దేశం తమకు నష్టం కలిగించారంటూ రెండోదేశంపై ప్రతీకార చర్య (Cross Retaliatory step) తీసుకోవచ్చు. అంటే ఒకవేళ ఆ సామ్రాజ్యవాద దేశంలో ఈ దేశపు బ్యాంకు వుంటే దాన్ని నడవనివ్వకపోవచ్చు లేదా రెండో దేశం పంపే సరుకులపై విపరీతంగా సుంకం విధించవచ్చు లేదా ఆ దేశపు వుత్పత్తులను పూర్తిగా నిషేధించవచ్చు.

## 2. వాణిజ్యపెట్టుబడికి సంబంధించిన చర్యలు (TRIMS - Trade Related Investment Measures)

డ్రాఫ్టులోని ఆర్టికల్ III (4), XI (1) దీన్ని వివరిస్తాయి. మూడవ ప్రపంచదేశాలు తమతమ దేశాల్లోకి విదేశీ పెట్టుబడి రావడం గురించి, తనదేశంలో పెట్టుబడి ఎలాపెట్టాలి, ఏఏరంగాల్లో ఎలా అనుమతిస్తామన్న దాన్ని గురించి చట్టాలు చేసుకున్నాయి. ఈ డంకెల్ డ్రాఫ్టు ప్రకారం -

1. స్వదేశంలోని ముడిసరుకులు లేదా మరేదైనా వాడాలన్న నిబంధన పెట్టరాదు.
2. విదేశీ సరుకులు దిగుమతిచేసుకునే పరిమాణాన్ని పెట్టుబడిదారుడు ఎగుమతి చేసే దానితో ముడిపెట్టరాదు.
3. పెట్టుబడి పెట్టే వ్యక్తి తన వుత్పత్తిలో నిర్ణీతశాతం ఎగుమతి చేయాలన్న నిబంధన పెట్టరాదు (విదేశమారకంకోసం).
4. విదేశీకంపెనీలకు అది ఎంతవుత్పత్తి చేస్తుందన్న దానితో దాని విదేశీమారకపు చెల్లింపులను ముడిపెట్టరాదు.
5. కొన్ని విషయాల్లో వుత్పత్తి ఎగుమతులను పరిమితం చేసే పద్ధతిని అనుసరించరాదు.

ఇవేకాక కంపెనీల్లో విదేశీ పెట్టుబడిదారులతో పాటు స్థానికుల భాగస్వామ్యం వుండాలన్న నిబంధనగానీ, కొన్ని రకాల వుత్పత్తులు బహుళజాతి సంస్థలకు అవకాశంలేకుండా చేయడంగానీ, వాటిలాభాల తరలింపులపై ఆంక్షలు గానీ వుండకూడదు.

## 3. మేధోపరమైన పేటెంట్ హక్కులు (TRIPS - Trade Related Intellectual property Rights).

సమాజమంతటికీ చెందాల్సిన నూతన విజ్ఞాన ఆవిష్కరణల ఫలితాలను ప్రవేటు వ్యక్తుల, గుత్త వ్యాపార సంస్థలపరం చేయటమే పేటెంటు హక్కు. తమదోపిడీకనుగుణంగా ఈహక్కులను చట్టబద్ధం చేస్తూ రూపొందించబడిన పేటెంట్ హక్కుల చట్టాలు సామ్రాజ్యవాద దేశాల్లో లాగా మూడవ ప్రపంచదేశాల్లో ఈ నియమాలన్నీ పాటించబడటం లేదు. తమ దేశాల్లో వున్న చట్టాలలాగే మూడవ ప్రపంచ దేశాలు కూడ ఈ చట్టాలను సవరించుకోవాలన్నది సామ్రాజ్యవాదులు కోరుతున్న దాని సారాంశం.

ఈ చట్టం ప్రకారం మేధోపరమైన ఆస్థి అంటే - అది ఒక వ్యక్తిగానీ, సంస్థగానీ (గుత్తసంస్థ) సృష్టించిన టెక్నాలజి కావచ్చు, డిజైను కావచ్చు. అలాగే దానిపై **హక్కు అంటే ఇతరులు ఎవరు దాన్ని వాడకుండా నిషేధించే రూపంలో** కావచ్చు. లేదా దాన్ని కిరాయికిచ్చి రాయల్టీలను అర్జించే రూపంకావచ్చు. దాని స్వంతదారుడు లేదా సృష్టికర్తకు పేటెంట్లు, కాపీరైట్లు లేదా ట్రేడ్ మార్కులు ప్రసాదించే రూపంలో ఈ హక్కులు గుర్తించబడుతాయి.

ఈ మేధోపరమైన హక్కులను సక్రమంగా గుర్తించడం లేదన్న సాకుతో అమెరికా కొన్నిదేశాలపై స్పెషల్ 301 ను ప్రయోగించింది కూడ.. ఈ మేధోపరమైన హక్కులను గుర్తించడం ఆ నూతన విషయాలనుకనుక్కున్న వాళ్ళకు ప్రోత్సాహకంగా వుంటుందన్నది సామ్రాజ్యవాద దేశాల వాదన. వాటిని కాపాడితే వాళ్ళు మళ్ళీకొత్త విషయాల్ని కనుగొనేందుకు ఆసక్తి చూపిస్తారంటారు. ఈ పేటెంట్ హక్కులు సక్రమంగా కాపాడబడ నందున అమెరికా తాను సం॥నికి 6000 కోట్లడాలర్లు (సుమారు రూ. 2లక్షల కోట్ల) కోల్పోతున్నానని అంటోంది.

సామ్రాజ్యవాద దేశాల్లోని గుత్త సంస్థలన్నీ ఈ పేటెంట్ హక్కుల్ని డిమాండ్ చేస్తున్నాయి. ఈ రకంగా పేటెంట్ హక్కుల్ని కోరడం - మూడవ ప్రపంచ దేశాల్లోని సంస్థలు, వ్యక్తులు ఆ కొత్త విషయాన్ని ఉపయోగించుకొని పుత్పత్తులు సాగించకుండా నిరోధించడానికే.

- పైగా ఈ చట్టం ప్రకారం పేటెంట్ దారుడు దాన్ని ఏదేశంలో అమలుకావాలో ఆ దేశంలో తయారుచేయ్యాలన్న నిబంధనలేదు. **దిగుమతి చేసుకునే పుత్పత్తిని కూడ స్వదేశంలో పుత్పత్తి అయిన దానితో సమానంగా** పరిగణించాలని కోరుతుంది.

(ఆర్టికల్ 27 (2) )

-మేధోపరమైన హక్కులు పొందిన వాళ్ళపై సమాజపరంగా ఎలాంటి ఆంక్షలు విధించరాదు.

-ఈ హక్కులు వస్తువులకే గాక జీవసంబంధ విషయాలకు కూడా (మొక్కలకు,జంతువులకు, జీవశాస్త్ర ప్రక్రియలకు) గుర్తించాలి.

-మూడవ ప్రపంచదేశాలు గుర్తిస్తున్న దానికన్నా దీర్ఘకాలం పేటెంట్ గుర్తించబడాలి. పేటెంట్లను 20సం॥పాటు, కాపీరైట్‌లను 50సం॥లపాటు గుర్తించాలి.

-తయారుచేసే పద్ధతి (process) పైనేగాక, ఆ ఉత్పత్తి పైన కూడా ఇవ్వాలి. ఇవీ డంకెల్ డ్రాఫ్టు పేటెంట్ హక్కుల్ని గురించి చెప్పేముఖ్యమైన అంశాలు. అయితే మనం బయోటెక్నాలజీ అధ్యాయంలో అమెరికా మొదటి యుపొవ్ (UPOV) ఒప్పందంలో లేదనీ;

మొక్కల వుత్పత్తిదార్ల హక్కుల (PBR)ను గుర్తించలేదనీ చూశాం-ఇపుడు అది ఆరంగంలో అభివృద్ధి సాధించింది గనుక ఆ హక్కుల ద్వారా వచ్చేలాభాలు కావాలి. తన దేశంలోని గుత్త కంపెనీలకు విదేశాల్లో కూడ ఆ పేటెంట్ హక్కుద్వారా లాభాలు పిండుకునే ఏర్పాటుకావాలి.

ఈ మేధోపరమైన ఆస్తులను గుర్తించడానికి ప్రపంచపేటెంట్ హక్కుల సంస్థ (World Intellectual Patents Organisation - WIPO)అనబడేది వుంది. లేకుంటే అంక్టాడ్ (UNCTAD - United Nations conference on Trade and Development) వుంది. వాటికి బదులుగా గాట్ నే దీనికి కూడ వేదిక చేశారు.

ఒకవేళ మేధోపరమైన హక్కుల్ని కాపాడకపోతే ఆ కాపాడని దేశంపై ఎదురుదెబ్బ (Cross Retaliation) చేసే హక్కును కూడ డంకెల్ డ్రాఫ్టు ఇస్తోంది. అలాగే ఈ హక్కును ఉల్లంఘించారని ఆ పేటెంట్దారుడు ఎవరిమీదనైన ఆరోపణచేస్తే ఉల్లంఘించలేదని బుజావు చేసుకోవలసింది ఆరోపణకు గురైనవాళ్ళే.

## 4. వ్యవసాయరంగం

గతంలోలేని వ్యవసాయరంగాన్ని కూడ గాట్ పరిధిలోకి తెచ్చారు. దీని ఉద్దేశం పేదదేశాల మార్కెట్లలోకి సంపన్నదేశాలు మిగులు ధాన్యాన్ని కుమ్మరించడమేననడంలో సందేహం వుండనక్కరలేదు. డ్రాఫ్టు ప్రకారం

-స్వదేశంలోని వ్యవసాయ వుత్పత్తులకు మద్దతుధరల విధానం రద్దు చేసుకోవాలి. వ్యవసాయానికి అందించే సబ్సిడీలను కత్తిరించుకోవాలి.

- వాణిజ్యానికున్న అవరోధాలన్ని తగ్గించాలి.

-వ్యవసాయ ఎగుమతులకిచ్చే సబ్సిడీలను తగ్గించాలి - ఆహార సెక్యూరిటీ కోసం ఇచ్చే సబ్సిడీలను కూడ తగ్గించుకోవాలి.

-ఒకవేళ ఆహారధాన్యాల దిగుమతి లేకుంటే దిగుమతులు చేసుకోవాలి. ఆదేశంలో జరిగే సగటు వినియోగంలో 3%తో మొదలు పెట్టి 1999 నాటికి దాన్ని (దిగుమతిని)5%కు పెంచాలి.

ఈ చర్యలన్నీ 1993లో మొదలెట్టి 1999కి పూర్తిచేయాలి.

ఈ వ్యవసాయ సబ్సిడీల విషయంలోనే అమెరికాకు, యూరపియన్ కమ్యూనిటీకి మధ్య ఏకాభిప్రాయం కుదరకనే డంకెల్ డ్రాఫ్టు ఇన్నాళ్ళు ఆలస్యమైంది. వీటి రెండింటి మధ్య సబ్సిడీల కత్తిరింపు పట్ల ఏకాభిప్రాయం వున్నా - ఏమేరకు, ఎలా చెయ్యాలన్న దానిపై భేదాభిప్రాయం వుంది.

## 5. జౌళిరంగం

టెక్స్టైల్ వ్యాపారాన్ని గాట్ పరిధిలోకి తేలేదు సామ్రాజ్యవాదులు. ఇక్కడే వాటి దుర్మార్గాన్ని అర్థంచేసుకోవచ్చు. ఎందుకంటే జౌళిరంగంలో అవి ఎగుమతి చేయగల స్థితి లేదు. మూడవ ప్రపంచదేశాలదే ఈ మార్కెట్టు. అవికోరినప్పటికీ అమెరికా, ఫ్రాన్సులు తమ మార్కెట్లను ఈ రంగంలో మూడవ ప్రపంచదేశాల ఎగుమతులకోసం తెరచివుంచడానికి సిద్ధపడలేదు. అందుకుదాన్ని గాట్లో కలపకుండా ప్రత్యేకంగా మల్టీఫైబర్ అగ్రిమెంట్ పేరిట

(MFA) వుంచారు. దీనిప్రకారం జౌళి ఎగుమతి చేసే దేశాలకు ఎగుమతి కోటాలు నిర్ణయించారు.

ప్రస్తుతం ఈ రంగాన్ని గాట్‌లో కలుపుతూ డంకెల్ డ్రాఫ్టులో వ్రాసినప్పటికి అందులో స్వేచ్ఛావ్యాపారానికి అవకాశం ఇవ్వలేదు. ఈ రంగపు వ్యాపారంలో స్వేచ్ఛను, సరళీకృత వ్యాపారాన్ని అనుమతించడానికి 10సం॥ల దశలవారీ కార్యక్రమాన్ని ప్రతిపాదించారు. పైగా దేశాలవారీ కోటాలకు బదులు గ్లోబల్ కోటాలు నిర్ణయించారు. అందువల్ల పేదదేశాలు తమ మధ్య ఇంకా పోటీ పెరిగి నష్టపోతాయి.

సామ్రాజ్యవాదులు వాళ్ళు ఎగుమతిచేయగల రంగంలో స్వేచ్ఛావ్యాపారం కోరుకుంటారు తప్ప పేదదేశాలకు అవకాశం వున్న చోట మాత్రం అదే సూత్రాన్ని అనుమతించరనడానికి ఇదొక మంచి వుదాహరణ.

## అమెరికన్ సామ్రాజ్యవాదమే అంతర్జాతీయ పోలీసు కూడ

ఈ డ్రాఫ్టు గుత్తకంపెనీలకు అనేకరకాలుగా ఉపయోగపడేలా రూపొందించబడింది. ఉరుగ్వేరౌండు ప్రత్యేకతల్లో ఇదికూడ ఒకటి. ఇపుడు చెప్పిన 4 అంశాలు కొత్తగా ఎజెండాలోకి వచ్చిన MNCలకే ఉపయోగపడతాయి. వాణిజ్య పెట్టుబడులు చట్టం (TRIMS) బహుళజాతిసంస్థ (MNC) లకు మూడవ ప్రపంచదేశాల్లో పెట్టుబడులు పెట్టుకోడానికి స్వేచ్ఛగా అనుమతిస్తే, మేధోపరపేటెంట్ చట్టం టెక్నాలజీపై వాటి పట్టును మరింత కంట్రోలు చేసి పోటీలేకుండా చేస్తుంది. సర్వీసురంగంలో వచ్చే అవకాశాలు ఆ దేశాల ఆర్థిక రంగంలోని గుత్త కంపెనీలకు బ్రహ్మాండమైన మార్కెట్లను సృష్టించి పెడతాయి.

అయితే ఈ ఏర్పాటు దెబ్బతినకుండా చేసుకోడానికి, ఒకవేళ ఏదైనా దేశంపై నియమాల్ని వుల్లంఘిస్తే చర్య తీసుకోడానికి అవసరమైన ఏర్పాటును కూడ ఇందులో చేశారు. అదే మల్టీట్రేడ్ ఆర్గనైజేషన్ (MTO) లేదా బహుళ వ్యాపారసంస్థ. గాట్‌లో ఈ ఉరుగ్వేరౌండు నిర్ణయాలన్నీ పూర్తిస్థాయిలో అమలు చేసేదే ఇది. ఈ ఏర్పాట్లు పూర్తయ్యాక గాట్ రద్దయి అందులోని దే శాలన్నీ దీనిలో చేరే ఏర్పాటు జరుగుతుంది.

దీన్ని ఏర్పరచడంలో ప్రధాన వుద్దేశం ఇప్పటివరకు గాట్‌కు తన ఒప్పందాలను అమలుపరచే యంత్రాంగం లేదు- ఇపుడు MTO ద్వారా అది ఏర్పడుతుంది. దీనిలో సమగ్రమైన వివాద పరిష్కార వ్యవస్థ (Integrated Dispute Settlement system - IDSS) వుంటుంది. ఈ వ్యవస్థ పై ఒప్పందాలను అమలుపరచని దేశాలపై ఎదురు దెబ్బ తీయడాన్ని అనుమతిస్తుంది. అంటే ఈ ఏర్పాటుద్వారా అమెరికా ఇప్పటికే వుపయోగిస్తున్న సూపర్, స్పెషల్ 301లను అంతర్జాతీయికరణ చేస్తుందన్నమాట. ఈ హక్కును చేబూనడం ద్వారా ప్రపంచమేధో పేటెంట్ల సంస్థ (WIPO) స్థానాన్ని ప్రక్కన పెడుతుంది.

ఈ విధంగా ఈ బహుళ వ్యాపార సంస్థ (MTO) ద్వారా అంతర్జాతీయ వాణిజ్యంపై ముఖ్యమైన మూడు కూటములు తమ పట్టును బిగిస్తాయి. అందులోనూ అమెరికా కీలకపాత్ర (పోలీసుగాకూడ) వహిస్తుంది.

## ఇంత విచ్చలవిడి దోపిడి చట్టానికి అమెరికాకి ఆస్కారం ఎలా ఏర్పడింది?

ఉరుగ్వేరౌండు చర్చల ద్వారా ప్రపంచ వాణిజ్యంపై అమెరికా తనకనుకూలంగా ఈ అంశాలన్నీ చేర్చుకోడానికి అవసరంఏమిటి? ఎలా వీలుపడిందన్న ప్రశ్నల్ని కూడ పరిశీలించాలి.

మొదటి విషయం అమెరికాలో బయోటెక్నాలజీ రంగంలో ఎంత అభివృద్ధి సాధించడానికి, గుత్తసంస్థల వ్యాపార విస్తృతికి ఎలా అవకాశాలేర్పడ్డాయో ఇంతకుముందే చూశాం. సజీవ పదార్థాల పేటెంట్ హక్కులు, వ్యవసాయాన్ని సరళతరం చేయడం, ఆ రంగంలోని బహుళజాతి గుత్తసంస్థల వత్తిడి నుండి వచ్చాయి.

ఇప్పటికే ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి ద్వారా మూడవ ప్రపంచదేశాల్లో సరళీకృత ఆర్థికవిధానాలు, వ్యవస్థాగత సర్దుబాట్లు కార్యక్రమాలు చేపట్టేలా చేసింది. మార్కెట్లకు విస్తృతి ఏర్పడినప్పటికీ ఆమెరికాకు పారిశ్రామిక ఉత్పత్తులను (Goods) ఎగుమతిచేసే అవకాశం పెద్దగాలేని పరిస్థితికి నెట్టబడింది. అది మున్నెన్నడూ లేనంత ఉత్పత్తి మాంద్యంలో కూరుకుపోయింది. (Great Recession) నిరుద్యోగం పెద్దఎత్తున పెరిగిపోయింది. దానికి స్వదేశీ అప్పులు, విదేశీ అప్పులు భారీఎత్తున పెరిగి ప్రపంచంలోని అతిపెద్ద రుణగ్రస్త దేశంగా తయారయింది. తన అంతర్గత పారిశ్రామిక వ్యవస్థలో ఎన్ని మార్పులు చేసుకున్నా తన సంక్షోభం నుండి బయటపడగల స్థితిలేదు.

అందువల్లే అది అంతర్జాతీయ మార్కెట్‌లో పేదదేశాల సర్వీసురంగంలోకి ప్రవేశించడానికి ఎంచుకుంది. ఈ మార్గంలో పెద్ద ఎత్తున లాభాలు సంపాదించి తన సంక్షోభం పూడ్చుకోడానికి ప్లానుచేసింది. అందుకు వాణిజ్య మదుపుల (పెట్టుబడుల) లో వున్న షరతులను, అడ్డంకులను తొలగింపచేసుకోవడం అవసరమైంది (TRIMS).

ఇంత స్వేచ్ఛగా ఇంత దుర్మార్గమైన షరతుల్ని మూడవ ప్రపంచదేశాలపైకి రుద్ద గలగడానికి ఆస్కారమిచ్చింది ప్రస్తుతమున్న అంతర్జాతీయ వాతావరణమేనని చెప్పాలి. సోషల్ సామ్రాజ్యవాద దేశంగా వుండిన సోవియట్‌యూనియన్ తన విధానాల మూలంగానే తీవ్ర అంతర్గత సంక్షోభాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. సోషలిస్టు ముసుగును చించుకుని బహిరంగ పెట్టుబడిదారి విధానంలోకి రావాల్సివచ్చింది. అక్కడ తీసుకున్న మార్పులు ఆ బ్లాకులోని దేశాలైన జర్మనీ తదితర దేశాల్లో కూడ మార్పులు తెచ్చాయి. జర్మనీ కూడ ఏకీకరణ తర్వాత తన ఆర్థిక, ద్రవ్య మిగులును కోల్పోయింది.

జపాన్ సరుకుల ఉత్పాదనరంగంలో ముందుంది. ఆయుధాల ఉత్పత్తిపై పరిమితివల్ల తను అగ్రరాజ్యంగా రూపుదిద్దుకోనప్పటికీ దానికి కూడ సరుకులకు, సర్వీసుల రంగంలోనూ మార్కెట్ కావాలి. యూరపియన్ కమ్యూనిటీకి చెందిన గుత్త సంస్థలు కూడ మార్కెట్ విస్తరణను కోరుతున్నాయి.

సోవియట్‌యూనియన్ విడిపోయిన తర్వాత ఏర్పడిన రష్యా అగ్రరాజ్యంగానే వున్నప్పటికీ అది తీవ్ర ఆర్థిక సంక్షోభంలో వుంది. తను అప్పులకోసం వెతుక్కుంటూ వుంది. తన రాజకీయ ప్రయోజనంకోసం అమెరికా దీనికి తోడ్పడుతూవుంది. వాటి మధ్య పోటీ, కుమ్మక్కు అన్నవి రెండూ వున్నప్పటికీ ప్రస్తుతం కుమ్మక్కు ప్రధానంగా వుంది.

సోవియట్‌యూనియన్ రివిజనిస్టు ఊబిలో కూరుకుపోయి సామ్రాజ్యవాద దేశంగా మారిన తర్వాత మూడవ ప్రపంచదేశాలకు సోషలిస్టు చైనా నాయకత్వం వహించింది. మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని రూపొందిన కా॥ మావో జాతీయ విముక్తి వుద్యమాలకు బాసటగా నిలిచారు. ఆ కాలంలో వియత్నాం అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని ఓడించి వీర వియత్నాంగా పేరు పొందింది. ఆ కాలంలోనే అలీనోద్యమం కూడ మంచి ఊపుతో ముందుకుసాగింది. అగ్రరాజ్యాల మధ్య పోటీ పీడిత దేశాలకు కొంత వెసులుబాటును ఇచ్చింది. అంతకంటే ఎక్కువగా సోషలిస్టు సిద్ధాంతం పీడితదేశాలన్నిటా ప్రజలకు ఆదర్శంగా నిలిచింది. 'సామాజిక

బాధ్యత అన్న అంశాన్ని ఏదేశంలో అధికారంలో వున్నా దోపిడీపాలకవర్గం కూడ లేదనలేకపోయింది. అయితే ప్రస్తుతం చైనా నాయకత్వం కూడ మార్క్సిజం - లెనినిజాన్ని వదిలి పీడిత ప్రజలకు, పీడితదేశాలకు నాయకత్వంవహించే స్థితిని కోల్పోయింది.

ఈ పరిస్థితిని ఆసరాచేసుకునే సామ్రాజ్యవాద దేశాలు ఇటీవల సోవియట్ యూనియన్ విడిపోవడం, ఇతర యూరప్ దేశాల్లో జరిగిన పరిణామాలను ఆసరాగా చేసుకుని మార్క్సిస్టు సిద్ధాంతంపై దాడి పెద్ద ఎత్తునచేశాయి. అవి ఏనాడో మార్క్సిజాన్ని వదిలేసి పెట్టుబడిదారీ పంథాలో నడుస్తున్న విషయం తెలిసికూడ ఈ దాడి చెయ్యడం వెనుక వాటి లక్ష్యం సోషలిస్టు జీవితవిధానం ప్రపంచంలో నిలబడలేదని చెప్పడమే. ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానం తప్ప మరొక జీవనవిధానం బ్రతకలేదని చెప్పడానికి చేసిన ప్రయత్నమే అది.

ప్రస్తుత ప్రపంచంలో సోషలిస్టు సిద్ధాంతం, సామాజిక ప్రయోజనం ముఖ్యమన్న ఆలోచనపై జరిగిన దాడి ఒకవైపు - మరోవైపు దెబ్బతిన్న అలీనోద్యమము, జి.77 గా ఏర్పడినప్పటికీ మూడవ ప్రపంచదేశాలకు నాయకత్వం లేకపోవడం, సామ్రాజ్యవాద దేశాల్లోని అంతర్గత సంక్షోభం ఈ కారణాలన్ని అమెరికా, యూరపియన్ కమ్యూనిటీ, జపాన్‌లకు ఈ డంకెల్ డ్రాఫ్టు ముందుకు తేవడానికి ఆస్కారమిచ్చాయి.

మూడవ ప్రపంచ దేశాల మార్కెట్లలో ఇష్టారాజ్యంగా దీన్నడ్డం పెట్టుకుని పెత్తనంచేసి, ఆ దోపిడీచేసిన డబ్బుతో తన దేశంలో దిగజారిపోతున్న ప్రజల జీవనప్రమాణాలను కొంతైనా నిలబెట్టుకోడానికి, పెరుగుతున్న స్వదేశీ విదేశీ రుణాల ఊబి నుండి బయట పడడానికి - అమెరికన్ కంపెనీలను ఇతరదేశాల కంపెనీలనుకొంటున్న దుస్థితి నుండి బయటపడడానికి అమెరికా ప్రయత్నిస్తోంది. ఈ డ్రాఫ్టు అందుకోసం రూపొందించ బడిందేనని ఇది రూపొందటం వెనుక బహుళజాతి గుత్త సంస్థ పాత్ర కీలకమైందనీ నిస్సందేహంగాచెప్పవచ్చు.

## మూడవ ప్రపంచదేశాల వైఖరి : భారత పాలకుల లొంగుబాటు

డంకెల్ ప్రతిపాదనలపై మూడవ ప్రపంచదేశాలు పలురూపాల్లో తమ నిరసనను ప్రకటించాయి. తమ ప్రత్యామ్నాయ ప్రతిపాదనలను కూడ విభిన్న అంశాలపై రూపొందించాయి. జెనీవా చర్చలలో మూడవ ప్రపంచదేశాల ప్రతినిధులు తమ ఆగ్రహాన్నీ, బాధనూ ప్రకటించాయి. బ్రెజిల్ రాయబారి రూబెన్ రిక్యూపిరో మూడవ ప్రపంచాన్ని కసాయివాని చేతిలోని గొర్రెతో పోల్చాడు. "నీ మాంసంతో ఏ రకమైన పులుసు పెట్టుకోమంటావు ?" అని కసాయివాడు అడిగిన చందంగా ఆ చర్యలున్నాయని ; "నన్నసలు తిననే వద్దని" ఆ గొర్రె అంటే "అది జరిగే పనికాదని" కసాయివాడు అంటున్నాడని చెప్పాడు. జెనీవాలో జరిగిన సెమినార్‌లో కెన్యా దేశపు రాయబారి అయిన థామస్ బగాడా "మూడవ ప్రపంచదేశాలను పంచుకునే పండుగలో పాల్గొనడానికే మమ్మల్ని ఉరుగ్వే చర్చలకు ఆహ్వానించారు" అన్నారు.

మూడవ ప్రపంచదేశాలకు నాయకురాలిగా భారతదేశం మొదట్లో కొంత మాట్లాడినట్లు కన్పించినప్పటికీ లొంగుబాటు ప్రదర్శించడానికి ఎంతోకాలం పట్టలేదు. ఇపుడు ప్లేటు ఫిరాయించి స్వేచ్ఛా వాణిజ్యం వల్ల నష్టం లేదనీ ఎగుమతులు పెంచుకోవచ్చనీ వాదనలు పుచ్చుకున్నాయి భారత పాలకవర్గాలు.

మూడవ ప్రపంచదేశాలను విపరీతమైన అప్పులభారంతో ముంచెత్తాయి సామ్రాజ్యవాద దేశాలు. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి రెండూ సమాన్వయంతో అప్పులిచ్చి, అది పెరిగే కొద్దీ షరతులతో మూడవ ప్రపంచదేశాలను కట్టిపడవేస్తున్నాయి. ఆ దేశాల్లోని అంతర్గత పాలసీలను కూడ నియంత్రించే అధికారాన్ని ఇప్పటికే ఇవి పొందాయి. భారతదేశ పరిస్థితినే సరిపోల్చుకున్నా పరిస్థితిని మనం వూహించుకోగలుగుతాం.

1992-93 సంవత్సరపు బడ్జెట్ పరిస్థితి గురించిన ఆర్థిక మంత్రిత్వ శాఖ రిపోర్టుపై 5 -11-93 నాటి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వ్రాసిన వివరాల ప్రకారం :

1993 మార్చి నాటికి విదేశీ అప్పు 2 లక్షల 66 వేల 167 కోట్ల రూపాయలకు చేరింది. మూడవ ప్రపంచదేశాల్లో అత్యధిక అప్పుగల బ్రెజిల్, మెక్సికో, ఇండొనేషియాల ప్రక్కన 4వ స్థానం సంపాదించుకుంది. దేశస్థుల జాతీయోత్పత్తి లో 29.2 శాతానికి చేరి బ్రెజిల్ పరిస్థితితో సమానస్థాయికి చేరింది. 1980-81లో రక్షణ అప్పులు (మిలటరీ) కలుపకుండా విదేశీ అప్పు మొత్తం స్థూల జాతీయోత్పత్తిలో 14.3 శాతం వుండగా, 1991-92లో 17.5 శాతంకు పెరిగి ఒక్కసారిగా 92-93లో 33.4 శాతానికి చేరింది. రక్షణ అప్పుకూడ కలిపితే అది 38 శాతం అవుతుంది. మొత్తం విదేశీ అప్పుల ఖాతాకు చెల్లింపులు 1992-93లో 20,895 కోట్ల రూపాయలకు చేరాయి. ఇది మన ప్రభుత్వ ఆదాయం లో 25.7 శాతం అయింది. (దేశంలో అంతర్గత అప్పులు 4 లక్షల కోట్ల రూ॥ వరకు వుంటాయని అంచనా. దాని భాగం ఇందులో కలపలేదు).

ఈ దుస్థితి బ్రెజిల్ అనుభవాన్నే మనకూ కలిగిస్తుంది. బ్రెజిల్ ఆర్థికవ్యవస్థ ఇప్పటికే అమెరికాకు అనుసంధానం చేయబడింది. ప్రపంచంలోనే మొదటిస్థానంలో పండ్లు పండించే ఆ దేశం నుండి ఎంతగా ఎగుమతులు చేసినా ఆ దేశపు అప్పు పెరుగుతున్నదే తప్ప తరగడం లేదు. మన ఆర్థికవ్యవస్థ కూడ ఆ దశకు ఇప్పటికే చేరింది. ద్రవ్యనిధి, ప్రపంచబ్యాంకుల 'దయ' లేకుండా రోజువారీ పాలన అవసరాలు కూడ తీర్చుకోగల పరిస్థితిలో మన పాలకులు లేరు. అందుకే ఎన్ని షరతులు రుద్దినా అంగీకరిస్తున్నారు. విదేశాల నుండి విడగొట్టుకొని బ్రతకలేమని సూత్రాలు చెబుతూ డంకెల్ డ్రాఫ్టును భుజాన వేసుకుంటున్నారు. పార్లమెంటులో, రాష్ట్రాల అసెంబ్లీలలో చర్చలు జరపకుండా దాటవేస్తున్నారు. కనీసం డ్రాఫ్టు పూర్తి పాఠాన్ని ఎం.పి. లకూ, ఎం.ఎల్.ఏ. లకు కూడ ఇవ్వడానికి సాహసించలేకపోతున్నారు.

# వ్యవసాయ రంగంపై డంకెల్ ప్రతిపాదనల పర్యవసానాలు

ప్రపంచంలో నేడున్న సమస్యలలో కెల్లా ఆకలి సమస్య తీవ్రమైంది. ఆహార వుత్పత్తి పెంచుకోగల ఆధునిక విజ్ఞానం వుండి కూడ ప్రపంచంలో సగానికి పైగా జనాభా ఆకలితో మగ్గిపోతున్నారు. మన భారతదేశంలోనే 30 కోట్ల మంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన వున్నారనీ పాక్షికంగానో, పూర్తిగానో ఆకలికి గురవుతున్నారని ప్రభుత్వ లెక్కలే తెలియజేస్తున్నాయి. అమెరికాలాంటి దేశాల్లో కూడా ఆకలి తీవ్ర సమస్యే. ఏ అంతర్జాతీయ వేదికైనా ఈ సమస్యను పరిష్కరించగలిగే చర్యలు రూపొందిస్తే అందుకనుగుణంగా వ్యవసాయ రంగాన్ని మలచగలిగితే ప్రపంచ ప్రజలు హర్షిస్తారు. అయితే గాట్‌లో వ్యవసాయ రంగాన్ని కలపడంలో వుద్దేశం అదికాదు. సామ్రాజ్యవాదులు, వారి గుత్తసంస్థల లాభాల కోసం మూడవ ప్రపంచదేశాల వ్యవసాయ రంగాన్ని తమకనుకూలంగా మలచుకోవడం కోసం.

## అవసరం లేకున్నా ధాన్యం దిగుమతి చేసుకోవాలి

డంకెల్ ప్రతిపాదన ప్రకారం మనకు అవసరమున్నా లేకున్నా ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోవాలి. ఇపుడు దేశం మొత్తంమీద వినిమయమవుతున్న మొత్తంలో 3% చేసుకొని ఈ దిగుమతులను 1999 నాటికి 5%కు పెంచాలి. అంటే మనదేశంలో ఇపుడు పండుతున్న 18.8 కోట్ల టన్నులన్న ప్రకారం లెక్కవేస్తే - మనం కనీసం 56 లక్షల టన్నుల ధాన్యం (వరి లేక గోధుమ) దిగుమతి చేసుకోవాలన్నమాట. ఈ లెక్కన సంకి సంకి పెంచుకుంటూ పోవాలన్నమాట. ప్రస్తుతం దేశంలో వున్న ప్రజల కొనుగోలు శక్తిని దృష్టిలో వుంచుకుని ఆర్థికవేత్తలు ధాన్యం పంటలో స్వయం సమృద్ధంగా వున్నామని చెబుతున్నారు. అయినా దిగుమతి చేసుకోవాలన్నమాట.

అందుకే కాబోలు మన పాలకులు అమెరికా, కెనడా, ఆస్ట్రేలియాల నుండి 1992లో 30 లక్షల టన్నుల గోధుమలు దిగుమతి చేసుకున్నారు. మన రైతుకు 350 రు. క్వింటాల్ చొ॥న అడిగితే ఇవ్వని పాలకులు క్వింటాల్‌కు 517 రు. విదేశీ మారకం చెల్లించి (అందులో కొరత వున్నా) దిగుమతి చేసుకున్నారు. ఇందుకోసం 1500 కోట్ల రూ॥ ఖర్చుపెట్టారు. గోధుమలు కావాలని 1992 ఆరంభంలోనే అమెరికాను అడిగితే నిరాకరించారు. కారణం మన పాలకులు అమెరికాకు ఇష్టంలేని చర్య - క్యూబాకు బియ్యం ఎగుమతి చేశారు గనుక. అమెరికాకు కోపం వచ్చింది గనుక. దాన్ని రద్దు చేసుకున్నామని మన పాలకులు మళ్ళీ చెప్పుకున్న తర్వాత అమెరికా శాంతించింది. ఈ దిగుమతిలో ఇంకో దారుణమేమంటే అంత అధిక ధరలు చెల్లించి అమెరికా నుండి దిగుమతి చేసుకున్న ధాన్యం బొంబాయి రేవులో 50 వేల టన్నులు రాగా వాటిని పరిశీలిస్తే పురుగు పట్టి వుండడం. పురుగు పట్టి పుచ్చిపోయి వున్నాయి గనుక పనికిరావని బొంబాయి పోర్టు అధికారులు నిలిపివేసి తిప్పి పంపాలని ప్రతిపాదించగా మన పాలకులు పురుగులు ఏరుకుని తినవచ్చులెమ్మని ఓడలను ఖాళీ చేయమని ఆదేశించారు. (తిప్పి పంపితే అమెరికన్ ప్రభువులకు కోపం రాదా మరి !)

## విదేశీ మారకపు నిల్వల పరిస్థితి బాగా లేకున్నా తప్పించుకోలేరు !

డంకెల్ ప్రతిపాదనల ప్రకారం మనం ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవాల్సిన అవసరం లేదని పాలకులు వాదిస్తున్నారు - దానికి వాళ్ళు చెప్పే కారణం మన విదేశీ మారకపు నిల్వలు సక్రమంగా వుండవు గనుక మనకు ఈ నిబంధన వర్తించదంటున్నారు.

అయితే ఇక్కడ కూడ సామ్రాజ్యవాదులు జాగ్రత్తపడ్డారు. విదేశీ మారకపు నిల్వల పరిస్థితి ఎలా వుందన్నది చెప్పాల్సింది దిగుమతి చేసుకోవాల్సిన మూడవ ప్రపంచ దేశం కాదు. దాన్ని నిర్ధారించాల్సింది అంతర్జాతీయ ద్రవ్యనిధి మాత్రమే. అందువల్ల ఎగుమతులు చేయాల్సి వచ్చినపుడు సామ్రాజ్యవాదులు ఈ ద్రవ్యనిధి నుండి రుణాలు ఇప్పించి దాని ఆర్థిక పరిస్థితి బాగానే వుందని సర్టిఫికెటిప్పించి ఎగుమతి చేస్తారు.

## వ్యవసాయానికిచ్చే అన్ని మద్దతు చర్యలను ఉపసంహరించుకోవాలి

అమెరికా, యూరపు కమ్యూనిటీ తదితర దేశాలు తమవద్దనున్న ఆహార ధాన్యాలను పేదదేశాలు కొనాలంటే ఆ దేశాల్లో ఈ పంటల విస్తీర్ణం తగ్గాలి. ప్రభుత్వాలు ఇందుకోసం రైతులకు ఇచ్చే అన్ని ప్రోత్సాహకాలు నిలిపెయ్యాలన్న నిబంధన పెట్టారు. దీని ప్రకారం మనదేశంలో ప్రస్తుతం వ్యవసాయ పంటలకు మద్దతుధర ప్రకటించి ప్రభుత్వం తోడ్పడే విధానం మానుకోవాలి.

- బ్యాంకులు ప్రాధాన్యత రంగం పేరుతో ఇప్పటివరకు వ్యవసాయ రంగానికి ఇచ్చే రుణాలు ఆపివేయబడతాయి. ఇప్పటికే మనదేశంలో నరసింహన్ కమిటీని - ఫండ్, బ్యాంకు (IMF, WB) ఆదేశాల మేరకు నియమించి వ్యవసాయ రంగాన్ని ప్రాధాన్యతా రంగం నుండి తొలగించారు.

- దేశంలో ఎరువులు, పురుగు మందులు, ఇతర వ్యవసాయ పరికరాలపై ఇచ్చే సబ్సిడీలను తగ్గించుకోవాలి. ఇప్పటికే మన పాలకులు ఐ.యం.యఫ్., ప్రపంచ బ్యాంకుల షరతుల మేరకే ఎరువుల సబ్సిడీ కత్తిరించివేశాయి.

- ప్రాజెక్టుల క్రింద వసూలుచేసే నీటి తీరువాను పెంచాల్సి వస్తుంది. (ప్రాజెక్టులపై ఖర్చుపెట్టిన దానిపై తగిన శాతం ఆదాయం రావడం కోసం). అలాగే వ్యవసాయదార్లకు ప్రస్తుతం కరంటుపై ఇచ్చే సబ్సిడీని కూడ కత్తిరించి వేస్తారు. యూనిట్ రేటు ప్రకారం బిల్లులు వసూలు చేస్తారు. ప్రైవేటు రంగంలో కరంటు తయారుచేసే యూనిట్లు చాలా మొదలవుతున్నాయి.

ఈ సబ్సిడీల సమస్యను మరికొంత వివరంగా పరిశీలిద్దాం -

- ఆహార ధాన్యాలను నిల్వ చేసుకొనే పద్ధతి (Buffer Stocks) రద్దుచేసి ప్రజాపంపిణీ వ్యవస్థను (PDS) మూసివేయాల్సి వస్తుంది.

- వ్యవసాయోత్పత్తులపై సుంకాలను 24%కు వచ్చే 10 సం॥ల్లో తగ్గించాలి.

## సబ్సిడీల సమస్య

డంకెల్ డ్రాఫ్టు వ్యవసాయ రంగానికిస్తున్న సబ్సిడీలను ఉపసంహరించాలని పేదదేశాలను ఆదేశించింది. మరోవైపు సామ్రాజ్యవాద దేశాలకు మాత్రం డీక్ఫుల్లు ఇన్కం సపోర్టు, రీజనలు అసిస్టెన్సు వంటి పేర్లతో సబ్సిడీలు కొనసాగించుకునేందుకు అనుమతినిస్తుంది. ఈ సబ్సిడీలు వుండడమా లేదా అన్న విషయంలోకి వెళ్ళబోయే ముందు అసలివి ఎందుకు వచ్చాయన్నది చూద్దాం.

బ్రిటిష్ వలసవాదం మనదేశంలోకి రాకముందు మనదేశంలో సబ్సిడీ అన్న ఆలోచన లేదు. వాళ్ళు వచ్చాక ప్రజల్ని కొత్త అలవాట్లకు గురిచేయాల్సి వచ్చింది. టీ, కాఫీలు ప్రజలకు అలవాటు చేసేందుకు ఉచితంగా టీ ఇచ్చారు. పొగాకు పంటను ప్రోత్సాహింప జేసేందుకు కొన్ని ఎరువులు, ఉపకరణాలు (బార్నల్ల వంటివి), విత్తనాలు ఉచితంగా ఇచ్చారు. టీ, కాఫీలు ముందు వుచితంగా ఇవ్వడమంటే ఆ తర్వాత ప్రజలు అలవాటు పడ్డాక అంతకుముందు అలవాటు చేయడం కోసం పెట్టిన ఖర్చును కూడ కలిపి లాభాలు పిండేవాళ్ళు. అలాగే పొగాకు పంటపై తాము పొందే లాభాల నుండే కొద్దిభాగం రైతాంగానికి ఇచ్చేవాళ్ళు. ఇది పైకి వుచితంగా ఇచ్చినట్లు కన్పించినా తాము లాభాలు పిండుకోవడానికి తగినట్లుగా ప్రజలు వ్యవహరించడానికి ప్రతిఫలంగా ఇచ్చిందే ఇది. నిజంగా కంపెనీ పైసా సబ్సిడీ ఇవ్వకున్నా పొగాకుకు ఇవ్వాల్సిన రేటిస్తే రైతుకే అదనంగా వస్తుంది.

అలాగే 1947 తర్వాత కూడ - అమెరికా మన వ్యవసాయ రంగంలో ప్రవేశించిన తర్వాత ఎరువులు, పురుగు మందులకు అలవాటు పడడం కోసం బ్యాంకుల నుండి తక్కువ వడ్డీలకు అప్పులు, కొంత వుచితంగానూ ప్రభుత్వం చేత ఇప్పించింది. (నిజానికి మన వ్యవసాయరంగంలో సబ్సిడీలు ఇచ్చింది అమెరికన్ సామ్రాజ్యవాదుల పథకాల్లో భాగంగానే). ట్రాక్టర్లను కూడ అలాగే ఇప్పించింది. ఇవి ఇవ్వడం ద్వారా అమెరికా తన వస్తువుల్ని అమ్ముకుని లాభాలు గడించగలిగింది. మరోవైపు వ్యవసాయం పెరగడం కోసం బడ్జెట్లో ప్రజల నుండి వసూలు చేసిన పన్నుల నుండి ప్రాజెక్టులు కట్టేట్లు చేసింది. వీటన్నిటి కోసం (నీటి పారుదల, రుణాలు లేక కరంటు వగైరాల కోసం) ప్రభుత్వం తన పెట్టుబడి ఉచితంగా ఇచ్చినట్లు కన్పిస్తుంది. దీన్నే సబ్సిడీగా ప్రచారం చేసుకుంటుంది. అయితే ఇక్కడే మోసం ఉంది.

నీటిపారుదల పెరగడం వల్ల నీటికోసం డబ్బును రైతువద్ద పెద్దగా వసూలు చేయనట్లు కన్పించినప్పటికీ - ఆ నీటివల్ల పండిన పంటలపై (ప్రత్తి, చెరకు, పొగాకు వంటి పంటలపై) ఎక్సైజ్ సుంకం రూపంలోనో విదేశీ మారకద్రవ్యం పేరుతోనో భారీమొత్తం ఆదాయం పొందుతోంది - ప్రభుత్వం పొందే ఆదాయంతో పోల్చినపుడు సబ్సిడీగా ఇచ్చే మొత్తం అతిస్వల్పం.

ఉదాహరణకు ఎరువులపై సబ్సిడీలు సాగినపుడు కూడ ఇచ్చింది సం॥కి 5వేల కోట్ల రూపాయలు. దేశం మొత్తం జనాభాలో 70 శాతం మంది వ్యవసాయంపై ఆధారపడుతున్నారనుకున్నా తలకు సం॥కి. రూ. 80 ఖర్చు చేస్తున్నట్లు లెక్క. మరోరకంగా చెప్పాలన్నా దేశంలో సాగయ్యే 35 వేల కోట్ల ఎకరాల భూమిపై సగటున ఎకరాకు సుమారు రూ. 1.40 వంతున ఖర్చు పెడుతుందన్నమాట. అలాగే 1993-94లో ప్రజాపంపిణీ వ్యవస్థ కోసం కేంద్ర ప్రభుత్వం కేటాయించింది 3వేల కోట్లు. అంటే తలకు సం॥కి 36 రూ. ఖర్చు చేస్తుందన్నమాట. ఇలాగే కరంటు తదితరాలపై ఇచ్చేది కూడ బహుస్వల్పం. దేశంలో

పరిశ్రమలు పెరగాలన్న పేరుతో పెట్టుబడిదార్లకు, విదేశీ కంపెనీలకు ఇచ్చే రకరకాల రాయితీలతో పోల్చినపుడు వ్యవసాయ రంగానికి ఇచ్చేది నామమాత్రం. ఇందులో కూడ అత్యధిక మొత్తాలు సంపన్న రైతులకు, భూస్వాములకు, అసమర్ధమైన ఎరువుల కర్మాగారాలకు - నిరంకుశాధికార వర్గాలకి ఉపయోగపడుతున్నాయి.

నిజానికి కష్టపడి పండించే రైతాంగానికి అంతర్జాతీయ మార్కెట్ ప్రకారం ధరలు చెల్లించినా, నిరుపేదలకు భూములు పంచి, రోజువారీ కూలీని శాస్త్రీయ పద్ధతి ప్రకారం చెల్లించినా మన ప్రజలకేమీ పైసాకూడ సబ్సిడీ అక్కరలేదు. ఒకవైపున రైతాంగపు పంటలపై అపరిమితమైన పన్నులు కొల్లగొడుతూ - పేదలు కొనే ప్రతి వస్తువుపై (వుప్పుపై కూడ) పన్నులు వేస్తూ ప్రజల్ని పీల్చి పిప్పిచేస్తూ మరోవైపు తన బాధ్యతగా వాళ్ళ సంక్షేమం కోసం నేనేమీ ఖర్చు చెయ్యనంటే ? ఆ బాధ్యత నాకు లేదంటే ప్రజలు అంగీకరిస్తారా ? అంటే ప్రభుత్వం ఇచ్చే రాయితీ లేక సబ్సిడీ మూడవ ప్రపంచ దేశాలన్నిటిలో ఏమేరకు ఇచ్చినా అదంతా - పాలకులు ప్రజల నుండి భారీమొత్తాలు రాబట్టి ఆ విషయం వాళ్ళకు అర్ధం కాకుండా చెయ్యడం కోసమూ, కడుపు మండి తిరగబడకుండా చెయ్యడం కోసమూ ఇస్తున్నదే తప్ప వేరుకాదు. తమ శ్రమకు ఫలితం ఇస్తే, తమ భూములపై రైతాంగానికి హక్కులిస్తే పైసా సబ్సిడీ కూడా ఇవ్వకపోయినా ఎవరూ అడగరు.

అయితే సామ్రాజ్యవాద దేశాల్లో సబ్సిడీల తీరు ఇది కాదు. ప్రజల నుండి వసూలు చేసే పన్నుల నుండి వ్యవసాయక ఎగుమతుల ప్రోత్సాహం పేరుతోనో (డీకపుల్డ్ ఇన్‌కం సపోర్టు), వెనుకబడిన ప్రాంతాలకు రాయితీ (రీజినల్ అసిస్టెన్సు) పేరుతోనో బహుళజాతి కంపెనీలకు భారీమొత్తాల రాయితీ ఇస్తారు. వందనా శివ 13/2/92 నాటి అబ్జర్వర్ పత్రికలో "తమ షరతులలో భాగంగా ప్రపంచబ్యాంకు - ఐ.యం.యఫ్‌లు మూడవ ప్రపంచ దేశాలలో తొలగింపజేసిన సబ్సిడీల వంటి చర్యల ద్వారానే అమెరికా తన ఆహార ధరలను తగ్గించ గలిగింది." అని వ్రాసింది. పేరుకేమో స్వేచ్ఛా వాణిజ్యం ! లోపలంతా పెద్దన్నపాత్రలాగా బలహీన దేశాలపై షరతులు విధించడం !

డంకెల్ ప్రతిపాదనల ప్రభావం మనపై వుండదని మన్‌మోహన్ సింగ్ మాయజేయ జూస్తున్నాడు.

అది నిజంగా అమల్లోకి వచ్చేట్లయితే "వ్యవసాయ రంగానికి అభివృద్ధి చెందిన దేశాలు ఇచ్చే సబ్సిడీ 5%కు, అభివృద్ధి చెందుతున్న దేశాలు ఇచ్చే సబ్సిడీ 10%కు పరిమితం చేయాలి. వ్యవసాయ రంగంలోని అన్ని ఉత్పత్తులకు ఈ పరిమితి వర్తిస్తుంది." అన్న సూత్రం మనం అమలు పరచాలి.

ఇంతేగాదు - "ప్రకృతి వైపరీత్యాలు వచ్చి వ్యవసాయ రంగానికి నష్టం జరిగినపుడు చెల్లించే నష్ట పరిహారం రైతుకు వ్యవసాయంపై వచ్చే ఆదాయంలో 70%కు మించరాదు" అని కూడ చెప్పింది డంకెల్ డ్రాఫ్టు.

ఇలా మనం వ్యవసాయ రంగంలో వేసే ప్రతి అడుగు గాట్ (GATT) ద్వారా సామ్రాజ్యవాదులచే నిర్ణయించబడుతుందన్నమాట. ఒకప్పుడు అమెరికావే మనదేశంలో వ్యవసాయ సబ్సిడీలు ఎక్కువ ఇచ్చేట్లు చేసింది (హరిత విప్లవంలో). ఇపుడు ప్రపంచ మార్కెట్‌ను తాను ఆక్రమించాలి గనుక ఇతర దేశాల్లో సబ్సిడీలు తగ్గింపజేయడం ద్వారా ఆ దేశంలో పంట పండించడానికయ్యే ఖర్చు పెరిగి, ఆ పెరిగిన ధరలతో మార్కెట్‌లోకి వస్తే తన ధరలను అవి తట్టుకోలేనట్లుగా చేసుకోవాలన్నది అమెరికన్ వ్యూహం. సామ్రాజ్యవాద

దేశాలలో వ్యవసాయ సబ్సిడీలు జపాన్ 72%, అమెరికా 26%, యూరప్ దేశాలు 57%, సౌత్‌కొరియా 61%లు వుండగా మనదేశంలో ఇస్తున్న వ్యవసాయ సబ్సిడీ 2% మాత్రమే నంటే పరిస్థితినివూహించుకోవచ్చు.

అయితే సబ్సిడీలు సాగించడమా లేదా అన్నది ఆయాదేశ ప్రభుత్వాలకు, ప్రజలకు మధ్యన వున్న వ్యవహారం. మధ్యలో వాటిని ఎత్తెయ్యమని అడగటానికి సామ్రాజ్యవాదులకు ఈ హక్కు ఎవడిచ్చాడని మూడవ ప్రపంచదేశాల ప్రజలు నిలదియ్యాలి.

## పేటెంట్ హక్కులు

భారత పాలకవర్గాలు శాస్త్ర, సాంకేతిక రంగాలపై ఇప్పటికే పేటెంట్ హక్కును గుర్తిస్తున్నారు. అయితే ఇపుడు డంకెల్ ప్రతిపాదనలు అంతకన్నా విస్తృతమైన పేటెంట్ హక్కుల్ని కోరుతున్నారు. సామ్రాజ్యవాద దేశాల్లో వున్న చట్టాలన్నిటినీ అమలుపరచమని కోరుతున్నారు. ఇపుడున్న 1970 పేటెంట్ల చట్టం రసాయనిక పదార్థాలను వుత్పత్తి చేసే ప్రక్రియను (Process) మాత్రమే గుర్తిస్తుంది. డంకెల్ కోరే ప్రకారం వుత్పత్తిపై కూడ పేటెంట్ హక్కు వుండాలి. ఉదాహరణకు నొప్పులను తగ్గించే ఇబూప్రోఫెన్ (Ebuprofen) అనే మందు వుంది - ప్రస్తుతం మనదేశంలో కనీసం 10 పేరున్న కంపెనీలు ఇదే మందును తయారుచేస్తున్నాయి. ఏ కంపెనీకి ఆ కంపెనీ అదే మందును వేర్వేరు పద్ధతుల్లో తయారుచేస్తుంది. ఇపుడున్న చట్టం వుత్పత్తి చేసే పద్ధతిపై మాత్రమే హక్కు ఇస్తుంది. గనుక ఆ 10 కంపెనీలు రంగంలో వుండి పోటీవల్ల ధర తగ్గే అవకాశం కూడ వుంటుంది. అయితే డంకెల్ డ్రాఫ్టు ప్రకారం ఆ రసాయనం లేదా మార్కు పైనే పేటెంట్ (Product Patent) ఇవ్వాలి. దీనివల్ల ఒకే కంపెనీకి ఆ లైసెన్సు వచ్చి అదొకటే రంగంలో వుండగలుగుతుంది.

వ్యవసాయ రంగానికి వస్తే ఒక ఎరువు లేదా పురుగు మందును ప్రస్తుతం ఎన్ని కంపెనీలయినా వేర్వేరు పద్ధతుల్లో తయారుచేయవచ్చు. అయితే కొత్తచట్టం ప్రకారం ఏదో ఒక కంపెనీకే ఆ ప్రత్యేక వుత్పత్తిపై హక్కు వస్తుంది.

## జీవ సంబంధ పేటెంట్ హక్కులు

ప్రస్తుత చట్టం ప్రకారం వ్యవసాయం, జంతువులు, ఇతర జీవసంబంధ ప్రక్రియలకు పేటెంట్ హక్కులు వర్తించవు. అయితే డంకెల్ డ్రాఫ్టు ప్రకారం వీటన్నిటిపై హక్కులు గుర్తించాలి.

- దీనివల్ల మేలిమి జాతి మొక్కను మనదేశం నుండి తీసుకెళ్ళి అమెరికన్ కంపెనీ పేటెంట్ చేసుకుంటే ఇకదాన్ని మనం వేసుకోవాలంటే ఆ కంపెనీకి రాయల్టీలు అది కోరినట్లు చెల్లించాలి.

- మన రైతులు, శాస్త్రవేత్తలు మేలిమిరకం మొక్కను తమ కృషివల్ల తయారుచేసినప్పటికీ దాన్ని పేటెంట్ చేసుకోడంపై మనకు శ్రద్ధ, అవసరం కన్పించవు గనుక మనం మిన్నకుండి ఏ సామ్రాజ్యవాద దేశాల మేధావిగానీ లేక కంపెనీగానీ దాన్ని తామే కనిపెట్టామని పేటెంట్ చేస్తే మనం మన దేశంలో పండించుకోవాలంటే కూడ రాయల్టీలు చెల్లించుకోవాల్సిందే.

- సామ్రాజ్యవాద కంపెనీలు హైబ్రీడు రకాల విత్తనాలు, మొక్కలపై పేటెంట్ పొంది అవి ఎంత రేటు డిమాండ్ చేస్తే అంత మనం చెల్లించుకోవాల్సి వస్తుంది.

- ఎరువులు, పురుగు మందులు ఎక్కువగా వుపయోగిస్తే తప్పితే పంట పండని విత్తనాలను మాత్రమే కంపెనీలు మార్కెట్‌లోకి విడుదల చేసినప్పటికీ వాటిని కొనుక్కోక తప్పదు.

- ఒకవేళ ఏదేని మేధావి లేక కంపెనీ పంటపై పురుగు పట్టడానికి కారణమైన జీన్‌ను వేరుచేసి దాన్ని తొలగిస్తే - అంటే తెగుళ్ళు సోకకుండా చేసే జీన్‌ను పేటెంట్ చేసుకొని మరెవరూ దాన్ని వుపయోగించకూడదని నిషేధిస్తే పేటెంట్ చట్టం ప్రకారం మనమేమీ చెయ్యలేం.

- ఇపుడు నత్రజని స్వయంగా తయారుచేసుకొనే పప్పుధాన్యాల గింజల నుండి, ఆ వేరు బుడిపె కల్గించే జీన్ లక్షణాలను బయటికి తీసి వరి మొక్కకు కలిపి సంకరీకరిస్తే ఆ మొక్కను కూడ విస్తృతంగా వినియోగంలోకి రాకుండా నిలిపివేయగలరు - తద్వారా నైట్రోజన్ వంటి ఎరువు వెయ్యకుండానే వరి కూడా పండించగలిగినప్పటికీ పేటెంట్‌నుపయోగించి తమ ఎరువులమ్ముకోడానికి కంపెనీలు ఆ రకం మొక్కలు రంగంలోకి రాకుండా చేయవచ్చు.

- ఎరువులు, పురుగు మందులు వాడకుండానే ఎక్కువ పంట దిగుబడి నిచ్చే విత్తనాలు, మొక్కల రకాలను కనుక్కుంటే ఆ జీన్లకు సంబంధించిన విషయం రహస్యంగా దాయవచ్చు. విత్తన రంగంలో ఎరువు, పురుగు మందుల కంపెనీలదే రాజ్యం గనుక అవి రైతులకుపయోగపడే లక్షణాలు గల విత్తనాలు రంగం మీదకు వస్తే తన వ్యాపారం దెబ్బ తింటుంది గనుక అలాంటి జీన్‌పై పేటెంట్ హక్కు సాధించి దాన్ని ఉపయోగించడాన్ని నిషేధించవచ్చు. (పేటెంట్‌లో రాయల్టీ తీసుకుని వుపయోగించుకోడానికి అనుమతించడమేగాక ఇతరుల్ని వుపయోగించకుండా నిషేధించే హక్కు కూడ వుంది.)

- ఈ పేటెంట్ చట్టం ప్రకారం సూక్ష్మజీవులను కూడ పేటెంట్ చేసుకునే హక్కుంది. గతంలో వున్న చట్టాల ప్రకారం ఇప్పటికే వున్న జీవజాలాన్నిగానీ, లేక వుత్పత్తి ప్రక్రియలుగానీ సహజ సిద్ధంగా వున్నవేవీ పేటెంట్ చెయ్యడానికి వీల్లేదు. కొన్నపుడు దేన్నయినా పేటెంట్ చేసుకోవచ్చు. అందువల్ల బ్యాక్టీరియాను కూడ పేటెంట్ చేస్తున్నారు. ఉదాహరణకు గతంలో పందుల నుండి 'ఇన్సులిన్' (చక్కెర వ్యాధి మందు) తీసేవాళ్ళు. ఇపుడు ఒకరకం బ్యాక్టీరియా నుపయోగించి తీస్తున్నారు. ఇలాంటి బ్యాక్టీరియాను పేటెంట్ చేస్తున్నారు - అంటే ఆ బ్యాక్టీరియాను కనుగొన్న వాళ్ళకే ఆ మందుపై గుత్తాధిపత్యం వుంటుందన్నమాట. అలాగే వైద్యశాస్త్రంలో వేర్వేరు సూక్ష్మజీవుల నుపయోగించే ప్రక్రియలు కనుగొనడంతో ఈ పేటెంట్ హక్కులతో మందుల ధరలు ఆ పేటెంట్‌దారుల కంట్రోలులోకి వెళ్తాయి.

- బ్యాక్టీరియా ఉపయోగం గురించి ఇపుడు తీవ్రంగా చర్చ జరుగుతోంది. సముద్రంపై తేలుతున్న ఆయిల్ తెట్టులను తినే బ్యాక్టీరియాలను కనిపెట్టారు. అలాగే ప్లాస్టిక్ పదార్థాలను ప్రపంచంలో అనేక రూపాల్లో వాడడం పెరిగింది. అవి మామూలు పదార్థాలలాగా కుళ్ళక పోవడంతో వాటిని తినగలిగిన బ్యాక్టీరియాల కోసం చూస్తున్నారు. దీన్ని పేటెంట్ చేసుకుంటే ఎక్కడ దాన్ని వుపయోగించి ప్లాస్టిక్‌ను నాశనం చేయాలన్నా రాయల్టీ చెల్లించుకోవాల్సివస్తుంది.

- మనందరికీ తెలిసిన బయోటెక్నాలజీ వుంది - పాలు పెరుగుగా మారడం. ఇందులో పనిచేసే బ్యాక్టీరియా ఒకటుంది. దాన్ని కూడ ఎవరైనా పేటెంట్ చేసి మీ ఇండ్లలో పెరుగు చేసుకోవాలంటే నాకు రాయల్టీలు చెల్లించాలంటే కూడ మనం ఆశ్చర్యపోనక్కరలేదు.

- ఇపుడు మొక్కలపై రసాయనాలు తెగుళ్ళ నివారణ కోసం వాడుతున్నప్పటికీ పర్యావరణం దెబ్బ తింటుందని ఆందోళనలు రావడంతో మొక్కలపై పట్టే పురుగును, వైరస్‌లను తినగల బ్యాక్టీరియా కోసం వెతుకుతున్నారు - అలాంటివి కూడ పేటెంట్ అయితే అతిఖరీదవుతాయి.

అలాగే ఎరువు, పురుగు మందుల్ని కూడా బ్యాక్టీరియా, ఆల్గే వంటి సూక్ష్మజీవుల సాయంతో చేసే ప్రయత్నాలు సాగుతున్నాయి. ఇవికూడ పేటెంట్‌కు గురవుతాయి.

ఇలా వివరించుకుపోతే చాల అవుతాయి. మానవ శరీరం తప్ప మిగిలినవన్నీ (మొక్కలు, బ్యాక్టీరియాలు, ఎలుకలు వంటి జీవజాలాన్నంతా) పేటెంట్ చేయడానికి ఈ కొత్తచట్టం అనుమతిస్తుంది. మన వ్యవసాయ పద్ధతులను కూడ పేటెంట్ చేసి దాన్ని వుపయోగించుకోవాలంటే కూడ రాయల్టీ చెల్లించమని అడగవచ్చు.

## పేటెంట్ కాలం 20 సం॥ల పొడిగింపు

మనదేశంలో ఇపుడున్న చట్టం ప్రకారం 5,7 సం॥లు, కొన్నిటిపై 14 సం॥లకు మించి పేటెంట్‌పై హక్కు లేదు. ఆ తర్వాత దాన్ని ఎవరైనా వుపయోగించుకోవచ్చన్నమాట. ఇపుడొచ్చే కొత్త చట్టం ప్రకారం 20 సం॥ల పాటు పేటెంట్‌దారునికి దానిపై సంపూర్ణ హక్కు వుంటుంది.

మనదేశంలో విదేశాల్లో ఒకోసారి ఒకే అంశంపై పరిశోధనలు సాగుతుండవచ్చు. ఒక హైబ్రిడ్ మొక్కను రూపొందించే విషయమే తీసుకుందాం. అమెరికాలో కనుగొన్న కొత్తమొక్కనే మన శాస్త్రజ్ఞులు ఒక గంట ఆలశ్యంగా కనుగొన్నారనుకుందాం. ఒక 20 సం॥ల పాటు ఆ విజ్ఞానం మన దగ్గరున్నా వాడుకోడానికి వీల్లేదు. అమెరికాకు డబ్బు చెల్లించి కొనుక్కోవాల్సిందే.

అలాగే హైబ్రిడ్ కోళ్ళుగానీ, పాలిచ్చే పశువులుగానీ వేటి విషయమైనా అంతే. ఒకసారి కనుగొన్న తర్వాత ప్రపంచం మొత్తంమీద 20 సం॥లపాటు పేటెంట్ హక్కు అంటే ఎంత లాభాన్ని జమ చేసుకోవచ్చో వూహించలేం.

పైగా 20 సం॥ల పాటు ఒక పదార్థం లేదా ప్రక్రియపై గుత్త హక్కున్నవాడితో ఆ తర్వాత అది రద్దయితే మాత్రం కొత్తగా మార్కెట్‌లోకి వచ్చి ఎవరు పోటీ పడగలుగుతారు ? పేటెంట్‌లు అమలు జరుగుతున్న అనుభవాలను బట్టి చూస్తే అది వీలుపడదని నిర్ధారించుకోవచ్చు.

## పేటెంట్‌దారుడిపై ఏ షరతులూ పెట్టరాదు ! (కంపల్సరీ లైసెన్సింగ్ ఎత్తివేయాలి !)

గతంలో వున్న పేటెంట్ చట్టం ప్రకారం ఒక ప్రక్రియపై పేటెంట్ పొందిన వారు దాన్ని దేశంలో వుత్పత్తి చెయ్యడం ఆరంభించాలి. అందుకోసం లైసెన్సు తీసుకోవాలి. ఒకవేళ పేటెంట్ పొందిన తర్వాత 3 సం॥ల వరకు వుత్పత్తి ప్రారంభించకపోతే ఆటోమేటిక్‌గా ఆ పేటెంట్ రద్దు అవుతుంది. వేరేవాళ్ళకు పేటెంట్ మంజూరు చేయవచ్చు. ఇపుడు ఆ షరతును రద్దు చేయమంటోంది డంకెల్ డ్రాఫ్టు. దేశంలో అవసరానికి సరిపడా తయారు చెయ్యకుండా పేటెంట్‌దారుడు ఇబ్బంది పెడుతున్నా ఆ పేటెంట్ ప్రకారం వుత్పత్తికి మరొకరికి ప్రస్తుతం అవకాశం ఇవ్వవచ్చు. దాన్నికూడ రద్దు చెయ్యమంటున్నారు సామ్రాజ్యవాదులు. అలాగే పేటెంట్‌దారుణ్ని తన వుత్పత్తిలో కొంతభాగాన్ని ఎగుమతి చెయ్యాలని కూడ (విదేశీ మారకం కోసం లేక ఇంకేదైనా అవసరంరీత్యా) ప్రభుత్వం షరతు విధించడానికున్న అవకాశం కూడ ఇకపై రద్దు చేసుకోవాలంటోంది డంకెల్ డ్రాఫ్టు.

అంటే - ఏదేని హైబ్రిడ్ మొక్కను పేటెంట్ చేసి దాని విత్తనాలు తయారు చెయ్యకుండా ఆగితే ఆ కంపెనీ, లేదా ఆ పేటెంట్‌దారుడికి బదులుగా వేరొకరికి వాటిని తయారుచేసే లైసెన్సు, పేటెంట్ ఇచ్చే హక్కు కూడా ప్రభుత్వాలకుండదన్నమాట. అలాగే దేశానికి సరిపడే సంఖ్యలో ఆ పేటెంట్‌దారుడు సరఫరా చెయ్యకపోయినా ప్రభుత్వం అతనినేమీ అనడానికి వీలులేదు. సమాజ అవసరాలంటూ అతనిపై ఏ షరతులూ రుద్దరాదు.

## విదేశంలో వుత్పత్తి దేశంలో వుత్పత్తితో సమానమే

గతంలోని చట్టం ప్రకారం పేటెంట్‌దారుడు ఖచ్చితంగా మనదేశంలోనే వుత్పత్తిని ఆరంభించాలి. విదేశీ పేటెంట్‌దారులయినా దేశంలో వుత్పత్తిని ప్రారంభించాల్సి వచ్చేది. అందువల్ల మన ముడిసరుకు వాడబడేది. మన కార్మికులకు అంతోఇంతో పని దొరికేది. అయితే డంకెల్ డ్రాఫ్టు విదేశాల్లో తయారుచేసినా దేశంలో తయారుచేసిన దానికి సమానంగా పరిగణించాలన్న షరతు పెడుతోంది.

దానివల్ల పేటెంట్‌దారుడు ప్రపంచంలో ఏ మూలనయినా వుత్పత్తి చేసి మనదేశంలోకి తీసుకవచ్చే అవకాశం కలుగుతుంది. దాని వుత్పత్తి ద్వారా స్థానికంగా అంతోఇంతో దొరికే వుద్యోగాలు కూడ ఇకపై పోతాయి. అంటే పేటెంట్ చేసే గుత్తసంస్థలు తమ వుత్పత్తిని మనదేశంలో కన్నా చౌకగా శ్రమశక్తి దొరికేచోట చేసుకోవచ్చు. ఈ షరతు వల్ల గతంలో దేశానికి అంతోఇంతో వుపయోగకరంగా వుండే చిన్నపాటి షరతులు కూడ లేకుండా సామ్రాజ్యవాదులకు మంచి అవకాశాన్ని ఇచ్చినట్లవుతుంది.

- వ్యవసాయ రంగంలోని ఎరువులు, పురుగు మందులు, విత్తనాల వంటి వాటికి కూడ ఇదే వర్తిస్తుంది గనుక దేశంలోని ఈ ఫ్యాక్టరీలల్లో కొన్ని మూతబెట్టి విదేశాల నుండి దిగుమతి చేసే అవకాశం వస్తుందన్నమాట. అలాగే విత్తనాలు మనదేశంలో తయారైతే ఈ వాతావరణ పరిస్థితులను తట్టుకునేట్లుగా వుంటాయి. విదేశాల నుండి చీడపీడలను వ్యాపింపజేసే విత్తనాలను కూడ భారీమొత్తాల్లో దిగుమతి చేసుకోడానికి దీనిలో అవకాశం కలుగుతుంది. వాటిని ఆయుధంగా వుపయోగించి దేశంలోని పంటలను నాశనం చేయవచ్చుకూడ.

## నేరం ఆరోపిస్తే రుజువు చేసుకోవాల్సింది మనమే !

గత పేటెంట్ చట్టాల్లో లేని షరతును ఇపుడు ఇందులో చేర్చారు. పేటెంట్‌దారుడికి లాభాలు పిండుకునే హక్కేగాక వేధించే హక్కుకూడ ఇచ్చారు. ఈ చట్టం ప్రకారం పేటెంట్‌దారుడు తన ఉత్పత్తిని, లేదా దాన్ని పోలినదాన్ని తయారుచేస్తున్నాడని మనపై ఆరోపిస్తే ఆ చట్టాన్ని వుల్లంఘించలేదని రుజువు చేసుకోవలసింది మనమే. పోలినదాన్ని లేదా దానికి దగ్గర పోలికలున్న వుత్పత్తిని చెయ్యడం గతంలో పేటెంట్ ఆక్రమణగా చూడబడేదిగాదు.

ఇపుడు చట్టం ప్రకారం గుత్తకంపెనీలు తమ చేతికి ఏ మట్టీకాకుండానే చిన్న కంపెనీలపై పేటెంట్‌ను అతిక్రమిస్తున్నారంటూ ఆరోపణలు చెయ్యవచ్చు. ఋజువు చేసుకోవలసింది ముద్దాయే గనుక కోర్టు ఖర్చులన్నీ పెట్టుకొని తిరగాల్సింది చిన్న కంపెనీయే. అమెరికా దేశపు కంపెనీలు అక్కడ కేసు వేస్తే అక్కడకు మనమే వెళ్ళి వాదించుకోవాలి. ఆ ఖర్చులు భరించలేనంత వుంటాయి. అందువల్ల గుత్త కంపెనీలు దీన్ని ఆయుధంగా తీసుకొని చిన్న కంపెనీలను బెదిరించి తన పాదాక్రాంతం చేసుకోవచ్చు. ఇలాంటి అనుభవాలు అపుడే మొదలయ్యాయి కూడ. హైదరాబాద్‌లోని రెడ్డి అండ్ రెడ్డి లాబొరేటరీస్ అనే సంస్థ జర్మన్ కంపెనీ నుండి ఇలాంటి బెదిరింపులనే ఎదుర్కొంటోంది.

- వ్యవసాయ రంగానికొస్తే కంపెనీ పేటెంట్ చేసిన విత్తనాలను రైతు ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం కనుక్కోవాలన్న పద్ధతిలో రూపొందిస్తున్నారు. ఒకవేళ రైతు కంపెనీ వద్ద కొనకుండా తన స్వంత చేలో పండించుకున్నా లేక పొరుగువానికి మారకం చేసుకున్నా, అయ్మినా ఈ చట్టం క్రింద నేరస్తుడవుతాడు. ఇలా కంపెనీకి హక్కు వున్న విత్తనాల్ని రైతు పేటెంట్ చట్టాన్ని వుల్లంఘిస్తున్నాడు గనుక అతనిపై చర్య తీసుకొనేలా యంత్రాంగాన్ని కూడ రూపొందించమని కోరుతోంది డంకెల్ డ్రాఫ్టు. అంటే మన పోలీసులే మన రైతులపై పేటెంట్ చట్టాన్ని వుల్లంఘించి విత్తనాలు తయారుచేసుకొన్నారని కేసుపెట్టి అరెస్టు చెయ్యాలన్నమాట. ఇంతకంటె నైచ్యం ఏముంటుంది ?

## విపరీతంగా పెరగనున్న మందుల ధరలు

మనదేశంలోని మందుల కంపెనీలు ఇప్పటికే అత్యధిక లాభాలను గుంజుతున్నాయి. వాటి వైద్య విలువలకన్నా విస్తృతంగా ప్రచారం చేయడం డాక్టర్లకు లంచాలివ్వడం లేదా పారితోషికాలివ్వడం ద్వారా తమ అమ్మకాలను పెంచుకుంటున్నాయి.

ఇపుడు రాబోయే పేటెంట్ చట్టం వీటికి మరింత బలాన్ని, వుత్సాహాన్ని ఇస్తుంది. బడా కంపెనీలు అందునా విదేశీ కంపెనీల వ్యాపారం విస్తృతంగా పెరుగుతుంది. స్థానిక చిన్న కంపెనీలు నష్టాలతో మూసివేసుకోవాల్సి వస్తుంది. పేటెంట్ గుత్తకు రావడంవల్ల ఇపుడున్న మందుల ధరలు ఆకాశాన్నంటుతాయి. అందునా అత్యవసర మందుల ధరలను కృత్రిమ కొరత సృష్టించి కూడ పెంచవచ్చు. కొత్తగా కనిపెట్టే కాన్సరు, ఎయిడ్స్ వంటి వ్యాధుల మందుల ధరలు మరింతగా పెరుగుతాయి. మందుల ధరలు ప్రస్తుతం అమెరికావంటి సంపన్నదేశాలకు మనకు మధ్య చాల తేడా వుండి దేశంలో తక్కువ ధరకు దొరికేవి కూడ అమెరికా స్థాయికి చేరుతాయి. (కొనుక్కోగలిగినవాడే బతకాలి అన్నది పెట్టుబడిదారీ సిద్ధాంతం గనుక). అంతేకాదు - మందులపై సామ్రాజ్యవాద గుత్తకంపెనీలకే పేటెంట్లు వున్నాయి గనుక మూడవ ప్రపంచ దేశాలను లొంగదీసుకోవడానికి రాజకీయ ఆయుధంగా వుపయోగించుకుని సప్లైలు ఆపేస్తామని బెదిరిస్తాయి కూడ.

## పేటెంట్ హక్కుల భావనే సమాజాభివృద్ధికి భిన్నమైంది

మానవ సమాజంలో మొదటినుండీ పేటెంట్ హక్కులు వుండి వుంటే ఇంతదూరం కూడ ప్రయాణం చేసి వుండేది కాదనేది నిస్సందేహం. ప్రపంచంలో మౌలికంగా అన్ని విజ్ఞాన శాస్త్రాలలోను కనిపెట్టిన విషయాలను పాతతరాలు వ్యక్తిగత స్వార్థంగా చూసుకోలేదు. సమాజ ప్రగతిలో భాగంగానే పరిగణించారు. స్వేచ్ఛగా సమాజం వుపయోగించుకోడానికి అనుమతించారు.

ఈ నాడు ఎలక్ట్రానిక్స్ మీద, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్‌ల మీద వందలు, వేలకోట్ల రూ॥ ఆర్జించజూస్తున్న సామ్రాజ్యవాద దేశాలు తమతమ దేశాల్లోని రోమన్ అంకెలనే వాడుతుంటే వీటిని రూపొందించ గలిగే వాళ్ళా? (రోమన్ సంఖ్యలో ప్రతి అంకె వేరుగా వెయ్యాల్సిందే. సంఖ్య పెరిగే కొద్దీ అంకెల పొడవు పెరిగి పోతుంది. కంప్యూటర్లలలో ఈ పద్ధతి వాడటం కష్టతరమైన విషయం) భారతదేశంలో కనుగొన్న సున్న వుండబట్టే గదా కుదించడం జరిగింది? దాని ఆధారమే గదా కాలిక్యులేటర్ల నుండి కంప్యూటర్ల వరకు వాడుతున్న పద్ధతి?

న్యూటన్ భూమ్యాకర్షణ సూత్రము, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతము, కెప్లర్ గ్రహగమన సిద్ధాంతము, రూధర్‌ఫర్డ్ కనుగొన్న పరమాణు సిద్ధాంతము, ఫారడే కనుగొన్న విద్యుత్తు,

గ్రాహంబెల్ కనుగొన్న టెలిఫోను, రైట్ సోదరులు కనుగొన్న విమానం ఇలాంటివెన్నో కలిపితేనే గదా ఆధునిక మానవవిజ్ఞానం ఎదిగింది? వృక్ష శాస్త్రం కూడ మెండెలే మొక్కల వర్గీకరణ కనుగొన్న తర్వాతే గదా ఎదిగింది? వీళ్ళందరికీ మానవ సమాజం ఏమిచ్చింది? ఇపుడు గుత్త కంపెనీలు కనిపెట్టే శాస్త్ర విజ్ఞానమంతా వాళ్ళు రూపొందించిన సిద్ధాంతాలు లేకుండానే రూపొందాయా? వాళ్ళకు ఈ గుత్త కంపెనీలు ఏ రాయల్టీలు చెల్లించి విజ్ఞానాన్ని కొనుక్కున్నారు?

అంతగా ఎందుకు ఇపుడు బయోటెక్నాలజీ, జెనిటికల్ ఇంజనీరింగ్‌ల ప్రకారం మొక్కలపై చేసే పరిశోధనకంతమూలం ఏ మొక్కలు? ఏ జీన్లు? మనలాంటి పేదదేశాల్లో తరాల తరబడి రైతాంగం అభివృద్ధి చేసిన మేలురకం మొక్కలుగాదా? సామ్రాజ్య వాద దేశాల్లోవున్న జన్యుసంపదంతా పేదదేశాలది గాదా ? పైసా మూల్యం చెల్లించ కుండా మన విజ్ఞానాన్నంతా దోచుకెళ్ళి దాన్ని అటూ ఇటూ కొంత మార్పు లేక అసలు మార్చకుండానే పేటెంట్ చేసుకుని మనల్నేమళ్ళీ పెద్ద మొత్తాల్లో డబ్బు రాయల్టీగా అడుగుతారా? ఎంత ఆధునిక బందిపోటీ సామ్రాజ్య వాదులు?

పైగా విజ్ఞాన శాస్త్ర పురోగమనం కోసం కూడా పేటెంట్ చేసిన వాటిని పరిశోధన కోసం వాడగూడదట! అలాంటి నిషేధమే ఇంతకుముందు విధిస్తే వీడికా హక్కులు ఎక్కడి నుండి వచ్చేవో? రాజకీయ ఆర్థిక అధికారం వుందిగ అని విజ్ఞాన శాస్త్రాన్ని కూడ తమ చేతుల్లోకి తీసుకుని మానవ సమాజ పురోగమనానికి అడ్డం పడడం తప్ప ఇది వేరేమవుతుంది?

కనుగొనే వాళ్ళకు (Inventors) ప్రోత్సాహకాలు లేగానీ కనిపెట్టడంలో శ్రద్ధ చూపెట్టరనడం మోసం. విజ్ఞాన శాస్త్రపు ఎదుగుదలంతా మానవుని జిజ్ఞాస నుండే పెరిగింది. సమాజంలోని కీలక విజ్ఞానాన్ని కనిపెట్టింది బడా కంపెనీల యజమానులూ గారు! పడక కుర్చీ మేధావులూ గాదు. ఆచరణాత్మక జ్ఞానంలో ఫీల్డు మీద వున్న వాళ్ళే విజ్ఞాన శాస్త్ర ఆవిష్కరణలూ, కొత్త యంత్రాలూ రూపొందించగలిగారు. మానవ పరిణామ సిద్ధాంతం కనుక్కొన్న డార్విన్ దాన్ని ఎలా ప్రతిపాదించగలిగాడు? జేమ్స్‌వాట్ ఆవిరి యంత్రాన్ని, రైట్ సోదరులు విమానాన్నీ ఏ ప్రయోగశాలలో రూపొందించారు? ఇలాంటి వుదాహరణలు కోకొల్లలు.

అలాగని ప్రయోగశాలల్ని కించపరచడం కాదు. ప్రయోగశాలల్లో జరగాల్సిన కృషికి పునాది అయిన విషయాల్ని మరచిపోయి, ఆమెట్లపై మనమున్నామన్న స్పృహలేకుండా ఇపుడు కనుగొన్నదే విజ్ఞానం గనుక ఇది మా గుత్త సొమ్మంటే ఎలా సమంజసమవుతుంది? ప్రయోగశాలలకు పరిమితుల్ని మరచిపోవడం గాక ఏమవుతుంది?

లాభార్జనకు వనరుగా తరాల తరబడి మానవజాతి అభివృద్ధి చేసిన విజ్ఞానాన్ని వినియోగించ జూడడం దుర్మార్గం. పెట్టుబడిదారీ వ్యవస్థ వికృత స్వభావం ఇక్కడ కూడ మనకు కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. లాభాపేక్ష తప్ప ఏ మానవ విలువలు (Human Values) లేని ఈ వ్యవస్థ దుర్మార్గమే సైన్సును కూడ తన క్రూరమైన లక్ష్యం కోసం (డబ్బు, రాజకీయ అధికారం) పరిమితం చేస్తుంది. సైన్సు మానవ సమాజానికి చేయాల్సిన సేవను అడ్డు కుంటోంది. మానవులను అత్యవసరమైన మందులను కూడ మనుషుల్ని బ్రతికించడం కోసం గాక తన లాభమే ప్రధానమనుకుంటోంది. మనిషి కడుపు నింపే గంజి గరువు గకాయ గట్రాలపై కూడ పేటెంట్‌లు కోరుతూ స్వేచ్ఛగా పంటలు పండించుకో కుండా అడ్డుకుంటోంది.

అందుకే ఈ పేటెంట్ అన్న ఆలోచనే మానవ సమాజానికి భిన్నమైంది. సమాజ ప్రగతికి తీవ్రమైన అవరోధం. విజ్ఞాన-శాస్త్రంపై సమాజపు మొత్తం కంట్రోలు, సమాజ సంక్షేమం లక్ష్యంగా వుండాలి తప్ప వ్యక్తుల లాభాపేక్ష కారాదు. అలాంటి పద్ధతికోసం, సామాజిక ప్రయోజనానికి సైన్సును వుపయోగ పెట్టే, అందులో భాగంగా చూసే సోషలిస్టు వ్యవస్థే నిజానికి సైన్సును మానవ ప్రగతికోసం వినియోగపెడుతుంది. సైన్సుపై పేటెంట్ హక్కులు తొలగాలంటే, దానిపై సమాజ కంట్రోలు వుంచే వ్యవస్థ కోసం పోరాడాలి, అపుడు మాత్రమే సైన్సు నిజమైన మానవ ప్రగతికి వుపయోగపడుతుంది. స్వేచ్ఛగా అభివృద్ధి చెందగలుగుతుంది.

## పెరగనున్న ఫుడ్ ప్రాసెసింగ్ పరిశ్రమ : దూరంకానున్న పండ్లు, కూరగాయలు

సంపన్నుల విలాసాలను తీర్చడంలో భాగంగా ఫుడ్ ప్రాసెసింగ్ పరిశ్రమ విస్తరిస్తోంది. వ్యవసాయ వృత్పత్తులను నిల్వ వుంచి రవాణా చేసే పద్ధతులు పెంచడం - వ్యవసాయోత్పత్తుల నుండి ఆహార పదార్ధాలు తయారుచేయడం (బిస్కట్లు,జామ్, సాస్, చిప్సు, సేమ్యాలు వగైరా) రోజురోజుకు విస్తరిస్తోంది. ఈ రంగంలోకి ఇప్పటికే బహుళజాతి కంపెనీలు ప్రవేశించి తమ వ్యాపారాన్ని విస్తరింపజేసుకొంటున్నాయి. వేళ్ళపై లెక్కించదగ్గ కంపెనీలు ఈ రంగంలో మనదేశమంతా మార్కెటును సంపాదించాయి. బ్రూక్‌బాండ్, లిప్టన్, డంకన్ కంపెనీలు టీ పొడి వ్యాపారంలోను, నెస్లె కంపెనీ పాల వుత్పత్తులు, అప్పటికపుడు పాలలో కలిపే కాఫీపొడి (నెస్ కాఫీ) రంగాల్లోను, కాడ్‌బరి కంపెనీ ఐస్‌క్రీమ్, చాకొలెట్లు, కోకోవా పానీయాలలోను, బ్రిటానియా కంపెనీ బిస్కట్ల వ్యాపారంలోను మార్కెట్‌ను సంపాదించుకుని వున్నాయి.

పళ్ళు, కూరగాయల ప్రాసెసింగ్, తాజా ఆహార పదార్ధాలు, కూరగాయలు, వంటనూనెలు, ఉప్పు, సోయా, పుట్టగొడుగులు, బేకరీ వుత్పత్తులు, ఫాస్ట్‌ఫుడ్స్, శుద్ధిచేసిన చేపలు, మాంసం, కోళ్ళ పరిశ్రమ వుత్పత్తుల వంటివన్నీ ఫుడ్ ప్రాసెసింగ్ పరిశ్రమ జాబితాలోకి వస్తాయి. గుత్త కంపెనీల కళ్ళు ఈ రంగంపై పడ్డాయి. పెప్సీ కంపెనీ టమోటా జూస్‌ను, బంగాళాదుంపల చిప్సును తయారుచేసే ఫ్యాక్టరీ పెట్టడం, కార్గిల్ కంపెనీ కాండ్లా రేవు వద్ద వుప్పు పరిశ్రమ పెట్టజూడటం, హిందూస్తాన్ లీవర్ కంపెనీ ఉల్లిగడ్డల ప్రాసెసింగ్ యూనిట్ పెట్టడం, ఐ.టి.సి. కంపెనీ రొయ్యల ఎగుమతి రంగంలోకి దిగడం దీనికి కొన్ని వుదాహరణలు మాత్రమే.

గుత్త కంపెనీలు తమ అవసరాల కోసం ప్రభుత్వంచే పాలసీలు చేపించడం ఈ రంగంలో కూడ చూస్తాం. వాటి అవసరాల కోసం కూరగాయలు, పండ్ల తోటలు పెంపకం కోసం (హార్టికల్చర్‌కు) 7వ ప్రణాళికా కాలంలో 25 కోట్ల రూ॥లు కేటాయిస్తే 8వ ప్రణాళికలో దాన్ని 1000 కోట్ల రూ॥ల కు పెంచారు. అంటే ప్రభుత్వం రైతులకు ప్రోత్సాహకాలిచ్చి పండింపజేస్తే వాటిని బహుళజాతి గుత్తకంపెనీలు కొని తమ లాభాలు పెంచుకొంటాయి. అందుకోసం ప్రపంచ బ్యాంకు రొయ్యల కోసం అప్పిచ్చినట్లే ఇస్తుందన్నమాట. ఇటీవలి కాలంలో మన రాష్ట్రంలో ఈ పండ్ల తోటల పెంపకం పెరగడం ఇందులో భాగమే. దీంతో గతంలో చౌకగా దొరికిన మామిడి, జామ, ద్రాక్ష వంటి పండ్లను కూడ సామాన్యులు కొనలేని స్థాయికి పెంచేశారు. ఇపుడు ప్రభుత్వం శీతలీకరణ యూనిట్లకు, గోడౌన్లకు, వీటిని విదేశాలకు ఎగుమతి చేయడానికి గుత్త కంపెనీలను ప్రోత్సహిస్తోంది.

దీంతో ఇక సామాన్యులు కూరగాయల, పండ్ల రుచులను ఊహించుకోవాల్సిందే తప్ప తినలేరు. మనదేశంలోని సంపన్న వర్గాలు, విదేశాల్లోని సంపన్న వర్గాలు మాత్రమే రకరకాల

రుచులతో వాటిని తినగలుగుతారు. ఇప్పటికే ప్రజలకు దూరం చేయబడిన పాలు, పెరుగు, చేపలు, రొయ్యల సరసన పండ్లు, కూరగాయలు కూడ దాదాపు కలిసినట్లే.

డంకెల్ డ్రాఫ్టు లక్ష్యాల్లో అగ్రిబిజినెస్ (వ్యవసాయ సంబంధిత వ్యాపారం) పెంచడం ఒకటి - దాని పర్యవసానం ఇదన్నమాట.

## బహుళజాతి గుత్త కంపెనీలకు అనుబంధమై, అంతం కానున్న మనశాస్త్ర పరిశోధనలు

పేటెంట్ హక్కుల వల్ల, మన విలువైన జన్యు సంపదంతా సామ్రాజ్యవాదుల జీన్‌బ్యాంకుల్లో పోగుపడడం వల్లా ఇప్పటికే అంతంత మాత్రం కానున్న మనశాస్త్ర, సాంకేతిక పరిశోధనలు అంతం కానున్నాయి. బహుళజాతి కంపెనీలకు తోకలు కానున్నాయి.

ఐ.యం.ఎఫ్., ప్రపంచ బ్యాంకుల వత్తిడిల మేరకు అనుసరించబడుతున్న విధానాల్లో భాగంగా ఇప్పటికే విద్యకు, శాస్త్ర సాంకేతిక పరిశోధనలకు ప్రభుత్వం ఇచ్చే నిధులు కత్తిరించివేశారు. ఉన్నతస్థాయి విద్యాసంస్థలు స్వయం పోషకం కావాలన్న పేరిట ట్యూషన్ ఫీజులు, పరీక్ష ఫీజులు వగైరా ఒక్కసారిగా పెంచివేశారు. (మన రాష్ట్రంలో ఈ సం॥ ఇంజనీరింగ్, పాలిటెక్నిక్, మెడికల్ విద్యార్థుల ఫీజులను హఠాత్తుగా పెంచడం దీని ఫలితమే). మరోవైపు డబ్బు రాబట్టడం పేరిట విదేశాల్లో నివశిస్తున్న భారతీయుల (NRI) బిడ్డలకు సీట్లిచ్చి డబ్బు వసూలు చేసుకోడాన్ని ముమ్మరం చేస్తున్నారు. మామూలు ఉన్నత విద్యాలయాలు, విశ్వవిద్యాలయాల స్థానంలో పెరుగుతున్న ఓపెన్ యూనివర్శిటీలు కూడ ప్రభుత్వ ఖర్చులు, బాధ్యతను తగ్గించుకోవడంలో భాగమే. యూనివర్శిటీలకిచ్చే గ్రాంట్లన్నీ ఇప్పటికే దిగకోసివేశారు.

శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఇప్పటికే వున్న పరాధీనత మరింత పెరిగి పునాదిరంగ (Basic Research) పరిశోధనను పూర్తిగా ఎత్తివేసుకుని అన్వయింపులపై (Applied Research) పరిశోధన నెలకొల్పుకొనే పేరిట బహుళజాతి గుత్తసంస్థల ఆధిపత్యంలోకి మన పరిశోధనా కేంద్రాలు వెళ్తున్నాయి. శాస్త్ర, సాంకేతిక విషయాల సలహా మండలి (CSIR) డైరెక్టర్ జనరల్ ప్రకటన ప్రకారం మన శాస్త్ర సాంకేతిక విషయాల పరిపాలక మరియు విధాన నిర్ణాయక కమిటీల్లోను (Governing and policy making bodies) 50 శాతం ప్రైవేటు రంగ కార్పొరేషన్ల అంటే బహుళజాతి గుత్త కంపెనీల ప్రతినిధులు తీసుకోబడతారు.

ఇక ఏం జరుగుతుందో మనం ఊహించడం కష్టమేం కాదు. 'జాతీయ అవసరాల కోసం' పరిశోధన అనేది మాటల్లో కూడ వుండదు. పూర్తిగా గుత్తకంపెనీలే ఏ పరిశోధనా ప్రాజెక్టుల చేపట్టాలో చెప్తాయి. వాటి పరిశోధన సంస్థలకు మన కేంద్ర పరిశోధనా సంస్థలు ఒకరకంగా బ్రాంచీలులాగా మారిపోతాయి. వాటి పేటెంట్ హక్కుల ప్రయోజనాల కనుగుణంగా మన శాస్త్ర సాంకేతిక పరిశోధనంతా రూపుదిద్దుకుంటుంది. మరోవైపు సి.యస్.ఐ.ఆర్.ను పరిశ్రమలాగా చేయాలని నిర్ణయించారు. ఈ రంగానికి ఇచ్చే నిధులను ప్రస్తుతం వచ్చే సంవత్సరానికి 50 శాతం కత్తిరించి క్రమక్రమంగా 1997 నాటికి ప్రభుత్వ బడ్జెట్‌లో ఏ కేటాయింపులు లేకుండా చేయాలని నిర్ణయించారు. వాటి స్వంత కాళ్ళపై అవి నిలబడాలన్న పేరుతో పరిశ్రమలకు అనుబంధం చేస్తారు. చివరకు వీటి గ్రంథాలయాలకిచ్చే నిధులుండవు గనుక శాస్త్రవేత్తలకు నూతన విజ్ఞానం కూడ అందించబడదు. శాస్త్రవేత్తలు తమకు ఇష్టం వచ్చిన రంగంలో పరిశోధన చేపట్టడంగాక గుత్తకంపెనీలకు ఆసక్తి వున్న ప్రాజెక్టులను చేపట్టాల్సి రావడంతో శాస్త్రవేత్తలు దానికి తట్టుకోలేక ఇళ్ళకు వెళ్ళాల్సి వస్తుంది. ఇదొక కొత్తరకమైన రిట్రెంచ్‌మెంట్ రూపం (రిట్రెంచ్‌మెంట్ అంటే కార్మికులను ఉద్యోగాల నుండి తొలగించడం).

రిచారియా కాలంలో పేరుకైనా 'జాతీయ' పరిశోధన వుంటే ఇపుడిక పేరుకు కూడ వుండదన్నమాట. గ్లోబలైజేషన్‌లో ఇదీ భాగంగా సాగి శాస్త్ర సాంకేతిక పరిశోధనంతా బహుళజాతి గుత్తకంపెనీలే గుత్తకు తీసుకుని వేలాది శాస్త్రవేత్తలను వీధుల్లోకి నెడతాయి. ఇప్పటికే ఉన్నత విద్యాలయాల్లో, శాస్త్ర సాంకేతిక సంస్థల్లో వేధింపులకు గురై ఆత్మహత్యలకు పూనుకునే మేధావుల సంఖ్య పెరుగుతుంది. రీసర్చి విద్యార్థులకిచ్చే స్కాలర్‌షిప్పులు - పారితోషికాలు కత్తిరించబడి సంపన్నుల బిడ్డలకు మాత్రమే పి.హెచ్.డి.ల యోగ్యత పరిమితమవుతుంది.

ఇప్పటికే ఈ చర్యలన్నీ ఆచరణ రూపం తీసుకోవడం మొదలై వేగం పుంజుకుంటున్నాయి.

## స్వేచ్ఛాయుత ఆర్థిక పోటీ నాటకం – ఎగుమతుల ద్వారా లాభాలు బూటకం

డంకెల్ ప్రతిపాదనల వల్ల మార్కెట్ అంతర్జాతీయకరణ (గ్లోబలైజేషన్) జరగడం వల్ల మనదేశం వ్యవసాయ ఉత్పత్తులను ఎగుమతి చేయవచ్చునని, తద్వారా మనకు అవసరమైన వస్తువులను దిగుమతి చేసుకోవచ్చని, 'లాభాలు ఆర్జించవచ్చునని ప్రభుత్వం చెబుతోంది. పి.వి.నరసింహారావు, ప్రణబ్ ముఖర్జీ, మన్‌మోహన్‌సింగ్‌లు పత్రికల్లో వస్తున్న విమర్శలకు డంకెల్ ప్రతిపాదనలను సమర్ధనగా చెబుతున్న ఏకైక వాదన ఇదే. రైతు నాయకుణ్ణని చెప్పుకొంటున్న భూస్వామ్యవర్గ మేధావి శరద్‌జోషి డంకెల్ ప్రతిపాదనలను బలపరుస్తూ ఏకంగా ఢిల్లీలో ప్రదర్శన జరిపించాడు. వీళ్ళ వాదనలలోకి వెళ్ళబోయేముందు వ్యవసాయరంగంలో వుత్పత్తి పరిస్థితి ఎలావుందో చూద్దాం. **(పట్టిక ప్రక్క పేజీలో)**

పైన చూపిన పట్టిక మొత్తం వుత్పత్తవుతున్న వివరాలను చెబుతుంది. ఇందులో మళ్లీ విదేశాలకు ఎగుమతులున్నాయి.

ఒక వేళ దేశంలో పండేవన్నీ ఇక్కడే మన ప్రజలకు వినియోగిస్తారని అనుకొంటే మనదేశంలోని 84 కోట్లమంది జనాభాకు, తలకు ఎంత లభించటానికి అవకాశం వుందో క్రింది పట్టికలో చూడవచ్చు. అలాగే వైద్యుల లెక్కల ప్రకారం ఆరోగ్యంగా జీవించే సగటు భారతీయునికి ఎంత ఆహార పదార్థం కావాలో కూడా పోల్చిచూడండి.

### తలసరిన లభిస్తున్న ఆహారపదార్థాలు

| పదార్థం | సగటున రోజుకు ఎంత లభ్యం | ఆరోగ్యంగా వుండాలంటే ఎంత అవసరం |
|---|---|---|
| కాయధాన్యాలు | 443.0 గ్రా | 600 గ్రా |
| పప్పు దినుసులు (మాంసకృత్తులు) | 36.5 గ్రా | 60 గ్రా |
| కూరగాయలు | 135 గ్రా | 285 గ్రా |
| పంచదార | 6 గ్రా | 50 గ్రా |
| నూనె పదార్థాలు | 25 గ్రా | 60 గ్రా |
| పాలు | 6 గ్రా | 200 గ్రా |
| గుడ్లు | నెలకు 2 | వారానికి 4 (కనీసం) |

## దేశంలోని వివిధ పంటల, ఆహార పదార్థాల మొత్తం వుత్పత్తి

| అంశం | కొలమానం | 1950–51 | 1980–81 | 1990–91 | 1991–92 | 1992–93 | 1993–94 |
|---|---|---|---|---|---|---|---|
| ఆహారధాన్యాలు | కోట్ల టన్నులు | 5.0 | 12.9 | 17.6 | 16.7 | 18.0 | 18.8 |
| వరి | కోట్ల టన్నులు | 0.6 | 3.6 | 5.5 | 7.3 | 7.1 | 7.8 |
| గోధుమ | కోట్ల టన్నులు | 2.0 | 5.3 | 7.4 | 5.5 | 5.6 | 5.8 |
| ముతకధాన్యాలు | కోట్ల టన్నులు | 1.5 | 2.9 | 3.2 | 2.6 | 3.6 | 3,6 |
| పప్పుధాన్యాలు | కోట్ల టన్నులు | 0.8 | 1.0 | 1.4 | 1.2 | 1.4 | 1.5 |
| నూనెగింజలు | కోట్ల టన్నులు | 0.5 | 0.9 | 1.8 | 1.8 | 2.1 | 2.1 |
| చెరుకు | కోట్ల టన్నులు | 5.7 | 15.4 | 24.1 | 24.9 | 23.9 | 24.5 |
| పత్తి (బేలు 170కి.గ్రా) | కోట్లబేళ్ళు | 0.3 | 0.7 | 0.9 | 0.9 | 1.1 | 1.2 |
| జనపనార (బేలు 180కి.గ్రా) | కోట్లబేళ్ళు | 0.3 | 0.8 | 0.9 | 1.0 | 0.7 | 0.9 |
| పాలు | కోట్ల టన్నులు | 1.7 | 3.1 | 5.3 | 5.7 | 5.8 | 6.3 |
| గుడ్లు | కోట్లలో (సంఖ్య) | 183.2 | 1006 | 2105 | 2280 | 2310 | 2500 |
| ఉన్ని | కోట్ల కి.గ్రా | 2.7 | 3.2 | 4.2 | 4.3 | 4.3 | 4.8 |
| తేయాకు | లక్షల టన్నులు | 2.7 | 5.7 | 7.1 | 7.4 | 7.6 | 8.0 |
| కాఫీ | లక్షల టన్నులు | 0.24 | 1.18 | 1.73 | 1.8 | 1.8 | 1.9 |
| రబ్బరు | లక్షల టన్నులు | 0.14 | 1.53 | 3.30 | 3.1 | 4.0 | 4.4 |
| చేపలు | లక్షల టన్నులు | 7.5 | 24.0 | 38.3 | 41.5 | 43.0 | 45.0 |



మూలం : యోజన, ఆగస్టు, '93.

అయితే ఇక్కడే గుర్తుంచు కోవలసిందేమంటే ఇవి సగటు లెక్కలు. దేశంలో అసలు తిండే లేని వాళ్లకు, కోటీశ్వరులకు కలిపి వేసిన లెక్కలు. ప్రజలకు అందుబాటులో వుండే ఆహార విలువలలో తీవ్రమైన అంతరాలున్నాయి. ఒక సర్వే ప్రకారం మూడవ ప్రపంచదేశాల్లో ధనికుడు రోజుకు 4290 కెలోరీలు శక్తి నిచ్చే ఆహారం తింటుండగా బీదవాడు 940 కెలోరీలు శక్తి నిచ్చే ఆహారం మాత్రమే సగటున తింటున్నాడు. మనిషికి సగటున ఆరోగ్యంగా జీవించాలంటే 2400 కెలోరీలు శక్తి కావాలి. మనదేశంలో సగటున లభిస్తున్నది 1500 కెలోరీలు మాత్రమే.

ఇపుడు పాలకుల పాలసీల్లోకి వద్దాం.

1980 వరకు దేశంలో సాగునీటి పారుదల పథకాలకోసం 10వేల కోట్ల రూ॥ ఖర్చు పెడితే ఆహారధాన్యాల దిగుమతికి 20 వేలకోట్ల రూ॥ ఖర్చుపెట్టారు. 1976 నుండి 86 వరకు 10 సం॥కాలంలో నూనె గింజలు, అవసరాల దిగుమతి కోసం 7000 కోట్ల రూ॥ ఖర్చుపెట్టారు. అంటే ఇది సం॥కి 700 నుండి 900 కోట్ల రూ॥ వుంది. ఇటీవలి కాలం వరకు మనదేశంనుండి సాగుతున్న ఎగుమతుల్లో తేయాకు, కాఫీ, పొగాకు, సుగంధద్రవ్యాలు, జీడిపప్పు, పంచదార, ముడి పత్తి వంటివే ప్రధానం. అయితే ప్రభుత్వం 1991 - 92 నుండి తీసుకున్న మార్పు కారణంగా వ్యవసాయక వుత్పత్తుల ఎగుమతుల పెరిగాయి. 1991 - 92 లో 6200 కోట్ల రూ॥ ఎగుమతులుండగా 1992 - 93 లో 7600 కోట్ల రూ॥ విలువ చేసే ఉత్పత్తులు ఎగుమతి అయ్యాయి.

## వ్యవసాయ, తోటలు, సముద్రపు వుత్పత్తుల ఎగుమతులు

(విలువ : కోట్ల రూ॥లలో)

| ఉత్పత్తులు | 1987-88 | 1988-89 | 1989-90 | 1990-91 | 1991-92 |
|---|---|---|---|---|---|
| తేయాకు | 601 | 609 | 917 | 1070 | 1132 |
| కాఫీ | 262 | 294 | 347 | 252 | 310 |
| పైరెండింటి మొత్తం 1&2 | 863 | 903 | 1264 | 1322 | 1442 |
| పొగాకు | 135 | 125 | 175 | 263 | 377 |
| సుగంధద్రవ్యాలు | 337 | 275 | 277 | 234 | 370 |
| జీడిపప్పు | 311 | 276 | 368 | 447 | 672 |
| పండ్లు, కూరగాయలు తయారైన పదార్థాలు | 304 | 352 | 420 | 434 | 695 |
| మాంసం, ఉత్పత్తులు | 88 | 94 | 114 | 140 | 231 |
| సముద్రపు ఉత్పత్తులు | 533 | 630 | 687 | 960 | 1374 |
| పై వాటి మొత్తం 3 నుండి 8 | 1708 | 1752 | 2041 | 2478 | 3719 |
| పైవాటిమొత్తం 1 నుండి 8 | 2571 | 2655 | 3305 | 3800 | 5161 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| బియ్యం | 339 | 331 | 427 | 462 | 755 |
| నూనెపదార్ధాలు | 213 | 409 | 610 | 609 | 871 |
| పై వాటి మొత్తం 9 & 10 | 552 | 740 | 1037 | 1071 | 1626 |
| దేశంలో మొత్తం ఎగుమతులు | 15674 | 20232 | 27681 | 32553 | 43828 |

బియ్యం ఎగుమతులలో గతంలో అతి ఖరీదైన బసుమతి రకం మాత్రమే అనుమతించబడేవి. ఇప్పుడు మధ్యరకం బియ్యాన్ని కూడా ఎగుమతి చేయడాన్కి అనుమతిస్తున్నారు. ప్రభుత్వం చెబుతున్న పాలసీ మేలురకం బియ్యం ఎగుమతి చేసి నాసిరకం బియ్యాన్ని ఎక్కువ మొత్తాలలో దిగుమతి చేసుకుంటామని. పైపట్టికలో 1988 - 89 నుండి క్రమంగా పెరుగుతున్న బియ్యం ఎగుమతులు అందులో భాగమే. 1990 - 91 లో 450 కోట్ల రూ॥ వున్న బియ్యం ఎగుమతిని 92 - 93 కు 900 కోట్ల రూ॥ కు పెంచగలమని - కొద్ది సం॥ల్లోనే దీన్ని 3000 కోట్ల రూ॥లకు పెంచి ప్రపంచ బియ్యం మార్కెట్‌లో మనవాటా 4 నుండి 15% పెంచుతామని కేంద్ర వ్యవసాయం మంత్రిత్వశాఖ కార్యదర్శి M.S. గిల్ ప్రకటించారు.

అయితే ఈ ఎగుమతుల రేట్లు పరిశీలిస్తే మనదేశములో అమ్మే రేట్ల కంటే అతి తక్కువగా వుంటాయి. మరోవైపు వీటికి బదులుగా దిగుమతి చేసుకునే గోధుమల రేట్లు ఎంత ఎక్కువగా వున్నాయో ఇంతకుముందే చూశాం - (మన రైతుకు క్వింటాల్ కు 260 రూ॥ చెల్లిస్తే అమెరికానుండి 517 రూ॥చొ॥న దిగుమతి చేసుకోవడం.

## రుచికరమైనవి ఎగుమతి చేద్దాం – నాశిరకానివి తెచ్చుకుందాం

"భారతీయుల సంఖ్య అధికంగా గల గల్ఫ్, తదితర దేశాలలో పేరు బడ్డ బ్రాండుల వారు ప్యాకింగ్ చేసిన వివిధ రకాల వంటనూనెలకు గిరాకీ చాలా అధికంగా వుంది. వాటి ఎగుమతులపై ఆంక్షలు తొలగించాలని వ్యవసాయ మంత్రిత్వశాఖ ప్రతిపాదిస్తోంది. ఈరీత్యా లభించిన ఆదాయంతో చౌకరకం వంటనూనెలను దిగుమతి చేసుకోవచ్చును."

"మన మేలురకం కందిపప్పు వంటి పప్పు ధాన్యాలకు గిరాకీ అధికంగా వుండి హెచ్చుధర పలుకుతుంది. ఈ పప్పుధాన్యాల ఉత్పత్తులద్వారా వచ్చే విదేశీ మారక ద్రవ్యంతో, అంతర్జాతీయ మార్కెట్‌లో అధికంగా అందుబాటులోవున్న చౌకరకం సాధారణమైన బఠాణీలు, శెనగలు, మూంగ్‌లను ఎక్కువ మొత్తాల్లో దిగుమతి చేసుకొనవచ్చును. వ్యవసాయ మంత్రిత్వ శాఖ అంచనాల ప్రకారం 50 వేల నుండి లక్ష టన్నుల వరకు పప్పు ధాన్యాలను ఈవిధంగా దిగుమతి చేసుకునేందుకు అవకాశంవుంది."

"1990 - 92 లో నాఫెడ్ దాని అనుబంధ సంస్థలు 183.24 కోట్ల రూ॥ విలువైన 4.16 లక్షల టన్నులు ఉల్లిపాయలు ఎగుమతి చేశాయి. ఇది ఒక రికార్డు."

"తాజాపండ్లు, ప్రాసెస్ చేసినవి, కూరగాయలు, పూలు ఇతర వన్య (అటవీ) ఉత్పత్తులు, మాంసం, మాంసపదార్ధాలు - ఎగుమతి చేయదగిన మరికొన్ని ముఖ్యాంశాలు. ఎక్కువ విలువ పొందగల్గిన, ప్రాసెస్ చేసిన పండ్లకు, కూరగాయల నుండి తయారయ్యే

పండ్ల రసాలు, తాండ్ర, జామ్‌లు, ఊరగాయలు, పచ్చళ్ళు, కాన్‌లలో సీలుచేసిన పండ్లు కూరగాయలు, తేమలేని, శీతలీకరించిన అనేక వుత్పత్తులున్నాయి."

(యోజన ఆగస్టు 93, సురీందర్ సూద్ వ్యాసం వ్యవసాయ ఎగుమతుల గురించి)

మన వ్యవసాయ ప్రణాళికల తాజా వ్యూహం ఇదీ. ఇంతకు ముందు చూపిన పట్టికలో సముద్ర వుత్పత్తులు ఎలా పెరుగుతున్నాయో చూడవచ్చు. అందునా విలువైన రొయ్యల ఎగుమతులు పెంచడానికి బడాబాబులంతా సముద్ర తీరాల్ని ఆక్రమించుకున్న విషయం ఆంధ్రతీరంలో చూస్తూనే వున్నాం – ఈ ఎగుమతులతో రొయ్యల ధర కిలో 300 రూ॥ పై చిలుకు కావడంతో వాటి రుచిని గురించి వూహించుకోడమే తీర ప్రాంత వాసులు మానివేశారు.

మన వుత్పత్తుల్లో గతం నుండి సాగుతున్న జీడి పప్పుల వ్యాపారం పెరుగుతూనే వుంది. రుచికరమైన ఈ పప్పు పండించే రైతులు మాత్రం శ్రీకాకుళం జిల్లాలో ప్రతిసం॥ము గిట్టుబాటు ధరకోసం ఆందోళన చేస్తూనేవున్నారు.

గతం నుండి సాగుతున్న చక్కెర ఎగుమతి తాజాగా విదేశాలకు ఎగుమతి చేస్తున్న రేటు లెక్కవేస్తే కిలోకు 5-00 రూ॥ మించడంలేదు. మన దగ్గర నుండి 11రూ॥ గుంజుతున్నా చాలడం లేదు. మరో 2 రూ॥ పెంచబోతున్నామని తాజావార్తలు. టీ, కాఫీల విషయం కూడ అంతే – మనం 75 రూ॥ పైగా చెల్లిస్తున్న టీ పొడిని విదేశాలకు కిలో 10 – 15 రూ॥ మధ్యనే ఎగుమతి చేస్తున్నారు. అందునా మనకందేవన్నీ నాశిరకానివని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

ఇటీవల ఆహార ప్రాసెసింగు పరిశ్రమ ప్రాధాన్యత గురించి ఎక్కువగా మాట్లాడుతున్నారు – 1988 లో 50 వేల వుద్యోగాలను ఈ పరిశ్రమ ద్వారా కల్పిస్తానని దేశంలోకి వచ్చిన పెప్సీ కంపెనీ వందలమందికి కూడ వుద్యోగాలివ్వలేదు. టమోటా సూప్‌ను, బంగాళాదుంపల చిప్స్‌ను తయారు చెయ్యడానికి దానికి లైసెన్సులిచ్చారు.

ఇంతకు ముందు నుండే సోయాబీన్సును దేశంలో పండించి దాని నుండి నూనెను, బిస్కట్ల వంటి వాటిని (మన వేరుశనగల్ని నేరుగా తినవచ్చు, సోయాబీన్సులో ప్రోటీన్ల శాతం ఎక్కువ వుండడం వల్ల చేదుగావుంటాయి. దాన్ని ఖచ్చితంగా పరిశ్రమ లోకి పంపాలి) తయారుచేసి వ్యాపారం సాగిస్తున్నారు.

దేశంలో వున్న విస్తారమైన అడవులన్నీ తమ పారిశ్రామిక అవసరాల కోసం నాశనం చేయడంలో పారిశ్రామిక అవసరాలకోసం కలప కొరత ఏర్పడింది. అందువల్ల భద్రాచలం పేపరు బోర్డు – రాజమండ్రి పేపరు మిల్లు వంటివి మన భూముల్లో యూకలిప్టస్, సుబాబుల్, సరుగుడు (చవుక) చెట్లు పెంచేందుకు రైతాంగాన్ని ప్రోత్సహిస్తున్నారు. ట్రంకు రోడ్డు పొడవునా ఈ కలప కొనుగోలు కేంద్రాలు పెట్టారు.

ఉల్లి, వెల్లుల్లిని డీహైడ్రేషన్ చేసి (నీటి ఆవిరితో ఉడకబెట్టడం) విదేశాలకు ఎగుమతి చేసే యంత్రాలను బల్గేరియా నుండి దిగుమతి చేసుకొని పరిశ్రమ పెట్టింది, హిందూస్తాన్ లివర్ కంపెనీ.

## పాల విప్లవ అనుభవాలు – అమ్ముడు పోని పాలు

పాల వుత్పత్తుల విషయం కూడ ఇదే మనం చూస్తాం. తెల్ల విప్లవం పేరుతో ఆర్భాటంగా అమెరికానుండి పాలశీతలీకరణ యంత్రాలు తెచ్చి ప్రచారం చేశారు. రాష్ట్రాల

పాడి సహకార సమాఖ్యలు, జాతీయ పాడి పరిశ్రమాభి వృద్ధి సంస్థలూ ఏర్పరచారు - మన పాలకుల ఎగుమతి, దిగుమతుల వ్యూహాల సామర్థ్యాన్ని ఇక్కడే చూడవచ్చు.

ఇంతకుముందే ఇచ్చిన లెక్కల ప్రకారం దేశంలో వుత్పత్తవుతున్న పాల అంచనా కేవలం తలకు రోజుకు 6 గ్రా॥ వుంది. ప్రధానంగా పల్లెల్లో వుత్పత్తయ్యే పాలు తమ పొట్టలు కట్టుకొని పేదలు బయటకు పంపడానికి సిద్ధపడుతున్నారు - అయితే వుత్పత్తయ్యే పాలను మార్కెటింగు చేయగల సత్తాలేదని ఆంధ్ర రాష్ట్ర పాడి పరిశ్రమ మంత్రి ప్రకటనే తెలుపుతుంది.

"పాలసేకరణ పెరిగిపోయి నష్టాలకు హేతువైందని, ఇది ఊహించని పరిణామమని రఘువీరారెడ్డి అన్నారు. సేకరించిన పాలను వెన్నతీసి పూర్తిగా విక్రయించలేక పోతున్నామని, మూడోవంతు పాలు మిగిలిపోవడంతో పాలపొడిగా మార్చుతున్నామన్నారు. ఈమేరకు రూ॥ 125కోట్ల విలువచేసే పాలపొడి నిల్వలు ఉన్నాయని, ఒక్కకిలో పొడిచేసేందుకు సంస్థకు 50రూ॥ఖర్చు అవుతుండగా మార్కెట్‌లో పాలపొడి రేటు కేవలం 25రూ॥లే వుందని, ఈ పరిస్థితిలో పాలపొడి విక్రయాలు పెంచితే నష్టాలు మరింతగా పెరుగుతాయని ఆయన ఆందోళన వ్యక్తంచే శారు. 50 కోట్ల రూ॥నష్టంలో సంస్థవుండగా 30కోట్ల రూ॥ విలువచేసే వుత్పత్తులు నిల్వ ఉండిపోయాయన్నారు".

ఇదీపరిస్థితి - ఒకవైపున అమెరికా నుండి పాల ఉత్పత్తుల దిగుమతులు - మరోవైపు దేశంలో పాలు వుత్పత్తి చేసి అమ్ముతాం, అని ప్రజలంటే కొనే దిక్కులేదు - సీజన్‌లో రైతులనుండి ఒకపూటకూడ పాలు సక్రమంగా సేకరించని దుస్థితి - మనరాష్ట్రంలో చూస్తున్నాం. పాలవిప్లవం ఒకవైపు పల్లెల్లోని ప్రజలను పాలు, పాల ఉత్పత్తులు తినడం మరచిపోయేలా చేసింది. మరోవైపు కొన్ని ప్రాంతాల్లో వ్యవసాయంలో నష్టాలు పొందుతున్న రైతులు (ఆత్మహత్యల ప్రత్తిరైతుల్లా) పాలు అమ్ముకొని అయినా బ్రతుకుదామంటే పాలకార్పొరేషన్లు కొనవు - కొన్నవాటికి కూడ సక్రమంగా డబ్బు చెల్లించవు.

## తినే చేపముక్క కూడ లేకుండా చేసిన నీలి విప్లవం

నీలివిప్లవం సముద్ర వుత్పత్తులను పెంచడానికని, ప్రజలకు పోషక విలువలతో కూడిన ఆహారం అందించడానికని ప్రచారం చేయబడింది. దీని విషఫలితాలు తీర ప్రాంతంలో తీవ్రంగావున్నాయి. మరట్రాలర్లు రంగంలోకి పెద్ద పెట్టుబడులతో దిగడంతో సముద్రంపై ఆధారపడే సాంప్రదాయక వేటగాళ్ళ జీవితంలో దుమ్ముపడింది.

మరోవైపు చేపల చెరువులు పెరిగాయి -మాగాణి భూములన్నీ వేల ఎకరాలు చెరువులుగా మారాయి. ప్రపంచబ్యాంకు అందించిన ఋణంతో ప్రత్యేకించి సముద్ర వుత్పత్తులు ఎగుమతి సంస్థ (MPEDA) ను ఏర్పరచి ప్రత్యేక లోన్లు ఇచ్చి రొయ్యల చెరువులు త్రవ్వించారు- చిన్న, మధ్య తరగతి, ధనిక రైతులు కూడ ఈ రంగంలోకి దిగారు. అయితే ఈ రంగంలోకి దిగిన ధాపర్ వాటర్ బేస్ లిమిటెడ్, రాంక్ ఆక్వావంటి బడా కంపెనీలు పెద్ద పెట్టుబడులతో దిగాయి.

రొయ్యల వుత్పత్తినంతా కొనుగోలు చేసి ఎగుమతి చేయ్యాల్సింది పెద్ద కంపెనీలే. పొగాకు రైతులు అనుభవమే రొయ్యలు పండించే రైతాంగానికి కూడ కొద్దికాలంలోనే రావడం ఖాయం. మార్కెటింగ్ చేసే శక్తులు ఎంతగా రైతాంగాన్ని ప్రభావితం చేస్తాయో కృష్ణాజిల్లా తీరప్రాంత అనుభవం కూడ ఇటీవలె బయటపెట్టింది. తీర ప్రాంతమంతా రొయ్యల లాభాలు పిండుదామని ఆశించిన రైతుల అనుభవమిది.

రొయ్యల కొనుగోలుదార్లపై ప్రభుత్వం కొత్తపన్ను వేయడానికి నిరసనగా వాళ్ళు రొయ్యల కొనుగోలు ఆపివేశారు. వారం రోజులపాటు రొయ్యల అమ్మకాలు ఆగడంతో అదనంగా వాటికి మేత వేయాల్సిరావడంతో చిన్నరైతులు అవస్థపడ్డారు - మరోవైపు రొయ్యల పొట్టు వలవడం వంటి ప్యాకింగు, ప్రాసెసింగు పనిలో పాల్గొనే కూలీలు కూడ అవస్థలపాలయ్యారు.

సామ్రాజ్యవాదుల, గుత్తకంపెనీల వ్యూహం ఇదే. పంటను వుత్పత్తి పెంచమనడం - తీరా వుత్పత్తులు పెంచడానికి అలవాటైన తర్వాత రేట్లను దిగకొయ్యడం - అసలే వుత్పత్తులుకొనకపోవడం.

## వరి, గోధుమ పండే చేలు వాణిజ్య పంటలమయం కావాలి!

1980ల నుండే ప్రపంచబ్యాంకు నివేదికల్లో సామ్రాజ్యవాదుల వ్యూహం బయట పడింది. "దారిద్ర్యం ఆకలి" అన్న అధ్యయనంలో ప్రపంచబ్యాంకు "ఆహార భద్రతకు, ఆహార స్వయం సమృద్ధికి మధ్య ఎలాంటి సంబంధం ఉండనక్కరలేదనీ - కనుక తగినంత చౌకగా ఆహార ధాన్యాలను పండించలేని దేశాలు అంతర్జాతీయ వాణిజ్యంపై ఆధారపడి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడం వాటిని పండించడం కన్నా మెరుగైనపని" అని చెప్పింది.

అమెరికన్ వ్యవసాయ మంత్రిత్వశాఖ కార్యదర్శి ఇంకా స్పష్టంగా ఈ విధంగా చెప్పాడు - "అభివృద్ధి చెందుతున్న దేశాలు ఆహారధాన్యాల కోసం తమకాళ్ళపై తాము ఆధారపడడమన్న ఆలోచన పాడుబడిన, గతించిన యుగాలకు చెందినది. అమెరికా వ్యవసాయ వుత్పత్తులపై ఆధారపడడం ద్వారా తమ ఆహారం గ్యారంటీ చేసుకోవచ్చు".

అమెరికన్ వ్యూహాన్ని అర్థం చేసుకోడానికి ఇంతకంటే వివరణేం కావాలి. ఈరోజు తమ చేతుల్లో వున్న గోధుమ నిల్వల్ని (అమెరికా మిగులు 18.9 కోట్ల టన్నులు, యూరప్ మిగులు ధాన్యం 4కోట్ల టన్నులు) మనలాంటి పేదదేశాలపై రుద్దాలి. అమెరికా చేతిలో వున్నమిగులే మన మొత్తం దేశ ఆహారధాన్యాల వుత్పత్తికంటే ఎక్కువగా వున్నాయి. గనుక వాటిని మనపై రుద్ది మనదేశం నుండి తమకు కావలసిన విలువైన ఆహారసరుకులు తీసుకెళ్ళాలి.

అందుకే ఒకవైపు వ్యాపారపంటలను, మరోవైపు కూరగాయలు, పండ్ల తోటల పెంపకాన్ని, నూనెగింజలు, రొయ్యల చెరువులను పెంచుతోంది. వరి, గోధుమ పండించే చేలన్నీ ఇప్పటికే ఈ పంటలుగా మారుతున్న క్రమం ఇంకా వేగం కావాలన్న మాట. అందుకే ఆహార ప్రాసెసింగు కోసమంటూ విదేశీ గుత్తసంస్థలు దేశంలోకి తెస్తున్న యంత్ర సామాగ్రిపై పన్నులు, సుంకాలు రద్దుచేసి స్వేచ్ఛగా దిగుమతి కానిస్తున్నారు. 4-11-93 నాటి పత్రిక ప్రచురించిన ఈ క్రింది వార్త పరిస్థితిని స్పష్టం చేస్తుంది.

"ఈ దశాబ్దాంతానికి రాష్ట్రంలో వుత్పత్తిఅయ్యే పామాయిల్ రాష్ట్రంలో ప్రజల వంట నూనె అవసరాల్లో నాలుగోభాగం తీర్చగలుగుతుంది. రాష్ట్రంలో ఈ పంట సాగుకు అనువైన భూమి 4 లక్షల హెక్టార్లు (10 లక్షల ఎకరాలు) వున్నట్లు గుర్తించారు. ప్రస్తుతం పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, కృష్ణాజిల్లాల్లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రోత్సాహంతో వివిధ ప్రవేటురంగ సంస్థల తోడ్పాటుతో రైతులు ఇపుడిపుడే ముమ్మరంగా ఆయిల్ పామ్ సాగు ప్రారంభిస్తున్నారు... ఐ.టి.సి. పామ్‌టెక్, గోద్రేజ్, స్పిక్, నవభారత్, ఫుడ్ ఫ్యాట్ అండ్ ఫర్టిలైజర్ తదితర కంపెనీలు ఇపుడు రంగంలోకి దిగాయి".

నూతన వ్యవసాయ విధానపు ముసాయిదాలో దీనికనుగుణంగానే ఇలా చెప్పారు.

"వ్యవసాయోత్పత్తుల ఎగుమతుల విషయంలో మనదేశానికి సహజంగానే కొన్ని అనుకూల పరిస్థితులున్నాయి. వ్యవసాయ పనిముట్లు దిగుమతులు చేసుకునే అవసరం మనకు తక్కువే వుంది. వ్యవసాయ కూలీల వేతనాలు తక్కువగా ఉండడం, సేద్యానుకూల వాతావరణ వైవిధ్యం వంటి ప్రయోజనాలను ఆసరాగా తీసుకొని, పళ్ళు, పువ్వులు, కూరగాయలు, కోళ్ళు, పశుగణాల ఎగుమతుల్ని అధికం చేసి మొత్తం ఎగుమతుల్లో మన వాటాను పెంచుకోవాలి".

"పరిశ్రమలతో పాటు వ్యవసాయంలో వాణిజ్యానికి, పెట్టుబడులకూ తగిన వాతావరణాన్ని ఏర్పరచడానికి ప్రభుత్వం కృషిచేస్తుంది. పరిశ్రమలకిచ్చే అన్ని ప్రయోజనాలను వ్యవసాయానికి కూడా ఇవ్వాలన్నది ప్రభుత్వ విధాన లక్ష్యం".

(యోజన ఆగస్టు 93 - "నూతన వ్యవసాయ విధానం")

మన ఆహార పంటల విస్తీర్ణాన్ని తగ్గించి సామ్రాజ్యవాదులు ప్రయోజనాలుకనుగుణంగా చర్యలు తీసుకుంటున్నారని చెప్పడానికి ఇంతకన్నా ఏం వివరాలు కావాలి!

## బహుళజాతి సంస్థలతో అంతర్జాతీయ వాణిజ్యంలో పోటీపడగల మనుకోవడం పగటికలే

ఆహారపంటలకు బదులుగా వాణిజ్య పంటలను పండించినా మన పంటల ధరలు మనచేతుల్లో వుండవు. ఎందుకంటే అమెరికా, ఫ్రాన్సు, జపాను వంటి దేశాల్లో వ్యవసాయ వ్యాపారం (Agri business) ఎరిగింది. బహుళజాతి గుత్తసంస్థలు (MNC) చేతులపై లెక్కపెట్టదగిన సంఖ్యలో వున్నవి - ఆదేశాల వ్యవసాయ వ్యాపారంపై పట్టుకలిగివున్నాయి.

అమెరికాకు చెందిన కార్గిల్ కంపెనీ ఒక్కటే 1990లో ప్రపంచ ఆహారధాన్యాల వాణిజ్యంలో 25% వ్యాపారం సాగించింది. ఇతర కంపెనీలు కాంటినెంటల్ 20%, లూయిస్‌డ్రెఫస్ 13%, ఎ.డి.యాటోయిస్ఫల్ 13%, బంగీ అండ్ బోర్న్ - 10% మొత్తం 5 సంస్థలు కలిపి 80% వ్యాపారం సాగించాయి. 15 బహుళజాతి సంస్థల స్థూల ఆదాయం 120 దేశాల (దాదాపు మూడవ ప్రపంచ దేశాలన్నింటి) స్థూల జాతీయాదాయంకంటే ఎక్కువ.

బహుళజాతి గుత్తసంస్థలు ఇంతపెద్ద ఎత్తున పెరిగిన ఈ దశలో ప్రభుత్వం వ్యవసాయరంగంలో ఇప్పటివరకు అనుసరిస్తున్న రక్షిత విధానాలను (Protectionist) వదులుకొని ప్రవేటు పెట్టుబడిని, అందునా విదేశీ గుత్తపెట్టుబడిని ఆహ్వానిస్తోంది. ఇప్పటికే పొగాకు రంగంలో మనదేశంలో వున్న ఐ.టి.సి. ని ప్రభుత్వం ఏ సందర్భంలోనూ వత్తిడిచేసి ధరలు ఇప్పించలేకపోవడం మనం ఇస్తూనే వున్నాం - ఆపంటను తొలిరోజుల్లో ప్రోత్సహించిన ఆ కంపెనీయే తర్వాత దశలో రైతాంగపు జీవితాల్తో ఎంత చెలగాటమాడిందో గుర్తుచేసుకుంటే ఇపుడు అవి ప్రవేశించే పంటల్లో ఏం జరుగుతుందో వూహించుకోవచ్చు

### ప్రపంచ వ్యాపారం గాట్ ద్వారా సాగుతున్న తీరు ఇదీ !

- ☆ మూడవ ప్రపంచదేశాల వుత్పత్తుల ఎగుమతులు మొత్తం ప్రపంచ ఎగుమతుల్లో 1986లో 11.2% వుండగా 1988కి కేవలం 13.8% కు పెరిగింది.
- ☆ ప్రపంచ జనాభాలో కేవలం 15 శాతం వున్న సామ్రాజ్యవాద దేశాలు ప్రపంచ వాణిజ్యంలోను, పెట్టుబడుల ప్రవాహంలోను 3/4వ వంతు వాటా కలిగి వున్నాయి.
- ☆ ప్రపంచ వుత్పత్తుల ఎగుమతుల్లో అమెరికా వాటానే 18%.
- ☆ పేద దేశమైన మలేషియా ఐరోపా కమ్యూనిటీ దేశాలకు శుద్ధిచేయని పామ్ ఆయిల్‌ను ఎగుమతి చేస్తుంది. దానిపై కేవలం 2 శాతం సుంకం పొందుతుండగా అదే శుద్ధిచేసిన నూనెపై 25 శాతం సుంకం వుంది.
- ☆ మూడవ ప్రపంచ దేశాలు ఎగుమతి చేసే కాఫీ, టీలకు ప్రపంచ మార్కెటులో కేవలం 20 శాతం (1/5వ వంతు రేటు) మాత్రమే పొందుతున్నాయి.
- ☆ మనదేశం వంటి కలప వుత్పత్తి చేసే 6 దేశాలు ఆ కలప ద్వారా తయారయ్యే వస్తువుల (తలుపులు, మంచాలు వగైరా) రేటులో కేవలం 9 శాతం మాత్రమే పొందుతున్నాయి.

వ్యాపారానికి హద్దులు లేవన్న సూత్రాన్ని అంగీకరించి బలవంతుడితో పోటీకి బలహీనుడు దిగితే ఏంజరుగుతుందో ఎవరుగెలుస్తారో వేరుగా చెప్పనక్కరలేదు. వాణిజ్యపంటలు పండించి విదేశీమారకద్రవ్యాన్ని సంపాదించుకొని, ఆ డబ్బుతో ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోమని సామ్రాజ్యవాదం మనకు చెప్పేది మోసమని తేలిగ్గానే అర్థం చేసుకోవచ్చు. కొన్నిదేశాలకు ఇప్పటికే ఆ చేదు అనుభవాలు రుచి చూపించారు కూడ.

వాణిజ్య పంటలవైపు మనల్ని మళ్ళిస్తారు. అందుకవసరమైన వ్యవసాయ అవసర ఉత్పత్తులు (Inputs - విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు) వాళ్ళచేతిలో వుంటాయి గనుక వాటిధరలు పెంచుతారు. (ఇప్పటికే మనదేశంలో అమ్ముతున్న విత్తనాలే ఎంత హెచ్చురేట్లకు అమ్ముతున్నారో చూస్తున్నాం). మరోవైపు పైన చెప్పుకొన్నట్లు ప్రపంచవ్యాపారం మొత్తాన్ని కంట్రోలు చేయగల ఎం.ఎన్.సి.లు మనవాణిజ్య పంటలు ధరలను, ఆహారోత్పత్తుల ధరలను తక్కువగా నిర్ణయిస్తారు. మనం పండించిన పంట ఎంత పెంచినా మనం దిగుమతి చేసుకోవాల్సిన వుత్పత్తులకు కూడ సరిపడనట్లుగా తయారుచేస్తారు.

## అంతిమంగా మనకు మిగిలేది నిత్యకరువు – ఆకలిచావులే!

అందువల్ల మళ్ళీ కథ మామూలే - ఆహారధాన్యాలు కావాలి కాబట్టి అప్పుతీసుకోమంటారు - ఆరకంగా మన ఖాతాలో ఎపుడూ అప్పు జమపడుతూనే ఉంటుంది. అప్పు పెరిగే కొద్దీ మళ్ళా షరతులకు తలొగ్గాలి. ఇదొక విషచక్రంలాగా సాగుతుంది. సబ్‌సహారా - ఆఫ్రికన్ దేశాలు ప్రస్తుతం ఎలా పీడించబడుతున్నాయో - తమ ప్రజల కోసం సామ్రాజ్యవాదులకు పంటలు పండించి బనానా దేశాలుగా (అరటిపండ్లను ఎగుమతి చేసే) పేరుపడింది ఇలాగే.

ఆహారధాన్యాల తప్పనిసరి దిగుమతి అనే షరతును మూడవ ప్రపంచ దేశాలపై రుద్దుతున్నారు. మనకు అవసరం లేకున్నా ప్రపంచ ఆహారధాన్యాల వుత్పత్తిలో 3%ను దిగుమతి చేసుకోవాలన్న షరతు కూడ ఇందుకోసమే.

ఈ పరిస్థితి సరిగ్గా 1940ల నాటి బెంగాల్ కరువును గుర్తు చేస్తుంది. ఒకప్పుడు బ్రిటన్ సామ్రాజ్యవాదం ఆహారపంటలకు బదులుగా దేశంలో వాళ్ళ అవసరాల కోసం పలు వాణిజ్యపంటలు పండించాలని రైతాంగాన్ని బలవంతపెట్టారు. 1873 నుండి 1947వరకు ఆహార ధాన్యాల వుత్పత్తి పెరుగుదల 0.117 వద్ద ఆగిపోగా వాణిజ్యపంటల వుత్పత్తి (కాఫీ, టీ, నీలిమదు, ఒపియం మత్తుమందు, జూట్, పత్తి) సం॥కి 1.3% చొప్పున పెరగడంతో బెంగాల్‌లో ఆహారధాన్యాల కొరత ఏర్పడింది. యుద్ధంవల్ల మరింతగా పెరిగింది. మరోవైపు మంచి బియ్యం ఎగుమతి చేసి అంతకన్నా ఎక్కువ మొత్తాల్లో చౌకరకం బియ్యాన్ని దిగుమతి చేసుకోటానికి పూనుకొంది - దిగుమతి చేసుకున్న ధాన్యమంతా మార్కెట్ లోని మధ్య దళారులు తమ చేతుల్లో పెట్టుకొని కృత్రిమ కొరతను సృష్టించారు - ఈ మొత్తం కలిసి 1943 బెంగాల్ కరువు భయానకంగా 30 లక్షలమంది ప్రజలను బలిగొంది.

సామ్రాజ్యవాదుల వ్యూహం ప్రకారం ఇపుడుకూడ మన పాలకులు ఎగుమతినుద్దేశించిన పంటల (Export oriented) విధానం చేపడితే జరిగేది వరి, గోధుమ, ఇతర ముతక ధాన్యాలు పండే చేలు అవి పండించేట్లుగా మార్చాలి. ఒకసారి పంటపొలాలను ఆ రకంగా మార్చిన తర్వాత మళ్ళీ తిరిగి వరి పండించాలంటే కష్టం. రొయ్యలు, చేపల చెరువులలో మళ్ళీ వరి పండుతుందా ? పండ్లతోటలు, సామాజికవనాలు (యూకలిప్టస్, చవుకలు, సుబాబుల్ వగైరా) గా మార్చిన పొలాలు ఆహారపంటలకు పనికి రావడానికి ఎంతకాలం పడుతుంది?

అందువల్ల బియ్యం సగటు ఎకరా దిగుబడి 1741 కిలోలకు, గోధుమ సగటు దిగుబడి ఎకరాకు 846కిలోలను మించి పండించకుండా పంట విస్తీర్ణం తగ్గితే చివరకు ప్రస్తుతం సగటున తలకు రోజుకు లభిస్తున్న 439గ్రా॥ కూడ లభ్యంకావు. మరింతగా ప్రజలు ఆకలిచావులకు గురికావాలి. ఆ కరువు ప్రకృతి వైపరీత్యం వల్లో, యుద్ధంలో బడ్జెటు కేటాయింపులు తగ్గో వచ్చే కరువు కాదు. సామ్రాజ్యవాద దోపిడి నుండి వచ్చే కరువు. రాబందుల్లా పేదదేశాల సంపదను పీల్చడంవల్ల వచ్చే కరువు.

డంకెల్ ప్రతిపాదనలను ప్రజల నెత్తినబెట్టి సామ్రాజ్యవాద ప్రభువులురాల్చే కమీషన్‌కోసం కక్కుర్తిపడే భారత పాలకవర్గాలకు ఆ అవకాశమిద్దామా? లేక ప్రతిఘటిద్దామా? ఇదీ ఈనాడు మన ముందున్న సమస్య.

## వలసపాలననాటి సామ్రాజ్యవాద విధానాల కొనసాగింపుగానే డంకెల్ ప్రతిపాదనలను అర్థం చేసుకోవాలి

అందుకే పాలకులు ఎన్ని కబుర్లు చెప్పి, పరిస్థితిని ఎంతమసిబూసి మారేడుకాయ జేయజూసినా మనం మోసపోరాదు. డంకెల్ ప్రతిపాదనలు మనకు స్వేచ్ఛా వాణిజ్యానికి అవకాశాన్నిచ్చి మన ఎగుమతుల్ని పెంచడంద్వారా ప్రపంచవాణిజ్యంలో గుర్తించదగిన స్థానం సంపాదించుకోడానికి తోడ్పడతాయనడం వట్టిదగా. అంతో ఇంతో పెరిగే వాణిజ్యం భారత ప్రజల్ని ఆకలితో మాడుస్తుంది. మనల్ని కరువుకాటకాలకు గురిచేస్తుంది.

ఈ డంకెల్ ప్రతిపాదనలు మారిన సామ్రాజ్యవాద అవసరాల్లో భాగమేనన్నది నిస్సందేహం. వలసపాలననాడు విచ్చలవిడిగా లూటీ చేసి మన వ్యవసాయాన్ని తన వ్యాపార

అవసరాలకు అనుగుణంగా రూపొందించుకుంది. పచ్చినిరంకుశంగా పోలీసుబలగాల్ని వుపయోగించికూడ ఆనాడు రైతుల్ని తమకిష్టం వచ్చిన పంటల్ని పండించేలా చేసింది. దాన్కి వ్యతిరేకంగా నీలిరైతులు తిరగబడితే నిరంకుశంగా అణచివేసింది. వ్యవసాయంలో లాభాలు పిండుకుంది. తన అవసరాలు తీర్చుకుంది.

రెండవప్రపంచయుద్ధం తర్వాత ప్రత్యక్ష వలసపాలన వీలుకాదని అర్థం చేసుకున్న సామ్రాజ్యవాదం వ్యూహం మార్చింది. రాజకీయంగా స్వతంత్రదేశాలన్న ముసుగులో మూడవప్రపంచదేశాలను అట్టిపెట్టి నిజానికి ఆర్థికంగా, రాజకీయంగా, మిలటరీ రీత్యా తనపై ఆధారపడి వుండేలా చేసుకుంది. ఆనాటి పరిస్థితులకు తగిన వ్యూహాలలో భాగంగానే హరిత విప్లవాన్ని రూపొందించింది. వ్యవసాయంలో ఆధునిక పద్ధతుల పేరిట విచక్షణారహితంగా ఎరువులు, పురుగుమందుల వాడకాన్నీ, ట్రాక్టర్లను పెద్ద ఎత్తున మూడవ ప్రపంచదేశాల మార్కెట్లోకి తెచ్చింది. నూతన విత్తనాల పేరిట పురుగుమందులు, ఎరువులు ఎక్కువగా అవసరమైన రకాలను వినియోగించిపెట్టింది. సంక్షోభంలో వున్న తన పారిశ్రామిక వుత్పత్తులను అమ్ముకుని లాభాలు గడించింది.

ఇపుడు సోషలిజం అనే ఆలోచనపై దెబ్బతీసి పెట్టుబడిదారీ విధానమే తప్ప ప్రపంచానికి వేరొక గత్యంతరం లేదనే చేదుమాత్రను ప్రపంచం చేత మింగించే ప్రయత్నంలో వుంది. తన లాభాపేక్ష మార్కెట్లో సంక్షోభాన్ని సృష్టించగా, ఆధిపత్యకాంక్ష మిలటరీ బడ్జెటులను పెంచి మరింత ఊబిలో ఇరుక్కుపోయేలా చేసింది. ఈ దశలో గ్లోబలైజేషన్ పేరిట గాట్‌లో తెచ్చిన డంకెల్ ప్రతిపాదనలు సామ్రాజ్యవాద అవసరాలకు అనుగుణమైనవి. ఆధునిక విజ్ఞానంపై తన గుత్త కంపెనీల పట్టును పదిలం చేసుకొనేందుకు వాటిని ఉపయోగించి లాభాల పంటలను పండించుకువేందుకు పేటెంట్‌ల చట్టం తెచ్చింది. విత్తనాలపై పేటెంట్‌లను అధికరేట్లకు అమ్ముకోవడమేకాక ఆహారధాన్యాల ఉత్పత్తిని మూడోప్రపంచదేశాల్లో తగ్గింపచేసి తనపై ఆధారపడేలా చేస్తుంది. ఈ రంగంలో తన పెట్టుబడుల విస్తరణకు అనుగుణంగా పెట్టుబడులపై అదుపులు, నిబంధనలు రద్దుచేయాలంది. ఉత్పత్తిలో వచ్చిన మందిగింపుతో పారిశ్రామికరంగంలో కన్నా సర్వీసురంగంలోకి దిగడంద్వారా ఉన్న ద్రవ్యాన్ని తన కంట్రోలులోనికి తెచ్చుకోవాలనుకుంది. వ్యవసాయంకోసం ఈ రంగంనుండి అందుతున్న తోడ్పాటును కూడ కత్తిరించి స్థానిక ఉత్పత్తిని కుంటుపడేలా చేస్తుంది. వ్యవసాయానికి అవసరమైన నీటిపారుదల, విద్యుత్ వంటి రంగాలకు ఇచ్చే వాటాలను కుదింపచేస్తుంది.

ఈ చర్యలన్నిటిద్వారా ప్రస్తుతదశలో సామ్రాజ్యవాదం తన అవసరాలకనుగుణంగా మన వ్యవసాయాన్ని మలచదలచుకుంది. పేదలకు అవసరమైన తిండి స్థానంలో సంపన్నుల రుచులకు అవసరమైన పంటలు, వారి విలాసాలకు అవసరమైన పంటలు పండించేలా చేస్తుంది. పబ్లిక్ తిండిగింజలు అమ్మకాలు కూడా నిలుపుదల చేస్తుంది. మూడో ప్రపంచ దేశాలని పునర్వ్యలసీకరించడంలో భాగంగా తెస్తున్న మార్పులుగా వీటిని మనం అర్థం చేసుకోగల్గినపుడే వాటికి వ్యతిరేకంగా మనం తగినట్లుగా కర్తవ్యాలను రూపొందించుకోగల్గుతాం.

# భారత రైతాంగం ఇతర ప్రజానీకంతో కలసి సమరానికి నడుం బిగించాలి !

సామ్రాజ్యవాదం తన వ్యూహాల కనుగుణంగా మూడవ ప్రపంచ దేశాలపై పెత్తనం చలాయిస్తోంది. ఇందుకనుగుణంగానే తను రూపొందించిన బ్రెట్టన్ వుడ్ సంస్థలుగా పేరుపడిన ప్రపంచ బ్యాంకు (W.B), అంతర్జాతీయ ద్రవ్యనిధి (I.M.F.), శాశ్వతమైన ప్రపంచ వాణిజ్య సంస్థ (I.T.O.) ను ఏర్పరచకుండా తాత్కాలిక ఏర్పాటుగా చేసిన వాణిజ్య, సుంకాల సార్వత్రిక ఒప్పందం (GATT) ల ద్వారా తన వ్యూహాల్ని రచింపజేసి అమలుపరచేలా చేస్తుంది.

నిజానికి గాట్‌లో ప్రస్తుతం డంకెల్ ప్రతిపాదనల ద్వారా తేదలచుకున్న మార్పులకు బీజాలు మిగిలిన రెండు సంస్థల ద్వారా ఇప్పటికే వేసింది. సరళీకృత ఆర్థిక విధానాలు, వ్యవస్థాగత సర్దుబాట్ల కార్యక్రమాలు (S.A.P.) అవే. అందుకే డంకెల్ ప్రతిపాదనలలోని అనేక అంశాలు ఇప్పటికే మనదేశంలో అమలుపరచబడుతున్నాయి.

నూతన పారిశ్రామిక విధానం పేరిట పరిశ్రమలకు లైసెన్సులు (ప్రభుత్వ అదుపు) లేకుండా చేశారు. ఆధునీకరణ, కంప్యూటరైజేషన్‌ల ననుసరించి ఎగ్జిట్ పాలసీ, గోల్డెన్ షేక్‌హ్యాండ్ పథకాల పేరుతో కార్మికుల వుద్యోగాలు పీకేసి ఇండ్లకు పంపారు. ఖాయిలా పడిన పరిశ్రమ (Sick Industries) పేరిట పరిశ్రమల మూసివేత - నష్టాల పేరిట ప్రభుత్వరంగ పరిశ్రమలు మూత - ఈ రెండు రకాల పరిశ్రమలు బహుళజాతి గుత్తకంపెనీల చేతుల కప్పజెపుతున్నారు. ఇందుకోసం గుత్తవ్యాపార చట్టం (MRTP), విదేశీ ద్రవ్యనియంత్రణ చట్టం (FERA) వంటివికూడ రద్దు చేశారు. తద్వారా లక్షలాది మంది రోజురోజుకు ఆకలికి గురిచేయబడుతున్నారు.

ఫండు, బ్యాంకు షరతుల మేర ప్రభుత్వ నిర్వహణా వ్యయం తగ్గించడం వంటి చర్యలు చేపట్టి ప్రభుత్వ వుద్యోగాల్లోని ఖాళీలను భర్తీ చేయడంపై నిషేధం విధించారు. ఉద్యోగుల కిచ్చే జీతనాతాల్లో కోత పెట్టారు. పే రివిజన్ కమీషన్ పేర ఇటీవల తీసుకున్న చర్యలు జీతాలను దిగకోయగా, మళ్ళీ ఎల్.టి.సి. (LTC) వంటి సౌకర్యాలను పొందడంపై కూడ నిషేధం పెట్టారు. మధ్యతరగతి వర్గాలకు వంట గ్యాసుపై ఇచ్చే రాయితీని కూడ కత్తిరిస్తున్నారు.

నూతన విద్యావిధానం పేరిట చదువులకు ఉద్యోగాలతో వున్న లింకును తొలగించారు (Delink jobs from degrees). ప్రైవేటు రంగంలో స్కూళ్ళను, కాలేజీలను పెంచుకోనిచ్చారు. ప్రభుత్వం కాలేజీలను నిర్వహించడానికి నిధులు (funds) ఇవ్వలేదు గనుక సీట్లను ధనవంతుల బిడ్డలకు అమ్ముకోమన్నారు - వేలాది స్కూళ్ళలో వుపాధ్యాయులు లేకున్నా నియమించేది లేదు పొమ్మంటున్నారు. అందువల్ల చదువు సంపన్న వర్గాలకు మాత్రమేనని ప్రభుత్వం చెప్పకనే చెబుతోంది. సాంఘిక సంక్షేమ హాస్టళ్ళను కూడ కత్తిరించి వేయడానికి వాటిని గురుకుల పాఠశాలలు తదితర పేర్లతో మార్చజూస్తోంది. స్కాలర్‌షిప్‌ల సంఖ్యను దిగకోస్తున్నారు.

వుద్యోగాలపై విధించిన నిషేధాలతో ఇప్పటికే దేశంలో వున్న నిరుద్యోగుల సంఖ్య 3కోట్ల నుండి అంతకంతకూ పెరుగుతూ పోతోంది.

దేశంలో ప్రజోపయోగ సర్వీసులైన విద్య, వైద్యం వంటి వాటికి కేటాయింపులే అతి తక్కువైతే వాటిని కూడ దిగకోస్తున్నారు. ప్రభుత్వ రంగంలో వైద్యం ప్రజలకు ఒక సౌకర్యంగా రోజురోజుకు అంతరిస్తోంది. గ్రూపు హాస్పటళ్ళు (అపోలో, మెడినోవా వగైరా) పెరగడంతో ఆధునిక వైద్యం మధ్యతరగతికి కూడ గగన కుసుమమైంది. పారిశ్రామిక రంగంలో తెచ్చిన సడలింపులు, ప్రభుత్వ క్వాలిటీ కంట్రోలు లేకపోవడంతో - అవసరమైన మందుల కంటే అనవసర మందులు మార్కెటును ఆక్రమిస్తున్నాయి. పేటెంట్ హక్కులు వైద్యశాస్త్రానికి అవసరమైన ప్రక్రియలకు (స్కానింగ్ వగైరా) కూడ విస్తరించడంతో ఇక మధ్యతరగతి కూడ ఆధునిక వైద్యం గురించి ఆలోచించడం మానెయ్యాల్సిందే.

సర్వీసుల రంగంలోకి స్పెషల్ 301 ను మనదేశంపై ప్రయోగించడం ద్వారా అమెరికా ఇప్పటికే ప్రవేశించింది. ఇప్పటికే విదేశీ బ్యాంకులు దేశంలోకి ప్రవేశించాయి. ఇన్సూరెన్సు, టెలికమ్యూనికేషన్సు, కంప్యూటరు సాఫ్ట్‌వేర్ వంటి రంగాలలోకి ప్రవేశం ఇక వేగవంతమవుతుంది. అందువల్ల బ్యాంకుల ద్వారా ఇప్పటికే వ్యవసాయరంగాన్ని ప్రాధాన్యత రంగం నుండి తొలగించి లోన్లు ఇవ్వడం రద్దు చేశారు. ఇకపై బ్యాంకుల నుండి నిరుద్యోగుల ఉపాధి పథకాలు (గ్రామోదయ వంటివి), పట్టణ పేదల ఉపాధి పథకాలు, చిన్న, మధ్య తరగతి వ్యాపారాల కిచ్చే లోన్లు, సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకపు లోన్లు వంటివి కూడ ఇకపై వుండబోవు. బ్యాంకింగ్ రంగం సంపన్న వర్గాలకూ, పారిశ్రామికవేత్తలకే పరిమితమవుతుంది. (విదేశీ బ్యాంకులు, విదేశీ ఇన్సూరెన్సు కంపెనీల ముందు అసలు మనవి నిలబడితే గదా!)

జాతీయ బూర్జువా వర్గం కూడా ప్రస్తుతం వస్తున్న చట్టాల వల్ల పూర్తి భద్రతను కోల్పోతుంది. పెట్టుబడులు పెట్టడంపై ఎలాంటి పరిమితులూ లేనందువల్ల జాతీయ బూర్జువాల చిన్న పరిశ్రమలు కూడ బహుళజాతి గుత్తసంస్థల పోటీ నెదుర్కోలేక దివాళా తీస్తాయి.

## రైతాంగపు అవస్థలు దుర్లభం

ఇప్పటికే వ్యవసాయంలో ఆధునిక విత్తనాలపై బడా కంపెనీలు, గుత్త కంపెనీలు రాజ్యమేలుతున్నాయి. ఇపుడు గుర్తించబోయే పేటెంట్ హక్కుతో విత్తనాల ధరలు ఆకాశాన్నంటుతాయి. మరోవైపు సబ్సిడీల రద్దుతో ఎరువుల ధరలూ, కంట్రోలు లేకపోవడంతో పురుగు మందుల ధరలు హద్దు అదుపు లేకుండాపోతాయి. పెరిగే సెస్సులు, కరంటు బిల్లులూ కలుస్తాయి. మరోవైపు వ్యవసాయ పెట్టుబడులకు ఇప్పటివరకు ప్రభుత్వరంగ బ్యాంకుల నుండి అందే తక్కువ వడ్డీ రుణాలు కూడ రద్దవడంతో వడ్డీ వ్యాపారులను ఆశ్రయించాల్సి వస్తుంది.

ఇంతచేసి కష్టపడి పండిస్తే మార్కెట్ అంతా గుత్తవ్యాపారుల కంట్రోలులోనే వుండి ప్రభుత్వ మద్దతు ధరల విధానం కూడ రద్దవుతుంది గనుక రైతు దివాళా తీస్తాడు. మరోవైపు పంట తనకిష్టం వచ్చినట్లు వేసుకోడానికి వీల్లేని భౌతిక పరిస్థితి. ఏయేడు ఏ పంట వేస్తే మార్కెట్ వుంటుందో తెలియని దుస్థితి ఇప్పటికే వున్నది ఇంకా తీవ్రతరమవుతుంది. ఆహార పంటల్ని దెబ్బతీయడమన్న సామ్రాజ్యవాద లక్ష్యం ప్రభావం రైతుపై పలువిధాలుగా వుంటుంది. ఇపుడు వాళ్ళ దృష్టి తమదేశాల్లో మార్కెటింగు వున్న పదార్థాల్ని ఇక్కడ పండించుకోవడంపైన, ఫుడ్ ప్రాసెసింగ్ పరిశ్రమపైన వుంది. అందువల్ల మన ప్రభుత్వ పథకాలు సామ్రాజ్యవాద లక్ష్యాల కనుగుణంగా ఇంకా ఇంకా మారతాయి. రొయ్యల చెరువులకు లోన్లు ఇప్పించిన ప్రపంచ బ్యాంకు - వాటిని ఆపి ప్రస్తుతం కూరగాయలు, పండ్ల

పెంపకానికి, నూనెగింజల పెంపకానికి ఇవ్వమంటోంది. ఈ పంటలు కూడ పెరిగాక ఆ రైతుల్ని కూడ దివాళా తీయిస్తుంది. ఏతావాతా రైతాంగానికి మిగిలేది అప్పులూ, దరిద్రమే. ఇప్పటికే సన్నకారు రైతులు భూములు కోల్పోతున్న తీరు ఇంకా వేగం పుంజుకుంటుంది. కొద్దికాలంలోనే లక్షలాది రైతులు తమ భూముల నుండి వేరుపడ్తారన్నది నిస్సందేహం.

బంజరు భూములను బహుళజాతి కంపెనీలకు, బడా బాబులకు కేటాయించడం, భూసంస్కరణల పథకాలు రద్దుచేయడంతో రైతు కూలీలకు బంజర్లు కూడ మిగలవు. మరోవైపు మారే పంటల సరళిలో శ్రమ అవసరం తగ్గుతుంది (ఎకరా వరిలో నాట్లకు, కలుపుకు, సేద్యానికి, కోతలకు, నూర్పిళ్ళకు ఎంతమంది కూలీలు అవసరం - ఎకరా మామిడితోటలో లేదా సొమాయిలు తోటలో ఎంతమంది అవసరమో పోల్చుకోవచ్చు). మరోవైపు ప్రజాపంపిణీ వ్యవస్థలో చౌకగా దొరికే బియ్యం, కిరసనాయిలు కూడ ఇవ్వబోరు. సబ్సిడీల రద్దుతో గ్రామీణ పేదలకు అందుబాటులో వుండే పథకాలు కూడ రద్దవుతాయి.

## పెరగనున్న సామాజిక ఉద్రిక్తతలు

పంచాయతీరాజ్ వ్యవస్థతో గ్రామాల్లో కక్షలూ, కార్పణ్యాలు పెరిగాయి. పైస్థాయిలో అధికారంలో వున్న శక్తులు గ్రామాల్లో తమ ఏజంట్లను పెంచుకున్నారు - హరిత విప్లవం, దానితోపాటు వచ్చిన పలు పథకాలు ఈ శక్తులకు తోడ్పాటునిచ్చి బలపడేటట్లు చేశాయి. ఈ శక్తులు గ్రామీణ ప్రాంతాల్లో తమ అధికారాన్ని నిలుపుకోవడం కోసం, ప్రత్యర్థి శక్తుల్ని దెబ్బతీయడం కోసం గ్రామీణ ప్రాంతాల్లో ఉద్రిక్తతల్ని పెంచాయి. ప్రత్యేకించి హక్కుల కోసం సంఘటితమయ్యే గ్రామీణ పేదలపై విచ్చలవిడి దౌర్జన్యాలకు పూనుకొన్నాయి. (కంచికచర్ల కోటేశు నుండి కారంచేడు, పదిరికుప్పం, నీరుకొండ, దొంతాలి, చుండూరు వగైరాలు, కీలవేన్మణి, బెల్చి, పిప్రాలలో జరిగిన దాడులూ ఈ కోవలేవే).

ఇటీవలి కాలంలో పాలకవర్గ శక్తులు తమ విధానాల వల్ల పెరుగుతున్న వైరుధ్యాల నుండి బయటపడడం కోసం, పాలకవర్గ శక్తుల అంతర్గత వైరుధ్యాల్లో పైచేయి సాధించుకోవడం కోసం కులపరమైన ఘర్షణలను కూడ రేకెత్తించాయి. సమాజంలోని ఆధిపత్య శక్తులను ప్రేరేపించి కులపరమైన దాడుల్ని కూడ ఒక క్రమంగా (phenomena) పెంచుతున్నాయి. మరోవైపు దేశవ్యాపితంగానే మతోన్మాదాన్ని పథకం ప్రకారం పెంచి పోషించి ప్రజలు పునాది సమస్యలపై ఆలోచించకుండా చేస్తున్నారు.

డంకెల్ ప్రతిపాదనల అమలు ద్వారా కూడ పాలకవర్గాలు గ్రామీణ ప్రాంతాల్లోని తమ శక్తులు బలపడేలా చేసుకుంటాయి. పెరిగే దారిద్ర్యం కారణంగా తీవ్రతరమయ్యే వైరుధ్యాల నుండి తప్పించుకోవడం కోసం కుల, మత తత్వాలను వీలైన ఇతర పెడమార్గాలను పెంచి పోషిస్తాయి.

## జనతా ప్రజాస్వామిక విప్లవమే పరిష్కారమార్గం

దేశంలోని బడా పెట్టుబడిదారీ వర్గం, భూస్వామ్య శక్తులు, సామ్రాజ్యవాదులు కలిసి దేశంలోని అసంఖ్యాక ప్రజానీకాన్ని దోపిడీ పీడనలకు గురి చేస్తున్నాయి. ఎప్పటికపుడు తమ కనుకూలమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక విధానాలను ప్రజల నెత్తిన రుద్దుతున్నాయి. ప్రజలు తమపై పెరుగుతున్న దోపిడీ, పీడన అణచివేతలకు వ్యతిరేకంగా పోరాడినపుడల్లా

రక్తపుటేరుల్లో ముంచెత్తుతున్నాయి. ఏటికేటికీ నిరంకుశ పోలీసు, మిలిటరీలను పెంచి పోషించడానికి బడ్జెట్‌లో కేటాయింపులు పెంచుతున్నారు. ప్రతిక్షణమూ పాలకవర్గాలు ప్రజలపై హింసను ప్రయోగిస్తూ, దానిపై ఆధారపడే, పాలన సాగిస్తున్నాయి. సామ్రాజ్యవాదుల కనుకూలంగా డంకెల్ ప్రతిపాదనల అమలులో అన్నిరంగాలకు బడ్జెట్ కేటాయింపులు తగ్గినా పోలీసు, మిలిటరీ బడ్జెట్లు మాత్రం ఏటికేటికీ పెరుగుతాయి. మరోవైపు ప్రజలను చీల్చడానికి భ్రమలకు గురిచేస్తారు. సంస్కరణలు అందులో భాగమే. ఇపుడున్న ఆర్థిక పరిస్థితిలో వీటిని అమలుజరిపే పరిస్థితి లేదు గనుక నిర్బంధం పైనే ప్రధానంగా ఆధారపడతారు. విభజించు - పాలించు అన్న వలసపాలన నాటి సిద్ధాంతాన్నే నేటికీ మన పాలకులు అనుసరిస్తూ ప్రజలు తమ మౌలిక సమస్యల పరిష్కారం కోసం ఐక్యం కాకుండా అనేక ఎత్తుగడలు ప్రయోగిస్తున్నారు.

పాలకవర్గాల ఎత్తుగడలుగానీ, మధ్యేమార్గవాదుల పరిష్కారాలుగానీ ప్రజల సమస్యలు పరిష్కరించకపోగా మరింతగా పెంచుతాయనేది గత 47 సం॥లుగా మనకు రుజువవుతూనే వస్తోంది. దేశంలో గ్రామీణ ప్రాంతాల్లో సాగుతున్న ఫ్యూడల్ దోపిడీ, దేశంలో సాగుతున్న బడాపెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దోపిడీలను సమూలంగా పరిష్కరించగలిగేది జనతా ప్రజాతంత్ర విప్లవం మాత్రమే. అందులో వ్యవసాయక విప్లవం ఇరుసుగా వుంటుంది. కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా సాగుతుంది.

## కన్నెగంటి హనుమంతు, అల్లూరిల పోరాట వారసత్వాన్ని నేటి రైతాంగం స్వీకరించాలి

బ్రిటన్ సామ్రాజ్యవాదులు వలసపాలన కాలంలో మన రైతాంగాన్ని అమాయకులుగానూ, అజ్ఞానులుగానూ, చేతకానివాళ్ళుగానూ పరిగణించారు. అయితే ఆ అమాయక రైతులే కరువు కాటకాలకు గురిచేసి ఆకలి చావులకు బలిచేయడానికి వ్యతిరేకంగా 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో కీలకపాత్ర నిర్వహించారు. ఈస్టిండియా కంపెనీ విచ్చలవిడి దోపిడీని అంతమొందించారు.

దేశవ్యాపితంగా సాగిన జాతీయోద్యమంలో రైతాంగం వీరోచిత పాత్ర నిర్వహించారు. పన్నుల నిరాకరణోద్యమానికి పిలుపిచ్చినపుడు ఆంధ్ర రైతాంగం ప్రదర్శించిన చైతన్యం వీరోచితమైంది. గుంటూరు జిల్లా పెదనందిపాడు ప్రాంతంలో సంపూర్ణ పన్నుల నిరాకరణ జరిగింది. పోలీసు, మిలటరీలను ప్రయోగించి రైతాంగాన్ని ఎంతగా నిర్బంధించినా ఒక్కరంటే ఒక్కరి చేతగూడా ప్రభుత్వం పన్ను కట్టించుకోలేకపోయింది. అరెస్టులు, జప్తులు, మిలటరీ కవాతు ప్రదర్శనలు, శతఘ్ని శకటాలేవీ ప్రజల మనోనిశ్చయాన్ని కదిలించలేకపోయాయి. చివరకు రైతాంగం మిలిటెంట్‌గా చౌరిచౌరాలో పోలీసు స్టేషనుపై దాడిచేసి ఆయుధాలు స్వాధీనం చేసుకున్నట్లుగా ఎక్కడ ముందు కెళతారోనని భయపడిన కాంగ్రెసు నాయకత్వం ఆ రైతాంగ వుద్యమానికి ద్రోహం చేసింది. ఆనాటి కాంగ్రెసు జిల్లా నాయకత్వం పైనుండి (గాంధీ నుండి) వచ్చిన ఆదేశాల మేరకు పోరాటాన్ని నిలిపేస్తూ ప్రకటించినపుడు రైతాంగం దానికి ప్రతిగా అరుపులు, కేకలు వేసి తమ ఆగ్రహాన్ని ప్రదర్శించింది.

ఇదే కాలంలోనే గుంటూరు జిల్లా పలనాడు రైతాంగం తమ పోరాటచేవను ప్రదర్శించింది. వరుసగా 1921, 22 సం॥ల్లో కరువు వచ్చి తీవ్రంగా ఆకలికి గురవుతున్న

దశలో అడవిపై హక్కులు నావేనన్న బ్రిటిష్ పాలకులు రైతాంగపు పశువుల్ని కూడ అందులోకి అడుగు బెట్టనివ్వలేదు. పశువుల మేత కోసం ఎంతగా బ్రతిమాలుకున్నా, పుల్లరి కడతాం, కనీసం జరిమానా వెయ్యవద్దన్నా పాలకులు వినకుంటే రైతులు చేతులు బిగించారు. బందెలదొడ్డిలో ఫారెస్టు అధికారులు, మిలటరీ కలసి తోలిన పశువుల్ని విడిపించుకునేందుకు రైతాంగం సంఘర్షణకు సిద్ధపడ్డారు. ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా పోలీసు తుపాకుల గుళ్ళకు ప్రతిగా రాళ్ళు రువ్వుతూ కదిలారు - కన్నెగంటి హనుమంతును పోలీసులు బలిగొంది ఈ పోరాటంలోనే.

దాదాపు ఇదే కాలంలోనే అల్లూరి సీతారామరాజు మన్యంలో గిరిజనుల్ని సామ్రాజ్యవాద దోపిడికి వ్యతిరేకంగా కదిలించాడు. గిరిజనుల పశువుల్ని అడవిలో మేపుకోకూడదని, అటవీ వుత్పత్తులు సేకరించుకోరాదనీ, అడవిలో కట్టెలు కూడ కొట్టుకోరాదనీ శాసించింది బ్రిటిష్ ప్రభుత్వం. విపరీతమైన జరిమానాలూ, వెట్టిచాకిరీ సాగించుకున్నారు బ్రిటిష్ అధికారులు. ఈ దుర్మార్గమైన దోపిడి, పీడనలకు వ్యతిరేకంగా గోదావరి, విశాఖ ఏజన్సీలో సీతారామరాజు గిరిజనుల్ని కూడగట్టాడు. పోలీసు స్టేషన్లపై దాడిచేసి ఆయుధాలు కూడ సేకరించుకున్నారు. బ్రిటిష్ దళాలపై వీరోచితమైన దాడుల్ని సాగించారు. చివరకు పాలకులు మలబార్, అస్సాం స్పెషల్ పోలీసులను రంగంలోకి దించాల్సి వచ్చింది. దీర్ఘకాలిక సాయుధ పోరాట అవగాహన లోపించిన ఫలితంగా వుద్యమాన్ని ఎక్కువ కాలం నడిపించ లేకపోయినా బ్రిటిష్ కసాయి పాలకుల గుండెల్లో నిదురించిన రామరాజు తెలుగు ప్రజల హృదయాల్లో సదా సమున్నతంగా నిలిచే వుంటాడు. కాంగ్రెసు రామరాజును బందిపోటుగా చిత్రించి ఆ పోరాటానికి వెన్నుపోటు పొడిచింది.

1930లలోనే ఆంధ్ర రాష్ట్రంలో బ్రిటిష్ సృష్టించుకున్న జమీందారి విధానానికి వ్యతిరేకంగా మునగాల, వెంకటగిరి, మందసా, చల్లపల్లి తదితర జమీ ప్రాంతాల్లో పెద్ద ఎత్తున రైతాంగం పోరాట మార్గంలోకి వచ్చింది. జమీందారీ విధానం తమపై విధించిన దుర్మార్గమైన పన్నులు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా రైతాంగం సమరశంఖారావం పూరించింది. ఆ పోరాటం నుండి పుట్టిందే నెల్లూరి 'జమీన్‌రైతు' పత్రిక. 1939లో ఈ జమీందారీ విధానాన్ని రద్దు చేస్తానని ఆశపెట్టిన, ఆనాడు మద్రాసు రాష్ట్రంలో అధికారంలో వున్న కాంగ్రెసు రైతాంగపు ఆశల్ని వమ్ము చేసింది.

1940లలో జరిగిన రైతాంగ పోరాటాలు భారతదేశ చరిత్రలోనే గర్వించదగ్గవి. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమంటే కేవలం పైపై నినాదాలకు పరిమితం కావడం కాదనీ నిజమైన రైతాంగ విముక్తి గురించి ఎలుగెత్తి చాటిన పోరాటాలవి - దేశంలోనే పేర్గాంచిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం అందులో చరిత్రాత్మకమైంది. నైజాం నవాబును, స్వదేశీ మార్కు పాలకుల్ని ప్రతిఘటించి 4000 మంది రైతాంగం రక్తతర్పణ చేసిన వీరోచిత పోరాటం. ములుగ్గర పట్టుకునే రైతన్న తుపాకీ పట్టి రాజ్యాధికారాన్ని సాధించుకొని కొద్దికాలమైనా గ్రామ స్వరాజ్యాలను అనుభవించిన పోరాటం.

1940లలోనే బెంగాల్‌లో తెభాగ రైతాంగం సాగించిన పోరాటం, మహారాష్ట్ర వర్లీ ఆదివాసులు సాగించిన పోరాటం, కేరళ పున్నప్ర - వాయలార్‌లో రైతాంగం, కార్మికులు కలసి సాగించిన పోరాటం, కయ్యూరు రైతాంగ పోరాటం వంటివి రైతాంగ విముక్తి లక్ష్యంతో సాగిన ప్రధాన పోరాటాల్లో కొన్ని.

1947 తర్వాత కూడ రైతాంగపు విముక్తిబాట చూపిన శ్రీకాకుళం, నక్సల్బరీ తదితర పోరాటాలు కూడ అనేక విలువైన అనుభవాల్ని, పుత్తేజాన్ని మనకు అందిస్తాయి.

ఆ పోరాటాలు అందించే స్ఫూర్తితో ప్రస్తుతం రైతాంగంపై సామ్రాజ్యవాదులూ, దేశంలోని భూస్వామ్య, బడా పెట్టుబడిదారీ వర్గాలూ ముందుకు తెస్తున్న విధానాలపై రైతాంగం సమరభేరిని మ్రోగించాలి. భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని సాగిస్తూనే ప్రస్తుతదశలో తనపోరాటపు మొనను సామ్రాజ్యవాదం పైకి ఎక్కుపెట్టాలి. డంకెల్ డ్రాఫ్టు తదితర చట్టాలను తమపై రుద్దకూడదంటూ రైతుకూలీలు, సన్నకారు రైతుల నుండి ధనిక రైతుల వరకు విభిన్న సెక్షన్ల రైతాంగమూ - చేతివృత్తుల వాళ్ళూ పట్టణాల్లోని కార్మికులు, విద్యార్థులు, మేధావుల నుండి జాతీయ బూర్జువావర్గం వరకు కలిసి వచ్చే శక్తులన్నిటితో సమైక్యంగా పోరాటమార్గం చేపట్టాలి. సమైక్యంగా సంఘటిత పోరాటం సాగించేందుకు ఉరకాల్సిన తరుణమిది.

దేశాలలోని వ్యవసాయం మరింతగా సామ్రాజ్యవాదులపై ఆధారపడేలా చేయబడుతుంది. సామ్రాజ్యవాదం ఈ దేశాలను వ్యవసాయ వలసలుగా మార్చి రైతాంగ జీవితాల్లో కల్లోలం రేపుతుంది. సామ్రాజ్యవాదులు, వారి వత్తాసుదార్లు ప్రచారం చేస్తున్నట్లు డంకెల్ ప్రతిపాదనలు మూడవ ప్రపంచ దేశాలని సాంకేతిక అభివృద్ధివైపు నడిపిస్తాయని చెప్పడం దగా తప్ప వేరుకాదు. అవి అత్యంత తిరోగమన స్వభావం కలవి, అభివృద్ధి వ్యతిరేకమైనవి. అవి ఈ దేశాలు అభివృద్ధి కాకుండా చేయటానికి, వూడిగంచేయించుకునేందుకు ఉద్దేశించబడినవే.

దేశంలోని బడాబూర్జువా, భూస్వామ్య పాలకవర్గాలు దళారీ స్వభావం కలిగివుండి సామ్రాజ్యవాదులకు ఊడిగం జేస్తున్నాయి. అవి ఇచ్చే స్వాతంత్ర్యం, స్వావలంబన సార్వభౌమత్వం వంటి నినాదాలు, 1947 నుండి దేశాన్ని మరింత పరాధీనత వైపు నెట్టిన విషయాన్ని కప్పిపుచ్చుకోడానికే తప్ప వేరుకాదు. దేశం తాకట్టు పెట్టబడ్డదన్న విషయాన్ని మరుగుపరచటానికి ఏమి చెప్పినా దాచలేనంత స్థాయికి సామ్రాజ్యవాదదోపిడి చేరింది. పి.వి.నరసింహారావు ప్రభుత్వ నూతన ఆర్థిక వాణిజ్య, పారిశ్రామిక విధానాలు సామ్రాజ్యవాద ద్రవ్య సంస్థలైన ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్‌లచే దేశాన్ని మరో "బనానా రిపబ్లిక్" గా మార్చేందుకు రూపొందించినవే తప్ప వేరుకాదు. నెహ్రూ, ఇందిరా, రాజీవ్‌ల కాలం నుండి అనుసరించబడుతున్న సామ్రాజ్యవాదదోపిడీ, కంట్రోలుకు లోబడి వుండే విధానాల కొనసాగింపు తప్ప ఇది వేరుకాదు. ప్రభుత్వం డంకెల్ ముసాయిదా పై గాట్‌లో చర్చిస్తానని చెప్పటం మోసపూరితం. ఎందుకంటే, డంకెల్ ముసాయిదాలోని అనేక అంశాలు ఇప్పటికే ఐ.ఎం.ఎఫ్ షరతుల్లో భాగంగా అమలు పర్చబడుతున్నాయి. అందువల్ల ప్రభుత్వం డంకెల్ ముసాయిదాకు తన ఆమోదాన్ని తెలపటం కేవలం లాంఛనప్రాయం మాత్రమే.

## వ్యవసాయరంగం భవిష్యత్తు

అభివృద్ధి, పురోగమనం ముసుగులో సామ్రాజ్యవాదులు మన వ్యవసాయరంగాన్ని డంకెల్ ముసాయిదా ద్వారా వలసీకరించదల్చుకున్నారు. వ్యవసాయవ్యాపారాన్ని భారీ స్థాయిలో చేపట్టడం ద్వారా మన వ్యవసాయాన్ని నాశనం చేసి వారి ప్రయోజనాలను సాధించుకోదల్చుకున్నారు. మనకవసరమైన ఆహార పదార్థాలు, ఇతర వ్యవసాయ ఉత్పత్తులు కత్తిరించబడి ప్రజలను మరింతగా ఆకలికి గురిచేస్తారు. ప్రస్తుతం వ్యవసాయంలో అప్రజాస్వామిక ఫ్యూడల్ సంబంధాలలో పాటు డంకెల్ ముసాయిదా సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష చొరబాటును కంట్రోలును మొత్తం వ్యవసాయరంగానికే విస్తరిస్తారు. ప్రస్తుత అర్ధవలస, అర్ధ ఫ్యూడల్ వ్యవస్థలో భూమిని దున్నే అసంఖ్యాక పేద, నిరుపేద రైతాంగానికి ఆ భూమి హక్కు ల్లేవు. యం.ఎన్.సి లు ఇప్పటికే మన దేశపు భూసంస్కరణ చట్టాలను పూర్తిగా ఎత్తివేసి ఏ నింబధనలూ లేకుండా తమకు భూములను అప్పజెప్పాలని కోరుతున్నాయి. డంకెల్ ముసాయిదాను అంగీకరించి అమల్లోకి తెస్తే రైతాంగం భూమి నుండి మరింతగా వేరు పడి ఎం.ఎన్.సి. ల చేతుల్లోను, పెద్ద భూస్వాముల చేతుల్లోను, కేంద్రీకృతం కావడం ఇంకా ఎక్కువవుతుంది. ఇది గ్రామీణ ప్రాంతాల్లో మరింతగా పేదరికం పెరిగి, అసమానతలు పెరగడానికి దారి తీస్తుంది. పేదరైతులు భూమి నుండి దూరం చేయబడతారు. మధ్య తరగతి రైతులు మరింతగా అవస్థల పాలవుతారు. వీటికి తోడు డంకెల్ ముసాయిదా వల్ల రైతులు తమకిష్టమైన విత్తనాలను వాడుకునే హక్కును కోల్పోతారు. మొత్తం వ్యవసాయ ఉత్పత్తి క్రమం, మార్కెట్, ఎం.ఎన్.సి ల చేతుల్లోకి వెళ్తుంది. ఈ విధంగా రైతాంగం బానిసలుగా దిగజార్చబడి మొత్తం వ్యవసాయమే సారాంశంలో వలసీకరణ చేయబడుతుంది.

అనుబంధం :

# రైతాంగానికి పిలుపు :
# డంకెల్ ముసాయిదాకు వ్యతిరేకంగా కార్యాచరణ తీర్మానం
# ఆగస్టు 17,18 జలంధర్ సదస్సు తీర్మానం

1993 ఆగస్టు 17, 18 తేదీలలో పంజాబ్ రాష్ట్రంలోని జలంధర్ పట్టణంలో 9 విప్లవ రైతాంగ సంఘాలతో కూడిన సన్నాహక కమిటీ డంకెల్ డ్రాఫ్టుకు వ్యతిరేకంగా అఖిల భారత రైతాంగ సదస్సును నిర్వహించింది. వెయ్యిమంది ప్రతినిధులు, అనేక సౌహార్ద సంస్థల ప్రతినిధులు హాజరయిన ఈ సదస్సు ఫ్యూడల్ వ్యతిరేక ప్రజా ఉద్యమంతో జతచేస్తూ, సామ్రాజ్యవాద వ్యతిరేక దేశభక్తియుత రైతాంగ ఉద్యమాన్ని నిర్మించాలని తీర్మానించింది.

1986 లో ఉరుగ్వేలో మొదలైన గాట్ చర్చల నుండి రూపొందిందే డంకెల్ ముసాయిదా. మూడవ ప్రపంచ దేశాలు దీన్ని మొత్తంగా అంగీకరించటమో లేక తిరస్కరించటమో చేయాలే తప్ప సవరణలు ప్రతిపాదించే హక్కు లేదు. ఈ షరతు మూడవ ప్రపంచదేశాలను అంగీకరించేలా వత్తిడి చేసేదే తప్ప వేరు కాదు. సామ్రాజ్యవాద విషకౌగిలిలో వున్న మనదేశం గాట్‌లో సభ్యదేశంగా ఈ ముసాయిదా పై ఈ సంవత్సరం ఆఖరు లోగా సంతకం చేయాల్సివుంది. భారతపాలక వర్గాలు సామ్రాజ్యవాదులకు లొంగుబాటుదారులయి వుండటం వల్ల సహజంగానే మనదేశం సంతకం చేసేలా వత్తిడి చేస్తుంది. అందువల్ల ఈ దుర్మార్గ ప్రతిపాదనలను మనపై రుద్దటానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన బాధ్యత మూడవ ప్రపంచదేశాల ప్రజలపైనే వుంది.

సామ్రాజ్యవాదం ముందెన్నడూ ఎరుగని తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నందువల్ల మూడవ ప్రపంచదేశాలను కొల్లగొట్టడాన్ని మరింత తీవ్రతరం చేసేందుకు, అదుపులోకి తెచ్చుకునేందుకు డంకెల్ ముసాయిదా అనబడేది ముందుకు తేబడింది. నేటి పెట్టుబడిదారీ వ్యవస్థలో కన్పిస్తున్న తీవ్రమైన ఆర్థికమాంద్యం సామ్రాజ్యవాద దేశాలలో ఉత్పత్తి సంక్షోభం, నిల్వలు పేరుకు పోవటము అన్న కారణంగాను, వాటి ఉత్పత్తిలో మరింతగా తీవ్రమవుతున్న, చుట్టుముడుతున్న సంక్షోభపు పర్యవసానాలే.

దీన్నుండి బయట పడడానికి సామ్రాజ్యవాద దేశాలు తమ సంక్షోభాన్ని మూడవ ప్రపంచంపై రుద్దటానికి నూతన పద్ధతులను రూపొందిస్తున్నాయి. వ్యవస్థాగత సంస్కరణలు, వ్యవస్థాగత సర్దుబాట్ల కార్యక్రమం, సరళతరం చేయడం మొదలైనవి ఈ గ్లోబలైజేషన్ (అంతర్జాతీయకరణ) లో భాగమే. ఐ.ఎం.ఎఫ్, ప్రపంచబ్యాంకు, గాట్ - ఈ లక్ష్యాలని సాధించే పనిముట్లుగా వున్నాయి. వాణిజ్యాన్ని, వుత్పత్తిని, శ్రమశక్తిని గ్లోబలైజ్ చేయటమన్నది మూడవ ప్రపంచ దేశాలను పునర్వలసీకరించటానికి అనుసరించబడుతున్న దుష్ట పథకం తప్ప వేరుకాదు.

డంకెల్ ముసాయిదా వాణిజ్య సుంకాల పరిధిని దాటిపోతుంది. వ్యవసాయంలోకి, సర్వీసుల రంగంలోకి, యం.ఎన్.సి లు ప్రవేశించకుండా వున్న అవరోధాలను తొలగింపచేసుకొని వాటి ప్రవేశానికి మార్గాన్ని సుగమం చేస్తుంది. మూడవ ప్రపంచ

దళారీ పాలకవర్గాలు సామ్రాజ్యవాద ప్రయోజనాల కోసం దేశంలోని వెనకబడిన ఉత్పత్తి పద్ధతులపై నూతన వ్యవసాయ విధానాలను రుద్దజూస్తున్నారు. డంకెల్ ప్రతిపాదనలు ఆచరణలో సామ్రాజ్యవాదుల, ఫ్యూడల్ శక్తుల పట్టును మరింతగా పెంచుతాయి.

## రైతాంగం ముందున్న కర్తవ్యాలు

డంకెల్ ముసాయిదాతో సహా ప్రస్తుత రైతాంగ సమస్యలన్నిటికీ పరిష్కారం దేశంలోని అర్ధవలస, అర్ధఫ్యూడల్ వ్యవస్థను కూల్చగలిగే నూతన ప్రజాస్వామిక విప్లవం విజయంతోనే సాధ్యపడుతుంది.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడటం, డంకెల్ ముసాయిదాకు వ్యతిరేకంగా పోరాడటం విడదీయరానివి. ఇది నూతన ప్రజాసామిక విప్లవంలో అంతర్భాగం. ప్రస్తుత రైతాంగ ఉద్యమం అశేష రైతాంగ సమూహాన్ని దేశభక్తియుత ఉద్యమంలోకి ఐక్యం చేయటంపై, కదిలించటంపై దృష్టి పెట్టాలి. ఇక్కడ ఒక విషయాన్ని మర్చిపోరాదు. అదేమంటే, డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమ పురోగమనం, విజయం నూతన ప్రజాస్వామిక విప్లవానికి ఇరుసైన ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమాన్ని తీవ్రతరం చేయడంపైనే ఆధారపడివుంటుంది.

ఇందుకోసం దేశంలోని విప్లవ, ప్రజాస్వామిక, దేశభక్తియుత రైతుల, రైతుకూలీలసంస్థల, వేదికల విశాల ఐక్యతను సాధించాలి. అఖిలభారత స్థాయిలో సాగాల్సిన ఈ కృషిలో దళితుల, గిరిజనుల, జాతుల స్వయం నిర్ణయాధికార ఉద్యమాలలోని రైతాంగ శక్తులన్నింటినీ సమీకరించాలి.

ఇలాంటి విశాల ఐక్య సంఘటనకు ముందుకురమ్మని దేశంలోని అన్ని విప్లవ, ప్రజాస్వామిక, దేశభక్తియుత రైతాంగ వ్యవసాయకూలీల సంస్థలన్నిటికీ ఈ సదస్సు పిలుపునిస్తోంది.

సి.పి.ఐ, సి.పి.యం తదితర సంస్కరణవాద శక్తుల, పాలక వర్గాలలోని కొన్ని శ్రేణుల నాయకత్వంలోని రైతాంగ, వ్యవసాయ కూలీల సంఘాలు కూడా దేశంలో డంకెల్ వ్యతిరేక ఉద్యమానికి పిలుపునిస్తున్నాయి. అయితే వాటి కార్యాచరణను బట్టి అవి సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి, అభివృద్ధి నిరోధక భారత పాలకవర్గాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు సమగ్రమైన కార్యక్రమం కలిగి లేవని స్పష్టమవుతోంది. అందువల్ల ఇలాంటి శక్తులలో డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించగల అవకాశం లేదు. అయితే మన సంఘటన ఇలాంటి సంస్థలతో నిర్దిష్టమైన సమస్యలపై ఐక్యకార్యాచరణకు సిద్ధంగా వుంటుంది. డంకెల్ ముసాయిదాను అమలు పరచడం ద్వారా యం.ఎన్.సిలకు ఇచ్చే భూముల లీజుల రద్దుకోసం, గిట్టుబాటు ధరల కోసం, బ్యాంకుల వ్యవసాయ రుణాలివ్వడం ఆపివేయడానికి వ్యతిరేకంగా - వంటి డిమాండ్లపై ఐక్యకార్యాచరణ చేపడుతుంది.

## మన ఉద్యమ డిమాండ్లు

ఈ సదస్సు డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమానికి ఈ క్రింది నినాదాలను రూపొందించింది.

1. డంకెల్ డ్రాఫ్టుని పూర్తిగా తిరస్కరించాలి.

2. డంకెల్ డ్రాఫ్టుని అమలుజరిపేందుకు వుద్దేశించిన ఐ.ఎం.ఎఫ్, ప్రపంచ బ్యాంకు షరతులను ఉపసంహరించాలి.

3. గాట్, ఐ.ఎం.ఎఫ్, ప్రపంచబ్యాంకుల నుండి భారతదేశం వైదొలగాలి

4. ఐ.ఎం.ఎఫ్, ప్రపంచబ్యాంకు, తదితర సామ్రాజ్యవాద సంస్థలకి వడ్డీలు, అప్పుల వాయిదాల చెల్లింపులు నిలిపివేయాలి.

5. సామ్రాజ్యవాదుల నియంత్రణలోని పరిశ్రమలు, వ్యవసాయ క్షేత్రాలు, పరిశోధనా సంస్థలు, వ్యాపార కంపెనీలు, సేవా రంగాలలోని సంస్థలనూ, వాటి ఆస్తులనూ భారత ప్రజల ఆస్తిగా ప్రకటించాలి.

6. సామ్రాజ్యవాదులతో అన్ని రకాల అసమాన ఒప్పందాలు, అంగీకారాలను రద్దుచేయాలి.

7. దేశాన్ని తిరిగి వలసదేశంగా మార్చే ప్రజావ్యతిరేక, దేశ వాహకాలైన నూతన పారిశ్రామిక, ఆర్థిక విధానాలను, నూతన వాణిజ్య విధానం, విద్యావిధానం వగైరాలను వుపసంహరించాలి.

8. భారత వ్యవసాయాన్ని మరోసారి వలసగా మార్చేందుకు వుద్దేశించిన నూతన వ్యవసాయ విధానాన్ని ఉపసంహరించాలి.

9. దున్నేవాడికే భూమి పంచాలి.

10. భూస్వాములు, ఇతర దోపిడీదారులను మినహాయించి రైతాంగానికీ, గ్రామీణ పేదలకు ఇచ్చిన ప్రభుత్వం, బ్యాంకు రుణాలను మాఫీ చేయాలి.

11. అడవిపైన, భూమిపైన ఆదివాసుల సాంప్రదాయ హక్కులకు హామీ ఇవ్వాలి. స్వయంపాలన, జీవన విధానంపైన స్వయం నిర్ణయ హక్కును గుర్తించాలి.

12. చేపలు, రొయ్యల పెంపకం, ఉప్పుతయారీ, తోటలు వగైరాల కొరకు బడా వ్యాపార సంస్థలు, బహుళజాతి సంస్థలకు భూమి లీజుని రద్దు చేయాలి.

13. బహుళజాతి సంస్థల విత్తనాలు, వ్యవసాయ పరిశోధన సంస్థలనీ, వ్యవసాయ సంస్థలని భారతదేశం నుండి గెంటివేయాలి.

14. మొక్కలు, ప్రాణికోటిపైన ప్రజల హక్కును సంపూర్ణమైనదిగా, ఈ హక్కును వారి నుండి వేరు చేయలేనిదిగా ప్రకటించాలి.

15. భూమి, విత్తనాలు, వ్యవసాయంపైన హక్కు ప్రజలకే వుండాలి. ఈ హక్కు వేరెవరికీ అప్పగించరాదు.

16. ఉపాధి హక్కును నిరాకరించే లే-ఆఫ్‌లు, లాకౌట్లు, మూసివేతలు, రిట్రెంచ్‌మెంట్లు, ఎగ్జిట్‌పాలసీ, వలంటరీ రిటైర్‌మెంట్ పథకాలు మొదలైన చర్యలన్నింటినీ ఆపివేయాలి. మూసి వేసిన పరిశ్రమలన్నింటినీ తెరిపించాలి.

17. ప్రజాపంపిణీ వ్యవస్థను ఎత్తివేసే పథకాన్ని విడనాడాలి.

18. పనిహక్కును గ్యారంటీ చేయాలి.

19. పెద్ద, పెద్ద డ్యాముల స్థానంలో బ్యారేజీలు, చెక్ డాములు, చిన్న చిన్న నీటిపారుదల ప్రాజెక్టులు, వాటర్ షెడ్ పథకాలని నిర్మించి వాటి నిర్వహణ, నియంత్రణలని ప్రజలకే అప్పగించాలి.

20. ఆదివాసులను నిర్వాసితులనుగావించి, పర్యావరణ వినాశనానికి దారి తీసేటటువంటి అటవీ, భూ, జల వనరుల వాణిజ్య వినియోగాన్ని నిలిపివేయాలి.

21. టాడా వంటి నిరంకుశ, నిర్బంధ చట్టాలను రద్దు చేయాలి. రైతాంగ వుద్యమ ప్రాంతాల నుండి కేంద్ర, రాష్ట్ర సాయుధ బలగాలన్నింటినీ ఉపసంహరించాలి. బూటకపు ఎన్‌కౌంటర్ హత్యలను ఆపాలి.

22. రాజకీయ ఖైదీలందరినీ బేషరతుగా విడుదల చేసి పోలీసు కేసులన్నింటిని ఉపసంహరించుకోవాలి.

అసంఖ్యాకమైన రైతాంగం, గ్రామీణ పేదలు పై డిమాండ్ల ప్రాతిపాదికగా ప్రభుత్వంపై పోరాడేందుకు; సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరే పోరాటాన్ని నిర్మించే లక్ష్యంతోను; ప్రత్యేకించి ప్రస్తుత దశలో సామ్రాజ్యవాద వ్యతిరేక, దేశభక్తియుత రైతాంగ ఉద్యమ నిర్మాణం కోసం ఐక్యం కమ్మని సదస్సు పిలుపునిస్తోంది. గ్రామీణ పేదలందరు ప్రభుత్వంతో "సహాయ నిరాకరణ", "పన్నుల నిరాకరణ", "ప్రభుత్వ బిల్లుల నిరాకరణ" వంటి చర్యలు చేపట్టాలి. పై ఇరవైరెండు డిమాండ్లను గుర్తింపజేసేందుకు, ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళేందుకు ఈ పోరాటపు ఆరంభంనుండే వీలైన రూపాల్లో ఈ చర్యలుచేపట్టాలి.

## దేశభక్తియుత రైతాంగ సంఘర్షణ ఏర్పాటు

విశాల రైతాంగ ఐక్యతను సాధించేందుకు ఈ సదస్సు నిర్వహించిన 9 విప్లవ రైతు సంఘాలు ఒక వేదిక నేర్పరచాలని సదస్సు తీర్మానిస్తోంది. "డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక దేశభక్తియుత రైతాంగ సంఘర్షణ సమితి"గా వేదిక పిలవబడుతుంది. కామ్రేడ్ హరదేవ్‌సింగ్ సంధు కన్వీనర్‌గా, 15 మంది సభ్యులతో కేంద్రకార్యాచరణ కమిటీని సదస్సు ఎన్నుకున్నది. సదస్సు ఇతర విప్లవ, ప్రజాస్వామిక, దేశభక్తియుత సంస్థలను ఈ సంఘటనలో భాగస్వామ్యం కమ్మని పిలుపునిస్తోంది. కనుక, ఇలాంటి సంస్థలన్నీ ముందుకు రావలిసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇదే సందర్భంలో ఈ వేదిక పేరు గురించి, కార్యక్రమం గురించి చర్చించి అవసరమైన మార్పులు, చేర్పులు చేసుకోడానికి సిద్ధంగా వున్నామని ప్రకటిస్తున్నాము.

## దేశభక్తియుత రైతాంగ ప్రచార వలంటీర్ల (PPPV) ను నిర్మించండి

దేశవ్యాప్తితంగా స్త్రీ, పురుషులందరితో పెద్ద పంఖ్యలో వలంటీర్లను నిర్మించండి. పై డిమాండ్లతో ప్రజా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి ఇది ఎంతైనా అవసరం. ఈ వలంటీర్లను ఏర్పరచడానికి జిల్లాల స్థాయిలో, పదస్సులు లేదా ప్రత్యేక సమావేశాలు

నిర్వహించండి. వలంటీర్ల ప్రత్యేక గుర్తింపు, క్రమశిక్షణ కోసం వలంటీర్లందరూ, ఎర్రటోపిని, బ్యాడ్జీని, నిలువెత్తు కర్రను కలిగివుండాలి. ఈ వలంటీర్లు కాలినడకపై గ్రామానికి వెళ్ళి గ్రామ స్థాయి వలంటీర్ల నేర్పరిచి ఇతర కర్తవ్యాలను కూడా ముందుకు తీసుకెళ్ళాలి. ఈ వుద్యమం ముందుకు నడవాలంటే క్రింది స్థాయిలో వలంటీర్లను నిర్మించడానికి ప్రాధాన్యతనిచ్చి అమలుపరచాలి.

## తొలిదశ ఆందోళనా కార్యక్రమం

డంకెలు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాన్ని దశల వారీగా నిర్మించాలని సదస్సు తీర్మానించింది. తొలిదశలో "డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పక్షాన్ని" సెప్టెంబరు 10 నుండి 25 వరకు పాటించవలసిందిగా, ప్రదర్శనలు, గ్రూపు మీటింగులు, బహిరంగ సభలు తదితర రూపాల్లో దేశ వ్యాప్తితంగా ప్రచార కార్యక్రమాలు నిర్వహించండి. సెప్టెంబరు 25న అన్ని జిల్లాల కలెక్టరేట్ల ముందు ధర్నాలు నిర్వహించండి. ఈ కార్యక్రమాన్ని జయప్రదం చేయటంకోసం ప్రజలు విస్తృతంగా జమకూడాల్సిందిగా కోరుతున్నాము. తర్వాత దశ కార్యక్రమాన్ని ఈ కార్యక్రమం ఐయిన వెంటనే ప్రకటిస్తాయి.

కన్వీనర్
కేంద్ర కార్యాచరణ కమిటీ
డంకెల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక,
దేశభక్తియుత రైతాంగ సంఘర్షణ సమితి

జలంధర్
18.8.93